# బాలరోగముల చికిత్స

ఆంధ్ర హోమోపతి సంఘమువారి ఆదరణమున
ప్రప్రథమముగా ప్రచురింపబడెను.

★

గ్రంథకర్త :
తల్లాప్రగడ కామేశ్వరరావు, బి.ఏ., యం.బి. (హోమియో)
ఉంగుటూరు.

★

కాపీరైట్ హోల్డర్స్ అండ్ పబ్లిషర్స్
జెమిని ప్రింటర్స్, ఏలూరు

1950

 [వెల రు. 3-0-0

# అంకితము



కుటుంబ సౌఖ్యమునకే గాక,
దేశ సౌభాగ్యమునకు కూడ
ఆధారభూతులగు పిల్లల క్షేమ
మునే సదా నపేక్షించుచు,
వారి ఆరోగ్యాభివృద్ధికై పాటు
పడి ప్రయత్నించు తలిదండ్రు
లందరకు వినయ పూర్వక
ముగా నర్పించు చున్నాను.

—గ్రంధకర్త.

## OPINIONS

Dr. T. Satyanarayana Murty, L. M. P. (Regd.)
PHYSICIAN & SURGEON.
*Secretary, Child Welfare Centre,*
TADEPALLIGUDEM.

This book on 'DISEASES OF CHILDREN AND TREATMENT' written by Mr. T. Kameswara Rao, B. A., is a valuable addition to the Telugu Literature. The author has made a comparative study of different systems of medicine. The subject matter is so nicely analysed that it can be easily understood by mothers, nurses, and Physicians alike. I cannot pronounce any opinion on the efficacy of the drugs mentioned in the book, as I have no practical knowledge of the same. The homœopathic system of medicine, though still new in the Andhra country, is rapidly becoming popular. It is easily avail able to all, cheap and agreeable to take. The author has rendered great service in presenting this edition to the Telugu Public.

(Sd.) *T. Satyanarayana Murty, L. M. P.*

డాక్టరు దువ్వూరి రామకృష్ణారావుగారు, బి.ఏ.ఎస్ డి.డి.హెచ్.డి.
కార్యదర్శి, హానిమన్ క్లబ్, రాజమండ్రి.

నేను డాక్టరు తల్లాప్రగడ కామేశ్వరరావుగారు వ్రాసిన 'బాలరోగముల చికిత్స' ను చదివితిని. గ్రంథకర్త ఈ పుస్తకము వ్రాయుటలో చాల కష్టించిరి. ఈ పుస్తకమును జాగ్రత్తగ పరిశీలించినచో వైద్యుల సహాయ మక్కరలేకయే, గృహస్థులు తమ పిల్లల రోగములను తప్పక ప్రథమదశలోనే నివారణ జేసుకొనగలరని నా నమ్మిక. మనదేశభాషలో యీ హోమియోపతీ పుస్తకములు బహుతక్కువ. అందువలననే యీ వైద్యమునకు రావలసినంత ప్రాముఖ్యత రాలేదు. ఈ కొరతను తీర్చుటలో నా వైద్యమిత్రులగు కామేశ్వరరావు, వై. గణపతిరావు, లంక రామారావు గార్లు మార్గదర్శకులగుచున్నారు. ఇంకను ఎన్నియో హోమియోపతి పుస్తకములు, అందు స్త్రీరోగములు, సన్నిపాత జ్వరము, క్షయ, నోటికాయలు మొదలగు ప్రత్యేక వైద్యగ్రంథములు (Books on special diseases) ప్రచురించవలసియున్నది. అచిరకాలములోనే యిట్టి గ్రంథములు ఆంధ్రములో అచ్చుపడుననియు, అవి సర్వజనాదరణీయము లగుననియు నే నాశించుచున్నాను.

(Sd.) దువ్వూరి రామకృష్ణారావు,
28-3-36.

# గ్రంథకర్త ఉపోద్ఘాతము

సోదర సోదరీమణులారా!

ప్రతి గృహమందును భార్యాభర్తలు పిల్లల కొరకు పరితపించుటయు, పిల్లలు పుట్టిన తోడనే అపరిమితానందభరితులై వేడుకలు జరుపుటయు యెల్లరు చూచుచున్నదే. ఎంతమంది ధనవంతులు బిడ్డలు లేకపోవుటచే తమ జన్మ నిరర్థకమని తలచి, బిడ్డలకొరకు తీర్థయాత్రలు సేవించుట, జపతపంబులు సలుపుట, దానధర్మంబులు చేయుట మనము చూచుట లేదు ? 'పిల్లలు లేని యిల్లు, పాడిలేని కొంప పాడుకొంప' యని పెద్దలు చెప్పిన సామెత వృథయగునా ? ముద్దుముద్దు మాటలతో, వచ్చీరాని నడకతో, పెట్టిన వస్తువు పెట్టినచోటనుంచక యిటునటు పారవైచుచు, ముద్దయిన అల్లరిచేయు పిల్లలున్న గృహమునకే అందము, ఆనందముకాని, మొరడులనలె భార్యాభర్త లిరువురు ఒకరి కొకరు యెదురుగా కూర్చొని విలాసముగా కబుర్లు చెప్పుకొనుచు సర్వ సౌఖ్యము లనుభవించుచుంటిమని అనుకొనుచున్నంత మాత్రమున ఆ గృహమునకు అంద మెక్కడ ? ఆనంద మెక్కడ ?

అట్టి నిత్యానంద మొసగూర్చు పిల్లలను ఆరోగ్యవంతులుగ చేయు భారము తలిదండ్రులదిగాక మరెవరిది ? వారి భారమును వారు గ్రహించక, ముద్దుచేగాని, గారాబముచేగాని బిడ్డలకు సరిపడని తినుబండారములను బెట్టియో, ఆరోగ్య విధులను గమనించకయో వారిని అనారోగ్యవంతులుగ జేయుచున్నారు. పిమ్మట తమ బిడ్డల రోగములకు చికిత్సలను

జేయుంపలేక మానసికముగను, ఆర్థికముగను బాధలు పడు చున్నారు. అది వారి స్వయంకృతాపరాధమే శిశు పోషణ విధానమును తెలిసికొని పిల్లల నారోగ్యవంతులుగ చేయుబాధ్యత తలిదండ్రులపై యుండ, వా రది నిర్లక్ష్యము చేయుటచేతనే బిడ్డలకు శరీర బాధ, పెద్దలకు మనోబాధ సంభవించుచున్నది.

మరియు చిన్నతనమునుంచి దృఢశరీరులు, దృఢసంకల్పులు నగు బాలురు పెద్దవారైనచో కుటుంబమునకేగాక దేశమునకు, ప్రపంచమునకు కూడ మహోపకారు లగుచున్నారు. కుటుంబ ప్రఖ్యాతి, దేశ సౌభాగ్యము పిల్లల మీదనేగదా ఆధారపడి యున్నది! నెపోలియన్, నెల్సన్, అబ్రహాంలింకన్, శివాజీ, మహాత్మాగాంధి మొదలగు వీరుల చరిత్రములను చదివినచో వారితల్లులు వారిని శైశవమునుంచి యెట్లుపెంచి తరిఫీదుచేసిరో తెలియగలదు. "The hand that rocks the child rules the world". ఉయ్యాలనూపు చేయి ప్రపంచము నేలుచున్న దను ఆంగ్లసామెతయొక్క భావమిదియేకదా!

పిల్లల క్షేమ మరయవలసినవారు తలిదండ్రు లొక్కరే కాదు. అయిదు సంవత్సరములు వచ్చినతోడనే పిల్లలు బడి లోనికి పంపబడుదురు. అక్కడ వారికి ఆరోగ్య విధులను నేర్పుచు, ఆరోగ్య మార్గములను సూచించుచు, ఆరోగ్య వంతులుగ చేయు బాధ్యత ఉపాధ్యాయులదై యున్నది.

కావున ప్రతి గృహమందుండదగినముఖ్య గ్రంథమేది యని యోచించి, తలిదండ్రులు, ఉపాధ్యాయులు ఎల్లరును శిశుపోషణము, బాలరోగములను గురించి ముఖ్యముగ తెలిసి కొనవలసిన యావశ్యకత కలదని యూహించి, కొన్ని ఆంగ్ల హోమోపతి గ్రంథముల సహాయమువల్లను, కొంత స్వానుభవ

మువల్లను, ఈ 'బాలరోగముల-చికిత్స' అను గ్రంథమును వైద్యేతరులకుకూడ అర్థమగు రీతిని అతి సులభశైలిలో వ్రాసి యుంటిని. దీనిని చదివిన జననిజనకులు, ఉపాధ్యాయులు కూడ వైద్యుని సహాయ మపేక్షించకయే తమబిడ్డల రోగములను ప్రారంభదశలోనే నివారణ చేసుకొనగలుగుదురని ఆశించు చున్నాను.

హోమియోపతి ఔషధములు, పిల్లలకు, పెద్దలకు, గర్భిణీ స్త్రీలకు ఎల్లరకు ఉపయోగమైనవి. అందు ముఖ్యముగ పిల్లలకు వరప్రసాదము. చేదు కషాయములతోను, వెగటు ద్రావకములతోను, వారిని క్షోభ పెట్టుటకంటె, వారు సంతోషముతోను, ప్రీతితోను సేవించు ఔషధములచేతనే వారి రోగములను నివారించుట మంచిది. హోమియోపతి మందులట్టివి, సేవించుట సులభము, పనిచేయుట అద్భుతము.

ఐదవ ప్రకరణములో పిల్లలకేగాక పెద్దలకుకూడ కలుగుచుండు సాధారణ జ్వరము, సన్నిపాత జ్వరము, చలి జ్వరము, ఉబ్బసము, క్షయ మొదలగు వ్యాధులను గురించి వ్రాయబడెను.

స్వంత పను లెన్ని యున్నను తీరికచేసుకొని వ్రాత ప్రతిని ఆమూలాగ్రముగ చదివి, ముఖ్యముగ సలహాల నిచ్చి, అచ్చువేయించుటకు ప్రోత్సాహపరచిన కాకినాడ ఆంధ్ర హోమియోపతి సంఘ కార్యదర్శిగారగు శ్రీయుత పొన్నాడ వెంకట్రావు బి. ఏ. గారికిని ; రాజమండ్రి హానిమన్ క్లబ్ కార్యదర్శిగారగు డాక్టరు దుర్వూరి రామకృష్ణారావు బి.ఏ.ఎన్.డి.డి. హెచ్. డి. గారికిని ; అచ్చు వేయించు కాలములో సలహాల నిచ్చి ప్రూఫులు సరిచూచి, విశేష శ్రమపడి సహాయ మొన

ర్చిన ఆంధ్ర హోమోపతి కాలేజి ప్రిన్సిపాల్ గారగు డాక్టరు లంక రామారావు హెచ్. ఎం. బి. గారికిని ; ఆంధ్ర హోమో పతిసంఘమువారి ఆదరణమున ప్రచురించుటకు అనుజ్ఞనొసంగిన సదరు అసోసియేషన్ వారికిని ; అమూల్యమగు పీఠికను వ్రాసి నా గ్రంథమునకు ప్రాముఖ్యత నొసంగిన శ్రీ పొన్నాడ వెంక ట్రావు బి. ఏ. గారికిని నా కృతజ్ఞతా వందనములు.

నే నీ గ్రంథముకూడ వ్రాసి సుమారు రెండు సంవత్సరము లైనను, పై నుదహరించిన స్నేహితుల ప్రోత్సాహమువల్ల నే యిప్పటికైనను ప్రచురింపగలిగితిని. ఇందులకుకూడ వారికి తిరిగి వందనములు.

నాకు గ్రంథము వ్రాయుట కిది ద్వితీయ ప్రయత్నము. నా సోదర సోదరీమణులు దీనిని చదివి, లోపములను దయతో తెలియజేసినచో కృతజ్ఞతతో సవరించుకొందును.

ఉంగుటూరు
(ప॥ గో॥ జిల్లా)

ఇట్లు విన్నవించు సోదరుడు
తల్లాప్రగడ కామేశ్వరరావు

# పీఠిక

## (పొన్నాడ వెంకటరావు, బి. ఏ.)

ఏ దేశమునగాని జాతీయతకు బిడ్డలే ఆధారము. బిడ్డలే జాతీయ ప్రతిష్ఠకు పునాది. దేహమనోదారుఢ్యములుగల బిడ్డలతోగూడిన దేశము మిక్కిలి ఔన్నత్యమును బొందును. అందుచేతనే జాతియ ఔన్నత్యమునకై పెనుగులాడుచున్న పాశ్చాత్యదేశములు ఇటలీ, జర్మనీ మొదలగునవి బిడ్డల ఆరోగ్యమునకెంతేని కృషిచేయుచున్నవి. ఆరోగ్యవంతులగు బిడ్డలను కని పోషించు తలిదండ్రులు దేశాభ్యుదయమున కెంతయు తోడ్పడి-వారగుదురు. గోల్డుస్మిత్తు అను నాంగ్లకవి ఎక్కువమంది పిల్లలనుగని, పెంచు తలిదండ్రులు బిడ్డలులేని వారికన్న యెక్కువ దేశోపకారులని వ్రాసియున్నాడు. గోల్డుస్మిత్తు కవి కుటుంబబాహుళ్యముచే బీదతన మనుభవించినను, తనబిడ్డలవల్ల కలిగిన యానందముచే మానసికసౌఖ్య మనుభవించియుండెను. బిడ్డలులేని సంసార మొక నిర్జీవమైన ఎడారివంటిది. ఎక్కువమంది బిడ్డలుగల సంసార మొక రమ్యమైన ఉద్యానవనము వంటిది. అయితే బిడ్డ లారోగ్యవంతులుగానిచో, సంసారము భయంకరారణ్యము వంటిదనికూడ చెప్పవచ్చును.

ఆరోగ్యవంతులై, దేహమనోదారుఢ్యములు కలిగిననేగాని, బిడ్డలు తలిదండ్రుల సౌఖ్యమునకుగాని, దేశసేవకుగాని కారణము కాజాలరు. ఆరోగ్యమైన బిడ్డలుగలుగుటకు ముందు తలిదండ్రు లారోగ్యవంతులై యుండవలెను. అనారోగ్యవంతులైన తలిదండ్రుల కారోగ్యముగల బిడ్డ లెట్లు జన్మించెదరు? శరీర మానసికారోగ్యము గలవారికిమాత్రమే ఆరోగ్యవంతులైన బిడ్డలు గలుగుదురు. పవిత్రమైన మనస్సుతో ఆరోగ్యదాయకమైన పరిస్థితులలో మాతృగర్భమున బీజోత్పత్తియైనచో తప్పక ఆరోగ్యవంతులగు బిడ్డలు కలిగెదరు. అట్లు గర్భధారణము మొదలు శిశుజన్మమువరకు శారీరమానసికారోగ్య పరిస్థితుల సరిగ్రహించి, అవలంభించక పోవుటవల్ల అనేకరోగములు కలుగుచున్నవనుటలో సందేహములేదు.

బిడ్డల రోగములకు కారణములలో ముఖ్యమైనది తలిదండ్రులు అస్వాభావిక జీవనముచేసి వ్యాధిగ్రస్తులై, అనారోగ్య అవస్థలో బిడ్డలను గనుట.

"The health of the mother and father long before the

Conception of the child has much to do with the ovum and the sperm cells and hence the inherited tendencies."

తలిదండ్రుల రోగము బీజముద్వారా బిడ్డలయందు ప్రవేశించును. ఈ కారణముననే కొందరు బిడ్డలు రోగముతోనే, రోగులగనే పుట్టెదరు. సుఖజాడ్యములుగల తలిదండ్రులకు పుట్టు బిడ్డలు జన్మించక ముందుగానే మరణించుటగాని, వెంటనే మరణించుటగాని, కొలది కాలములోనే మరణించుటగాని జరుగుచుండును. ఇట్లే క్షయరోగుల బిడ్డలుగూడ మరణించెదరు. బిడ్డలకు గలుగు దీర్ఘరోగము లన్నియు తలిదండ్రుల రోగములవల్లనే కలుగుచుండును.

బిడ్డలు జన్మించినది మొదలు ప్రకృతి ధర్మములకు విరుద్ధముగ పెంచబడుట వల్లకూడ అనేక రోగములు కలుగుచుండును. వీటిలో కృత్రిమాహారములు, కృత్రిమ అలవాటులను ముఖ్యముగా రోగ జనితములు. బిడ్డలకు గలుగు తరుణ వ్యాధు లన్నియు విపులముగా యీ గ్రంథకర్తగారు చికిత్సా విధానముతో వివరించియున్నారు.

వైద్య శాస్త్రములో బాలరోగ నిదానమును, చికిత్సావిధానమును మిక్కిలి కష్టమైనది. బిడ్డలయందు రోగ సూచనల గ్రహించుట సులభముకాదు. బిడ్డలు తమ మానసిక లక్షణములనుగాని, బాధలనుగాని వర్ణింపలేరు. అల్లోపతి విధానమువలె రోగ పర్యవసాన లక్షణములనుబట్టి చికిత్సా విధాన మేర్పరచుకొనుటవల్ల రోగము కుదురదు. అందు ముఖ్యముగా దీర్ఘరోగములలో రోగియందు వైద్యుని నేత్రములకు గోచరించు లక్షణములను బట్టిమాత్రమే మందు నిర్ణయించిన, యెంతమాత్రమును లాభ ముండదు.

చికిత్సా విధానములో కలుగు నపజయములకు ముఖ్యకారణము రోగ నిదానమందలి లోపమేగాని వేరుగాదు. హోమోపతి శాస్త్రములో రోగ నిదానమునకు తదితర వైద్యశాస్త్ర రోగనిదానమునకును, అందు ముఖ్యముగా అల్లోపతి వైద్యశాస్త్ర రోగనిదానమునకును చాల వ్యత్యాసము కలదు. హోమోపతి వైద్యుడు రోగిని రోగమును మిక్కిలి సూక్ష్మదృష్టితో గ్రహించినగాని రోగి సరియైన రూపమును గ్రహించలేడు. సరియైన రోగి రూపమును గ్రహించినగాని సారూప్యముగల ఔషధమును గుర్తించలేడు. అల్లోపతి వైద్యుడు రోగియందలి ప్రతేక రూపమును గ్రహించడు సరిగదా, అట్లు గ్రహించ నవసరము లేదనియు, అందరి రోగులయందును రోగము లొకేరీతిగా నుండుననియు నమ్మి రోగములకు చికిత్స జేసెదరు. హోమోపతి వైద్యుడు రోగికి చికిత్స చేయును. అల్లోపతి వైద్యుడు రోగమునకు చికిత్స చేయును.

ఇందలి విశేషము అల్లోపతి వైద్యుడు గ్రహించలేడు. హోమోపతి శాస్త్ర తత్వము గ్రహించినవారు మాత్రమే బోధపరచు కొనగలరు. రోగికి మందుగాని రోగమునకు మందులేదన్నచో కొందరు యిందలి గూడార్థమును గ్రహింపలేక పరిహాశించెదరు.

రోగమనగా నేమో, ఆరోగ్యమనగా నేమో, ప్రాణమనగా నేమో, మరణ మనగా నేమో నొకటి రెండు మాటలలో చెప్పుట చాలకష్టము. రోగముగాని ఆరోగ్యముగాని ప్రాణముగాని మరణముగాని ఒక విధముగాగాని మరియొక విధముగాగాని ఉండునని చెప్పలేము. రోగమునుగాని ప్రాణమునుగాని మరణ ముగాని మనము కంటితో చూడలేము. ఒకానొక పరిస్థితిలోనున్న మనిషి రోగముచే బాధ పడుచున్నాడనియు, రోగియనియు, ఒకానొక పరిస్థితిలో నున్న మనిషి ఆరోగ్యవంతుడనియు, మరియొక పరిస్థితిలోనున్న మనిషి ప్రాణము గలిగియున్నాడనియు, యింకొక పరిస్థితిలోనున్న మనిషి మరణము నొందిన అనగా ప్రాణము కోల్పోయిన మృత శరీరమనియు చెప్పెదుము. చైతన్యములేని, చైతన్యశక్తిలేని శరీరము మృత కళేబరము. చైతన్యశక్తియే ప్రాణ మని చెప్పవలెను. ఈ శక్తి సక్రమముగా, ఒకానొక పరిస్థితియందు శరీరము నావహించి, శారీర మానసిక కార్యక్రమమును జరిపించునంతకాలము, మను ష్యుడారోగ్యవంతుడుగ నుండును. ఈ చైతన్యశక్తి లేక ప్రాణశక్తి సక్రమ స్థితిదప్పి విపరీత పరిస్థితులనొంది శరీరమున ప్రవహించుచున్నచో అనారోగ్య స్థితియనియు అట్టి స్థితియందు మనుష్యుడు రోగియనియు చెప్పెదుము.

అల్లోపతి వైద్యులయందేగాక, పలువురు హోమోపతి వైద్యులయందుగూడ రోగమనగా సరియైన యభిప్రాయములులేకున్నవి. ఎట్టివాడారోగ్యవంతుడో ఎట్టివాడు రోగియో సరియైన యభిప్రాయములు నిర్దిష్టముగ వైద్యుని మనస్సు నందు నాటుకొనియుండవలెను. ఈ యభిప్రాయమును స్వల్పముగ సూచించ ప్రయత్నించెదను.

సౌఖ్యము లేకపోవుటే రోగము. శారీర మానసికసౌఖ్యమే ఆరోగ్యము. శారీరసౌఖ్యమున్నంతకాలము మనము ఏ అవయవమునందుగాని ఏ బాధయును పొందము. శరీరమున ఏభాగమునగాని, ఎంత స్వల్పముగానైనను బాధగాని, మంటగాని, సలుపుగాని, పోటుగాని, తిమ్మెరగాని, దురదగాని కలిగినచో, మన దృష్టియు, ఆలోచనయు ఆ భాగమున కేంద్రీకరించును. ఆరోగ్యముగా నున్నంతకాలము మన శరీరముసంగతిగాని, ఏ అవయవము సంగతిగాని మనకు జ్ఞాపకముండదు. ప్రతినిమిషమును ఎన్నియోసార్లు మనము నాసికతో గాలి

పిల్చుచున్నను, ప్రతి నిమిషమును మనహృదయ మెన్నియోసార్లు కొట్టుకొను చుండినను, వీనిసంగతే మరచెదము. మనమెంతదూరము నడచినను మనపాదము లను గురించిగాని, ఎంతపనిచేసినను మనచేతుల గురించిగాని యోచించము. ఆరోగ్యస్థితియం దున్నంతకాలము మనశరీర అవయవములు మన మెరుగకుండ గనే, పరిపాటుగా తమ కార్యక్రమమును నిర్వర్తించును. అట్లుగాక కొంచెము రొంపపట్టినచో, తరుచు మనచేతులు ముక్కుమీదనే యుండును. కొంచెము తలనొప్పి కలిగినచో, అది తగ్గువరకు మరియొకపని చేయజాలము. ఇట్లే మాన సికారోగ్యముకూడ నుండును. మనస్సు సరిగా పనిచేయునంతకాలము, కామ క్రోధ లోభ మోహ మదమాత్సర్యాదులు లేక, నిర్విచారముగ, మహానంద ముతో కాలము నడచుచుండును. జ్ఞాపకశక్తియందు లోపముండక, ఆలోచన శక్తి సరిగాఉండి, గ్రాహ్యశక్తి సూక్ష్మముగా నున్నచో మానసికారోగ్యము సరిగానున్నదని చెప్పవచ్చును. అట్లుగాక స్వల్పకారణములచే చిరచిరలాడుచు క్రోధము నొందుచు, అతి సులభముగ దుర్వ్యసనములకు లొంగిపోవుచున్న మనోదౌర్బల్యము గలుగుచున్నదని చెప్పవలెను.

ఆరోగ్యస్థితి యనగా శారీర మానసిక వ్యాపారములు సులభముగ, యేవిధ మయిన కష్టమును పొందకుండ నడచిపోవుచుండు స్థితి యనవచ్చును. అనా రోగ్యస్థితి యిందుకు భిన్నముగ నుండును.

మనము భగవత్స్వరూపమైన ప్రకృతినుండి జన్మించితిమి. అనగా మనము పంచ భూతములవల్ల నుత్పత్తియైతిమి. మన శరీరము, మనస్సును పంచ భూత సమ్మేళనము. పంచ భూతములవల్ల నుత్పత్తియై, పంచ భూతములవల్లనే యభి వృద్ధినొందుచు జీవించుచు, పంచ భూతములలో కలసిపోవుచున్నాము. పంచ భూతములతో మనకు ఉండుకున్న సంబంధమే మన యారోగ్యమును తెలియ జేయును. మనము జీవించుట కాధారభూతములైన పృథ్వ్యప్తేజో వాయు రాకాశములు మనయందు కొన్ని మార్పులు కలుగజేయుచుండును. సాధారణ ముగా ఆరోగ్యవంతుడైన మనుష్యునియందు వాయువు, జలము, ఉష్ణము, శీతలము మొదలగునవి యేవిధమైన బాధయును కలిగించవు. అనారోగ్య వంతునియందు మాత్రమే బాధలు కలిగించును. కొందరు యేమాత్రమును ఉష్ణ మును సహించలేకుండుటయు, మరికొందరు శీతలోదకమువల్ల బాధల నొందు టయు, కొందరు శీతలోదకము నేగాని గోరువెచ్చని నీరుకూడ సహించలేక పోవుటయు, కొందరు మండువేసవిలోగూడ దుప్పటి కప్పుగొనుటయు మొద లగు పరిస్థితులు కలిగియుండురు. కొందరు శీతకాలము ప్రవేశించినంతనే రోగ

గ్రస్తులగుటయు, కొందరు వేసవి రాగానే రోగపీడితు లగుటయు, కొందరకు వర్షకాల మారంభ మవగనే జబ్బుచేయుటయు కలుగును. ఇవి అన్నియు అనారోగ్య పరిస్థితులే !

శరీర మానసికారోగ్యముగల మనుష్యుడు సచ్చిదానందమూర్తియై, భగవద్భక్తిగలవాడై, సృష్టిజాలమును ప్రేమించుచు, కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాదులకు లోనుగాక, తన శరీరావయవముల ఉనికిగూడ మరచిపోయి, పంచభూతములవల్ల బాధలు పొందక ఆనందించుచుండును. ఇందుకు భిన్నముగ మానసిక లక్షణముల యందేమి, శారీరావయవ లక్షణముల యందేమి మార్పులు గోచరించినచో, అవి అనారోగ్య సూచనలని గ్రహించవలసియున్నది. చిన్న పిల్లల యందు గూడ పెద్దల యందు వలెనే యీ రోగసూచనలకు కారణము ఆంతరంగిక రోగపిశాచత్రయమైన సోరా, సైకోసిసు, సిఫిలిసు రోగములేగాని వేరుగాదు. సాధారణముగ అస్వాభావికాహారమువల్ల గలుగు బాధలును, ఆకస్మికోపద్రవములవల్ల కలుగు బాధలును మినహాయించగా, మిగిలిన వ్యాధులన్నియు, అందు ముఖ్యముగా అన్నికాలిక రోగములును పై రోగత్రయమువల్లనే కలుగునని హానిమన్ మహాత్ముడు నిర్ధారణచేసియున్నాడు.

ఈ రోగత్రయమైన సోరా, సిఫిలిస్, సైకోసిసు వ్యాధుల లక్షణముల బాగుగ గ్రహించినగాని, రోగియొక్క నిజస్వరూపమును గ్రహించుటకష్టము. సోరారోగి తరుచు నాడివ్యాధులచేతను, చర్మవ్యాధులచేతను బాధపడుచుండును. ఈ రోగియందు మానసికాందోళన మెక్కువగనుండును. శారీర మానసికాందోళన, విరామములేమి, భయము, ఉన్మాదము, స్వల్పకారణములకే కోపము తెచ్చుకొనుట, పిరికితనము, ఒక ఆలోచననుంచి మరియొక ఆలోచనలోనికి యెడతెగకుండ పరుగులిడుచుండుట, సదా ప్రయాణము చేయవలయుననియు, తిరుగుచుండవలెననియు కోరిక, విశ్రాంతికొరకు మత్తుద్రవ్యముల నుపయోగించు నలవాటు, చురుకుతనముకొరకు కాఫీ, టీ, చుట్ట మొదలగు వాని నుపయోగించు నలవాటు మరియు ఎన్నో విధములైన లక్షణములుండును. ఈ వ్యాధి ప్రపంచములో నూటికి తొంబదిమంది కున్నదని చెప్పవలెను. ఈ వ్యాధి నాగరికత హెచ్చుచున్నకొలదిని, అస్వాభావిక జీవనపరిస్థితు లెక్కువగుచున్నకొలది మరింత విరివిగ వ్యాపించుచుండుటయేగాక అనేక వికృత రూపముల దాల్చుచున్నది. ప్రపంచమునగల వ్యాధులలో నూటికి డెబ్బదియైదు రోగములకే సోరావ్యాధి కారణమని కనుగొనబడినది. దీనికి ముఖ్యకారణములు:

అస్వాభావిక ఆలోచనము, అస్వాభావికోద్దేశములు, అస్వాభావికోద్రేకములు, అస్వాభావి కాహార విహారాదులు, అస్వాభావిక రోగములు. వీటి నివారణకై అస్వాభావిక వైద్యపద్ధతుల నవలంభించి రోగము నంతర్గతముచేయుట. ఈ రోగము మన తాతతండ్రులనుంచి, అంతకుచాల పూర్వమునుంచి వంశపరంపరా వచ్చుచుండును. కుటుంబములకు పిత్రార్జితపు ఆస్తి యేమియు లేకున్నను, సోరామాత్రము కావలసినంత కలుగు చున్నది. చిన్న బిడ్డలయందుగూడ చర్మ వ్యాధులు, చిడుము, గజ్జి మొదలగునవి కనపడునప్పుడు, పైనచెప్పిన భయము పిరికితనము, సిగ్గు, మానసిక దౌర్బల్యము, చిరాకు మొదలగు లక్షణము లగు పడినప్పుడు సోరా రోగియని గ్రహించవచ్చును. ఈ సోరాతత్వముగల రోగు లలో సోరినం, సల్ఫర్, కాలీఫాస్, కాల్కేరియా, లైకోపోడియం మొదలగు యాంటిసోరిక్కు మందుల నుపయోగించినగాని తత్వము మారదు.

సోరావ్యాధి ఉత్పత్తి, స్వభావము, నివారణమును గురించి వ్రాయవలసి నచో ఒక పెద్ద గ్రంథము వ్రాయవలసి యుండును.

సాధారణముగా బలహీనులైన బిడ్డలు, యెల్లప్పుడు నీరసముగా కనబడు వారు, తరుచు గ్రంధులువాచుట, "టాన్సిల్సు" ఎడినాయిడ్సుచే బాధపడు వారు, స్వల్ప కారణములచే పడిశము గలవారు, బలహీనమైన ఊపిరితిత్తులుగల వారియందు క్షయరోగ తత్వముండును. దీనికిగూడ సోరాయే కారణమని కొందరు సూచించుచున్నారు. బిడ్డలలో యీ వ్యాధులు చాల తరుచుగా చూచు చున్నాము. ఇట్టి రోగ తత్వములలో బేసిలినం, టూబరిక్యూలినం, బరీటాకార్బ్, నేట్రంమూర్, కాల్కేరియాకార్బ, కాల్కేరియాఫాస్, మొద లగు మందులిచ్చినగాని ఉపయోగముండదు.

ఇల్లే సుఖరోగములు సెగ, సవాయి, రోగములు జీర్ణించి, అంతర్గతమైన వారి సంతతియందు జనించిన బిడ్డలకు, మెడోరినం, తూజా, మెర్క్యూరియస్ సిఫిలినం మొగలగు మందులను రోగ సారూప్యము ననుసరించి ఉపయోగించ వలెను. శరీర తత్వములలో అంకురించి ఆవరించియున్న ఈ దీర్ఘరోగ తత్వముల రూపమును సరిగా గ్రహించినగాని రోగ చికిత్సామార్గము సులభముగాదు.

వంశపరంపరావచ్చు పైచెప్పబడిన రోగములుగాక అల్లోపతివైద్య పద్ధ తులవల్ల అనేక రోగములు కలుగుచున్నవి. నిజమైన రోగకారణముల నెరుగక సరియైన రోగనివారణ పద్ధతుల నెరుగక, అస్వాభావిక చికిత్సలచే, రోగ ముల బహిష్కరణ మార్గముల బంధించి రోగముల నంతర్గతము చేయు చుండుటవల్ల అనేక ప్రమాదములు కలుగుటయేగాక, అనేక నూతన

రోగములు కలుగుచుండును. రోగముల నణచిపెట్టి, రోగ నివారణమని చెప్పు వైద్యుల పద్ధతివల్ల కలుగు రోగముల స్వభావముల గుర్తెరిగినగాని సరియైన చికిత్సామార్గము లభించదు. చర్మవ్యాధులను జింకు, సల్ఫర్ తైలములచేతను, జ్వరములను క్వైనా మొదలగు మందులచేతను అణచిపెట్టి అంతర్గతము చేయుటచే యెన్నియో ప్రమాదకరమైన వ్యాధులు కలుగుచున్నవి. ఇట్లే మశూచికము రాకుండ టీకాలువేయుట, కలరా మొదలగు వ్యాధి నిరోధనమునకై చేయు ఇంజక్షన్‌లు అనేక ప్రమాదకరమగు దుష్ఫలితముల కలుగజేయుచున్నవి.

ఇదిగాక అనవసరమైన శస్త్రవైద్యముచేకూడ చాల వ్యాధులు కలుగుచున్నవి. ఇట్లనినచో శస్త్రవైద్యమును యెంతమాత్రమును నిరసించుటకాదు. శస్త్రచికిత్స మిక్కిలి అవసరమని తోచినపుడు మాత్రమే చేయించవలెనుగాని, అనవసరముగా చేయించినచో నదియు అనర్థమును చేకూర్చును. బిడ్డల టాన్సిల్స్ వ్యాధిలో, టాన్సిల్సు శస్త్రచికిత్సచే అంతరింపచేయుటచే, క్షయరోగము గలుగునని చెప్పబడుచున్నది. ఈ "టాన్సిల్స్"కు కారణమైన శరీరతత్వమును క్రమమైన చికిత్సచే మార్పుచేసినచో టాన్సిల్స్ వృద్ధిచెందకుండ నిలిచిపోయి, క్రమముగా వాటియంతటు అవి అంతరించును. టాన్సిల్స్, ఎడినాయిడ్స్, వాచిన గ్రంధులు, అంతరకుసుమలు, కంతులు, కాయలు మొదలగువాటి కేదో కారణ ముండవలెనుగదా! వీటి కారణమును నివారణచేయవలెనుగాని, శస్త్రములచే కోసినచో, తిరిగి కొంత కాలమునకు మరల బయలుదేరును. నవీనశాస్త్ర పరిశోధనా ఫలితముగ బిడ్డల రోగములకు కాల్షియం లోపము ముఖ్య కారణమని చెప్పబడుచున్నది. జీవరసాయన శాస్త్రజ్ఞులు కాల్షియం లోపముచే బిడ్డలు సరిగా నభివృద్ధిచెందక, రోగగ్రస్తులగుచున్నారని చెప్పుచున్నారు.

కాల్షియం శరీర నిర్మాణములోని యెముకలు వృద్ధిచెందుటకును, శరీర కండరములను రక్తమును బలపరచుటకును ముఖ్యమని చెప్పబడుచున్నది. ధాతుపోషక లవణములలో కాల్కేరియాఫాస్ బిడ్డలకు చాల బలము కలిగించుచు చాల వ్యాధులకు పనిచేయుచున్నది. ఇట్లే కాల్కేరియాకార్బుగూడ బిడ్డల శరీరతత్వమును బలపరచుచున్నది. బిడ్డలయందు రికెట్సు అను వ్యాధికి యివి చాల చక్కగ పనిచేయును.

బిడ్డల రోగనిదానములో, వీరి శరీరతత్వ రూపములను జాగ్రత్తగ పరిశీలించవలెను. ప్రతిదినము అనేక రకముల బిడ్డలను మనము చూచుచుందుము. రోగులయిన బిడ్డలయందు అస్వాభావికమైన మానసిక లక్షణములు గోచరించును.

బిడ్డల మానసిక తత్వములలో చాలచిత్రములు చూచుచుందుము. సాధారణ

ముగా "కెమోమిల్లా" మానసికతత్వముగల బిడ్డలవలన బాధపడని యిల్లు అరుదు. ఇట్టి బిడ్డ తలిదండ్రులకే దుర్భరముగ తోచును. ఈ రోగికి మిక్కిలి చిరాకు, కోపము, ఏమిచేసినను కోపముపోదు. బిడ్డ సదా యేడ్చును. అస్తమానము యెత్తుకొని త్రిప్పుచుండవలెను. రాత్రి నిద్రతక్కువ, ఏదిచూచినను అది కావలె ననుట, కావలసినది యిచ్చినను పారవేయును. నాడీదౌర్బల్యము; బిడ్డ తలి దండ్రుల ప్రాణమునుకూడ విసిగించును. ఇట్లే "సినా" "ఆంటింక్రూడు" మొదలగు మందులయందు, ఇట్టి చికాకుగల మానసికతత్వములుండును. ఇట్లే "శానిక్యులా" బిడ్డ పెంకెబిడ్డ, అల్లరిచేయును, ఏడ్చును, కొట్టును, క్రిందపడి దొర్లును, రాత్రింబవళ్లు యెత్తుకొనవలెనని కోరును; ఏమిచేసినను, ఏమి యిచ్చి నన, యెంతబ్రతిమాలినను శాంతించదు. మిక్కిలి యెక్కువైన మలబద్ధము కలిగియుండును. ఏ వ్యాధి అయిననుసరే యీ లక్షణములున్నచో యీమందు లిచ్చినచో బిడ్డకు ఆరోగ్యము కలుగును. ఇట్లే అనేక మానసికతత్వములకు సారూప్యముగల మందులు చాలగలవు. బిడ్డలయందీ మానసిక లక్షణముల బాగుగ గ్రహించి సారూప్యౌషధమును నిర్ణయించక, జబ్బుచేయగనే "కాలోమెలు" యిచ్చి ఆముదముపట్టి, బాగుగా జీర్ణశక్తి నెక్కువచేయు మందులిచ్చినచో, రోగకారణమైన తత్వమట్లే నిలిచియుండును.

మానసిక లక్షణములనుబట్టి సారూప్యౌషధమును నిర్ణయించినప్పుడే సరియైన మందు లభించుటయు, నిజమైన రోగనివారణ గలుగుటయు తటస్థించును. రోగము ముందుగా మనస్సునందే ఆరంభించి, క్రమముగా నభివృద్ధి పొంది, శరీరావయవములయందు క్రమముగా మార్పులు కలుగజేసి బాగుగా ముదిరినప్పుడు శరీరమందు రోగపదార్థమును బహిష్కరింపజేయుచు, అనేక విధములుగ కనబడును. శరీరమున మనకు గోచరించు రోగలక్షణములకు చాల కాలముపూర్వమే శరీరమును పరిపాలించు మనస్సులోనే రోగము ఆరంభించి వృద్ధిచెందుచుండును. గనుక మానసికలక్షణముల ముఖ్యలక్షణములుగ గ్రహించి సారూప్యౌషధమును నిర్ణయించుటే మిక్కిలి అవసరము.

ఇట్లే శరీరతత్వములుగూడ బాగుగ గ్రహించినగాని ఔషధనిర్ణయము చాలకష్టము. కేవలము శరీరము చిక్కి బలహీనముగా ఉండుట, ఆకలిలేమి, విరేచనబద్ధము, పడిశము, జ్వరము మొదలగు లక్షణములనుబట్టి ఔషధ నిర్ణయముచేయుటవల్ల రోగి తశ్శాంతిపొందినను రోగము యెన్నడును కుదురదు. శరీరమున కంతకును సంబంధించిన లక్షణములు, శరీరతత్వమును బాగుగ

గ్రహింపవలెను. శరీరతత్వము లనగా వాత పిత్త శ్లేష్మ తత్వములనిమాత్రమే గ్రహింపగూడదు.

ప్రకృతితో, దైవసృష్టితో, జీవనిర్జీవ పదార్థములతో, పంచభూతములతో ప్రతి మనిషికినిగల సంబంధ బాంధవ్యములబట్టి, అందువల్ల శారీర మానసిక లక్షణములయందు గలుగు మార్పులబట్టి తత్వము గ్రహించవలెను.

ఇట్టి తత్వములు హోమియోపతి వస్తుగుణదీపికలో దీర్ఘకాలము పనిచేయు మందులలో స్పష్టముగా కనబడును. ఇట్లు అనేక ప్రత్యేక తత్వములు రోగుల యందు గ్రహించి సారూప్యౌషధ నిర్ణయము చేయవలెను. అట్లుచేయక కేవలము స్థానికరోగ చిహ్నములనుబట్టిమాత్రమే ఔషధ నిర్ణయముచేసినచో తాత్కాలిక గుణముమాత్రమే కలుగునుగాని రోగి ఆరోగ్యవంతుడగునని చెప్ప వీలులేదు.

రోగులలో కాల్కేరియాతత్వము, కాప్సికం తత్వము, కాస్టికం, మెడోరినం, సోరినం, సిఫిలినం, ట్యూబరక్యూలినం, సల్ఫరు, లైకోపోడియం, గ్రాఫైటిసు మొదలగు తత్వములు జ్ఞప్తియందుంచుకొనవలెను. ఈ రోగుల తత్వములు బాగుగా బోధపడును.

సోరినం రోగి చూచుటకు అసహ్యకరముగ నుండును. సాధారణముగ అపరిశుభ్రముగను, చిడుము, దురద, విచారముగను, స్నానము చేయుటయం దయిష్టముగను ఉండును.

మెడోరినం రోగి మోకాళ్ళమీదను, రొమ్మునానుకొని బోర్లపండుకొనుచు, మధురపదార్థములయం దెక్కువ యిష్టముగలిగి, చీకటిఅన్న భయము కల్గి, మూత్రరోగము కలిగియుండును. సిఫిలినం రోగి బాధలు రాత్రులం దుద్రేకించును. ట్యూబర్క్యులినం రోగి శరీరమంతయు, మలమూత్ర విసర్జనములును పుల్లని వాసనగలిగి ఆమోద్రేకముతో గూడియుండును. కాస్టికం బిడ్డ చాల కాలము వరకు నడచుటకు అలవాటు కలిగియుండదు. కాప్సికం రోగి బలహీనమైన కండరములు కలిగి శ్లేష్మతత్వముకలిగి, గాలి యం దిష్టములేక, ఊబశరీరము కలవాడై, సోమరియైయుండును. సరసపరిల్లా బిడ్డకు పీక సన్నమును, శరీరము ముడతలు పడియుండును. అయోడియం బిడ్డ సదా యేదో తినుచుండవలెను. అయినను యెండిపోవుచుండును. అబ్రటేనం బిడ్డకు కాళ్లు సన్నముగనుండును. ఆర్జెంటంనైట్రికం బిడ్డ ముదుసలివలె యెండిపోవును. కాల్కేరియా బిడ్డలు త్వరగా నడవలేరు. నేట్రంమూర్ బిడ్డలు త్వరగామాట్లాడలేరు. కాల్కేరియా ఫాస్, బరిటా కార్బ్, నేట్రంమూర్, కాల్కేరియా బిడ్డలు ముఖ్యముగా మాన

సిక దౌర్బల్యము కలిగియుందురు. ఆంటిం(క్రూడ్, సల్ఫర్ బిడ్డలు స్నానము చేయుట కిష్టపడరు.

ఇట్లు శరీర మానసిక తత్వములకు సంబంధించిన లక్షణములను, ముఖ్యముగా రోగుల యిష్టాయిష్టములు, ప్రత్యేక కోరికలు, ప్రత్యేక సహనములును జాగ్రత్తగా పరిశీలించి, సారూప్యౌషధము నిర్ణయము చేయవలెను. ఆహార పదార్థములయందేమి, గాలి, నీరు, శీతలము, ఉష్ణము మొదలగు వాటి యందేమి రోగికి గల యిష్టములు, అసహ్యములను, ముఖ్య లక్షణములుగను; మానసిక లక్షణములు, కోపము, అసహనము, బుద్ధిమాంద్యము, గ్రాహ్యశక్తిలోపము, జ్ఞాపకశక్తిలోపము మొదలగు లక్షణములుగూడ విలువయైన రోగ సూచకములుగను, శరీర రోగబాధలయొక్క ఉద్రేకోపశమన పరిస్థితులుగూడ ప్రాముఖ్యమైన లక్షణములుగను, పిమ్మట రోగి పొందు బాధలు మొదలగునవియు వరుసప్రాముఖ్యతతో గ్రహించి సారూప్యౌషధమును గుర్తించవలసియున్నది. ఇట్లు చేయవలసిన అవసరమునకు కారణముల వ్రాయుటకు యిచ్చట తావు లేదు.

కొన్ని సాధారణ రోగములు బిడ్డలుధరించు దుస్తులు, ఆహార విహారములు, అలవాట్లు మొదలగువాటిలో లోపము లుండుటచే కలుగును. డబ్బాపాలవల్ల జీవించు బిడ్డలకు తరుచు కాలేయ ప్లీహ రోగములు కలుగు చుండును. చిన్న బిడ్డలకు వదులుగానుండు అంగీయును, లాగును చాలును. బిడ్డలు తరుచు గాలిలోను, యెండలోను స్వేచ్ఛగా తిరుగుచుండుటయు, సాధ్యమైనంత వరకు దుస్తులు తక్కువగా ధరించుటయు, అలవాటు చేయవలెను. పుట్టినది మొదలు కాళ్ళకు మేజోళ్ళు, జోళ్ళు, షరాయిలు, చొక్కాలు, కోట్లు, మొదలగు దుస్తుల అలవాటు చేయకూడదు. బీదలు, పల్లెటూరివాండ్రు, గోచీ గుడ్డమాత్రము ధరించి యెంత చలిలోనైనను, వర్షములోనైనను, యెండలోనైనను నిర్లక్ష్యముగ తిరుగుచు మిక్కిలి ఆరోగ్యవంతులై హాయిగా రోంపయినను లేక యుండుట చూచు చున్నాము. ఇంక ధనవంతులు ఉన్ని మేజోళ్లు, చొక్కాలు, కోట్లు, జోళ్ళు, పట్టుకోట్లు యెన్నియో రంగుదుస్తులు ధరించు చున్న కొలది, యెప్పుడును, చీమిడి ముక్కులతోను, కళ్ళపుసులతోను, ఒడలంతయు చిడుము, కురుపులతోను, యింటిలోనున్నను గాలి తగిలిన పడిశము, వర్షము కురిసిన జ్వరము, ఎండకాలమువచ్చిన విరేచనములు, కురుపులును గలిగిన సదా వైద్యునిమీదనే ఆధారపడి యుందురు. భగవన్నిర్మితమైన మన శరీరము, భగవన్నిర్మితమైన పంచభూతములతో మిత్రత్వము గలిగియుండ

వలెను. గాలిని, నీటిని శీతోష్ణములను శత్రువులవలె చూచుచుండినచో, అవి మనల యెట్లుపోషించి, సంరక్షించును ? గనుక సాధ్యమైనంత దిగంబర జీవనమే ఆరోగ్యదాయకము. చిన్నబిడ్డలకు మంచి గాలియు, సూర్యరశ్మియు మిక్కిలి అవసరము. ఇవి లేకపోవుటవల్లనే అనేక వ్యాధులు కలుగుచుండును.

మరియు చిన్నపిల్లల నెప్పుడును గారాబముతో పెంచగూడదు. లేక లేక పిల్లలు పుట్టినవారు, ధనవంతులగు బిడ్డలను మిక్కిలి గారాబము చేసెదరు. అట్లు చేయుటంలో బిడ్డలను మానసికముగను, శారీరకముగను అతి సున్నితము చేసెదరు. అట్లుచేయుటచే బిడ్డలకు శారీర మానసిక దౌర్బల్య మేర్పడును. మరియు గారాబముచే తరుచు తినుబండములు, మధుర పదార్థములును తినుట కిచ్చి అలవాటుచేసెదరు. చిన్నపిల్లలకు విస్తారము చక్కెరతినుటవల్ల చాల జబ్బుచేయును. కాలేయ వ్యాధులు జనింపచేయును. ఆంత్రములను, జఠరకోశమును పాడుచేయును. ఇదిగాక యిప్పుడు మనయిండ్లలో సాధారణముగ బిడ్డలకుగూడ కాఫీ, టీ లను అలవాటు చేయుచున్నారు. దీనివల్ల అనేక వ్యాధులు కలుగుచున్నవి. ముఖ్యముగా నాడీవ్యాధులకిన్నిటికిని ఈ దురలవాటు కారణమని చెప్పవలెను.

ఈ గ్రంథమును నా మిత్రులైన గ్రంథకర్త మిక్కిలి ప్రజోపయోగముగ రచించిరి. మన ఆంధ్రభాషలో హోమోపతి వైద్యములో బిడ్డల వ్యాధులను గురించి వ్రాయబడిన మొదటిగ్రంథ మిదియే. ఇందలి విషయములుగూడ చాల చక్కగా వ్రాయబడినవి. ఇట్టి గ్రంథము లింకనువ్రాసి హోమోపతి వైద్యాభివృద్ధికి గ్రంథకర్త తోడ్పడునని ఆశించుచున్నాము.

కాకినాడ,<br>
30–11–35.

పొన్నాడ వెంకటరావు,<br>
ఆంధ్రహోమోపతిసంఘ కార్యదర్శి.

# ద్వితీయముద్రణమున కుపోద్ఘాతము



ఈ గ్రంథము పునర్ముద్రణము జేయవలసిన అవసరము నాలు గైదు సంవత్సరముల క్రిందటనే కలిగినది. అయినప్పటికి పునర్ముద్రణము జరిగియుండలేదు. దీని కొరకై అనేకమంది ఆతురతతో యెదురుచూచుచున్న సంగతి మాకు తెలిసి, గ్రంథకర్తగారితో యీ విషయము ముచ్చటించగా, వారు మమ్ముల నాదరించి, వారు తెలుగున వ్రాసిన నాలుగు హోమియోపతి వైద్య గ్రంథముల—(1) స్త్రీల ఋతురోగములు (2) బాలరోగముల చికిత్స (3) సుఖవ్యాధులు (Venereal Diseases) (4) అజీర్ణము—యొక్క కాపీ రైటు హక్కులను సంపూర్ణముగా మాకిచ్చియున్నారు. మా యెడల వారు జూపిన ఆదరమునకు వారికి కృతజ్ఞతా వందనము లర్పించుచున్నాము.

నేటికి మరల యీ అమూల్యమైన గ్రంథమును ముద్రించి, హోమియోపతి వైద్య శాస్త్రాభిమానుల కందజేయుటలో మేము చాల సంతసించుచున్నాము.

1–10–1950 }
ఏలూరు }

ఇట్లు
జెమిని ప్రింటర్స్, ఏలూరు

# విషయ సూచిక

ఐదవ ప్రకరణము



ఆరవ ప్రకరణము

వస్తుగుణదీపిక

———



# మొదటి ప్రకరణము

## 1

ఏ రోగమునకైనను ఔషధనిర్ణయమును జేయుటకు పూర్వము వైద్యుడు కొన్ని ముఖ్యవిషయములను గ్రహించవలసియున్నది. బాహ్యమున కనబడు కొన్ని రోగలక్షణములనుమాత్రమే తెలుసుకొని వైద్యమొనర్చుటను ప్రారంభించరాదు. ప్రతి రోగికిని ప్రత్యేకించియుండు కొన్ని విశేష లక్షణములుగలవు. అట్టి లక్షణములన్నింటిని రోగివద్దనుంచి తెలుసుకొనియో లేక వైద్యుడు పరీక్షించి తాను స్వయముగా గ్రహించియో వైద్యముచేయవలెనేగాని, కేవలము బాహ్యలక్షణములనుబట్టి మాత్రము ఔషధనిర్ణయము చేయరాదు. ఇట్టి లక్షణ సముదాయమే హోమియోపతి వైద్యమునకు ప్రధానమైనది. అట్టి విశేషలక్షణము లెవ్వియన :—

1. రోగియొక్క మానసిక లక్షణములు :—అనగా కోపము, విచారము, ప్రేమ ద్వేషము, భయము, ధైర్యము మొదలగునవి.
2. ప్రకృతి లక్షణములు :—అనగా శీతోష్ణములను భరించలేకపోవుట, చలనమువలనగాని, విశ్రాంతివలనగాని, బాధలధికమగుట, నొక్కుటవలన నొప్పు లుపశమించుట మొదలగునవి.
3. శరీర లక్షణములు :—దురభ్యాసమువలన నదివరలో జనించి నెమ్మదించిన చర్మవ్యాధులు మొదలగునవి.
4. బుద్ధిలక్షణములు :—అనగా జ్ఞాపకశక్తిలో హెచ్చుతగ్గులు, చురుకుతనము లేక బండతనము మొదలైనవి.
5. స్వభావలక్షణములు :—(Idiosyncrasies).
6. అలవాట్లు (Habits)
7. రోగియొక్క శరీరతత్వము.
8. ఇష్టాయిష్టములు.
9. ప్రత్యేకముగ ఒక్కొక్క రోగికి కలుగుచుండు విపరీతభావములు.

10. రోగముయొక్క ఉద్రేక, ఉపశమన కాలము, పరిస్థితులు.

11. రోగియొక్క కుటుంబ చరిత్ర

12. వాలుకీరంగు మొదలగునవి.

ఇట్టి లక్షణములు ఒక్కొక్క రోగికి ఒక్కొక్క మాదిరిగా నుండును. కావున నీ లక్షణములన్నియు బాగుగ గ్రహించిన పిమ్మట ఔషధ నిర్ణయము జేయవలయునేగాని, జ్వరమున్నది గదాయని 'ఎకోనైట్' యిచ్చినను, దగ్గునుబట్టి 'ఇపికాక్' వాడినను ప్రయోజనములేదు. బాహ్యమున కగపడు అధిక శరీరోష్ణము (High temperature) ను బట్టి జ్వరరోగుల కందరకు ఒకేఔషధము పనిచేయునా? 'పిడుగుకు, బియ్యమునకు ఒకేమంత్రము' పఠించినచో హాస్యాస్పదము కాదా! కావున ప్రతిరోగికి ప్రత్యేకించియుండు పైన వ్రాయబడిన మానసిక లక్షణములు మొదలగునవన్నియు బాగుగా గ్రహించియే ఔషధనిర్ణయమును జేయవలసి యుండును. ఇట్లుచేసిన ఔషధ నిదానమే రోగ నిదానము. ఈ సందర్భములో డాక్టర్ నాష్ యిచ్చిన ఉదాహరణ సమంజసముగా నున్నది.

ఒక క్షయరోగివద్దకు వైద్యుని దీసికొనిపోయిరి. పరీక్షించిన పిమ్మట రోగ నిర్ణయ మేమి యని అతనిని ప్రశ్నించగా 'స్టానమ్' అని జవాబు చెప్పెను. అందరు నాశ్చర్యపడిరి. వారి కర్థము కాలేదు. ఏమనగా 'స్టానమ్' ఔషధ నామముగాని, రోగ నామము కాదు. కాని 'స్టానమ్' వాడబడెను. రోగము కుదిరెను.

"What is your diagnosis, Doctor" "Stanum" said the Doctor. 'What!'..."Stanum" replied the Doctor. Stanum was the diagnosis of the remedy, not the disease It was given and cured the patient. —*(Nash.)*

అనగా రోగ నామ మేదైననేమి, లక్షణములే ప్రధానము. అదియే దీని భావము. అదియే హోమోపతి వైద్యశాస్త్రమునకు ముఖ్యమైనది.

# 2

సాధ్యమగునంతవరకు గుణముల కన్నిటికిని సరిపడు ఔషధ మొకటియే నిర్ణయించవలెను. ఇతర వైద్య విధానములవలె గుణమున కొక మందు నిర్ణయించి అన్నియు కలిపి వాడరాదు. ఏక మూలికా సిద్ధాంతమే యీ వైద్య

విధానమందలి ముఖ్యలక్షణము. అనేకమూలికలను మిశ్రమముజేయుట దీనికివిరుద్ధము. ఈ వైద్య విధానమును కనిపెట్టిన హానిమన్ యిట్లు వ్రాసియున్నాడు:—

"In no case is it requisite to administer more than one single, simple medical substance at one time" — *(Organon)*

"It is not conceivable how the slightest doubt could exist as to whether it was more consistent with nature, and more rational to prescribe a single, well known medicine at one time in a disease, or a mixture of several differently acting drugs." —*(Organon)*

లక్షణముల కన్నింటికిని నొక మందు సరిపోవనిచో, మిక్కిలి బాధకరమై, ప్రాముఖ్యమగు లక్షణములను గుర్తించి వాటికి వర్తించు ఔషధమును ప్రారంభమున ప్రధానముగ వాడవలయును. అది దానిపని నిర్వర్తించి లక్షణములను తగ్గించిన పిమ్మట, మిగిలిన లక్షణములకును, యేవైన నూతనముగ జనించిన గుణములకును వేరొక ఔషధమును గ్రహించి వాడవలయును. ఇట్లు వాడినచో గుణము లన్నియు తగ్గి రోగ నివారణగును.

## 3

ఈ వైద్య విధానములో ఔషధము లనేక రూపములలో తయారుచేయబడును. చిన్న మాత్రలు, యివి ఆవగింజ పరిమాణము కలిగియుండును. కొంచెము పెద్ద మాత్రలు, యివి మినపగింజ పరిమాణము గలిగియుండును. చూర్ణములు, ద్రావకములు, యివిగాక పుండ్లు, దెబ్బలు మొదలగువాటికి బాహ్యమున కుపయోగపడు పై మందులుకూడ కలవు.

## 4

ఔషధమును సేవించుటకు ఉదయము, సాయంత్రము, పరుండబోవునపుడు ముఖ్యసమయములు. తరుణవ్యాధులలో మోతాదు లధికముగ దినమునకు 4, 5 సారులు వాడవలసివచ్చుచుండును. అట్టి సమయములలో భోజనమున కొక గంట పూర్వముగాని, భోజనానంతరము రెండు గంటలకుగాని ఔషధమును వాడుచుండవలెను. క్రూరమైన కలరా మొదలగు వ్యాధులలో త్వరత్వరగా అరగంట పావుగంట కొక మోతాదు చొప్పునకూడ వాడవలసివచ్చుచుండును. కాని దీర్ఘవ్యాధులలో (Chronic Disease) దినమున కొకటి లేక రెండు

రోజుల కొకటి, లేక వారమున కొక మోతాదు చొప్పునగాని నెల కొక మోతాదుగాని అవసరమునుబట్టి వైద్యుడు వాడవలయును.

మోతాదు, వయస్సునుబట్టి రోగమునుబట్టి నిర్ణయింపదగును. కాని సాధారణముగ పెద్దలకు 3 లేక 4 పెద్దమాత్రలుగాని 6 చిన్నమాత్రలుగాని ; పొడియైనచో 4 లేక 5 వడ్లగింజలయెత్తు; ద్రావకమైనచో రెండుచుక్కలు సుమారొక ఔన్సునీళ్ళలో కలిపి యివ్వదగును. బాలురకు రెండు పెద్దమాత్రలు లేక నాలుగు చిన్నమాత్రలు; పొడియైనచో 2 లేక 3 వడ్లగింజలయెత్తు; ద్రావకము ఒకచుక్క. శిశువులకు దానిలో సగము. ద్రావకమైనచో రెండుచుక్కల ఔషధమును నాలుగు చెంచాల నీళ్ళలోకలిపి, నాలుగుమోతాదులుగ నిచ్చుట సుళువైన పద్ధతి.

# 6

ఔషధములయొక్క బలము (Potency) ను గురించి వైద్యులనేక విధములుగ వ్రాయుచుందురు. కొందరు తక్కువ పొటెన్సీగల మందులను, మరి కొందరు యెక్కువ పొటెన్సీగల మందులను వాడుచుందురు. ఇది కొంతవరకు వారి అనుభవముమీద ఆధారపడియుండును. కావున సాధారణముగ పిల్లలకు 3x, 6x 12x, 30 పొటెన్సీలలో వాడుటమంచిది. అవసరమైనచో రోగ తీవ్రతనుబట్టి 200, 1000 కూడ వాడదగును. పెద్దవారల కెక్కువపొటెన్సీగల (Potency) ఔషధములను, అనగా 200, 1000 (C. M ; M. M.) పొటెన్సీలను వాడవచ్చును. తరుణవ్యాధులలో చిన్న పొటెన్సీలను, దీర్ఘవ్యాధులలో పెద్ద పొటెన్సీలను వాడుచుందురు. 30 లోపు అన్నియు తక్కువ పొటెన్సీలని తెలుసుకొనదగును.

---

# రెండవ ప్రకరణము

## 1. శిశుజననము

బాలరోగ నిదానము, చికిత్సలను వ్రాయుటకు పూర్వము శిశుజననము, శిశుపోషణను గురించి కొంచెము తెలియజేయుట యావశ్యకమని తోచి, వాటిని యీ ప్రకరణములో వ్రాయుచుంటిని.

గర్భములోనుండు శీతోష్ణస్థితులకును, బయటపడిన పిమ్మట సోకు శీతోష్ణములకును భేదముండుటచే శిశువు జన్మించిన వెంటనే యేడ్వనారంభించును. ఇది శిశువుయొక్క ఆరోగ్యమును తెలియజేయు శుభచిహ్నము. దాని వలన ఊపిరితిత్తులు శుభ్రపడి, ఉచ్ఛ్వాస నిశ్వాసములు బాగుగ నేర్పడును. ఒకవేళ శిశువు రోదనముచేయనిచో, శిశువును నీళ్ళలో ముంచినను, ఉదకము ముఖముమీద చల్లినను, బుగ్గమీద మెల్లదిగా గిల్లినను, లేక చిటికె వేయుట మొదలగు కొద్ది ధ్వనిచేసినను యేడ్వనారంభించును. శిశువు కంఠము కఫ పూరితమై యుండుటచే జన్మించిన వెంటనే దాని నే విధమునైన తీసి వేయుట ముఖ్యము.

శిశువునకు నాభినాళము ఛేదించుట ముఖ్యమైన కర్మ. ఇది కడు జాగ్రత్తతో జేయవలసిన పని. ఇందేమాత్రము నిర్లక్ష్యము జేసినను. శిశువునకు నాభియందు పుండ్లు, వ్రణము బయలుదేరును. కొంతమందికి చీము, నెత్తురు కారుచు, బాధలేక పై పూతవలన తగ్గవచ్చును. లేదా కొందరికి తీవ్రరూపముదాల్చి వ్రణములచే ప్రమాదములు కలుగవచ్చును. కావున పరిశుభ్రమై, మలినములేని పదునైన కత్తితో అతి జాగ్రత్తగా నీ పని జరుపవలయును.

శిశువు జన్మించిన వెంటనే శరీరమంతయు మలినముచే గప్పబడి అపరిశుభ్రముగా నుండును. కావున ఆరోగ్యముకొరకు వెంటనే స్నానము చేయించవలెను. శీతలోదకము నెన్నడును వాడరాదు. వారి శరీరము చలిని భరించలేదు. కావున ఉష్ణోదకముచే స్నానముజేయించి పరిశుభ్రముగ నుతకి భద్రపరచిన వస్త్రములచే గప్పి, వెలుతురు కలిగినటువంటిన్నీ ఎక్కువ చలి గాలి తగలనటువంటిన్నీ, ఆరోగ్యమైనటువంటిన్నీ గదిలో, నొంటరిగా పరుండబెట్టక, తల్లిప్రక్కలోనే పరుండబెట్టవలెను.

ఆసుపత్రులలో పురిటి గదులకును, సంసారుల గృహములలో పురిటి గదులకును యెంతయో భేదముగలదు. అది యేమిసాంప్రదాయమో తెలియదుగాని, మనవారు పురిటి గది తలుపులు రాత్రింబగళ్లు మూసియుంచుదురు. వెలుతురు రానియ్యరు. ఏమాత్రమైనను గాలి సోకనివ్వరు. గదులు చీకటి కోణములు. రాత్రింబవళ్ళు దీప ముండవలసినదే. దీనికితోడు ఊక పొగ యొకవైపున, బాలింతరాలి మలమూత్రములు రెండవప్రక్కన, గుమ్మమువద్ద పాతచెప్పు. బయటవారి గదివద్దకు వెళ్ళుటకే భయపడినప్పుడు, లోనున్న మాతాశిశువుల ఆరోగ్య మెటులుండునో యూహింపుడు.

స్నానానంతరము శిశువుచే స్తన్యపానము చేయించవలెను. తల్లివద్ద పాలు లేవనిగాని మరేకారణమువలనగాని శిశువును తల్లినుంచి విడదీయరాదు. స్తన్యపానముచే పాలు వృద్ధియగుటయేగాక, తల్లి గర్భాశయము ముకుళించుకొని అధిక రక్తస్రావముకలుగకుండగను, పాలజ్వరము రాకుండగను ఆపుచేయును. డాక్టర్ రడ్డక్ యిట్లు వ్రాసియున్నాడు :—

"The disturbances common to the coming of milk are often prevented or much diminished by applying the child to the breast early after delivery ... further by favouring contraction of the womb of the mother, the probability of secondary haemorrhage and also the chance of what is called "Milk fever" w ll be much lessened"

—(*Dr. Ruddock.*)

ప్రసవమైన మూడు దినములవరకు తల్లివద్ద పాలుండవని చెప్పుదురు. కాని ప్రథమ దినమున సైతము తల్లివద్ద శిశువునకు పాలుండకపోవు. తరువాతనైనను శిశువును తల్లిప్రక్కలో పరుండబెట్టుకొని స్తన్యము కుడిపినచో తప్పక పాలు చేపువచ్చును. అది నైసర్గికము. శిశువుమీద ప్రేమయే పాలను ప్రసవింపజేయును.

శిశువు జన్మించిన పిమ్మట మూడు పూటలు కొద్ది మోతాదులలో గాడిద పాలుపోయు ఆచారము కొన్నిచోట్ల కలదు. ఇది చాల మంచిదనియే చెప్పవచ్చును. దీనివలన కఫదోషములు హరించి, ముందుముందు పిల్లలకు క్షయ, ఉబ్బసము మొదలగు శ్వాసకాసరోగములు రాకుండ సాధ్యమైనంతవరకు కాపాడును.

# 2. ఆహారము

శిశువునకు తల్లిపాలకంటె శ్రేష్ఠమైన ఆహారము మరియొకటిలేదు. తల్లిపాలే శిశువునకు సాత్వికమైన ఆహారము. అవియే ఆరోగ్యమును బలమును కలుగ జేయును. అవియే త్వరలో జీర్ణమై శిశువునకు పోషణ జేయును.

ఇది గ్రహించలేకనో, మరేకారణమునరో గాని కొందరు ధనవంతులగు స్త్రీలు బిడ్డలనుగనుటయే వారి కర్తవ్యమనియు, పోషించుట నితరుల కర్తవ్య మనియు తలచి శిశువు జన్మించిన వెంటనే నితరుల కప్పగింతురు. గౌరవభంగ మని తలచితిరో, సౌఖ్యమున కడ్డమని భావించితిరో గాని వా రట్లొనరించుట పాపకృత్యము. ప్రస్తుతకాలమం దనేక నవనాగరికు లిట్టి దుష్కార్యముల నొనరించుచున్నారు. కావుననే వారిపిల్ల లారోగ్యవంతులుగాక, నిత్యము రోగ పీడితులై మక్కుచు, మూల్గుచు, అకాలమృత్యువు వాతబడుచున్నారు. బిడ్డ లను పోషించుటయే భారమని భావించినచో కనుట యెందులకో ?

కాలమునకు సరిపోయినట్లు విదేశములనుంచి గడ్డపాలు విరివిగా దిగుమతి యగుచున్నవి. సర్వవిషయములలో పాశ్చాత్య వ్యామోహములోబడి మునిగి యున్న మనవారు పిల్లలను బెంచుటలో మాత్రమూవ్యామోహమునుండి తప్పించు కొనగలరా ? తప్పించుకొనుటకు ప్రయత్నింతురా ? కావుననే తల్లియొద్ద పాలున్నను లేకపోయినను, గ్లాకోస్, గొల్లభామమార్కు మొదలైన విదేశీ గడ్డ పాలను పిల్లలకు తరుచు వాడుచు వారి శరీరములను పాడుచేయుచున్నారు. గడ్డపాలకంటె అనారోగ్యకరమగు వస్తువు మరొకటిలేదు. సాత్వికమైన పాలను కాచి తయారుచేసి డబ్బాలలో నిల్వయుంచిన గడ్డపాలలో శిశువునకు పోషణనిచ్చు పదార్థము లెక్కడనుండి వచ్చును ? స్వాభావికమగు పాలవలె మానవ నిర్మితమగు పాలు జీర్ణమగునా ? కావుననే పూర్వములేని క్రొత్త వ్యాధులు జనించుటయు శిశుమరణము లెక్కువగుటయు తటస్థించుచున్నది.

ఈ గడ్డపాలు సరిగ జీర్ణము కాకపోవుటచే పిల్లలకు తరుచు ప్లీహాయకృత్ వ్యాధులు (Liver complaints) కలుగుచున్నవి. అన్ని రోగములలో కార్జమునకు సంబంధించిన వ్యాధులే పిల్లలకెక్కువ ప్రమాదములైనవి. ఈ వ్యాధి జనించినచో శిశువుల కాశవదులు కొనవలసినదే. గడ్డపాలు వాడుట వలన ధన నష్టమేగాక ప్రాణనష్టముకూడ సంభవించుచున్నది.

ఒకవేళ తల్లివద్ద పాలులేకపోయినను, తల్లి జబ్బుగలదై అనారోగ్యవంతు రాలైనను, దాదిచే పాల నిప్పించుట రెండవపరకము. దాది ఆరోగ్యవంతు

రాలై, మంచి నడతగలదై, వికారరూపము భయంకరాకారము లేనిదై, మనోవ్యాకులతగాని విచారముగాని లేక నిత్య సంతోషిణియై యుండవలెను. తన శిశువుకంటె కూడ తాను పాలిచ్చు శిశువు వయస్సుండినచో మిగుల శ్రేష్ఠము.

దాదులు దొరకనిచో పోతపాలు తప్పని సరియేకదా. సర్వసాధారణముగ శిశువులకు చాలచోట్ల ఆవుపాలను వాడుటయే అలవాటు. కాని అవి స్నిగ్ధము లగుటచే గురుత్వముచేసి సులభముగ జీర్ణముగాక పిల్లల కజీర్ణ రోగములు తరుచు కలుగుచుండును. ఆవుపాలనే వాడవలసిన యావసరము కలిగినచో పాలను నీళ్ళను వేర్వేరుగ కాచి, ఒకవంతుపాలు, ఒకవంతు నీరును గలిపి శిశువుల కిచ్చినచో లఘువుగ జీర్ణమై అగ్నిమాంద్యమును గలిగించక శిశువులను ఆరోగ్యవంతులుగ జేయును. ఇట్లుజేసినను కూడ జీర్ణము చేసుకొనలేని దుర్బల శిశువులకు పాలుపోసినపిమ్మట ½ గ్రైను పెప్సిన్ యిచ్చినచో త్వరలో జీర్ణమగును. కొందరు తల్లులు వామును మూటగట్టి ఆవుపాలలోవైచి కాచి, పాలు కాగినపిమ్మట ఆమూటను తీసివైచి ఆ పాలను పిల్లలకుపోయుదురు. అటులజేయుటకూడ మంచిదే. అజీర్ణ దోషము లేకుండ కాపాడును. డాక్టర్ బార్ట్లెట్ యీ క్రిందివిధముగా వ్రాసియున్నాడు :—

"Cow's milk in its natural state is not a fit substitute for the infant's natural food. The main difficulty encountered in feeding an infant with cow's milk is to control the proteids, so that they can be digested, for not only does cow's milk contain almost three times as much proteids as woman's milk, but the proteids of the former of a different character forming larger and tougher curds under the action of acids and the digestive ferments. For this reason the milk must first of all be diluted before it can be given to a babe with any degree of success"

(Text Book of Clinical Medicine — Treatment by *Dr Clarence Bartlett*. P. 480.)

పోతపాలన్నిటిలో మేకపాలు చాల శ్రేష్ఠము. మేక పాలన్ని విషయము లలో శిశువుయొక్క తల్లి పాలనే బోలియుండును. రక్తవృద్ధిచేయు పదార్థము లెక్కువగ నుండుటచేతను సులువుగ జీర్ణము కాగలవగుటచేతను, పిల్లలకు యకృత్ వ్యాధులను కలుగనీయక శరీర పోషణ కెక్కువ సహకారిగనుండును.

ఇవి త్రిదోషహారమైనవి. క్రిమి, దగ్గు, ఒగరుపు, క్షయ, పాండు మొదలగు వ్యాధులను నిర్మూలించుటలో అద్భుతముగ పనిచేయును. ఈ పాలను త్రాగిన వారు క్షయరోగమునకు భయముచెందనవసరములేదు.

మేకయొక్క ఆహారము స్వాభావికమైనది. మేక ప్రపంచమునందుగల పలు విధములైన ఆకులను దినుచుండును. కావుననే బండి ఆకు, రాట్నపాకు తప్ప మిగిలిన ఆకులన్నియు మేకతినునని సామెతకూడగలదు. కావుననే దీని పాలు కూడ ఆరోగ్యమైనవి.

ఇంతేగాక మేక బీదలపాలిటి కామధేనువు. స్వల్పఖరీదు. మేపుట సులభము. కావున ఆర్థికముగ తలచినను, ఆరోగ్యముగ యోచించినను పిల్లలకు సర్వవిధముల మేకపాలే శ్రేష్ఠము. ఈ పాలను కాచకుండ పచ్చివి వాడుటయే మంచిది.

శిశువుల కేపాలు పోసినను చక్కెర మాత్రము కలుపరాదు.

## 3. ఆహార నియమము

శిశువులకు యేడ్చుట సహజము. కావున వారు తరుచుగ యేడ్చుచుందురు. ఆదిగాక పోతపాలు సరిగ జీర్ణముగాక బాధకలిగియైనను యేడ్వవచ్చును. అజ్ఞానులైన కొందరు తల్లులు శిశురోదనమునకు కారణమారయలేక ఆకలిచే నేడ్చుచున్నాడని తలచియు, యింటిలో ముసలమ్మలు, కొంచెము నమలబెట్టి వూరుకోబెట్టరాదాయని పోరుటచేతను, నమలబెట్టుటకు స్తన్యములేని కారణముచేతను, దగ్గర డబ్బాలో నమర్చియున్న గిడ్డపాలను నీళ్లలోకలిపి కాలనిర్ణయములేక, మోతాదు నిర్ణయ మసలే సరకుగొనక, పిల్లలకు పోయుదురు. పాపము శిశువులు కడుపునిండుగనుండి ఒడలుతెలియక మత్తుగ పడుకొనెదరు. పెద్దవారుమాత్రము విందులకుబోయి మిక్కుటముగ భుజించినరోజున లేవలేక మత్తుగ పడియుండరా? అట్లే పిల్లలు మత్తుగపడియుండినచో, ఆకలిచల్లారినది గనుక యూరకున్నాడని పాపమజ్ఞానులైన తల్లులు సంతోషించుచు వారిపని మీద వారుపోయెదరు. ఫలితమేమి? అజీర్ణముచేసి వాంతులు, విరేచనములు, తరువాత రోగనివారణకొరకు వైద్యులు, మందులు, ఆహా! ఎంత అవివేకము. శిశుపోషణ తెలియని అజ్ఞానులు కొందరు; తెలిసి పోషించుట గౌరవభంగమని తలచు నవనాగరికులు కొందరు.

తల్లి స్తన్యమైనను పిల్ల ఏడ్చినపుడెల్ల ఇవ్వరాదు. తరుచు స్తన్యమునుడిపినచో

పిల్లల కజీర్ణరోగములు కలుగుటయేగాక, స్తన్యముయొక్క స్వభావముకూడ మార్పుజెందును. స్తన్యపానములకు తగినవ్యవధి యుండినచో పాలు పలుచగను, ఆరోగ్యముగనుయుండి సులభముగ జీర్ణమగును. కాని తగు విరామములేకుండ తరుచు స్తన్యమును కుడిపినచో పాలు చిక్కబడి క్రొవ్వుపదార్థము లధికమై సులువుగ జీర్ణముకానేరవు. క్లారెన్సు బార్ట్లెట్ ఈవిధముగా వ్రాసియున్నాడు.

"The intervals at which the breast is emptied exerts a pronounced effect upon Composition of the milk. The longer the interval, the more watery the milk, and the more frequently the child nurses the more concentrated the milk becomes. When the bad habit of putting the child to the breast every time it cries is enforced, the childs' digestive organs not only become over-worked but the milk also is altered in composition. Such overstimulation of the mammary gland leads to an increased secretion of solids, the milk assuming the character of 'Strippings' (ie milk especially rich in fats and proteids).

(Text book of clinical Medicine-Treatment chapter on Feeding of Infants by *Dr. Clarence Bartlett* )

జననమొందిన రెండు రోజులవరకు శిశువునకు ప్రతిఝామునకు పాలిచ్చుచుండవలయును. మూడవ దినము మొదలు నెలవరకు పగలు మూడు గంటల కొకసారియు, రాత్రులు నాలుగు గంటల కొకసారియు యివ్వవచ్చును. మూడవ మాసము దాటువరకు పగలు మూడు గంటల కొకసారియు, రాత్రులు ఒకటి రెండు సార్లును యివ్వదగును. మూడవ మాసము దాటిన పిమ్మట రాత్రులు పూర్తిగ మానివేయుట మంచిది. ఏడ్చుచున్నాడని పాలిచ్చుట మంచిది కాదు.

సాధారణముగ శిశువునకు జననకాలమందొక ఔన్సు పాలు సరిపోవును. క్రమముగ మాసములు హెచ్చినకొలది పాలుకూడ హెచ్చించవలయును.

పోతపాలు పోయవలసివచ్చినపుడు పాల బుడ్డ నుపయోగించుట మంచిది. అట్టి బుడ్లను యెల్లప్పుడు రెండింటిని జాగ్రత్తపెట్టించవలెను. ఒకదానిని వాడునపుడు రెండవదానిని సోడానీళ్ళలోవేసియుంచి పరిశుభ్రముగా నుంచవలెను. పాలబుడ్లను, పాలపీకలను పాలుపట్టిన పిమ్మట పరిశుభ్రముగ కడిగి భద్రపరచ

వలయును. సోమరులగు కొందరు తల్లులు వాటిని శుభ్రపరచక, అశ్రద్ధగ పడ వేయుటచే మలినము చేరియు, చీమలు పట్టియు చెడిపోవుచున్నవి. వాటినే తిరిగి వాడినచో శిశువులకు రోగములు కలుగుచున్నవి. మరియు పాలపీకలు నోటిలో యుండగ శిశువు నెన్నడును నిద్రపుచ్చరాదు. పాలు త్రాగుట పూర్తి యైన పిమ్మట బుడ్డిని తీసివైచి శిశువును నిద్రపోనియ్యవలెను.

## 4. నిద్ర

శిశువు కొన్ని నెలలవరకు దినములో చాలభాగము నిద్రపోవుచుండును. అది వాని కారోగ్యమే. శిశువు సరిగా అభివృద్ధిచెంది, ఆరోగ్యముగా నుండ వలెనన్న చాలసేపు వలసినంత నిద్ర సుఖముగా పోవలెనని డాక్టరు టూకర్ వ్రాసియున్నాడు. "The child must sleep plentifully if it is to grow and develop as it should." ఏ వయస్సులో ఎన్ని గంటలు నిద్రపోవలెనో ముందు ఆరోగ్య శిశులక్షణములలో వ్రాయబడును.

నిద్రనుండి శిశువు నెన్నడును బలవంతముగ మేల్కొలపరాదు. అట్లు మేల్కొలిపినచో అది వాని ఆరోగ్యమునకు భంగకరము. నాటకములకు తదితర వినోదములకు పిల్లల నెన్నడును తీసుకొనిపోరాదు. అట్లు తీసుకొని పోవుట ఒకగొప్ప దురలవాటు. అంతేగాక వారినిద్రకు భంగముకలిగి, జీర్ణ కోశముచెడి, సరియైన అభివృద్ధిని పొందజాలరు.

"Insistence on regular, quiet sleep is of the greatest importance...The habit of taking children to places of amusements is bad Digestion and nutrition cannot but be interfered with." (Diseases of children by *Dr. Tooker* )

ఈ అలవాటు చాలచోట్ల కలదు. కొందరు తల్లులు హరికథలు, నాటక ములు, సర్కసులు, సినిమాలు మొదలగునవి చూచుటకు పోవునపుడు నిద్ర పోవుచున్న పిల్లలను బలవంతముగా లేపి, బుజముమీద వేసుకొని వెళ్లుచుందురు. ఇట్లుచేయుట పిల్లలకెంత ఆరోగ్యభంగమో తల్లులు గ్రహించలేకున్నారు. ధనవంతులైనచో దాదులకుగాని, నౌకర్లకుగాని పిల్లలను వప్పగించి తల్లులు షోకుగా నాటకములకు, సినీమాలకు వెళ్లుచుందురు. నౌకర్లెంత జాగ్రత్తగా చూచుచుందురో వేరే చెప్పవలయునా ? కన్నతల్లికే లేనిబాధ్యత, జీతము కొరకుయున్న నౌకర్లకుండునా ?

ఇంతేగాక మనవారిలో యింకొక అలవాటుకూడ కలదు. ఎవరైనను బంధువులుగాని, స్నేహితులుగాని, మొగవారుగాని, ఆడవారుగాని యింటికి వచ్చినపుడు, నిద్రపోవుచున్న శిశువును బలవంతముగాలేపి "అన్నయ్యా! పిల్ల వాడి ముఖము చూచినావా?" అనిగాని, "ఒదినా! పిల్ల ముఖము చూచి నావా?" యనిగాని చెప్పుచు, శిశువు ముఖమును పరిశీలించి తండ్రి పోలిక యని కొందరు, తల్లిపోలిక యని కొందరు, మేనత్తపోలికయని కొందరు పోల్చుచు మొగపిల్లవాడైనచో తల్లిపోలిక, ఆడపిల్లయైనచో తండ్రిపోలిక కలిగియున్న వా రదృష్టవంతు లనుచు—యీ విధముగా విలాసముగా కబుర్లు చెప్పుకొందురు. పిల్లలను కన్నామని ఆనందమో, పిల్లలయందలి మోహమో తెలియదుగాని, యీ ప్రకారము నిద్రనుండి లేపుట 'పిల్లికి చెలగాటము ఎలుకకు ప్రాణపోకట' యని పాపము అమాయకులగు తల్లులు గ్రహించలేకున్నారు.

కావున నిద్రపోవుచున్న పిల్లలను మాత్ర మెన్నడును లేపరాదు. వారిని సుఖముగా గాఢనిద్రపోనియ్యవలెను. వారికి నిద్రయే ఆరోగ్యము.

పిల్లల కెప్పుడును పరిశుభ్రమైన గాలి తగులుచుండవలెను. నిద్రపోవు సమయములో నీ విషయము ముఖ్యముగా గమనింపవలయును.

పిల్లల నెప్పుడును గదిలోనే పరుండబెట్టి యుంచరాదు. వారికి సూర్యరశ్మి, పరిశుభ్రమైన గాలి తగులునట్లు చేయవలయును. వారి నట్టి ప్రదేశములలో నప్పుడప్పుడు ఆడుకొననీయవలెను. లేనిచో వారి అవయవములు సరియైన అభి వృద్ధి పొందనేరవు. వారు అంగవిహీనులగుదురు, రక్తక్షీణమగును, శరీరము పాలిపోవును. కావున వారికి గాలి, వెలుతురు, సూర్యరశ్మి అత్యావసరమని తెలియనగును.

పిల్లలొకవేళ నిద్రపోనియెడల మత్తుమందు లెన్నడును వాడరాదు. కొందరు తల్లు లజ్ఞానముచే తమ పిల్లలకు తెల్లమందు, నల్లమందు వాడుట కలదు. అనగా కడుపుబ్బరముగా నున్నను, విరేచనబద్ధ మున్నను, అజీర్ణముగా యున్నను తెల్లమందును (రసకర్పూరము), విరోచనము లెక్కువగా యున్నను, నిద్రలేక పోయినను నల్లమందును వాడుచుందురు. ఇవి తాత్కాలికముగ గుణమిచ్చిన ట్లగపడినను, వారి ఆరోగ్యమును జెరపి తీరని హానిజేయును. కావున నిట్టి దుర లవాటులను పూర్తిగ మానవలయును. పిల్లలకు నిద్రపట్టకపోవుట శారీరక, మానసిక కారణము లనేకము లుండవచ్చును. శరీర బాధ లేక భయము లేక కోపము— యివన్నియు కారణములే కావున యిట్టివి ముందు సరిచూసి

పిమ్మట నిద్రపుచ్చవలెను. నిద్ర రానిచో ఉయ్యాలలో పరుండబెట్టి శ్రావ్యమైన జోలపాటలు పాడినచో సాధారణముగ పిల్లలందరు సుఖముగ నిద్రపోవుదురు. అంతేగాని వారి ఆరోగ్యమునకు భంగము కలిగించు మత్తుపదార్థము లెన్నడును వాడరాదు. దీనినే డాక్టర్ టూకర్ వ్రాసియున్నాడు.

"First see that Psychical and Physical environments are corrected. Never under any circumstances use any hypnotic or narcotic to force sleep. Always bear in mind that opium in any form is not well borne by young children and is always dangerous." — (*Dr. R. N. Tooker.*)

ఇంకొక విషయము. పిల్లల నెప్పుడును భయపెట్టుట, బెదరించుటగాని మంచిపనికాదు. అట్లు చేసినచో వారి మనస్సు వ్యాకులతజెంది గాఢ నిద్ర చెందలేరు. కావున అది వారి యారోగ్యమునకు భంగము. వారి మనస్సు నుల్లాసముగ నుంచవలయును. వారిని సంతోషముతో నాడుకొనునట్లు సదా చూడవలసియుండును. కావుననే వారికి పలురంగులుగల అందమైన ఆట వస్తువుల నిచ్చుచుందురు. ఇది చాలా మంచిది. పిల్లవాడు పాలు త్రాగునపుడు గాని, అన్నము తినక పెంకిపట్టు పట్టినపుడుగాని, యేడ్చినపుడుగాని 'బూచి బూచి' యని భయపెట్టుచుందురు. ఇట్లు చేయుటచే వారికి మనస్సు చెడి, సరిగా నిద్రపట్టక ఆరోగ్యము చెడుటయేగాక, పెద్దవారైన పిమ్మట యిదియే వారి జీవితములో పెద్ద భూతమై పిరికిపంద లగుచున్నారు.

## 5. అన్నప్రాశనము

శిశువునకు స్తన్యము సుమారొక సంవత్సరము వయస్సువరకు యివ్వ వచ్చును. దంతములు మొలకెత్తిన పిమ్మట స్తన్యము మాన్పవచ్చును. సాధారణ ముగ దంతములు ఆరు, యెనిమిది మాసములమధ్య వచ్చుచుండును. కావున దంతములు జనించిన కొద్దిమాసములవరకు స్తన్యమిచ్చినను దోషములేదు. సంవ త్సరము దాటినపిమ్మట యివ్వరాదు. దంతము జనించనిదే స్తన్యము మాన్ప రాదు ; అన్నప్రాశన చేయరాదు. సాధారణముగ యెనిమిదవ మాసమున అన్నప్రాశనము జరుపుదురు. మొగపిల్లలకు సరిమాసములలోను, ఆడపిల్లలకు బేసిమాసములలోను అన్నప్రాశనము జరిపించు వాడుకకలదు.

పిల్లల కతిసులభముగ జీర్ణమగు తేలికయాహారముమాత్రమే యిచ్చుచుండ వలెను. వాము బాగుగవలిపి, ఉప్పు మిశ్రమముచేసి తరుచుగ అన్నములో

కలిపిపెట్టు వాడుక చాలయిండ్లలో కలదు. ప్రారంభమున నిట్లు కలిపిపెట్టుట మంచిపద్ధతియే. ఇట్లుచేయుటవలన శిశువులకాహారము త్వరలో జీర్ణమగుటయే గాక, వారి జీర్ణకోశమును శుభ్రపరచి మంచిస్థితిలో నుంచును.

## 6. ఆరోగ్య అనారోగ్య శిశులక్షణములు

| ఆరోగ్య లక్షణములు | అనారోగ్య లక్షణములు |
|---|---|
| **1. నాడి :—**<br>జననము మొదలు 6 మాసములు 140<br>ఏడాదివరకు 120–130<br>మూడేండ్లవరకు 100–120<br>ఆరేండ్లవరకు 90–100<br>12 సంవత్సరముల వరకు 80–90<br>ఆపైన పెద్దవారివలె 75 | ఈ క్రమము తప్పినచో అనారోగ్యము. నాడి వేగముగా నున్నచో జ్వరము, నాడి క్షీణించి నెమ్మదిగా యున్నచో ప్రాణశక్తి (Vitality) తక్కువనియు సూచించును. |
| **2. ఉచ్ఛ్వాసనిశ్వాసములు :—**<br>పెద్దవారికంటె పిల్లలు రెట్టింపు సార్లు తీయుచుందురు. పెద్దలలో నిమిషమునకు 20 సార్లు. పిల్లలలో 40 పైన. ఊపిరి యేవిధమైన వాసనలేక యుండును. పిల్లల శ్వాసయందు పొత్తికడుపు కదలుచుండును. | ఇది తప్పినచో అనారోగ్యము. ఊపిరి వేగముగా తీయుచున్నను, ధ్వని యున్నను శ్వాసకాస రోగములను సూచించును. ఊపిరివాసనకలిగి పుల్లగా యున్నచో అజీర్ణమును సూచించును. |
| **3. శరీరకాంతి :—**<br>పిల్లవాని రంగు ఎర్రగా నున్నను, నల్లగాయున్నను, ఆరోగ్యమైన పిల్లవాని ముఖమందొక విధమైన కళ యుండును. ముఖవర్చస్సు ఆరోగ్యమును సూచించును. | వర్చస్సు మారినచో అనారోగ్యమును సూచించును. శరీరము పసుపుపచ్చగానున్న కామెర్లు, తెల్లగా యున్న రక్తహీనము మొదలగునవి తెలియనగును. |
| **4. ఇతర అవయవములు :—**<br>ఇవి యన్నియు సరిగా వయసును బట్టి అభివృద్ధి చెందుచున్నచో ఆరో | అట్లుగాక, అవయవములు సరిగా అభివృద్ధిచెందక, పొట్ట పెద్దదగుట, |

| ఆరోగ్య లక్షణములు | అనారోగ్య లక్షణములు |
| --- | --- |
| గ్యము, శరీరము ముడతలు పడక బాగుగా యుండును. | తల విపరీతముగ పెరుగుట, కాళ్ళు చేతులు సన్నగిలుట, మెడకృశించుట, వెన్నెముక వంగియుండుట ఈ మొదలైనవన్నియు రోగలక్షణములు. |
| **5. శరీరోష్ణము (Temperature):-** పెద్దవారికంటె పిల్లలలో శరీరోష్ణము కొంచె మధికముగా యుండవచ్చును. అదియునుగాక అజీర్ణ దోషము మొదలైన కారణములవలన పిల్లలలో శరీరోష్ణము త్వరలో హెచ్చుచుండును. దీనినిబట్టి కంగారు పడనక్కరలేదు. సాధారణముగా 98°-4 ఉండును. | మామూలు ఉష్ణమునకు ఒక డిగ్రీ హెచ్చినను, ఒకడిగ్రీ తగ్గినను, భయములేదు. కాని విశేషముగా హెచ్చిన జ్వరము, విశేషముగా తగ్గినవాతము, విశేషముగా హెచ్చినను, తగ్గినను ప్రమాదమే. |
| **6. పొత్తికడుపు :—** ఇది మెత్తగాయుండి ఏ విధమైన బాధలేక పిల్లవాడు ఖులాసాగా యుండును. | పొత్తికడుపు పొంగరించుట, గట్టిగానుండుట అనారోగ్యలక్షణములు. ఇట్లుండుట శూల, అశ్మరి మొదలగు మూత్రవ్యాధులను సూచించును. |
| **7. ఏడుపు :—** ఆరోగ్యముగాయున్న పిల్లవాడు ఆకలి వేయునపుడుమాత్రమేఏడ్చుచుండును. కాని కొంతమంది పిల్లలు పెంకితనముచేగాని, ఏమియు తోచకగాని యేడ్చుచుండుట కలదు. ఏడ్చినపుడు పాలిచ్చిన పిమ్మట ఊరుకొనినచో ఆకలిచే యేడ్చుచుండెనని తలపవచ్చును. కాని ఒకప్పుడు మత్తుచేకూడ పండుకొనవచ్చును. మొత్తముమీద శిశువులలో యేడుపుకారణము కనిపెట్టుటకష్టమే. | పాలిచ్చినను కూడ యేడుపు మాననిచో కడుపు నొప్పిగాని, ఏయితర బాధలుగాని యున్నవని గ్రహించదగును. రాత్రులు నిద్రలో ఉలికిపడి లేచి యేడ్చుచుండినచో క్రిమిలక్షణమని తెలుసుకొనదగును. |

| ఆరోగ్య లక్షణములు | అనారోగ్య లక్షణములు |
| --- | --- |
| వారికి యేడుపు ముఖ్యలక్షణము. | |
| **8. మలము :—** | |
| పుట్టినపుడు ఆకుపచ్చగా గాని, నల్లగాగాని యుండును. పిమ్మట విశేషము పలుచగాగాని, గట్టిగాగాని యుండక, కొంచెము పసుపురంగుగాను, గరిటజారుగానుయుండి, ఏవిధమైనదుర్వాసనలేక, పిల్లవానికిఏమియు శ్రమలేక సునాయాసముగా క్రిందికి జారిపోయినచోఆరోగ్యమును సూచించును. ప్రారంభమున శిశువు దినమునకు 4 సార్లును, క్రమక్రమముగా 2, 3 సార్లును, సంవత్సరము దాటిన పిమ్మట 1, 2 పర్యాయములు వెళ్లుచుండును. | మలము గట్టిగా ఉండలవలెయుండి బాలుడు విశేషముగాతినుకుచున్నచో మలబద్ధము, శూల యనియు, దుర్వాసనగలిగి, తెల్లగా నీళ్ళవలె పలచగ విరోచనమైనచో అజీర్ణ మనియు, నల్లగాయున్నచోజలుబనియు, జిగురునెత్తురు ఆయూ రోగ లక్షణము లనియు తెలుసుకొనదగును. ఎక్కువ పర్యాయములు వెళ్ళినను, అసలు వెళ్ళక పోయినను రోగ చిహ్నములే. |
| **9. మూత్రము :—** | |
| ఇది ఎండుగడ్డి రంగుగలిగి, డాగు పడకుండా పరిశుభ్రముగాయున్నచో ఆరోగ్యము. ఏకధారగా పోయుచుండును. దీనిని నిల్వయుంచినచో ఏవిధమైన పదార్థము అడుగునజేరదు. స్తన్యపానముచేయు పిల్లలకంటె డబ్బాపాలనుత్రాగు పిల్లలు ఎక్కువసార్లు విడుచుచుందురు. | మూత్రము పసుపురంగుగాయుండి, డాగుపడినచో కామెర్లనియు, స్వల్పముగాను, కొంచెము రంగుగాయున్నచో జ్వరచిహ్నములనియు, రక్తముతో కూడియున్నను, మూత్రద్వారము మంటయున్నను, మూత్రము పలుధారలుగా వెడలుచున్నను, నిలవయుంచినచో అడుగున మడ్డిగాని, తెల్లని పదార్థముగాని, యిసుకవంటి పదార్థముగాని చేరినచో అశ్మరి మొదలగు మూత్రవ్యాధులనియు, బొట్లుబొట్లుగాను, నిద్రలోను, అప్రయత్నముగాను స్రవించుచున్నచో అజీర్ణము, క్రిమి లక్షణ మనియు మొదలైనవి |

| ఆరోగ్య లక్షణములు | అనారోగ్య లక్షణములు |
|---|---|

**10. నాలుక :—**

ఆరోగ్య సూత్రములను గమనించి పెంచిన పిల్లల నోరు పరిశుభ్రముగా నుండును. నాలుకపైన పొక్కులు, పుండ్లుయేమియు బయలుదేరవు. నోరు వాసనయుండదు. నోటినుంచి చొల్లు కారదు.

**11. నిద్ర :—**

శిశువులకు నిద్ర ప్రాముఖ్యమైనది. ఏ అభ్యంతరము లేకుండ సుఖముగా గాఢనిద్ర పోవుటయే వారికి ఆరోగ్యము. పుట్టినది మొదలు మూడు మాసములవరకు దినమునకు 16 మొదలు 18 గంటలును, పిమ్మట రెండు సంవత్సరముల వయస్సువరకు రోజుకు 14 మొదలు 16 గంటలును, అటు తరువాత 10 సంవత్సరముల వయస్సువరకు 10 మొదలు 12 గంటలును నిద్రపోవుట మంచిది. ఆరోగ్యమైన శిశువు నెక్కడ పరుండబెట్టినను, ఏ పరిస్థితులలోనైనను, వెలుతురు, ధ్వని యెక్కువగా యున్నను గాఢ నిద్ర పోవును. అట్టి నిద్రయే శిశువుయొక్క ఆరోగ్యమును తెలియజేయును.

"The perfectly healthy, well-trained child will sleep in spite of unfavourable environments."

—*Dr. Tooker.*

గ్రహించదగును.

అపరిశుభ్రమే అనారోగ్యము. అట్టి పిల్లలకు నోరువాసన, నోటినుంచి చొల్లుయుండును. నాలుకపైన పుండ్లు, పొక్కులు బయలుదేరి తాలుకంటకము (Thrush) మొదలగు వ్యాధులు జనించును. నాలుక తెల్లగాయున్న చో మలబద్ధము, అజీర్ణము సూచించును.

శిశువు సరిగా నిద్రపోవక, గాఢ నిద్రచెందక, ఉలికిపడు చుండినను, భయపడుచున్నను, ఏడ్చుచున్నను, పలవరించుచున్నను, నిద్రలో చొంగ అధికముగా కార్చుచున్నను, ఆ శిశువు అజీర్ణముచేగాని, కడుపునొప్పిచేగాని క్రిములచేగాని, మరియే ఇతర వ్యాధిచేనైనగాని, బాధపడుచున్నదని గ్రహించదగును. పై లక్షణములు శిశువుయొక్క అనారోగ్యమును సూచించును.

"If the child does not sleep soundly and well, there is something wrong with its Physical condition or environment.

—*Dr. Tooker.*

# మూడవ ప్రకరణము

## 1. స్తన్యదోష నిదానము

బాలురు ప్రథమావస్థలో ప్రత్యేకము చనుబాలతోను, ద్వితీయావస్థలో పాలు, అన్నముతోను, తృతీయావస్థయందు ప్రత్యేకము అన్నముతోను పోషింపబడును. కావున వారి కిచ్చు ఆహారములయం దే దోషము లేకుండినచో వారి కే రోగమును సాధారణముగ గలుగక ఆరోగ్యముగ నుందురు.

శిశువునకు పాలిచ్చు దాది ఆరోగ్యవంతురాలై, నిత్య సంతోషవంతురాలై; మంచి నడతగలదై, స్తన్యము త్రిదోషరహితంబై యుండవలయును. దాదుల తత్త్వము ననుసరించి శిశువులకు రోగములు కలుగుచుండును. అనేక దాదులచే పాలిప్పించరాదు.

తల్లిగాని దాదిగాని త్రిదోషములను (వాత, పిత్త, కఫదోషములు) కలిగించు ఆహారములను వర్జించవలయును. అధికముగ ఉప్పు, పులుసు, కారము, తీపి గలుగు పదార్థములనుగాని, గురుపదార్థములనుగాని, క్రొవ్వుపదార్థములనుగాని భుజించినను, తరుచు విందులకు బోయి అమితముగ సేవించినను, ఆరోగ్య నియమములను పాటించక పగలు నిద్రించినను, రాత్రు లధికముగ మేల్కొనినను, దేహపరిశ్రమ చేయకపోయినను, పరిశుభ్రముగ నుండకపోయినను, స్తన్యము దోషపూరితంబగును. అట్టి పాలను శిశువులు పానముజేసినచో వారికి నానా విధ రోగములు జనించును. ఈ భావమునే బార్ట్లెట్ కూడ వ్రాసెను.

"Food and exercise exert a marked influence upon the Composition of the Milk. The richness of the milk, that is the amount of fat, is increased by a nitrogenous diet. The proteids are increased together with the fat, by a liberal proteid diet; also by insufficient exercise when a liberal diet is enjoyed and by too frequent nursing. One of the chief difficulties frequently encountered with wet nurses is the change in the character of the milk to an indigestible form from the excess of solids resulting from a too liberal diet in conjunction with too little exercise."

—(*Dr. Clarence Bartlett.*)

## 2. వాతదోష స్తన్యము

నలుపుగాని, ఎరుపువర్ణముగాని కలిగియుండి, కొంచెము వాసనకలదై, నురగకలిగియుండి, వగరుగాయుండి, తేలికగజీర్ణమై, యెంతత్రాగినను తృప్తి తీరకయుండి, నీటిమీద తేలునట్టి స్వభావముగల స్తన్యము వాతదోషము కలిగినదని తెలుసుకొనవలెను.

ఇట్టి స్తన్యమును పానముజేసినచో శిశువు వాతదోషములచే పీడింపబడి హీనస్వరము కలిగియుండును. ఈ పాలలో బలముగలిగించు పదార్థములు లేకపోవుటచే శిశువు కృశించి చిక్కిపోవును. మలమూత్రము లతికష్టముమీద గాని విడువలేకుండును. అపానవాయువు బంధించును. వాతసంబంధమైన శిరోరోగములు, పీనసము కలుగును. నాసికా ద్వారమునుండి శ్వాస సరిగ వెడలకపోవుటచే వాసన తెలియకుండును.

## 3. పిత్తదోష స్తన్యము

ఎర్రగను, నల్లగను, ఆకుపచ్చగను, నీలముగనుయుండి, చేదు, పులుపు, కారము, ఈ రుచులు కలిగియుండి, శవవాసనగాని, రక్తవాసనగాని కలిగి యుండి, పచ్చనిరేఖలతో కూడియుండు స్తన్యము పిత్తదోషము కలిగినదని యెరుంగవలయును.

ఇట్టి స్తన్యమును పానముజేసినచో శిశువు పిత్తరోగముల కాలవాలమై, కామిల, పాండు, దప్పి, నీళ్ళవిరేచనములు మొదలైన వ్యాధులచే పీడింప బడును. శరీరము వేడిగానుండి చెమటలుపోయును.

## 4. కఫదోష స్తన్యము

మిక్కిలి తెల్లగను, తీపిగనుయుండి నెయ్యి, నూనె మొదలగువాటియొక్క వాసనగలిగి, చిక్కగనుండి, అధికమగు జిడ్డుగలిగి నీటిలోమునుగు స్వభావము గల స్తన్యము కఫదోషపూరితమైన స్తన్యమని తెలిసికొనదగును.

ఇట్టి స్తన్యమును పానముజేసినచో శిశువునకు నోటినుండి చొల్లుకారుట, కండ్లువాచి తెల్లబడుట, అధికమైన నిద్రగలిగి మందముగానుండుట, వమనము లగుట—ఈ గుణములన్నియు కలుగును. ఈపాలతిస్నిగ్ధములగుటచే శిశువు నకు శ్వాసకాసరోగములు జనించును.

## 5. దోషరహిత స్తన్యము

తెల్లగను, పచ్చగను, నిర్మలముగను, మధురముగను, త్రాగుటకు రుచిగను యుండి, ఉదకమున బోసినపుడు నీటితో గలిసిపోవు స్వభావముగలిగి నురగ లేకయున్న స్తన్యము పరిశుద్ధంబైనదనియు, ఆరోగ్యమైనదనియు, శిశువుల కిచ్చుటకు తగినదనియు తెలిసికొనదగును.

"Woman's milk is white, opaque flu'd, slightly alkaline in reaction and of a sweetish taste."—*Dr. C. Bartlett*

## 6. ఆహారములో మార్పుచేయుటకు సూచనలు

ఈ క్రింది లక్షణములను గమనించి శిశువుయొక్క ఆహారములో అవసరమైన మార్పులు చేయవచ్చును :—ఇవి డాక్టర్ బార్ట్లెట్ యొక్క సూచనలు.

1. పాలు త్రాగినవెంటనే వమనమైనచో శిశువు పాలను వేగముగా త్రాగెననిగాని, అధికముగ త్రాగెననిగాని గ్రహించవలెను.

2. ఒకసారి పాలుత్రాగి రెండవసారి త్రాగుటకుగాని మధ్య పుల్లని వమనమైనచో క్రొవ్వుపదార్ధమధికమగుటచే అజీర్ణము చేసినదని గ్రహించదగును.
3. పాలు త్రాగినపిమ్మట అరగంటకు పెరుగుబిళ్ళలవలె వమనమైనచో మాంసకృత్తు లధికమగుటచే అజీర్ణము చేసినదని యెరుంగవలయును.
4. మలబద్ధమున్నచో క్రొవ్వుపదార్థము తక్కువైనదనిగాని, కావలసిన దానికంటె అధికముగ నున్నదనిగాని యెరుంగదగును.
5. విరోచనము ఆకుపచ్చగను, పల్చగను, పెరుగువలెనున్నచో, మాంసకృత్తు లధికమగుటచే అజీర్ణముచేసినదని గ్రహించి, పాలను పలచన చేయవలయును. (Must be diluted.)
6. కడుపునొప్పి యున్నచో మాంసకృత్తు లధికముగ నున్నవనిగాని పాలు వేగముగ పట్టుబడిన వనిగాని, అధికముగ నివ్వబడినవనిగాని గ్రహించవలెను.

"The following condition and symptoms must be carefully noted and amount of food and the percentage of fat, proteids and sugar must be regulated.

1. If the child vomits shortly after finishing its bottle, it

is either getting the food too rapidly or in too large quantities.

2. Regurgitation of food between feedings, either sour or rancid, indicates an excess of fat. Persistent vomiting is frequently a sign of fat indigestion.

3. Vomiting of larger curds, half an hour or more after feeding, is an indication either of too much proteids or proteid indigestion.

4. Constipation, as a rule, is an indication of deficient fat or of a general deficiency of solids in the food. Excessive fat feeding produces constipation with large, grayish stools.

5. Curds in the stools, when the latter are green and inclined to be loose, are usually a sign of too much proteids or proteid indigestion...The milk must further be diluted.

6. Colic is either a sign of proteid indigestion or results from too rapid or too frequent nursing. When due to fermentation it may be the result of excess of sugar in the food."

—*(Dr. Clarence Bartlett.)* Treatment P. 485.

# నాలుగవ ప్రకరణము

జ్వరములు, శ్వాసకాసరోగములు, కర్ణరోగములు, మశూచి, ఇత్యాది కొన్నివ్యాధులు పిల్లలకేగాక పెద్దవారలకుకూడ వచ్చుచుండును. అట్టి వ్యాధులను కొన్నిటిని గురించి ముందు ప్రకరణములో తెలుపబడును. అవిగాక కొన్ని వ్యాధులు ప్రత్యేకముగాగాని, ఎక్కువ తరుచుగగాని, అధికప్రమాదముగగాని పిల్లలకు మాత్రమే కలుగుచుండును. అట్టివాటిని గురించియు, వాటికి తగుచికిత్సలను గురించియు యీ ప్రకరణములో వ్రాయబడుచున్నది. అజీర్ణ రోగము పిల్లలకేగాక పెద్దలకుకూడ తరుచు కలుగు వ్యాధియైనను అది బాలరోగములలో ప్రాముఖ్యమైనది గనుక దానినిగురించి యీ ప్రకరణములోనే వ్రాయబడి యున్నది.

## 1. రోగనిరూపణము

పెద్దవారికి కలుగు రోగములయొక్క లక్షణములు, కారణములు గ్రహించి వైద్యము చేయుట కడు సులభము. వైద్యుడు గ్రహించలేకపోయినను, రోగి నడిగి తెలుసుకొనవచ్చును. కాని శిశువుల విషయ మట్టిదిగాదు. వారికి చికిత్సచేయుట బహు కష్టము. వారు అజ్ఞానముచేతను, మాటలురాని కారణములచేతను వారి బాధలను వారు పైకి చెప్పలేనంత స్థితిలో నుండుటయే దీనికి ముఖ్యకారణము. కావున వైద్యుడు కడుఓపికతో, మిక్కిలి జాగ్రత్తతో లక్షణములనుబట్టి పిల్లల బాధలను గ్రహించి చికిత్స చేయవలసియుండును. మరియు వారికి చికిత్సచేయు వైద్యుడు వారి బాధలను తరుచు చూచుచు, రోగములను జాగ్రత్తగా కనిపెట్టుట కలవాటు కలవాడై యుండవలయును.

ఈక్రింది లక్షణములనుబట్టి కొంతవరకు శిశురోగనిరూపణము జేయవచ్చును:-

1. శిశువు విశేషముగ రోదనము చేయుచున్న యెడల బాధ మిక్కిలి తీవ్రమైనదని యెరుగవలయును.
2. శిశువు తన శరీర మందెచ్చోటను మిక్కుటమైన బాధ కలిగియుండునో, ఆ ప్రదేశము మాటిమాటికి స్పృశించుచుండును. ఆ ప్రదేశ మితరులు తాకినచో యేడ్చును.
3. బాధ శిరమునందుండినచో శిశువు కన్నులు మూసుకొని తల యెత్త లేకుండును.

4. కుక్షి (కోష్టము)యందు బాధ కలిగినపుడు మలమూత్ర బంధనము, వాంతి, కడుపుబ్బరము, ప్రేవులరచుట, వీపును పైకెత్తుట, ప్రక్క లెగరవేయుట, స్తన్యముల గరచుట—యీ లక్షణములు కలుగును. వస్తి (పొత్తికడుపు) యందు బాధ జనించునపుడు మూత్రము నిలచియుండి వెడలక వేదన, దప్పి, ఉలికిపడుట, దిక్కులు జూచుట, మూర్ఛ, చంటిబిడ్డ గుణము—యీ లక్షణములు కలిగియుండును.

6. గుదమునందు బాధ కలిగినచో మలబంధనము, ఉలికిపడుట, దిక్కుల చూచుట—యీ లక్షణములు కలిగియుండును.

7. శ్వాసకాస జబ్బులు కలిగినచో ఊపిరి కష్టముగా పీల్చుట, ముక్కు లెగర వేయుట, పక్క లెగరవేయుట—యీ లక్షణము లుండును.

8. కర్ణరోగములలో శిశువు తనచేతిని తరుచు చెవివద్ద పెట్టుకొనబోవుట, తల యిటునటు నాడించుట— ఈ గుణము లుండును.

9 కడుపులో పురుగులున్నచో ముక్కుదురద, ముఖము పొంగరించుట, ఆసనము తీపు, మల విమోచన కాలమందు తినుకుట, గుదమందుదురద, ఆకలి లేకపోవుట, రాత్రియందు నిద్రలో భయపడి యేడ్చుచు లేచుట— ఈ లక్షణము లుండును.

10. గొంతుక రోగములలో గుటకవేయలేక పోవుట, మెడయందు కంఠము నందున్న గ్రంధులు వాచుట— ఈ గుణములుండును.

## 2. దంతోత్పత్తి

పిల్లలకు సాధారణముగ ఆరు, యెనిమిది మాసములమధ్య దంతములుత్పత్తి యగును. అంతకు పూర్వముకూడ కొందరికి దంతములు మొలచుట కలదు. కాని అట్టివారు దంతపటుత్వములేక దంతబాధలచే సదా పీడింపబడుచుందురు. ప్రారంభమున దంతము లడుగుభాగమున జనించును. ఇది స్వభావము. కాని ప్రారంభముననే పై చిగుళ్ళయందు దంతములు జనించిన పిల్లలు లేకపోలేదు.

మొదట జనించు దంతములకు పాలపళ్ళు (Milk teeth) అని పేరు. ఎన్నో మాసమున దంతములు మొలకెత్తునో, అన్నో సంవత్సరమున ఊడి పోయి తిరిగి జనించును. వీటికి ఖాయపుపళ్ళు (Permanent teeth) అని పేరు.

దంతములు మొలుచునపుడు బాలుర కనేక యుపద్రవములు కలుగుచుం

డును. అందు ముఖ్యముగ అతిసారము, వాంతులు, తలనొప్పి, వాపు, చిక్కి-పోవుట—ఈ లక్షణములు కలుగును. వీటిని సాధారణముగ వైద్యముచేయ నవసరముండదు. అయినను యీ క్రింది ఔషధము లాయా గుణములకు వాడదగును.

కేమోమిల్లా :—దంతోత్పత్తి కాలమందు శిశువులకు కలుగు అతిసారము నకు వాడదగిన ముఖ్యౌషధము. శిశువు వణకుచు, భయపడుచు, ఏమియు తోచక, బాధపడలేక, ఎల్లపుడు నెత్తుకొనమని వాంఛించుచుండును. విరోచనములు తెల్లగను, ఆకుపచ్చగను, నాసనగను యుండును. పొత్తికడుపు పొంగరించి కడుపునొప్పి యుండును.

పోడోఫిల్లం :—ఆకుపచ్చగయుండి, వాసనగలిగి నీళ్ళవలెనగు పెద్ద విరోచనములకు బాగుగా పనిచేయును.

క్రియొసోటం :—దంతములు పుట్టినపుడు చిగుళ్ళు వాచి, యెర్రబడి, నొప్పి యెక్కువగా నున్నప్పుడును, పండ్లు పైకి మొలచిన వెంటనే చెడిపోయి నపుడును, శిశువు శరీరము ముడతలుపడి ముసలిరూపు యున్నపుడును పని చేయును. బ్లాక్ వుడ్ యిట్లు వ్రాసియున్నాడు.

"It is useful in painful dentition of children...The child is wrinkled and looks old, the gums are painful, swollen, dark-red or blue and the teeth decay almost as soon as they appear." —(*Dr. Blackwood's* 'Materia Medica.')

కాల్కేరియా కార్బ్ :—పిల్లలకు దంతములు వచ్చు సమయములలో కలుగు సమస్త దుర్గుణములకు అద్భుతముగా పనిచేయును. పాలవలెనే తెల్లగ, పలచ నగు అజీర్ణ విరోచనములకు, పెరుగుబిళ్ళలవలె వెళ్ళు వాంతులకు, కడుపు నొప్పికి, ఉబ్బరమునకు బాగుగా పనిచేయును. మరియు పండ్లు ఆలశ్యముగా వచ్చుట, పిల్లలు చిక్కిపోయి నీరసముగా నుండుట, నడవలేకపోవుట—వీటికి మంచిది.

కాల్కేరియాఫాస్ :—ఇదికూడ పిల్లలకు పండ్లువచ్చు కాలములో కలుగు సకల దుర్గుణములకు మంచిది. ఆకుపచ్చగ, వెచ్చగ, దుర్వాసన గలిగియుండు నీళ్ళవిరోచనములకును, జీర్ణము కాక పాలు వమనమగునపుడును, కడుపు నొప్పికిని, పిల్లలు చిక్కిపోవునపుడును దంతము లాలశ్యముగ వచ్చినప్పుడును బాగుగ పనిచేయును.

నేట్రంఫాస్ :—విరోచనములు ఆకు పచ్చగను, పుల్లని వాసన గలిగి యున్నపుడు పనిచేయును.

ఇపెకాక్ :—వికారము, వాంతులు యున్నపుడు పనిచేయును. కొందరకు దంతోత్పత్తి కాలమందు మలబద్ధముకూడ యుండవచ్చును. మలము కష్టము మీద, కొద్దిగ, గట్టిగ ఉండలవలె వెళ్ళును. ఇట్టి మలబద్ధమునకు మెగ్నీషియా మూర్ పనిచేయునని బ్లాక్‌వుడ్ వ్రాసియున్నాడు.

## 3. పండ్లుకొరుకుట లేక దంతశబ్దము
## Grinding of the teeth.

లక్షణములు :—బాలురు కొందరు నిద్రించుచుండగా దంతములతో శబ్దము చేయుదురు. కొందరు గొంతుకలలో యేదియోయున్నట్లు గుటకలువేయుదురు. మరికొందరికి యేదియో అడ్డుతగిలినట్లుండి ఉక్కిరిబిక్కిరియై దగ్గువచ్చును. దంతములువచ్చు సమయములో కొందరు చిగుళ్ళను బాగుగనొక్కి దంతములు కొరుకుచుందురు. వారేవస్తువైనను నోటిలోబెట్టుకొని కొరుకుటకు యిష్టపడు చుందురు. నిద్రలో ఉలికిపడుచుందురు.

### చికిత్స :

సినా :—నిద్రలో పండ్లు పటపటకొరుకుట, ఉలికిపడిలేచుట, గొంతుకలో నేదియో అడ్డమున్నట్లుండి గుటకలువేయుట, దగ్గుట—ఈ లక్షణములకు బాగుగపనిచేయునని డాక్టర్‌నాష్ వ్రాసియున్నాడు.

కేమోమిల్లా :—పై లక్షణములుండి ఒకచెంప ఎర్రగను వేడిగను, రెండవ చెంప తెల్లగను చల్లగను యున్నపుడు వాడవలయును.

ఫైటోలక్కా :—దంతములు మొలచునపుడు చిగుళ్ళను గట్టిగనొక్కవలెనని యిచ్ఛయుండును. ఏ వస్తువైనను నోటిలోబెట్టుకొని కొరకవలెనని కోరిక యుండునపుడు దీనిని వాడదగును.

పోడోఫిల్లం :—నిద్రలో పండ్లుకొరుకుట, మూల్గుట, యేడ్చుట—ఈ లక్షణములకు పనిచేయును.

నేట్రంఫాస్ :—పిల్లలు రాత్రులు నిద్రలో పండ్లుకొరుకుటకు వాడదగును. ఈ లక్షణములు క్రిములవలన గలిగినచో అద్భుతముగా పనిచేయును.

## 4. రోదనము Crying.

లక్షణములు :—పిల్లలు సాధారణముగ నేడ్చుచుందురు. కారణ మెవరును గ్రహించలేరు ఏమియు తోచకపోవుట, కోపము కొంతవరకు కారణములు. ఏమికావలెనో వారుచెప్పలేరు. కాని యేదియిచ్చినను తృప్తిచెందక పారవేయు దురు. దేనికిని తృప్తిపొందరు. ఏడుపు మాత్రము మానరు.

### చి కి త్స :

కేమోమిల్లా :—కారణములేని కోపమువచ్చి పిల్లలు తరుచు యేడ్చు చుందురు. ఏది యిచ్చినను త్రోసివేయుదురు. తలిదండ్రులుగాని, బాలుడు గాని యేమికావలెనో గ్రహింపజాలరు. శిశువునకు మనస్థిమితముండదు (Restlessness). కాని హోమోపతి వైద్యుడట్టి స్థితిలో శిశువున కేమి కావలెనో సులభముగ తెలుసుకొనగలుగును. శిశువునకు కావలసినది కేమోమిల్లా. ఒక మోతా దిచ్చినచో యేడుపు తగ్గును. కోపము వలన గలుగు బాధ లన్నిటికి మంచిపనిచేయును. "It is the leading anger remedy of the Materia Medica." —(*Nash*.)

సినా :—పాలిచ్చు దాదిని తన్నును ; కొట్టును. ఎవరైన ముట్టుకొనినను, యెత్తుకొనుటకు ప్రయత్నించినను, తనవైపు చూచినను, నేడ్వనారంభించును. ఏదియో కావలెనని కోరికయుండును ; కాని చెప్పలేడు. ఏది యిచ్చినను తిరస్కరించును. ముఖ మెర్రగనుండును. ఈ లక్షణములతోగూడిన రోదనము లకు పనిచేయును.

స్టాఫిసేగ్రియా :—పిల్లవానికి యేది యిచ్చినను పారవేయుచు, యేడుపు మానకుండును. ఈ యేడుపు ఉదయముపూట అధికముగ నున్నపుడు దీనిని వాడదగును.

బ్రైయోనియా :—పిల్లవాడు పరుండినపుడు యూరకుండి, కదపినచో యేడ్వనారంభించునపుడు పనిచేయును.

యాంటిమోనియమ్‌క్రూడమ్ :—పిల్లవానివైపు చూచినను, ముట్టుకొనినను భయపడి యేడ్చును, చిరచిరలాడుచుండును. కొద్ది జ్వరముండును.

## 5. కుకూణకము (Infantile ophthalmia)
## లేక నేత్రరోగము

లక్షణములు :— ఈ రోగమందు కన్నులు దురద, ఱెప్పలక్రింద యిసుక

వలెనుండి మిరమిర లాడుట, నేత్రము ఎర్రగనుండుట, వాపు, పోట్లు, వెలుతురు యెండచూడలేకపోవుట, కన్నులు నీరుకారుట, రాత్రు లధికమై ఉదయమున లేచుసరికి కండ్లంటుకొనుట—ఈ లక్షణములను గలిగియుండును. కనురెప్పలమీద బహుచిన్న మొటిమలవలె (Pimples) కూడ బయలుదేరును. కొందరకు కండ్లలో పుసులుకారును. పై మొటిమలు కొందరిలోలేకపోవచ్చును.

కారణములు :—బాలురకిచ్చు పాలదోషమువల్లను, చలిగాలి తేమవల్లను, ఎండ, పొగ, దుమ్మువల్లను—ఈ రోగము సాధారణముగ జనించును.

## చికిత్స :

బెల్లడోనా :—నొప్పి, కండ్లవాపు, ఎరుపులకు పనిచేయును. చెక్కిళ్ళు ఎర్రగనుండును. కండ్లు మెరయుచుండును. వెలుతురును జూడలేకపోవును.

మెర్క్యురియస్ కార్ :—నొప్పికలిగి కండ్లనుంచి అధికముగ నీరుకారును. దీనిని బెల్లడోనాయును ఒకదానితరువాత నొకటి వాడదగును.

ఆర్జెంటమ్నైట్రికమ్ :—కండ్లనుండి చీమువంటి ద్రవమధికముగ కారునపుడును, కనుఱెప్పలు పొంగరించియున్నపుడును పనిచేయును. దీనిని లోపలకు పైకికూడ వాడుచుందురు. ఇది నేత్రరోగములకు చాలామంచిది.

స్టాఫిసేగ్రియా :— కనురెప్పలయందు బయలుదేరు చిన్న కాయలకు (Styes) వాడుదురు. ఇవి ఒకానొకప్పుడు పుండ్లుకూడ యగుచుండును.

యూఫ్రేషియా :—ఇది ప్రత్యేకము నేత్రరోగములకే బాగుగా పనిచేయును. శుక్లమండలము (Cornea) పై జిగురువంటి పదార్థముచేరి కండ్లు మిటకరించినచో తొలగిపోవును. కన్నులనుండి చురుకుచురుకు మనెడి నీరధికముగ కారుచు, కనురెప్పల పైపుండ్లు పడి, రెప్పలను భగభగమండించును. ఈ నీరు దవడలపై కారునపుడు దవడలు తోలూడిపోవునంత మంటమండును. డాక్టరు బ్లాక్వుడ్డు యిట్లు వ్రాసియున్నాడు.

"A profuse acrid lachrymation which bites and excoriates the eyelids, which swell and ulcerate, as well as the portion of the cheek over which it flows." — *Blackwood.*

కోనియం :—రాత్రులయందు, వెలుతురులోను నొప్పు లెక్కువగుచు, చీకటిగదిలోను, ఒత్తిడివల్లను తగ్గుచుండును. కనురెప్పలు నిలుపలేక పడిపోవునపుడు బాగుగా పనిచేయును.

ఆర్సెనికమ్ :—మంట లున్నపుడు పనిచేయును.

సల్ఫర్ :—ఱెప్ప లెఱ్ఱగను, దురదగను, మంటగను యున్నపుడు పని చేయును.

ఎకోనైట్ :—వెలుతురు చూడలేనపుడు, నొప్పి అధికముగ యుండు నపుడు, రొంప జలుబుతోకూడి కండ్లు వాచి మంట లున్నపుడు, కంటినుండి నీరు కారునపుడు పనిచేయును. మిక్కుటమైన బాధచే రోగికి స్థిమితములేక యుండును. పెద్దవారైనచో చనిపోవుదుమని భయముండును. కంటిలో అన్య పదార్థము చేరియుండుటవల్లను, ఱెప్పవెంట్రుకలు లోపల పెరుగుటవల్లను జనించు మంటలకు వాడదగును.

అసారం యూరోపియమ్ :—చలిగాలివల్లను, చన్నీటివల్లను, ఉపశమన ముగ యుండి సూర్యకాంతి సోకినచో బాధ యెక్కువగునపుడు పనిచేయును.

రూస్టాక్స్ :—రెప్పలు వాచి యెఱ్ఱగానుండుట, కండ్లు మంటలు, నీరు కారుట, రాత్రులు అంటుకొనుట, వెలుతురు జూడలేకపోవుట –వీటికి మంచిది.

కాల్కేరియాకార్బ్ :—ఉదయమున లేచుసరికి కండ్లంటుకొనుట, వెలు తురు జూడలేకపోవుట –యీ లక్షణములకు పనిచేయును.

ఆర్నికా :—దెబ్బలవల్లను, గాయములవల్లను కన్ను యెఱ్ఱపడినపుడు దీనిని లోపలికి, పైకికూడ వాడవచ్చును.

ఫెర్రంఫాస్ :—ఎరుపు, నొప్పి, మంటయున్నపుడు కనురెప్పల క్రింద యిసుకవలె మిరమిరలాడునపుడు, చన్నీటివలన బాధ ఉపశాంతిగానున్నపుడు దీనిని వాడవలయును.

కాలీమూర్ :—కండ్లు వాచి యెఱ్ఱపడినపుడు, పుసులు కారునపుడు, లోపల యిసుక యున్నట్లు మిరమిరలాడునపుడు, శుక్లమండలముపై పుండు యున్నపుడు బాగుగా పనిచేయును. దీనిని ఫెర్రంఫాస్‌ను ఒకదాని తరువాత నొకదానిని వాడదగునని చాప్‌మెన్ వ్రాసియున్నాడు.

"Sore eyes with specks of white matter on the lids. Granulated eyelids with feeling of sand in the eyes. Alternate with Ferrum Phos."

*(Chapman's Biochemistry.)*

నేట్రంమూర్ :—కంటినుండి నీ రెక్కువగా కారునపుడు పనిచేయును.

సైలీషియా :—పసుపుపచ్చని పుసులు కారుచున్నను, కనురెప్పలమీద

బయలుదేరు కాయలకును (Styes) పుండ్లుకును పనిచేయును.

కాల్కేరియాసల్ఫ :— కండ్లు ఎరుపు, నొప్పియుండి పసుపుపచ్చని పుసులు కారునపుడు పనిచేయును.

గమనింపదగిన విషయములు :—కండ్లనెప్పుడును ఉష్ణోదకముతో పరిశుభ్రముగ కడుగుచుండవలయును. కండ్లంటుకొనకుండ వేసలైనుగాని, ఆలివ్ ఆయిలుగాని (Olive O.l) వ్రాయుట మంచిది. ఎక్కువ వెలుతురుగాని, సూర్యరశ్మిగాని తగలరాదు. ఆసిడ్ బోరాసికమ్‌యొక్క బలమగు ద్రావకము (saturated solution) కండ్లు కడుగుటకు ఉపయోగించవచ్చును.

## 6. ముఖపాకము Inflammation of the mouth.

ఇది పిల్లలకు వచ్చు నోటిరోగము. దీనినే నాలుకపూత యందురు.

లక్షణములు :— నోటియందు ఎర్రగ, వెచ్చగనుండు పుండ్లు బయలుదేరును. పెదవు లెర్రబడును. పై చర్మ మూడిపోవును. ఊపిరి వాసనగలిగి యుండును. నాలుక పగిలియుండును. ఈ రోగి నోరు సులభముగ తెరువజాలడు. కొందరికి నోటినుండి చొల్లుకారును. పెద్దవారికి కలుగు నోటిపూత లక్షణము లుండును.

కారణములు :—అపరిశుభ్రము, ఆహారదోషములే ముఖ్యకారణములు. కావున దోషరహితమైన పాలను నియమము ననుసరించి యిచ్చుచు, శిశువును పరిశుభ్రముగ నుంచవలయును.

### చికిత్స :

మెర్క్యూరియస్ :— నోటి రోగములకు ముఖ్యౌషధము. నోటినుంచి విశేషముగ చొల్లు కారునపుడు, ఊపిరి దుర్వాసన గలిగియున్నపుడు పనిచేయును.

కాలీక్లోరికమ్ :—ఊపిరి, నోటినుండికారు చొల్లు వాసనగలిగియుండి, నోటిలో పుండ్లుయున్నపుడు వాడదగును. ఈ వ్యాధులలో నోటిని పరిశుభ్రముగ కడుగుటకుకూడ దీనిని వాడుదురు. పాదరసము విశేషముగవాడియున్న రోగులకు బాగుగా పనిచేయును.

హైడ్రాస్టిస్ :—నాలుక, చిగుళ్ళు, చెంప వాచి ఎర్రపడి మిక్కుటమైన నొప్పిని కలుగజేయును. పెదవులమీదను, నాలుకమీదను పుండ్లు బయలుదేరును. నోటిలో జిగురువంటి ద్రవమూరుచుండును. దీనిని పైకికూడ వాడవచ్చును.

కాలీమూర్ :—పిల్లలకు నోటిలో తెల్లనిపుండ్లు బయలుదేరి, చిగుళ్లువాచి నోటినుండి చిక్కని చొంగ కారుచున్నపుడు పనిచేయును.

నేట్రంమూర్ :—నోటినుండి చొల్లధికముగ కారుచున్న యేనోటి రోగమునకైనను పనిచేయును.

ముఖ్యవిషయములు :—ఈ రోగమునకు అపరిశుభ్రము ముఖ్యకారణ మగుటచే శిశువునోటిని పరిశుభ్రముగా నుంచవలెను. శిశువునోటిని వేడినీళ్ళతో పరిశుభ్రముగా కడుగవలయును. మరియు పాలిచ్చుటకు ముందు, పాలిచ్చిన పిమ్మటకూడ తల్లికూడ తల్లియొక్క చన్మొనలు ఉష్ణోదకముతో బాగుగా కడుగవలయును. పిల్లలకు పోతపాలుపోయుచో, రబ్బరుతో చేయబడు పాల పీకలను పరిశుభ్రముగా నుంచవలయును. పాలు పట్టినపిమ్మట ఆపీకలను సోడా బైకార్బనేటు నీళ్ళతో శుభ్రపరచవలెను. ఈ విధముగా శుభ్రతను గమనించినచో శిశువులకు నోటిరోగములు రానేరవు. దోషరహితమైన పాలనే వాడవలయును. డాక్టర్ బార్ట్లెట్ యీ విధముగా వ్రాసియున్నాడు.

"As part of the toilet of the new born infant, the mouth should be most carefully washed with boiled water. Before and after nursing, it is always a good precaution for the mother to clean her nipples thoroughly with boiled water. This simple precaution will almost certainly prevent mouth infection of the nursing infant. In the case of bottlefed infants the most important prophylactic measure against stomatitis, and indeed against any other infantile ills, is attention to the rubber nipples. These should be cleansed thoroughly after each feeding, and occasionally boiled in a solution of bicarbonate of soda. While not in use they should be kept in sterilized water. Antiseptic mouth-washes are entirely unnecessary in the care of healthy mouth."

(Text Book of Clinical Medicine—Treatment 281.)

## 7, తాలుకంటకము Thrush—Sore mouth.

### ఇదికూడ ఒకవిధమైన నోటిరోగము

లక్షణములు :- శిశువు భయపడును. పాలు త్రాగుటకు యిష్టపడకుండును

ఒకవేళ త్రాగినను వాంతి, నీళ్ళవిరోచనములు కలుగును. నాలుకమీద, అంగిలిలోను, పెదవులు, దవడల లోపలిభాగమున తెల్లని పొక్కులు బయలు దేరును. కొద్ది జ్వరముండును. దప్పియుండును. మెడ వ్రేలాడవేయు చుండును.

కారణములు :— స్తన్యమునందలి దోషముచేగాని, స్తన్యము చాలనపుడు గాని, పాలను బోయునపుడు పరిశుభ్రతను గమనింపనిదోషంగాని, యీ వ్యాధి కలుగుచుండును. ఇది క్షయ, పాంగు మొదలగు వ్యాధులలోకూడ కనపడ వచ్చును. అట్టి సమయములో నిది చాల ప్రమాదకరమైనది.

చికిత్స :

బోరాక్స్ (Borax) :—ఈ వ్యాధికి దివ్యౌషధము. పైన వ్రాయబడిన లక్షణము లన్నిటికి పనిచేయును. శిశువు స్తన్యమును ద్రాగక యేడ్చును. అతి సారము, నాలుకపైన, దవడలలోపల తెల్లని పొక్కులుండును. దీనిని నీటిలో గలిపి, ఆ నీటితో నోటిని పరిశుభ్రముగ కడుగవలయును. శిశువులకు గ్లిసరిన్‌తో కలిపివాడినను వాడవచ్చును. కొంతమంది గ్లిసరిన్‌కు బదులు తేనెతో కలిపి శిశువులకు వాడుట మంచిదని చెప్పుదురు. కాని తేనెవలన నోటియందుబయలు దేరు పొక్కు లెక్కువై రోగమభివృద్ధి చెందును. కావున మధురమైనదేదియు వాడరాదు. డాక్టర్ బార్‌ల్లెట్ యిట్లు వ్రాసియున్నాడు.

"The fungus should be gently wiped off with a moist linen rag, after which the parts should be washed with a 5 p. c. solution of Borax. In the case of infants, the Borax may be mixed with some glycerine. While honey is a good vehicle for Borax, and is generally recommended for use in infantile mouth inflammations, its use in thrush is not above criticism; for it is capable of increasing the activity of fungus growth. For this reason, foods which contain sugar must be avoided."

(Text Books of clinical Medicine—Treatment.)

మెర్క్యూరియస్ డల్‌సిస్ :—నోటినుండి నీరుకారుట, ఊపిరి వాసన గలిగియుండుట, గొంతుక నొప్పి—యీ లక్షణములకు పనిచేయును.

బెల్లడోనా :—గొంతుక, నోరు వాచి యెఱ్ఱగ నుండుట, ఆరిపోయి యుండుట, గుటకవేయునపుడు నొప్పి యుండుట—వీటికి పనిచేయును.

హైడ్రాస్టిస్ (Hydrastis) :—చిగుళ్లు పళ్ళు నంటిపెట్టియుండక వదులుగ యుండును. నాలుకపై పుండ్లు యుండును.

అర్జెంటమ్ నైట్రికమ్ :—గొంతుక సంబంధమైన బాధలకుమంచిది. గొంతుకలో యేదియో యున్నట్లు, గోకుచున్నట్లుండి, ఓకరింపు, దగ్గు వచ్చును.

కాలీపెర్మాంగ్–పొటాసియం పెర్మాంగనేట్ :—నీటిలో కలిపి నోటి దుర్వాసనకు వాడవచ్చును. సల్ఫ్యూరస్ యాసిడ్ కూడ రోజుకు రెండుసార్లు పైకి వాడవచ్చును.

ఫెర్రంఫాస్ :—శిశువులలో నీ రోగమునకు మంచిది. గొంతుక నొప్పికి పనిచేయును.

కాలీమూర్ :—ఇది యీ రోగమునకు ముఖ్యౌషధము. దీనిని లోపలికి పైకికూడ వాడవచ్చును.

"It is the chief and generally the only remedy required-Internally and as a wash." —(*Chapman* )

నేట్రంమూర్ :—నోటినుంచి నీ రధికముగ కారునపుడు పనిచేయును.

ముఖ్యగమనింపు :—తల్లి స్తన్యమువలన నీ రోగము జనించినచో, వెంటనే తల్లిపాలుమాన్పించి, దాదిపాలుగాని, ఆవుపాలుగాని వాడుట మంచిది. పాలిచ్చిన పిమ్మట, తల్లి చన్మొనలను, శిశువునోటిని పరిశుభ్రముగా కడుగవలెను. ఇట్టి శుభ్రతను గమనించినచో ఈ వ్యాధి రానేరదు.

"Thorough cleansing of the mouth is of especial importance in thrush, as the disease cannot appear if proper hygienic conditions of the mouth prevail.
—*Dr. C. Bartlett.*

## 8. అహిపూతనము Chafing—soreness of infants.

లక్షణములు :—శిశువులయొక్క గుదస్థానము శుభ్రముగ కడుగకున్నను, శిశువును స్నానముచేయించకున్నను, చెమట యెక్కువగ పట్టుచున్నను, మలినముచే దురద బయలుదేరును. గజ్జలలోను, చంకలలోను, మెడక్రిందనుకూడ మలినమును శుభ్రపరచనియెడల దురద బయలుదేరి రాపిడివలన ఎరుపుమంటలు బొబ్బలులేచును. అవిచితికిన రసికారును. ఆ సమయములో బాధ అధికమగును.

కారణము :—అపరిశుభ్రమే ముఖ్యకారణము.

## చికిత్స :

మెడోర్హినం 200 Medorrhinum 200 :— సైకోటిక్ లక్షణములకు మంచిది. ఈ వ్యాధికి బాగుగా పనిచేయును.

కేమోమిల్లా :—పిల్లలకు పనిచేయును.

కాల్కేరియాకార్బ :—గండమాల వ్యాధులు గలిగిన పిల్లలకు బాగుగా ఉపయోగపడును. (Useful in scrofulous children)

లైకోపోడియం ; సల్ఫర్ :— ఇవికూడ వాడదగును. ఈ వ్యాధిలో యీ రెండునుకూడ మంచి పనిచేయును.

నేట్రంసల్ఫ :—పొక్కులు చితికి పసుపుపచ్చని, నీళ్ళవంటి ద్రవము కారునపుడును, పైత్యలక్షణములకును పనిచేయును.

కాలీసల్ఫ :—పసుపుపచ్చని రసి కారునపుడు పనిచేయును.

పైకివాడు మందులు :— హైడ్రాస్టిస్ గ్లిసరిన్‌లో కలిపి తయారుచేసిన లోషన్ వాడుట మంచిది. లైకోపోడియం, జింకు ఆక్సైడ్‌కలిపి, ఆ భస్మమును జల్లుటకూడ మంచిదే. శిశువున కాయాస్థలములు పరిశుభ్రముగ నుంచుట ముఖ్యము.

## 9. పారిగర్భికము

## Disease caused by prolonged lactation.

లక్షణములు :—బాలునకు జీర్ణశక్తి తగ్గిపోవును. బాలుడు కృశించి చిక్కిపోవును, దుర్బలుడగును, రక్తము క్షీణించును, అగ్నిమాంద్యము, వమనము, దగ్గు జనించును. కడుపుపెరుగును. ఇట్టిస్థితిలోబాలునకు జీర్ణశక్తిని బాగుపరచి, ఆకలిని బుట్టించి, రక్తవృద్ధిని గలుగజేయు ఔషధములను వాడవలయును.

కారణములు :—తల్లివద్దగాని, దాదివద్దగాని, శిశువు దీర్ఘకాలము స్తన్యపానము జేయుటచే నిట్టివ్యాధి కలుగుచున్నది. గర్భవతియైన తల్లివద్దగాని దాదివద్దగాని శిశువు స్తన్యము కుడువరాదు. ఆ స్తన్యములో శిశువునుపోషించు పదార్థములు నశించుటచే శిశువు కృశించి దుర్బలుడగును. ఒక సంవత్సరము వయస్సు వచ్చినపిమ్మట శిశువు స్తన్యపానము చేయరాదు.

ఇదియునుగాక తల్లి గర్భవతియైనచో స్తన్యపానమువలన గర్భస్రావము కూడ కలుగవచ్చును. దీనినే బార్ట్లెట్ యిట్లు వ్రాసియున్నాడు.

"The prolongation of the nursing period, however, brings about anaemia, and the exclusive use of milk as a food for children during the second year results in malnutrition, and anaemia." (Deficient proteids and iron etc.)

"Should the mother become pregnant, it is not advisable for her to continue nursing, as the drain on the system becomes too great under the circumstances, besides, the milk will deteriorate and there is the added danger of miscarriage."

(Text Book of Clinical Medicine— Treatment by *Dr. Clarence Bartlett.*)

## చికిత్స ;

చైనా :—దీర్ఘకాలము స్తన్యపానముచే గలుగు దుర్బలత్వమునకు, రక్తక్షీణమునకు మిగుల ఉపయోగకారి.

It is useful in the anaemia, and debility that follows the loss of a vital fluid, as a haemorrhage, prolonged and excessive lactation, diarrhoea etc." —*Dr. Blackwood.*

కాల్కేరియాకార్బ :—పిల్లలకు జీర్ణకోశము బాగుపరచుటకును, రక్తమభివృద్ధిపరచి దృఢవంతులుగ జేయుటకును అద్భుతముగా పనిచేయును.

కార్బోవెజ్, లైకోపోడియం:—జీర్ణకోశమునందలి దోషములనుబోగొట్టి అగ్నిదీప్తిని కలుగజేయును.

నక్సువామికా, పల్సటిల్లా, బ్రైయోనియా :— ఈ మూడునుకూడ జీర్ణకోశముమీద బాగుగ పనిచేయును.

కాల్కేరియాఫాస్ :—పిల్లలకు జీర్ణశక్తిని బాగుచేసి, రక్తవృద్ధిచేయుటకు ప్రధానమైనది.

ఫెర్రంఫాస్ :—దుర్బలత్వము, అగ్నిమాంద్యము, బలక్షీణము, రక్తక్షీణము గలిగిన శిశువులకు అగ్నిదీప్తిని కలుగజేసి, రక్తమును వృద్ధిపరచి దృఢశరీరమును గలవారిగ చేయును. మంచి రసాయనము.

"It is indicated as a reconstruction in those who are anaemic - children who are weakly, with a failing appetite and who lose weight and strength." —*Dr. Blackwood.*

## 10 క్షీరాలసకము (Infantile cholera).

పెద్దవారికివచ్చు కలరా వ్యాధి వంటిది. ఆ లక్షణములే కలిగియుండును. కావున దీనికి ఆంగ్లమున 'Infantile cholera' అని పేరు. అనగా 'పిల్లలకు వచ్చు కలరా' యని యర్థము.

శిశువులకు జఠరాగ్ని పూర్తిగ నశించును. వాసనగలిగియుండు ఆకుపచ్చని నీళ్ళవిరేచనములతో ప్రారంభమగును. అవి కొంచెముపలచగను, నురుగుతోను గలసియుండును. రంగుతో ప్రారంభమైన విరోచనములు వెంటనే శ్వేతవర్ణముగా మారి గంజివలె యుండును. కడుపునొప్పి, దప్పి, జ్వరము, తేనుపులు, నోటియందరుచి, ఒడలు నొప్పులు, స్వరహీనము, మూలుగుట, కాళ్లుచేతులు తన్నుకొనుట, కంటిగ్రుడ్లు క్రిందికిపోవుట—యీ లక్షణము లన్నింటిని కలిగి యుండును. ఇది చాల ప్రమాదకరమైన వ్యాధి. తీవ్రరూపము దాల్చినచో మూత్రబంధనముకూడ కలుగును. ఈ వ్యాధికి ప్రారంభదశలో శిశువులకు వాంతులు వెళ్లును. పాలు త్రాగిన వెంటనే కష్టతరమైన వాంతి వచ్చును. పాలు కొంచెము సేపిమిడినను పుల్లని పెరుగువలె శిశువు కక్కుకొనలేనంత పెద్ద వమనమగును. ఇది కనిపెట్టి వెంటనే తగిన ఔషధము లివ్వవలెను. లేనిచో ప్రమాదమైన క్షీరాలసకవ్యాధిలోనికి దింపును.

క్రమముగ వాంతులు, విరోచనములు తగ్గుట, విరోచనముయొక్క తెలుపు రంగు మారుట, ముఖ్యముగ మూత్రము జారీయగుట—యివి శుభచిహ్నములు.

కారణములు :—పాలిచ్చు తల్లిగాని, దాదిగాని దోషయుక్త పదార్థములను సేవించినచో, స్తన్యము దోషపూరితమై యుండును. ఆ స్తన్యమును శిశువు పానముజేసినచో క్రమముగా జీర్ణముగాక వాంతి, అతిసారము, కడుపు నొప్పి బయలుదేరును. ఈ లక్షణములే ముదిరినచో ప్రమాదములగును. స్తన్యపానము చేయు స్థితి దాటిన పిల్లలైనచో, వారి కిచ్చు ఆహారదోషముచే నీ వ్యాధి కలుగును. బలువైన పదార్థములను, న్యూనాధికంబుగను, అకాలమందు పిల్లలను భుజింపజేసినను, వారి కిచ్చు నీరు మొదలగునవి పరిశుభ్రముగ లేకపోయినను యీ వ్యాధి జనించుచుండును.

### చికిత్స :

పోడోఫిల్లం :—ఈ రోగమునకు దివ్యౌషధము. దీని విరేచనములు ప్రాతః కాలమున యెక్కువగుచుండును. అవి పసుపుపచ్చగా గాని, ఆకుపచ్చగాగాని యుండి, వాసనగలిగి నీళ్లవలె పల్చగ నగుచుండును. విరేచనము చాల పెద్దదిగ యుండును. కండ్లు సగము మూసుకొని శిశువు నిద్రపోవును. తల తిరుగుట,

మూల్గుట, కడుపులో గురగురలాడుట, వట్టి త్రేణుపులు— యీ లక్షణములను గలిగియుండును. బాగుగ ముదిరిన వ్యాధిలో యీమందు 1000 పొటెన్సీ (Fotency) తో కుదిర్చితినని డాక్టర్ నాష్ వ్రాసియున్నాడు.

క్రియసోటమ్ :—దంతోత్పత్తి కాలమున దంతబాధచే కలుగు క్షీరాలసనమునకు పనిచేయును. ఎడతెగని పెద్ద వమనములు. విరేచనము శవగంధము.

వెరాట్రం ఆల్బమ్ :—శిశువును నిరాశచేసుకున్న సమయములోనైనను యీమందు ప్రాణమిచ్చి రక్షించును. మహావాతములమీద పనిచేయును. శరీరమంతయు మంచుగడ్డవలె చల్లబడి నొసటనుమాత్రము చల్లని చెమటలుపోయును. దీని విరేచనములు పెద్దవిగను, కడుగువలెను యుండును. అప్రయత్నముగకూడ వెళ్ళుచుండును. పెద్దవాంతులుండును. కడుపునొప్పివల్లను, యితర బాధలవల్లను రోగి స్మారకము తప్పినవానివలె యుండును.

బిస్మత్ :—ఎంత తీవ్రమైన వ్యాధిలోనైనను నిమిషములమీద పనిచేయును. దీని విరేచనములు పెద్దవిగను, బాధలేకుండగను, నీళ్ళవలెను, దుర్వాసనతోను యుండును. నీరు త్రాగినవెంటనే పెద్ద వమనమై నీరుమాత్రమే వెళ్లిపోవును. దప్పి యెక్కువగనుండును. పై మూడౌషధములను దగ్గర జాగ్రత్తపెట్టుకొనినచో యీ వ్యాధివలన భయపడనవసరముండదు. డాక్టర్ నాష్ యిట్లు వ్రాసియున్నాడు.

"Bismuth is one of our best remedies for cholera infantum ; genuine cholera infantum, when the disease is sudden in its onset and rapid in its course. Such cases die in a night or even a few hours, unless Bismuth, Veratrum, Kreosote or some other remedy of such rapid action saves them."
—*Dr. Nash.*

ఎథూసాసైనాపియమ్ :—ఇదికూడ నొక ముఖ్యమైనమందు. వికారము, వాంతియుండి, విరేచనములు పసుపుపచ్చగాగాని, ఆకుపచ్చగాగానియుండి జీర్ణముకాని పదార్థములను గలిగియుండును. తీపుయుండును. కంపములు (Convulsions) కూడ యుండవచ్చును. కండ్లు క్రిందికి దించుకొనిపోవును. తల పైకి యెత్తలేకపోవును.

క్యాఫియావిస్కోసిమా :—ఆకుపచ్చని నీళ్ళవిరేచనములు, జీర్ణముకాని పాలు ఆహారము వమనమువెళ్లుచుండును. శిశువు భయపడును, జ్వరముండును.

స్మిమితముండదు. ఇది ఈ వ్యాధిలో (Infantile cholera) అమోఘముగ పనిచేయును.

యుఫోర్బియా కార్ :—పెద్ద పెద్ద నీళ్ళవిరేచనములు, వమనములు, ప్రేగులలో గురగుర, శోష, స్మారకము తప్పుట, ఆతురత—ఈ లక్షణములుండును.

కేంఫర్ (Camphor) :—వ్యాధి ముదిరి, అంత్యదశలో శరీరమంతయు చల్లబడినపుడు పనిచేయును.

సోరినమ్ :—గోధుమవర్ణము గలిగి, పచనముకాని పదార్థములతోను, దుర్వాసనతోను గూడియున్న నీళ్ళ విరేచనములుండినపుడీ వ్యాధిలో పనిచేయును.

నేట్రుంమూర్ :—అప్రయత్నముగ వెళ్ళు నీళ్ళవిరేచనములు, మెడ కృశించియుండుట—ఈ లక్షణముల కీవ్యాధిలో వాడదగును.

ఫెర్రంఫాస్ :—అజీర్ణ పదార్థములతో కూడియున్న నీళ్ళవిరేచనములకు, వాంతులకు, జ్వరమునకు బాగుగా పనిచేయును.

కాల్కేరియాఫాస్ :—దంతములు మొలచు కాలములోగాని, అజీర్ణము వలనగాని అగు విరేచనములకు అద్భుతముగా పనిచేయును. కృశించిన పిల్లలకు దివ్యౌషధము. దీని విరేచనములు అజీర్ణముతో కూడియుండి, దుర్వాసనగలిగి, ఆకుపచ్చగను, వెచ్చగను, పెద్దవిగను, నీళ్ళవలె పల్చగను యుండును. దీనిని, ఫెర్రంఫాస్‌నువాడి యీ రోగము కుదర్చబడెనని డాక్టర్ ఛాప్‌మన్ వ్రాసియున్నాడు.

నేట్రంఫాస్ :—క్రిములతోను, అజీర్ణముతోను కూడియున్న విరేచనములకు పనిచేయును. విరేచనములు, వమనములుకూడ పుల్లని వాసనగలిగియుండును. కడుపునొప్పి, పులిత్రేణుపులు మొదలగు అజీర్ణలక్షణములుండును.

మెగ్నీషియాఫాస్ :—కడుపునొప్పి, కంపములు యున్నపుడు ఈ వ్యాధిలో బాగుగా పనిచేయును.

"Cholera infantum accompanied with cramp-like pain in the bowels, flatulent colic, drawing up of the legs, convulsions, spurting stools etc." —*Dr. Chapman.*

ఇవిగాక, జాలప్, ఐరిస్, డయోస్కోరియా, పల్సటిల్లా, సికేల్ కూడ వాడవచ్చును.

## 11. చంటిబిడ్డగుణము లేక అపతంత్రవాతము
## Infantile convulsions.

ఈ వ్యాధి ఆరుమాసములు మొదలు సుమారు పదిసంవత్సరముల వయసు గలిగిన బాలబాలికలకు కలుగుచుండును.

లక్షణములు :—ఈ వ్యాధి వచ్చుటకు ముందు జ్వరము తగులును. పిమ్మట నీ వ్యాధి తగులగనే బిడ్డ స్మృతితప్పి పడిపోవును. అవయవములు వణకుట, కొట్టుకొనుట, నోటినుండి నురగలు కారుట, బొటనవ్రేళ్లు పిడికిళ్ళలోనికి ముడుచుకొని, పిడికిళ్ళు గట్టిగ పట్టుకొనుట, గ్రుడ్లొకప్రక్కకు పోవుట, శిశువు బిగుసుకొనిపోయి మొద్దువలె పడియుండుట— యీ లక్షణములను గలిగియుండును.

కారణములు :—ఆహారదోషములచే జనించు అజీర్ణమువల్లను, క్రిముల వల్లను, భయమువల్లను, దంతములు మొలచు సమయమందును, వాతశ్లేష్మముల ప్రకోపమువల్లను యీవ్యాధి వచ్చుచుండును. శిశువు గర్భమునందుండగ తల్లి అపస్మారము (Hysteria) వలన బాధపడియుండినచో శిశువున కీవ్యాధి కలుగవచ్చును. మెదడునకు సంబంధించిన వ్యాధివలనను, అణచిపెట్టబడిన చర్మవ్యాధుల వలననుకూడ కలుగవచ్చును.

పై కారణము లన్నియుగాక యీవ్యాధి కొన్ని కుటుంబములలో వంశ పరంపరగాకూడ కలుగుచుండునని జార్జిరాయల్ వ్రాసియున్నాడు.

"Heredity often plays a part. I have known the children of three generations have spasms during the period of first dentition. I have treated two families whose children always had convulsions whenever the temperature reached 100° from any cause."

Diseases of the Brain and Nerves by *Dr. George Royal.*

### చికిత్స :

ఎకోనైట్ :—ప్రారంభదశలో ఫిట్ (Fit) రాబోవు ముందు జ్వరము జ్వరమునకు, స్థిమితము లేకపోవుట (Restlessness) వాడవలెను.

సల్ఫర్ :—అణచిపెట్టబడిన చర్మవ్యాధులవలన గలిగినచో పనిచేయును.

బెల్లడోనా :—మెదడునకు సంబంధించిన వ్యాధులీరోగమునకు కారణమై యుండవలెను. ముఖ మెర్రగనుండుట, బిడ్డ నిద్రనుంచి ఉలికిపడి లేచుట,

రెప్పలు వాల్చక తేరపారిచూచుట, శరీరము బిగిసియుండుట—యీ లక్షణము లకు వాడదగును. లావుగనుండు పిల్లలకు బాగుగ పనిచేయును.

నక్స్వామికా :—జీర్ణకోశము చెడిపోయి, అజీర్ణము, మలబద్ధముచే కలిగి నపుడు పనిచేయును. రోగి సాధారణముగ స్మారకముతప్పి యుండడు. తాకి నను, చలిగాలి తగిలినను, కదిపినను, నీటివల్లను యెక్కువగును. కావున రోగిని విశ్రాంతిగ బట్టలు కప్పి పడుకొననీయవలెను. చిరచిరలాడుచు కోప స్వభావము గల పిల్లలకు పనిచేయును.

కేమోమిల్లా :—తల్లికి తీవ్రమైన కోపము వచ్చి చల్లారిన వెంటనే శిశువు స్తన్యపానము జేసినపుడును, దంతములు మొలచు సమయమున కలిగెడు కంపము లకును (Convulsions) బాగుగ పనిచేయును. దీని కంపములు వెంటవెంటనే వచ్చి పోవుచుండును. కంపముల మధ్య బిడ్డకు స్మారకము వచ్చి భయపడుచు కుదురులేక యుండును. ముఖ్యముగ కాళ్లు చేతులు, ముఖ కండరములు వణకు చుండును. కను రెప్పలు ముడుచుకొని కండ్లు సగము మూతలుపడియుండును. దప్పి, వేగమైన ఉచ్ఛ్వాస నిశ్వాసములును గలిగియుండును. చిరచిరలాడెడి స్వభావముగల పిల్లలకు బాగుగా పనిచేయును.

సినా :—కడుపులో క్రిములు కలిగిన పనిచేయును. రోగి కాళ్లు చేతులు ఒకప్రక్కనుంచి మరియొక ప్రక్కకు ఆడించుచుండును. దీని కంపములు యెక్కువగ రాత్రివేళ వచ్చుచుండును.

మెర్క్యూరియస్ :—క్రిములువలన గలుగును. కడుపు పొంగరించియుండును. త్రేణుపులు వచ్చును. నోటినుండి అమితముగ చొల్లు కారుచుండును.

హైయోసియామస్ నైగర్ (Hyoscyamus niger) :—భయము వలన గలుగును. ముఖ కండరములు, వ్రేళ్లు ముడుచుకొనిపోవుట, వంకరలు తిరుగుట, నోటినుండి నురగలు కారుట, నిద్రలో భయపడి అరచుట—యీ లక్షణము లుండును.

సిక్యూటా విరోసా (Cicuta Virosa) :—కంపములు సాధారణముగ యేకారణముచే గలిగినను, యేవిధముగ నున్నను పనిచేయును. అవయవములు వంకరలు తిరుగుట, వణకుట, ముఖ మెర్రబారుట, మూలుగుట, అనేకవిధము లైన వికార చేష్టలను జేయుట—యీ లక్షణములను గలిగియుండును. రోగి అజీర్ణమువల్లను, క్రిములవల్లను, గాయములవల్లను, నల్లమందు విశేషముగ వాడి యుండుటవల్లను బాధపడి యుండవచ్చును.

స్ట్రామోనియం :—భయముచే గలుగు కంపముల కమోఘముగ పని చేయును. శిశువు భయపడినచో స్వప్నములలోనే నేడ్చుటయు, వెంటనే కంపములు కలుగుటయు సంభవించును.

"I had one such case of a child who was frightened by her grandfather while he was acting Santa Claus. Her dreams and convulsions had been repeated every night for over two months Stramonium 30, five drops every four hours, cured her in five days." —Dr. *George Royal.*

ఇంతేగాక దీపము, అద్దము జూచినను, యేదైన పానీయములు త్రాగుటకు నోటివద్ద పెట్టుకున్నను కంపములు కలుగుట తటస్థించుచుండును. అట్టివాటికి కూడ నిది పనిచేయును.

"There are convulsions at the sight of a light, a mirror or water and when a cup of drink touches the lips."

—(Dr. *Blackwood's* 'Materia Medica'.)

జెల్సిమియమ్ (Gelsimium) :—నరముల సంబంధమైన వ్యాధు లన్నిటికిని, వణకెక్కువగ నున్నపుడును దీనిని తప్పక వాడదగును.

జిన్కమ్ మెటాలికమ్ (Zincum Metalicum) :—శరీరమునకు రక్తవృద్ధిచేసి లోహ (Iron) మెట్టి పుష్టిని కలిగించునో నరములకు జిన్కమ్ అట్టి పనినే జేయును. ఇదికూడ వణకుయున్నపుడు బాగుగా పనిచేయును. డాక్టరు నాష్ యిట్లు వ్రాసియున్నాడు.

"This metal seems to act principally upon the nervous system. I think it is Burt who says what iron is to the blood Zinc is to the nerves." *Leaders by Dr. Nash.*

ఇగ్నేషియా :—విచారగ్రస్తులైన పిల్లలకును, పాలిపోయి సున్నితమై (Delicate) భయపడు పిల్లలకును పనిచేయును. నిద్రనుంచి భయపడి ఉలికిపడి లేచుచుండును. శరీరము వణకుచుండును. నోటినుండి నురగలుకారును. ప్రతిరోజుగాని, రోజువిడచి రోజుగాని ఒకేకాలమునకువచ్చు ఫిట్లు (Fit) లకు పనిచేయును. ఈ మందు నరములకు సంబంధించిన వ్యాధులన్నింటికి పెట్టినదిపేరు.

కుప్రంమెటాలికం :—అవయవములయొక్క చివరభాగములు వంకరలుపోవుటతో ప్రారంభమై శరీరమంతయు వ్యాపించును. కంటిగ్రుడ్లు తిరుగు

చుండును. ముఖము వికార రూపముగను, దవడలు నొక్కుకొనిపోయి యుండును. పెదవులు నీలవర్ణముగలిగియుండును. వికారము, తరుచు వాంతి యుండును. స్మారకముండదు. బొటనవ్రేళ్ళు పిడికిలలో గట్టిగ బట్టుకొనియుండును. నిద్రలేమివల్లను, మానసిక, శారీరపరిశ్రమవల్లను, అణచిపెట్టబడిన చర్మవ్యాధులవల్లను తరుచుగ నీవ్యాధి కలిగినచో తప్పక దీనిని వాడదగును. వేడిమి వలన ఉపశాంతిగ యుండును.

ఓపియం :—భయముచే కలిగినను, మగత మలబద్ధమున్నను, ఊపిరి పీల్చుట కష్టముగాయున్నను పనిచేయును.

కాలీఫాస్ (Kali Phos) :—నరములకు సంబంధించిన వ్యాధులన్నిటికి వజ్రాయుధము వంటిది. శరీర మానసిక పరిశ్రమ లెక్కువగయున్నను, భయము, ఆదుర్దాయున్నను దీనిని వాడదగును. కంపములు, హిస్టీరియా మొదలగు వాత రోగముల కమోఘముగ పనిచేయును.

మెగ్నీషియాఫాస్ :—ఇదికూడ నరముల సంబంధమైన బాధలన్నిటికి బాగుగ పనిచేయును. కాళ్ళు చేతులు కొంకరపోవుట, ముఖకండరములు ముడుచుకొనిపోవుట, పళ్ళుబిగబట్టుట, వెర్రిచూపు చూచుట, నోటినుండి నురగలు కారుట—ఈ లక్షణములతోగూడిన కంపములకు (Convulsions) యీడ్పులకు బాగుగాపనిచేయును. దీనిని వేడినీటితో వాడినచో త్వరలో అద్భుతముగా గుణమునిచ్చును. దీనినివాడి పై లక్షణములుగల యీడ్పులను కుదిర్చితినని ఛాప్మన్ వ్రాసియున్నాడు.

కాల్కేరియాఫాస్ :—పిల్లలకు పండ్లువచ్చు సమయములోను, రక్తక్షీణమగు పిల్లలకు వచ్చు కంపములకు యీడ్పులకు పనిచేయును. దీనిని ఫిట్టు తగ్గినపిమ్మట రసాయనముగా వాడవచ్చును.

నేట్రంఫాస్ :—నులిపురుగున్నచో పనిచేయును.

ఫెర్రంఫాస్ :—ప్రారంభమున జ్వరలక్షణములకు వాడదగును.

గమనింపదగిన విషయములు :— ఈ వ్యాధియందు కడుపు, ప్రేవులు ఖాళీగాయుంచవలెను. కావున పిల్లలకు విరేచనముజేయించుట ముఖ్యావసరము. ఇందుకు గ్లిసరిన్ ఎనీమా (Glycerine Enema) చేయుట చాలమంచిది. స్మృతితప్పి పడియుండుస్థితిలో చన్నీళ్లు ముఖముమీద జల్లుటవలన ఉపయోగముండును. మరియు హారతి కర్పూరము (Camphor) గాని, యామిల్ నైట్రేటు (Amyl Nitrate) గాని వాసనచూపించినచో బాలుడు ఫిట్టు

నుండి స్మారకమునకువచ్చును. కొందరు నవాసాగరము సున్నముకలిపి వాసన చూపించుచుందురు. ఇది విశేషమైనఘాటు కలిగియుండుటచే పిల్లవాడు భరించ లేకపోవును. దీని ఘాటువలన ముక్కులదరి మంటకూడ పెట్టవచ్చును. కొన్ని చోట్ల నొకపెద్ద దురలవాటుకూడ ప్రబలియున్నది. చుట్టగాల్చి ముఖముమీద నెడమీద, రొమ్ముమీద కాల్చుదురు. ఇది యెంతమాత్రము మంచిదికాదు. దీనివలన పుండ్లుపడి పిల్లవాడు విశేషముగ బాధపడును. ఇట్టి పనుల నెంత మాత్రము ప్రోత్సహింపగూడదు. వైద్యుడు వీటిని నిరసించుటకే ప్రయత్నము జేయవలెను. రోగము నెమ్మదించిన పిమ్మట ఒకరోజువరకు రోగికి యే ఆహార మును బెట్టకూడదు. తరువాత నొకటిరెండు రోజులుకూడ ద్రవపదార్థములు, అనగా పాలు మొదలగునవి యిచ్చుట మంచిది.

## 12. మూర్ఛ (Epilepsy).

ఇది నరములకు సంబంధించిన వ్యాధి. సాధారణముగ 10, 16 సంవత్సర ముల మధ్య వయస్సు గలిగిన పిల్లలకు వచ్చుచుండును. కొందరకు యింకా తక్కువ వయస్సులోనే రావచ్చును.

లక్షణములు :—రోగము వచ్చుటకు పూర్వము ఒకవిధమైన ఆరాలు (Aurae) బయలుదేరును. అనగా వింతవింత బొమ్మలు, రంగులు కనబడు చున్నట్లు, విపరీతమైన ధ్వనులు వినబడుచున్నట్లు, క్రొత్తక్రొత్త రుచులు నోటికి తగులుచున్నట్లు, దుర్వాసన లాఘ్రాణించుచున్నట్లు, ఛాతీమీద పెద్ద బరువున్నట్లు—యిట్టి లేనిపోని భ్రమలు కలుగుచుండును. వీటివలననే రోగము వచ్చినదని గ్రహింపదగును.

ఈ జబ్బుకస్మాత్తుగ వచ్చును. నిలుచున్నవాడు స్మారకములేక భూమిమీద పడిపోవును. తరుచు పెద్దపెద్ద కేకలువేసి పడిపోవును. కంపములుకూడ యుండ వచ్చును. ముఖమునకు వికారరూపము కలుగును. గ్రుడ్లు కనురెప్పల క్రిందకు పోయి తెలుపు భాగము మాత్రమే కనపడుచుండును. వెలుతురును జూడలేక పోవును. తల వెనుకకు తిరిగిపోవును. కాళ్లు, చేతులు, తల వంకరలుతిరిగి కొట్టు కొనును. ఇందువలన రోగికి దెబ్బలు, గాయములుకూడ తగులును. నోటివెంట నురగలు కారును. నాలుక కరచుకొనును. దీనివలన పుండ్లుపడి రక్తస్రావము కూడ కలుగును. బొటనవ్రేళ్లు గుప్పెళ్లలోపట్టి గట్టిగపట్టుకొనును. పండ్లు గట్టిగ బిగబట్టి యుండును. మలమూత్రము లప్రయత్నముగ వెడలుచుండును. కొన్ని నిముషములైన పిమ్మట యీ తీవ్ర లక్షణము లన్నియు మారి రోగి కదలకుండ

పడియుండును. మగతవచ్చి నిద్రపోవును. నిద్రనుండి లేచునరికి ఖులాసాగా యుండును.

పై విధముగనే యీ రోగ మెక్కువగ వచ్చుచుండును. కాని యింతకంటె బహు తేలికగకూడ పిల్లలలో కొందరికి వచ్చుట కలదు. పిల్లవాడు తోటి పిల్లలతో నాడుకొనుచుండగ అకస్మాత్తుగ నాటమానివేసి, నిశ్చేరపడి చూచుచు స్మృతి తప్పియుండును. ముఖము పాలిపోవును. ఇట్లు సుమారొక నిమిషముండి తిరిగి యెప్పటివలె నాటప్రారంభించును. బిడ్డలకు లేతవయస్సులో నీలక్షణము కనపడినచో వెంటనే తగువైద్యము చేయించక నిర్లక్ష్యించినచో రోగము మొదటుపేరాలో వ్రాయబడిన తీవ్రరూపము దాల్చవచ్చును. కావున రోగము ముదరకపూర్వమే శిశువునకు వైద్యము జేయించవలెను.

కారణములు :— ఈ రోగము వంశపారంపరముగ రావచ్చును. లేదా క్రిములవల్లను, శారీర మానసికోద్రేకములవల్లను, మెదడునకు సంబంధించిన జబ్బులవల్లను, భయమువల్లను, అజీర్ణమువల్లను, వాతప్రకోపమువల్లను, కపాలమునకు తగులు దెబ్బలవల్లను రావచ్చును. దురలవాటులవలన, దంతరోగములవలన కూడ కొందరకు కలుగవచ్చును.

మూర్ఛకు (Epilepsy) అపస్మారమునకు (Hysteria) గల భేదములు గమనింపదగినవి. లేనిచో నొకదానికొకటి పొరపాటుబడవచ్చును :—

1. మూర్ఛలో రోగి పూర్తిగ స్మారకము తప్పియుండును. అపస్మారములో నీ లక్షణముండ నవసరములేదు.
2. మూర్ఛలో ముఖము వికారరూపము గలిగియుండును. అపస్మారములో రోగి ముఖము వికృతాకారముగ నుండక మామూలుగనే యుండును.
3. మూర్ఛలో రోగి పడిపోవుటకు పూర్వము పెద్దపెద్ద అరుపులరచును. అపస్మారములో నట్టి కేకలేమియు నుండక రోగి పడిపోవును.
4. మూర్ఛలో ఫిట్టు (fit) యొక్క తీవ్రము కొన్ని నిముషములుండిన పిమ్మట మగతవచ్చి రోగి గాఢనిద్రబోవును. అపస్మారములో నట్టి మగతగాని, నిద్రగానియుండక ఫిట్టు తగ్గగనే రోగి లేచి కూర్చొనును.
5. మూర్ఛ 15 సంవత్సరములు లోపల వయసుగలిగిన బాలబాలికలకు సాధారణముగ వచ్చుచుండును. లేతవయస్సులోనే ప్రారంభము కావచ్చును అపస్మారము సాధారణముగ 12 సంవత్సరములు దాటిన వారికిని, ముఖ్యముగ స్త్రీలకును వచ్చుచుండును.

## చికిత్స :

ఆర్టిమీషియా వల్గారిస్ (Artemisia Vulgaris):—సాధారణముగ ఆరాలులేకుండవచ్చు మూర్ఛకును, భయము మనస్తాపమువలన జనించు మూర్ఛకును, దగ్గరదగ్గరలో ఫిట్టులు వచ్చినపుడును దీనిని వాడదగును.

అర్జెంటం నైట్రికం :—అజీర్ణములతో కూడియున్నపుడు దీనిని వాడవలయును.

అమోనియం బ్రోమేటమ్ :—మెదడునకు సంబంధించిన లక్షణములను గలిగియున్నచో పనిచేయును.

ఇగ్నేషియా :—భయమువల్లను, మిక్కుటమైన మనోవిచారమువల్లను, కలిగినచో దీనిని వాడవలయును. హిస్టీరియా మొదలగు యితర వ్యాధులకు (Nervous diseases) కూడ బాగుగ పనిచేయును..

బ్యూఫో :—మర్మస్థానమందలి వ్యత్యాసములవలన కలిగినను, భయమువలన గలిగినను పనిచేయును. పిల్లలు తరుచుగ బాల్యములో చెడ్డ సహవాసములచే ముష్టిమైథునము మొదలగు దురలవాటులకు లోనగుదురు. ఆకారణముచే గలిగిన మూర్ఛలకు బాగుగ పనిచేయును.

నక్సువామికా :—మలబద్ధము, అజీర్ణము, కోపమువలన గలిగిన మూర్ఛలకు మంచిది.

ఆర్నికా :—దెబ్బలు, గాయములవలన గలిగిన మూర్ఛలకు పనిచేయును.

కుప్రంమెటాలికమ్ :—ఈడ్పులు(Spasms) యెక్కువగానున్నచో పనిచేయును.

గ్లోనోయిన్ :—ముఖమనేకరంగులుగ మారుట, ముఖ్యముగ ఫిట్టు వచ్చినప్పుడు తెల్లబారియుండును. సాధారణముగ దప్పికయుండదు.

బెల్లడోనా :—ముఖ మెర్రబారుట, నాడి వేగముగ నుండుట, తలపోటు యుండుట, ఆరాసాధారణముగాలేకపోవుట, చాలసేపటివరకు స్మృతితెలియకుండుట—యీ లక్షణములకు పనిచేయును.

సిక్యూటావిరోసా :—అవయవములు వంకర తిరుగుట, ముఖమెర్రబారుట, దవడలు నొక్కుకొనిపోవుట, నోటివెంట నురగలుకారుట, అజీర్ణము—యీ లక్షణములమీద పనిచేయును.

ఓపియం :—నిద్రలోవచ్చు మూర్ఛకు పనిచేయును.

మెగ్నీషియాఫాస్ :—తల వెనుకకు తిరిగిపోవుట, రోగి తన బొటన

వ్రేళ్ళను గుప్పెళ్ళలోబట్టుట, పళ్ళు బిగబట్టుట, కాళ్ళుచేతులు వంకరలు పోవుట, పిల్లవాడు కొయ్యగుట — ఈ లక్షణములకు పనిచేయును.

కాలీమూర్ :— ఇది ప్రధానౌషధము. అలజి (Eczema) మొదలగు చర్మవ్యాధులు వచ్చిన పిమ్మట కలుగు మూర్ఛలకు పనిచేయును. రోగి నాలుక తెల్లగాయుండును.

సైలీషియా :— రాత్రియందుగాని, అమావాస్యకుగాని యెక్కువగు మూర్ఛలకు మంచిదని నాష్ వ్రాసియున్నాడు.

"I have several times found a silicea child suffering from epileptiform spasms which were always worse at new moon. A few doses of silicea 200th set them all right."

*(Leaders by Dr. Nash.)*

రాత్రియందు, పౌర్ణమియందు ఎక్కువగు మూర్ఛలకు మంచిపనిచేయునని డాక్టర్ ఛాప్‌మన్ వ్రాసియున్నాడు.

"Spasms worse at night or near the time of full moon."

—*Chapman.*

నేట్రంఫాస్ :— క్రిములవలన గలిగినచో పనిచేయును.

కాలీఫాస్ :— వాతరోగములకు (Nervous diseases) దివ్యౌషధము. వీటికన్నిటికి మంచిపనిచేయును.

కాల్కేరియాఫాస్ :— ముష్టిమైథునము మొదలగు దుర్గుణముల కలవాటు పడిన బాలురకును, రక్తహీనులగు పిల్లలకును గలుగుమూర్ఛలకు పనిచేయును.

సోలేనంకారోల్ :— ఋతుకాలమందు వచ్చు మూర్ఛలకు మంచి పని చేయును.

జెల్సిమియమ్ :— హృదయ దౌర్బల్యముతోకూడిన వాతరోగముల కన్నిటికి మంచిది.

హాయోసియామస్ :— రోగి తన్నుకొనుట, వంకరలుపోవుట, నోటినుండి నురగకారుట, నాలుక కరచుకొనుట — ఈ లక్షణములుగల ఫిట్లులకు పనిచేయును. ఈ రోగి యిటుఅటు తన్నుకొని చివరకు కదలక పడియుండి నిద్రపోవును. డాక్టర్ డ్యూయీ యిట్లు వ్రాసియున్నాడు.

"Epileptic spasms with jerking, twitching and frothing at the mouth followed by sleep; patient bites his tongue"

ఇవిగాక జింకంఫాస్, కాల్కేరియా కార్బ్ కూడా పనిచేయును.

గమనింపదగిన విషయములు :—ఈ రోగికి సత్ప్రవర్తన, సత్సాంగత్యము, సత్సంభాషణ ప్రాముఖ్యమైనవి. ఉద్రేకమును గలిగించు కోపము, దుస్సాంగత్యము, దుర్భాషలు పనికిరావు. పిల్లవానికి దేనియం దెక్కువ అభిలాష యుండునో కనిపెట్టి వాని మనస్సు ఉల్లాసముగను, జీవితము శాంతముగను, ఆనందముతోను, ఉత్సాహముతోను గడుపునట్లు చూచుచు, అందుకు తగిన మార్గములను తలిదండ్రులుగాని, వైద్యుడుగాని యోచించుచుండవలెను. రోగి మనస్సు విచారముతోగాని, వాని జీవితము నిరుత్సాహముగాగాని, సోమరితనముగాగాని యుండరాదు. మనోపరిశ్రమ యెక్కువగా పనికిరాదు. మరియు ఉద్రేకమును కలిగించు పదార్థములు (కాఫీ, పుగాకు మొదలగునవి) వర్జనీయములు. లఘుపదార్థములను తేలికగా భుజించుచుండవలెను. పండ్లు, శాకాహారములు మంచివి. రోగికి ముఖముపై శీతలోదకమును జల్లుట మంచిది.

## 13. నృత్యవాతము లేక కోరియా

## Chorea or St. Vitas's Dance.

పైన వ్రాయబడిన రెండు వ్యాధులవలె నిదికూడ తరుచు పిల్లలకు జనించు నొక వాతరోగము. ఈ వ్యాధి పెద్దవారికంటె పిల్లలలోను ; బాలురకంటె బాలికలలోను తరుచు కలుగుచుండును. సాధారణముగ 15 సంవత్సరములు లోపల వయస్సుగలిగిన పిల్ల లీ రోగముచే బాధపడుచుందురు. దీనినిబట్టి పై వయస్సు దాటిన వారికి రాదని భావము కాదు.

లక్షణములు :—ప్రారంభమున రోగి నిరుత్సాహముగ, విచారముగ, స్థిమితములేక యుండును. ముఖము వికారరూపము గలిగియుండును. అవయవములు మెలివేసుకొని, వంకరలుతిరిగి చంచలచలనము గలిగియుండును. కదుపుటకు రోగి ప్రయత్నించినకొలది వంకర లెక్కువగును. అవయవములేమియు స్వాధీనములో నుండవు. రోగి తనచేతిని నోటివద్దకు తీసుకొని వెళ్ళుటకు ప్రయత్నించినచో, ఆచేయి నెత్తిమీదికిగాని ముఖముమీదికిగాని పోవును. నడచుటకు ప్రయత్నించినచో కాలువెనుకకుగాని, ఒకప్రక్కకుగాని పోవును. మాట్లాడుటకు ప్రయత్నించినచో మాట సరిగరాదు. చేతితో దేనిని పట్టుకొనలేకపోవును.

వ్యాధి ముదరనిచో చలనములన్నియు (Movements) నిద్రలో నాగిపోవును. కాని వ్యాధి ముదిరినచో పై లక్షణములయొక్క ఉధృత మెక్కు

వగును. రోగి అతి ప్రయాసతోగాని కూర్చుండలేడు, పరుండలేడు, నడువ లేడు, మాట్లాడలేడు, భుజించలేడు. ఉచ్ఛ్వాసనిశ్వాసములు సైతము కష్టమే. ఊపిరి సరిగారాక నిద్రకూడ పట్టదు. అదియునుగాక నిద్రలోకూడ అవయవ ములప్రయత్నముగ కదలుచున్నచో రోగతీవ్రతను దెలియజేయును.

ఈ రోగము పెద్దవారలకు కలిగినచో, నిద్రాభంగము, సంధి, పిచ్చిపిచ్చి భ్రమలుండి శరీరోష్ణము 104°, 105° వరకు హెచ్చి ప్రాణాపాయముకూడ కలుగవచ్చును.

కారణములు :—సాధారణముగ నత్తివానినిజూచినను, కుంటివానినిజూచి నను వాని ననుకరించుట (Imitate) పిల్లల స్వభావము. అనుకరణమే స్థిరమైన యలవాటగుచుండును. ఇదిగాక ముఖ్యకారణము లెవ్వియన, శిశువునకు బలకర మగు పోషణలేకపోవుట, అనారోగ్య పరిస్థితులలో పెంచుట, అజీర్ణ దోష ములు, మలబద్ధము, క్రిములు, పండ్లజబ్బులు, రక్తహీనము, భయము, విచారము, ఋతుస్రావము సరిగలేకపోవుట, పొంగు, కోరింతదగ్గు, మేహవాతపు జబ్బులు మొదలగునవి కొన్ని యీ రోగమునకు ముందు వచ్చియుండవచ్చును. తల్లులు హిస్టీరియా రోగులైనచో పిల్లలకీ వ్యాధి రావచ్చును. శీతోష్ణ స్థితిని బట్టియు, ఋతువులను బట్టియుకూడ రావచ్చును. వసంతఋతువులో రోగ మెక్కువగుచుండవచ్చును. మనోపరిశ్రమ యెక్కువగయున్నను, నీతిబాహ్య మైన ప్రవర్తన గలిగియున్ననుకూడ నీ వ్యాధి జనించవచ్చును.

## చికిత్స :

ఆక్టియా రేసిమోసా (Actea Racemosa):—రోగము యెడమ ప్రక్కన యెక్కువగునపుడు—అనగా యెడమ కాలు, యెడమ చేయి, ముఖముయొక్క యెడమ పార్శ్వము వంకిరలు తిరిగి కదులుచున్నప్పుడు— మనస్థిమితములేక ఒక విషయమును గురించి మాట్లాడుచు రెండవ విషయములోనికి దిగుట, అతి ధోరణి కలిగియుండుట—యీ లక్షణములకు పనిచేయును. రజస్వలకాలమందు బాలికలకు వచ్చుదానికికూడ పనిచేయును. మేహవాతమువల్లను, ఋతు దోషమువల్లను కలిగినచో బాగుగా పనిచేయును. దీనిని వాడినచో ఋతు స్రావము సరిగా వెళ్ళుచు, వ్యాధి నెమ్మదించును. దీనిని గురించి యీ క్రింది విధముగా వ్రాయబడెను.

"Dr. Hale-Cimicifuga :—It is useful both in 'Fright chorea' and in many cases of chorea appearing just before

or at puberty in girls. Cimicifuga, given freely, will bring on the menses, after which chorea will improve. It will cure chorea in older girls when it appears only before and during menses."

—(Diseases of children. by *Dr. Tooker.*)

"Fear of going crazy and loquacity with frequently changing from one subject to another."

—*Dr. George Royal.*

ఇగ్నేషియా :—ఇదికూడ రోగ మెడమప్రక్కన యెక్కువగునపుడు పనిచేయును. కోపముచేగాని, విచారముచేగాని కలిగినను, భోజనానంతర మధికమైనను వాడదగును. ఈ రోగి సదా విచారముతోనుండి ఒంటరిగా నుండును. టూకర్ యిట్లు వ్రాసియున్నాడు.

"Ignatia is useful when the left side is mainly affected etc."

కాస్టికమ్ :—కుడివైపున రోగ మెక్కువనున్నపుడు పనిచేయును.

సినా :—క్రిములవలన గలిగినచో వాడదగును.

పల్సటిల్లా :—రజస్వల సమయములో బాలికల కీవ్యాధివచ్చినచో బాగుగ పనిచేయును.

టెరెంట్యూలా:—కుడికాలు, కుడిచేయి కదలికయున్నపుడు వాడదగును. స్త్రీలకు బాగుగ పనిచేయును.

జిన్కమ్ (Zincum) :—భయముచే కలిగినచో వాడదగును.

స్కుటల్లేరియా (Scutallaria) :—విశేషమైన చదువు (Over-study) వలన పిల్లలకు కలిగినను, నిద్రలేమివలన స్త్రీలకు కలిగినను పనిచేయును.

మైగేల్ (Mygale) :—ముఖ మెఱ్ఱబారి, ముఖకండరములు వంకరతిరిగి యుండును. నోరు, కండ్లు, నిమిషనిమిషమునకు మూయుచు తెఱచుచుండుట, చేయి ముఖమువద్దకు తీసుకొని వెళ్లుటకు ప్రయత్నించినను విఫలమగుట, కూర్చుండినను కాళ్ళెప్పుడు కదలుచుండుట, నడచుటకు ప్రయత్నించినచో కాళ్లీడ్చుట– ఈ లక్షణములకు పనిచేయును. నిద్రించునపుడు శాంతిగనుండి, ఉదయమున లేచుటతోడనే రెట్టింపు యుద్రేకముతో వచ్చుచుండును. డాక్టరు డ్యూయీ యీ విధముగా వ్రాసెను.

"In chorea where there are twitchings of the facial muscles, irregular convulsive movements of one side of the body, the words are jerked out, the movements cease during sleep, but return more violent in the morning"

—*Dr. Dewey.*

అగేరికస్ (Agaricus) :—ముఖము, కనురెప్పలు వంకరులు తిరుగును. శరీర మంతయు నాట్యము చేయుచుండును. ఈ చలనము లన్నియు రోగి నిద్ర పోవు సమయములో నాగిపోవును. దీని లక్షణము లన్నియు పెద్ద యురుములతో కూడిన తుపాను సమయమున ఉద్రేకించుచుండును. బ్లాక్‌వుడ్ యిట్లు వ్రాసియున్నాడు.

"It is indicated when there is twitching and nictitation of the eye-lids...and a dancing of the whole body. The involuntary movements cease while the patient is asleep; the symptoms are worse during thunder-storm."

—*Blackwood.*

ఎకోనైట్ :—భయముచే కలిగినపుడు, జ్వర ముండినపుడు పనిచేయును.

నక్సువామికా :—అజీర్ణ దోషములు, మలబద్ధ ముండినచో పనిచేయును.

జెల్‌సిమియం :—హృదయ దౌర్బల్య మున్నపుడు యీ వ్యాధిలో పని చేయును.

వెరాట్రుంవిరైడ్ :—కండపుష్టికలిగి బొద్దుగానున్న ఆడపిల్లలకీ వ్యాధి వచ్చినపుడు వాడదగును.

స్ట్రెమోనియమ్ (Stramonium) :—రోగము తీవ్రరూపము దాల్చినపుడు బాగుగ పనిచేయును. ఉదా:-13 సంవత్సరముల బాలిక. ప్రతిఅవయవము కదులుచుండెను. కాళ్ళు, చేతులు, శరీర మంతయు నొక ప్రక్కనుంచి మరియొకప్రక్కకు అప్రయత్నముగ తిరుగుచుండెను. ముఖము వికృతరూపము గలిగియుండెను నాలుక బయటకు చాచుచుండెను. కండ్లు తేరిపారిచూచుచుండెను. త్రాగుటకు, మాట్లాడుటకు ప్రయత్నించినచో లక్షణము లెక్కువగుచుండెను. స్వచ్ఛముగ మాట్లాడలేకుండెను. గుటకవేయలేదు. రక్తక్షీణము, రాత్రులు కొద్ది నిద్ర. ఈ లక్షణములుగల రోగికి స్ట్రెమోనియం 6 యిచ్చి కుదిర్చితినని జార్జి రాయల్ వ్రాసియున్నాడు.

—(Diseases of the Brain and Nerves)

హాయోసియామస్ :—నరములకు సంబంధించిన వ్యాధులలో నిదికూడ పనిచేయును. కంపములకు, యీడ్పులకు మంచిది. సంధికూడ యుండును.

"Every muscle in the body twitches, from the eyes to the toes."

మెగ్నిషియాఫాస్ :—శరీరమున యే భాగమున, ఏ విధమైన యీడ్పులు (Spasms) వచ్చినను, అవయవము అప్రయత్నముగ కదులుచున్నను, దీనిని తప్పక వాడవలయును. నరములకు సంబంధించిన వ్యాధులన్నింటికి ప్రధానౌషధము.

కాలీఫాస్ :—ఈ రోగమునకు బాగుగా పనిచేయును. మనోవ్యాకులత, కుదురులేకపోవుట, నరముల బలహీనతయుండును. వాతరోగములన్నిటికి దివ్యౌషధము.

కాల్కేరియాఫాస్ :—రక్తక్షీణమై, పాలిపోయిన పిల్లలకు మంచిది.

నేట్రంఫాస్ :—క్రిములవలన కలిగినను, అజీర్ణదోషములున్నను అద్భుతముగా పనిచేయును.

ఉదా :—12 సంవత్సరముల బాలుడు. ఒక్కనిమిషమైనను కుదురులేదు. నేలమీద పడిపోవుట, అవయవములు వంకరలుపోవుట, నురగకారుట—ఈ మొదలైన గుణములుండెను. పిల్లవానిమీద ఆశ వదలుకొనిరి. ఆ స్థితిలో మెగ్నిషియాఫాస్, కాలీఫాస్ ఒకదాని తరువాత నొకటి వాడుచు, మధ్యమధ్య కాల్కేరియాఫాస్ వాడబడెను. ఆరుమాసములలో రోగము పూర్తిగ నెమ్మదించెను. తిరిగి కనుపించలేదని ఛాప్‌మన్ వ్రాసియున్నాడు. (Biochemistry)

ముఖ్యముగ గమనింపదగిన విషయములు :—శాంతము, విశ్రాంతి, నిద్ర— ఇది యీ రోగమునకు ముఖ్యమైన చికిత్సలు. రోగము సాధారణ లక్షణములను కలిగియున్నచో కొద్దిపరిశ్రమ దీసుకొనవచ్చును. కాని రోగము తీవ్రమైనచో రోగిని పరుండబెట్టియే యుంచవలెను. పరిశుభ్రమైనగాలి తగులనియ్యవలెను. అవసరమైనచో స్థలమార్పుగూడ చేయవలసియుండును. దుస్తులుకూడముఖ్యము. జార్జి రాయల్ యిట్లు వ్రాసియున్నాడు.

"Quiet rest and sleep are the three important elements in the treatment of chorea. For the milder forms, rest need not mean confinement in bed, for a little well regulated exercise is often beneficial. In the severe forms, however rest in bed is essential. Plenty of fresh air in

the sick room is advisable. Change of climate is also necessary in some cases. Dress is important, especially for cases complicated with rheumatism. Flannel under wear during the fall and spring season is desirable."

(Diseases of the Brain and Nerves by — *George Royal* )

ఇంతేగాక పిల్లలను బడికి పంపుట మానవలెను. వారికే విధమైన శ్రమ యుండరాదు. ఇతరులు వారిని హేళనచేసినచో మనస్తాపమును బొందుదురు. దీనివలన తీరని యపకారములు ముందుముందు కలుగును. ఆవేశపూరితములగు పుస్తకము లెన్నడును జదువకూడదు. దీనినే డాక్టర్ బార్ట్లెట్ వ్రాసి యున్నాడు.

"The child should be taken from school and all study interdicted. Every thing that can be done to restrain under nervous activity must be enforced. These patients are very sensitive to ridicule, and their experiences at this time may have serious effect on their subsequent lives. Their presence in the school-room is also prejudicial to such of the other scholars as have hysterical temperment"

(Text,book of Clinical Medicine—Treatment. P. 965. by —*Clarence Bartlett*.

పథ్యము :—ఎక్కువ రక్తవృద్ధిచేయు నాహార మిచ్చుచుండవలెను. కాడ్ లివర్ఆయిల్ చాల మంచిపనిచేయును. మందులకుతోడు బలమైన ఆహార మిచ్చినచో త్వరలో గుణమిచ్చును. రసాయనములు (Tonics) బాగుగ వాడవలయును. లోహముతో (Ferrum) గలిసిన ఔషధములు వెంటనే గుణ మిచ్చును. శాకాహారము, పండ్లు చాల శ్రేష్ఠము. ఇంతేగాక మలబద్ధమును నశింపజేయు నాహారమును వాడుచుండవలెను. ఇంకను మలబద్ధ మున్నచో, మలమును వెంటనే బయటకు వెళ్ళగొట్టుచుండవలెను.

## 14. ధనుర్వాతము Tetanus.

ఇది పిల్లలలోను, పెద్దలలోనుకూడ జనించు నొక వాతరోగము. పిల్లలలో నిది యెక్కువ ప్రమాదకరము.

లక్షణములు :—వాతప్రకోపముచే శరీరము-ముఖ్యముగ మెడ, శిరస్సు వెన్నెముక-ధనస్సువలె వంగియుండును. పండ్లుకొరుకుట, ఆవలింతలు, నోటి

నుండి -నొల్లుకారుట, అవయవములన్నియు బిగబట్టుట, కండ్లు కదపలేక పోవుట, దవడలు నొక్కుకొనిపోవుట, మాట్లాడలేకపోవుట— ఈ లక్షణము లను గలిగియుండును. దవడలు నొక్కుకొనియుండుటచే దీనికి నాంగ్లమున Lock-jaw అనికూడ పేరుకలదు. మెడనరములు స్తంభించి నమలుచున్నట్లు బాధయుండును. ముఖము భయంకరాకారము కలిగియుండును.

ఈ వ్యాధి నెమ్మదించుటయే కష్టము. నెమ్మదించినను రోగికి అంగవైకల్య మేర్పడును.

కారణములు :— ఆరోగ్య విధులను గమనించకపోయినను, శిశువునకు సరియైన పోషణ లేకపోయినను, రికెట్సు (ఎముకలకు సంబంధించిన వ్యాధి) చే బాధపడినను, జననకాలమందు నాభినాళము ఛేదించుటలో పరిశుభ్రత గమ నించకపోవుట మొదలగు లోపములున్నను, దెబ్బగాని గాయముగాని తగిలి నను, శీతగాలి యెక్కువగ సోకినను, స్త్రీలైనచో చన్నీళ్ళతో ఋతుస్నానము జేసినను, సాధారణముగ యీవ్యాధి జనించుచుండును.

## చికిత్స :

సిక్యూటావిరోసా :—రోగి అనేక వికృతాకారములుగ మారును. శిరస్సు మెడ, వెన్నెముక వెనుకకు వంగియుండును. శరీరమంతయు బిగబట్టియుండును. ధనుర్వాతరోగమునకు ప్రధానౌషధము. తలమీదగాని, ముఖముమీదగాని దెబ్బతగిలినదానికికూడ పనిచేయును. నోటివెంట నురగలు కారుచుండును.

ఆర్నికా :—దెబ్బలవలనగాని, గాయమువలనగాని, బొడ్డుకోయుటలో కలుగు లోపమువలనగాని జనించిన ధనుర్వాతమున కద్భుతముగాపనిచేయును.

రూస్టాక్సు :—శరీరమంతయు మొద్దుబారియుండును. స్థిమితము లేక పోవును. పసుపుపచ్చని విరేచనములుండును. ఈ లక్షణములకు బాగుగ పనిజేసె నని జార్జి రాయల్ వ్రాసియున్నాడు.

హైపెరికమ్:—నరములకు దెబ్బలుతగిలినను, కాలిలో మేకు దిగినను జనించు వాతమునకు పనిచేయును.

నక్సువామికా :—స్మారకముతో కూడిన కంపములకును (convulsions) శరీరము వెనుకకు వంగిపోయినపుడును పనిచేయును.

కుప్రం :—వాతరోగము లన్నిటికిని పనిచేయును. ఈడ్పులకు మంచిది.

ఆర్సెనికమ్ :—కుదురులేకయున్నను, నిస్త్రాణ అధికముగా యున్నను,

నాడీమండలముమీద (Nervous system) బాగుగా పనిచేయును.

"Arsenicum also affects profoundly the nervous system. To the characteristic restlessness, is added great prostration." —*Nash*

కాలీఫాస్ :—వెన్నెముకయందు బాధయున్నను, ఆవలింత లెక్కువగ యున్నను, రోగిని నిరాశచేసుకొన్నపుడును బాగుగ పనిచేయును.

మెగ్నీషియాఫాస్ :—వాతనొప్పులకు యీడ్పులకు, కంపములకు మంచిది. యీ రెండు లవణములు వాతరోగములలో (nervous diseases) ప్రధానమైనవి.

ఇవిగాక పాసిఫ్లోరా ఇన్‌కార్నటా (passiflora incarnata) లైకోపోడియమ్, యామిల్‌నైట్రోస్, ఏకోనైట్, సొలానమ్ కారోల్, ఫాస్ఫరస్ కూడ వాడుచుందురు.

గమనింపదగిన విషయములు :—రోగికి విరేచనబద్ధము లేకుండ చూచుట ముఖ్యము. కంపములు తగ్గిన పిమ్మట పుష్టిగల ద్రవపదార్థములను మాత్రమే యివ్వవలెను. గాయములవలన నీ రోగము కలిగినచో గాయములలో అన్య పదార్థ మేమియు లేకుండ చూచుచు పుండును పరిశుభ్రముగా హైపరికమ్ ద్రావకముతో కడుగుట మంచిది. పాలిచ్చు తల్లికి వచ్చినచో శిశువును స్తన్యపానము మాన్పించవలెను.

## 15. రికెట్స్ Rickets.

ఇది పిల్లలకు వచ్చు యెముకలకు సంబంధించిన వ్యాధి. సాధారణముగ $1\frac{1}{2}$, 2 సంవత్సరముల వయసుగల బిడ్డలకు వచ్చుచుండును.

లక్షణములు :—జీర్ణకోశము చెడిపోవుటచే బిడ్డలభివృద్ధిపొందక ఎముకలు బలహీనమగును. అందుచే అవయవములు లోపలికి వంగియుండును. ప్రారంభ దశలో కొద్దిజ్వరమువచ్చును. కుదురులేక యుండుట (Restlessness) పాలిపోవుట, శరీర మెండిపోవుట, భయము, ఆకలి తరుచు యెక్కువగుట, నీరసము, విరేచనబద్ధము లేక అతిసారము—ఈ లక్షణములు కలిగియుండును. రోగము ముదిరినకొలది తల పెద్దదగుట, పొట్ట పెరుగుట, యితర అవయవము లన్నియు కృశించియుండుట, అతినీరసము, వెన్నెముక వంగియుండుట—ఈ లక్షణములుకూడ వృద్ధియై ప్రమాదావస్థలోనికి దింపును. ఎముకలు మృదువుగ

(soft) నుండుటచే బాలుడు సరిగ నిలుచుండలేడు. ఇతరులసహాయము లేనిదే లేవలేడు. నడువలేడు. నడచుటకు ప్రారంభించు సమయమందే సాధారణముగ నీవ్యాధి జనించుచుండును. కాని కొందరికి నడకవచ్చినపిమ్మటకూడ యీవ్యాధి రావచ్చును. దంతము లాలశ్యముగ మొలకెత్తును. మస్తకమునందలి (skull) యెముకలకు మధ్యనుండు ఖాళీలు తెరచియేయుండును. రాత్రియందు తలమీద చెమటలు పోయును.

కారణములు :—శిశువు గర్భమునందుండగ తల్లి అగ్నిమాంద్యము (Dyspepsia) చే బాధపడినను, తల్లి తగు పరిశ్రమజేయక తనశరీరము నతి సుకుమారముగ పెంచినను, శిశువునకు సరియైన పోషణలేకపోయినను, తగినంతగాలి, వెలుతురు లేక తేమ యిండ్లలో నివసించినను, శిశువుయొక్క జీర్ణకోశము చెడిపోయి యీ వ్యాధి కలుగుచుండును.

## చికిత్స :

కాల్కేరియాకార్బ :—తల పెద్దదగుట, ఆకలి యెక్కువగ యుండుట, మలబద్ధము, శిశువు ముసలిరూపు కలిగియుండుట, పళ్ళు త్వరలోచెడిపోవుట, తలమీద చెమటలుపోయుట—ఈ లక్షణములున్నపుడు దీనిని వాడదగును.

ఫాస్ఫరస్ :—పోషణ సరిగలేక రక్తహీనమై, కాళ్ళుచేతులు బలహీనమై నడచుటకుగాని, యేదైన పట్టుకొనుటకుగాని శక్తిలేనివారలకు, తల్లిదండ్రులు క్షయరోగ పీడితులైయున్నను యిది పనిచేయును.

బారిటా కార్బ (Baryta Carb) :—సరియైన అభివృద్ధి లేనపుడు పనిచేయును. శారీరకముగగాని, మానసికముగగాని పిల్లవాడు చాల నీరసించియుండును. పిల్లవాడు పిచ్చివానివలె యుండును. తల, పొట్ట పెద్దవైయుండి, యితర భాగము లన్నియు కృశించియుండును. ఆకలి యెక్కువగాను యెంత తిన్నను నీరసముగాను యుండును. మరుగుజ్జు పిల్లలకు మంచిది.

కాల్కేరియాఫాస్ :—ఎముకలకు సంబంధించిన బాలరోగము లన్నిటికి దివ్యౌషధము. ఇది పిల్లల పాలిటి సంజీవి. ఈ రోగమునకుగల లక్షణము లన్నిటికి—అనగా కృశించిపోవుట, జీర్ణశక్తి తగ్గిపోవుట, నీరసము, మలబద్ధము లేక అతిసారము, తల పెద్దదగుట, పొట్ట పెరుగుట, వెన్నెముక వంగియుండుట—ఈ గుణము లన్నిటికి అద్భుతముగా పనిచేయును. ఎముకలను గట్టిపరచి, చక్కగ పెరుగునట్లు చేయుటయేగాక జీర్ణకోశమును బాగుచేయును. కాళ్లు వెన్నెముక వంగినను, మస్తకమునందలి యెముకలమధ్య-ఖాళీలు మూసుకొనక

పోయినను, బాగుగ పనిచేయును. కృశించిపోయిన పిల్లలకు దీనికి తగిన మందింకొకటి లేదు.

This is the great remedy in bone diseases, as the phosphate of lime so largely predominates in bone structure. When the bones are weak and soft, Calcarea Phos will strengthen them. Bow-legs in children; rickets, spinal curvature etc."

"Chief remedy in this disease, owing to the disturbance in the lime molecules. Calcarea Phos is pre-eminently a child's remedy, on account of the formation of cartilage into bone. In any of the ailments of infancy no mistake will be made if Calcarea Phos is prescribed."

—*Chapman's* Biochemistry.

సైలీషియా :—ఈ రోగమున కద్భుతముగ పనిచేయును. గండమాలవ్యాధి గల పిల్లలకు (Scrofulous children) బాగా పనిచేయును. తలపెద్దదగుట, పొట్టపెరుగుట, సీలమండలు కృశించియుండుట, తిన్నగ నడవలేకపోవుట, జీర్ణశక్తి తగ్గిపోవుట, శరీర మెండిపోవుట—ఈ లక్షణములను గలిగియుండును. తలమీదగాని, పాదములమీదగాని చెమటలుపోయును.

ఇవిగాక ఫెరెడియమ్, యాసిడ్‌ఫాస్, కేమోమిల్లా, మెర్క్యూరియస్, కాలీఫాస్‌కూడ వాడవచ్చును.

## ఉదాహరణములు :

1. ఒకశిశువు 4 సంవత్సరముల వయస్సు. తలపెద్దది, ఇతర అవయవములేవియు అభివృద్ధిలేదు. దంతములు రాలేదు. మెడకృశించిపోయి, సన్నముగ నుండుటచే పటుత్వమేలేదు. తల నిలుపలేదు. సహాయములేనిదే కదలలేదు. కూర్చుండలేదు. ఏమియు తినలేదు. తినవలెననికూడ తెలియదు. వెన్నెముక చంద్రవంకవలె వంగియున్నది. ముఖము పాలిపోయెను. ఈ స్థితిలో కాల్కేరియాఫాస్, కాలీఫాస్ ఒకదాని తరువాత నొకటి ఆరువారములు వాడిన పిమ్మట, అద్భుతమైన మార్పుగలిగి శిశువు తనంతటతాను నడవగలిగెను.

— *Chapman.*

2. మూడు సంవత్సరముల శిశువు. ఎముకలు గట్టిలేక అతి మృదువుగానుండెను. మస్తకములోని యెముకలమధ్య ఖాళీలుండెను. పళ్ళుబాగా రాలేదు.

సహాయములేనిదే నిలువలేదు. కాల్కేరియాఫాస్, నేట్రంమూర్ వలన బాగుగా నడవగలిగెను.

— *Chapman.*

3. మూడు సంవత్సరముల వయస్సుగల శిశువు. జీర్ణశక్తి క్షీణించెను. కాళ్ళు కృశించిపోయెను. అతి నీరసము. సహాయములేనిదే నిలువలేకుండెను. కాల్కేరియాఫాస్ రెండుమాసములు వాడితిని, శిశువు నడవగలిగెను. ఆరోగ్యముగ నుండెను. తలిదండ్రుల కానందము గలిగెను.

గమనింపదగిన విషయములు :—శిశువును, పరిశుభ్రమైన గాలి వెలుతురు గలిగియుండి తేమలేని యిండ్లలో నుంచవలెను. పోషణ సరిగాజేయుచు, శిశువునకు మంచి యాహార మిచ్చుచుండవలెను. వానిని బయటకు పోనిచ్చి స్వేచ్ఛగ నాడుకొననియ్యవలెను. కొందరు భాగ్యవంతులు తమ బిడ్డలకు చిన్నతనము నుంచి పాదములకు జోళ్ళను తొడగి, వారిని స్వేచ్ఛగ నాడుకొననివ్వక అతి గారాబముతో పెంచుదురు. యితర పిల్లలతో ఖులాసాగా బయట వీధులలో నాడుకొననిచ్చుట మర్యాద భంగమనియు, దర్జాకు లోటనియు భావింతురు. ఇట్టి లేనిపోని దర్జాలకు లోనై భాగ్యవంతులు కొందరు తమ పిల్లల ననారోగ్యవంతులుగజేసి పాపము గట్టుకొనుచున్నారు.

## 16. స్కార్లెట్ జ్వరము Scarlet fever.

ఇది యొకవిధమైన అంటువ్యాధి. సాధారణముగ 2 మొదలు 6 సంవత్సరముల వయస్సు గలిగిన పిల్లలకు వచ్చుచుండును. ఒక పిల్లవానికి తరుచు రెండవ పర్యాయము రాదు.

లక్షణములు :—ఈ వ్యాధికి నాలుగు దశలు.

మొదటి దశ :—చలి, వణుకు, జ్వరము, గొంతుక నొప్పి, వాంతి, అతిసారము, తలనొప్పి, గ్రంథులు వాచుట, యేమియు మ్రింగలేకపోవుట, దప్పి, యెర్రని రంగుగల కొద్ది మూత్రము—యీ లక్షణములతో వ్యాధి ప్రారంభమగును. పొంగులో దగ్గు యేలాగో, యీ వ్యాధిలో గొంతుక నొప్పి (Sore throat) ఆలాగే ముఖ్యలక్షణము. గొంతుక యెర్రగనుండును. కాని పుండ్లు యుండవు. ఇవన్నియు స్వల్పముగ తేలిపోవు వ్యాధి లక్షణములు. తీవ్రమైన వ్యాధిలో పుండ్లు యుండును. శిశువునకు కంపములుకూడ కలుగవచ్చును. శరీరోష్ణము 105° వరకును, నాడి 150, 180 వరకును యుండును.

రెండవ దశ :—రెండవ రోజున యెఱ్ఱని పొక్కులు (Rash) బయలు దేరును. ఇవి ఛాతిమీద మొదటకనపడి, ముఖమునకు, మెడచివరకు, ఒక రోజులో శరీరమంతయు వ్యాపించును. ఈ పొక్కులు మిక్కిలి మెఱ్ఱగాను, గుంపులుగాను లేచును. శరీరమంతయు ఖాళీలేకుండ యెఱుపెక్కును. దురద యెక్కువగ యుండును. కంటిలోని తెలుపు సైతము యెఱ్ఱబడును. నాలుక మధ్యభాగము తెల్లగయుండి చుట్టు యెఱ్ఱగనగును. ఈ యెరుపురంగధికముగ శరీరమంతయు వ్యాపించుటచే నీ రోగమునకు స్కార్ లెట్ అనగా నొకవిధ మైన యెరుపు రంగు.

మూడవదశ :—రోగతీవ్రత 5, 6 రోజులవరకుయుండి, తరువాత తగ్గుట ప్రారంభమగును. యెనిమిదవరోజునగాని, తొమ్మిదవరోజునగాని తగ్గును.

నాల్గవదశ :—ఆఖరుదశలో చేతులు, పాదములు, ముఖము, శరీరమంతటి నుంచి పొరలు క్రిందరాలిపడిపోవును. మొత్తము, రోగము బాగుగ నెమ్మదించు టకు 15 దినములు పట్టును. రోగము తీవ్రమైనచో జ్వరముతోపాటు సంధి కూడ యుండవచ్చును.

ఈ రోగములో మధ్య జ్వరము తీవ్రముగా నున్నపుడు ముక్కునుండి రక్తముకూడ పడవచ్చును.

కారణములు :—పక్కులు రాలిపోవునపుడు రోగి రక్తములోనున్న విష పురుగులు గాలిలో ప్రవేశించి యితరుల కీవ్యాధి సోకుచుండును. అదిగాక కొన్ని యావుల కీవ్యాధి లక్షణములుండుననిన్నీ, వాటిపాలను త్రాగినపిల్లల కీరోగము తగులుననిన్నీ వ్రాసియున్నారు. పుస్తకములద్వారాగాని, బట్టల ద్వారాగాని యీవ్యాధి సోకవచ్చును. ఈ క్రిములు గోడలను, యింటిలోని సామగ్రుల నంటిపెట్టుకొని, తద్వారా యీవ్యాధిని వ్యాపింపచేయుననికూడ వ్రాసియున్నారు.

## చికిత్స :

ఎకోనైట్ :—ప్రారంభదశలో జ్వరమున్నపుడు పనిచేయును.

బెల్లడోనా :—ఇది ప్రధానౌషధము. ఈ రోగమున కమోఘముగ పని చేయును. కండ్లు, గొంతుక ఎఱ్ఱబడి మండుట, సంధి, కంపములు, దప్పి, తల నొప్పి, నిద్రలేమి, స్థిమితము లేకపోవుట—ఈ లక్షణములకు పనిచేయును. దీనిని ఎకోనైట్తో మొదటి దశలో వాడదగును. గొంతుక వాచి, పుండ్లు, మంట యున్నపుడు మెర్క్యూరియస్ వాడదగును.

మెర్క్యూరియస్:—గొంతుకలో పుండ్లు, నోటినుండి నీరుకారుట, మ్రింగ లేకపోవుట, ముక్కునుండి దుర్వాసనగల నీరుకారుట-యీ లక్షణములకు పనిచేయును.

అమోనియా కార్బ్:—శరీరమంతయు సందులేకుండ యెఱ్ఱబడియుండును. బాధయంతయు గొంతుకలో కేంద్రీకరించి యుండును. ఇదియే యీ రోగము నకు ముఖ్యలక్షణము.

జిన్కమ్ :—రోగి దుర్బలుడైయుండి, పొక్కులుగాని, బొబ్బలుగాని పైకి లేవక యున్నపుడు శరీరముమీద కనబడనపుడు వాడదగును.

కుప్రమ్ :—పొక్కులు లేచును. కాని యితర కారణములచే నవి యణగి పోవును. అంతేకాని స్వాభావికమార్గము ననుసరించి కాలపరిమితిదాటిన పిమ్మట రాలిపోవుట యుండదు. అటువంటి సమయములో దీనిని వాడదగును.

అయిలేంథస్ గ్లాన్డ్యులోసా (Ailanthus Glandulosa) :—వ్యాధి యొక్క విషమపరిస్థితులలో నిది వజ్రాయుధమువంటిది. శరీరము ధూమ్ర వర్ణము, పొక్కులు యెరుపు నలుపు కలసిన రంగు, తీవ్రజ్వరము, నాడి వేగము, దప్పి, సంధి, మగత, కండ్లు రక్తవర్ణము, కనుపాపలు పొంగరించుట, మలమూత్రము లప్రయత్నముగ వెడలుట, అవయవాగ్రములు, ముక్కు చల్లగ నుండుట, నాసికనుండి దుర్గంధయుక్తమైన ద్రవము స్రవించుట—యిట్టి విపరీత లక్షణము లున్నపుడు దీనిని తప్పక వాడవలయును. గుణ మిచ్చువరకు వెంట వెంటనే వాడు మండవలయును. డాక్టర్ బ్లాక్ వుడ్ యిట్లు వ్రాసియున్నాడు.

"This remedy is indicated in low adynamic states such as are met with in cases of malignant scarlet fever where the skin presents a lived purple appearence or the eruption has a dusky, carmine shade ; the fever is high, the pulse small and very rapid. There is thirst, delirium and coma. The eyes are suffused with a bloody discharge. The pupils are dilated. The discharges from the rectum and bladder are involuntary, the nose and extremities are cold."

(*Blackwood's* Materia Medica.)

ఫెర్రంఫాస్ :—ప్రారంభమున చలి, వణకు, జ్వరము, నాడివేగము, తల నొప్పి, గొంతుకనొప్పి, ముక్కునుండి రక్తము కారుట—ఈ లక్షణములకు బాగుగా పనిచేయును.

కాలీసల్ఫ :—దీనిని ఫెర్రంఫాస్‌తో వాడిన జ్వరమునకు పనిచేయును. మరియు పొక్కులాకస్మికముగ అణగిపోవునపుడు పక్కగట్టి పొక్కులూడిపోవు స్థితిలోను దీనిని వాడినచో చర్మమును శుభ్రపరచును.

నేట్రంమూర్ :—రోగారంభమునగాని, మధ్యగాని, నీరువంటి ద్రవము వమనమువెళ్ళినను, నాలుకచివర నురగవంటి బుడగలున్నను, మగతయున్నను దీనిని వాడదగును.

కాలీఫాస్ :—తీవ్రమైన కేసులలో గొంతుక జబ్బధికమై వాసనయున్నను, ఊపిరి దుర్వాసనగలిగియున్నను, మగతయున్నను, నరముల బలహీనతయున్నను పనిచేయును.

కాలీమూర్ :—ఈ రోగమునకు బాగుగా పనిచేయును.

ఈ రోగికి చలిగాలి తగిలినను, రోగి చలిగాలిలో తిరిగినను, శరీరముబ్బుట, నంజు, మూత్ర మతి స్వల్పముగ వెడలుట, చెవిలో చీము, అతిసారము, కండ్ల జబ్బులు తరుచు జనించుచుండును. కావున రోగిని చలిగాలిలో తిరుగనివ్వరాదు. చలిగాలి తగులకుండ కాపాడుచుండవలయును.

ఒకవేళ పై రోగములు జనించినచో యీ క్రింది ఔషధములను వాడవలయును :—

యేపిస్ ; డిజిటాలిస్ :—నంజు, స్వల్పమూత్ర మున్నపుడు నీ రెండౌషధములను ఒకదాని తర్వాత నొకదానిని వాడదగును.

టెరిబింథినా :—నంజు, మూత్రద్వారము మంట, మూత్రము పొగరంగు కలిగియుండుట—యీ లక్షణములకు వాడవగును.

అపోసైనమ్ :—నంజుకు, స్వల్పమూత్రమునకు పనిచేయును.

టెల్లూరియమ్ (Tellurium) :—చెవిలో చీముకు మంచిపనిచేయును. పోడోఫిల్లం ; ఫైటోలక్కా ; గాంబోజియా ; గ్రాఫైట్స్ ; క్రోటన్ టిగ్లియమ్ ; కెమోమిల్లా మొదలగునవి అతిసారమునకు వాడదగును.

నేట్రంసల్ఫ ; నేట్రంమూర్ ; కాలీమూర్ :—నంజురోగమునకు వాడదగును.

ఫెర్రంఫాస్ :—మూత్రద్వారము మంట, కొద్దికొద్దిగా మూత్రముపడుట, మూత్రము రంగుగానుండుట, అనేకసార్లు వెళ్ళవలసియుండుట—వీటికి మంచిది.

మెగ్నీషియాఫాస్ :—మూత్రబంధమునకు మంచిది.

కాలీమూర్ :—మూత్రద్వారము మంటయుండి మూత్రము నల్లగాయున్నపుడు వాడవచ్చును. మరియు చెవిలో పోటు, హోరు, చెముడు మొదలగు కర్ణరోగములకుకూడ పనిచేయును.

సైలీషియా :—చెవిలో చీముకారునపుడు మంచిపనిచేయును.

ఫెర్రంఫాస్ :—కండ్లు మంటలు, మిరమిరలాడుట—వీటికి మంచిది.

కాల్కేరియాసల్ఫ :—కండ్లనుండి పసుపుపచ్చని పుసులు కారునపుడు మంచిది.

సైలీషియా :—పసుపుపచ్చని పుసులకు, రెప్పలమీద కాయలకు మంచిది. దీనిని పైకికూడ లోషనుగా వాడవచ్చును.

కాల్కేరియాఫాస్ ; నేట్రంఫాస్ :—అతిసారమునకు పనిచేయును. ఈ రోగములో నంజు లక్షణములులేకుండ మూత్రము స్తంభించినచో రోగి జీవించుట దుర్లభము.

గమనింపదగిన విషయములు :—పరిశుభ్రమైన గాలివచ్చు గదులలో రోగిని పరుండబెట్టవలెను. గోరువెచ్చని నీళ్ళతో కాపడముచేయుట మంచిది. గొంతుకనొప్పికి ఆవిరి నోటిలోనికి పట్టుట మిగుల నుపయోగకారి. హైడ్రాస్టిస్ నీటిలోకలిపి పుక్కిలించుటచే మంచిపనిచేయును. కొంచెము నెమ్మదించినతోడనే రోగి బయటకు పోరాదు. పోయినచో పైన వ్రాయబడిన ఉపవ్యాధులుజనించును. ఈ రోగము వ్యాపించిన ప్రదేశములలో పిల్లలకు ఉదయము, సాయంత్రము బెల్లడోనా యిచ్చినచో వ్యాధిరాకుండ కాపాడును. వచ్చినను సులువుగ తేలిపోవును.

పథ్యము :—జ్వరము పూర్తిగ తగ్గువరకు ఘనపదార్థము లివ్వరాదు. పాలు, సోడా, నారింజపండ్లరసము, ద్రాక్షపండ్లు మొదలగునవి వాడుట మంచిది.

## 17. పొంగు (Measles)

### ఇది తరుచు పిల్లలకు వచ్చు నొకవిధమైన అంటువ్యాధి

లక్షణములు :—రొంప, జ్వరము. ముక్కునుండియు, కండ్లనుండియు నీరుకారుట, కొంచెము దగ్గు— ఈ లక్షణములతో ప్రారంభమగును. తొలి రోజున జ్వరము, తలనొప్పి, ఒడలు నొప్పులు తీవ్రముగ యుండును. 103° వరకు యుష్ణముండును. నాల్గవ రోజున ముఖము మీదను, మెడమీదను

దద్దుర్లు బయలుదేరి శరీర మంతయు వ్యాపించును. ఇవి యెఱ్ఱగను, చిన్నవిగను, గుండ్రముగను, శరీరముకంటె కొంచె మెత్తుగను యుండి నొక్కినచో తెలుపుగమారి తడిలేకయుండును. రెండు మూడు రోజులలో బాగుగ పైకిలేచి, తరువాత మూడు రోజులవరకు యుండును. అటుపిమ్మట జ్వరము తగ్గును. దద్దుర్లు వాడిపోయి పొరలుపొరలుగా నూడిపోవును. మొత్తము వ్యాధి లక్షణము లన్నియు తగ్గుటకు సుమారు పదిహేనురోజులు పట్టును. వ్యాధి యనంతరము కొందరి కతిసారము కలుగవచ్చును.

ఈ వ్యాధికిని, స్కార్ లెట్ జ్వరమునకు ముఖ్యమైన భేద మేమనగా :— పొంగులో జ్వరము తగిలిన నాల్గవ రోజునగాని, ఐదవ రోజునగాని శరీరము మీద దద్దుర్లు, పొక్కులు బయలుదేరును. స్కార్ లెట్ జ్వరములో, జ్వరము ప్రారంభించిన ఒకటి, రెండు రోజులలోనే పొక్కులు లేచును. పొంగులో దగ్గు ముఖ్యలక్షణము, రెండవ దానిలో గొంతుక నొప్పి ప్రధానలక్షణము.

కారణము :— అంటురోగ మగుటయే ముఖ్యకారణము.

## చికిత్స :

పల్సటిల్లా :— ప్రారంభమున జనించు జలుబు లక్షణములకు మంచిది. దద్దుర్లు పైకి కనబడక పూర్వము, ముక్కువెంట, కండ్లవెంట నీరుకారుట తుమ్ములు, దగ్గు, తలనొప్పి—యీ లక్షణములకును, అజీర్ణ దోషము లున్నపుడును అమోఘముగ పనిచేయును.

ఎకోనైట్ :— ప్రారంభదశలో జ్వర తీవ్ర మున్నపుడు పనిచేయును.

బ్రైయోనియా :— దగ్గు, దప్పి, మలబద్ధ మున్నపుడు పనిచేయును.

యూఫ్రేషియా (Euphrasia) :— కళ్ళనుండి నీరు కారుచున్నపుడు పనిచేయును.

బెల్లడోనా :— తలనొప్పి, వెన్నునొప్పి, కండ్లెఱ్ఱబడి నీరుకారుట, పొడి దగ్గు, గుండెలలో కఫముచే బరువు, స్వరభేదము, దప్పి, నిద్రలేమి, స్థిమితము లేకుండుట, ముక్కువెంట నీరుకారుట, తరుచు తుమ్ములుండుట, ఒకానొకప్పుడు సంధి—యీ లక్షణము లున్నచో దీనిని వాడవలయును.

స్టిక్టా పల్ మొనేరియా (Sticta Fulmonaria) :— దగ్గుతో కూడిన పొంగులకు, నిద్రలేమికి బాగుగా పనిచేయును.

మొమోర్డికా ఛారంటియా (Momordica Charantia) :— ఈ రోగ

మున కీ మూలిక చాల మంచిపనిచేయుననిన్ని, అనేక మందికి వాడి కుదిర్చితి ననిన్నీ డాక్టరు ఛటర్జీగారు తమ 'Family Physician' అను గ్రంథములో వ్రాసియున్నారు.

మార్బిల్లినం 200 :—వ్యాధి రాకుండ కాపాడును.

ఫాస్ఫరస్ :—దద్దుర్లు బాగుగ పెరగనపుడు, దగ్గు, అతిసారమున్నపుడు దీనిని వాడదగును.

ఆర్సెనికమ్ :—ఫాస్ఫరస్ యిచ్చిన పిమ్మట, గుండెలలో శ్లేష్మభారము తగ్గి, జ్వరము, అతిసార మున్నపుడు వాడవలయును.

రూస్టాక్స్ :—వాత నొప్పు లధికముగ నున్నపుడు బాగుగపనిచేయును.

వయోలా ఒడోరేటా (Viola Odorata) :—చెవినుండి చీము కారు నపుడు పనిచేయును.

కాలీమూర్ :—దగ్గుయున్నను, గొంతుక వాచినను, అతిసార మున్నను పనిచేయును.

కాలీసల్ఫ :—శరీరముమీద లేచిన పొక్కు లగస్మాత్తుగ అణగిపోయి నచో దీనిని తప్పక వాడవలయును.

నేట్రంమూర్ :—కళ్ళనుండి నీరుకారుచున్నపుడు వాడదగును. ఇవిగాక ఇపెకాక్, కాలీబైక్, యాంటింటార్ట్, మెర్క్యూరియస్ సోల్ కూడ ముఖ్య మైనవియే.

ముఖ్యముగ గమనింపదగిన విషయములు :—పొంగులున్న ప్రదేశములలో పిల్లలకు జ్వరము తగులగానే సాధారణముగ మందు లిచ్చు వాడుక బహు తక్కువ. పొంగులు విశేషముగ ప్రబలియున్న కాలములో పిల్లలకు పల్సటిల్లా వారము రోజు లిచ్చినచో వారికి పొంగు తగులకుండా కాపాడును. లేదా తగిలినను స్వల్పముగ తేలిపోవును. పొంగుపడి లేచిన పిమ్మట పథ్య మతిజాగ్ర త్తగా చేయించవలయును. లేనిచో అపథ్య దోషమువలన కొన్ని వ్యాధులు కలుగుచుండును. దగ్గువలన బాధపడుచున్న రోగి బలహీనమగు శిశువయినచో నది క్షయలోనికి దింపవచ్చును. దాని లక్షణములు కనుపించిన వెంటనే తగిన వైద్యునియొక్క సలహా తీసికొనవలయును.

ఇదిగాక చెవిలో చీము, చెముడు, కంటి జబ్బులు, అతిసారముకూడకొందరి రోగులకు కలుగుచుండును. ఈ క్రింది ఔషధములను ఆయాగుణములకు వాడదగును.

హెపార్ సల్ఫ ; పల్సటిల్లా :—చెవిలో చీముకు, చెముడుకు మంచిది.

ఎకోనైట్ ; బెల్లడోనా ; మెర్క్యూరియస్ కార్ :—కంటి జబ్బులకు వాడదగును.

కేమోమిల్లా ; పోడోఫిల్లం ; ఒలియాండర్ ; బిస్మత్ మొదలగునవి అతిసారమునకు వాడనగును.

సల్ఫర్ :—అన్నిటికినికూడ మంచిది.

కాలీమూర్ :—దగ్గుకు, చెముడుకు పనిచేయును.

సైలీషియా :—చీముకు, చెముడుకు బాగుగ పనిచేయును.

ఫెర్రంఫాస్ ; కాల్కేరియాసల్ఫ ; నేట్రంమూర్ :—వీటిని కంటి జబ్బులకు వాడదగును. కాలీఫాస్కూడ రోగానంతరము నీరసముచే కలుగు దృష్టిదోషమునకు మంచిది.

కాల్కేరియాఫాస్ :—అతిసారమునకు మంచిపని చేయును.

## 18. ఆటలమ్మ Chicken-Pox.

ఇదికూడ తరుచు యెక్కువగ పిల్లలకు వచ్చు నొకవిధమైన అంటురోగము.

లక్షణములు :—మొదటి రోజున కొద్ది జ్వరము. సాధారణముగ మొదటి రోజున గాని, రెండవ రోజునగాని నీటితోగూడిన పొక్కులు ముఖముమీదను, ఛాతిమీదను, కడుపుమీదను, నెత్తిమీదను బయలుదేరును. ఇవి గుంపులుగా బయలుదేరి కొన్ని తగ్గుచుండగ కొన్ని లేచుచుండును. ఈ నీటిపొక్కులు 3, 4 రోజులలో చీముపట్టును. వారము రోజులలో యెండి పక్కులు కట్టును. సుమారు 10, 15 దినము లీ రోగపరిమాణ ముండును. శరీరముమీద మొదట మచ్చలు పడినను కొద్ది కాలములో పోవును.

కారణము :—అంటురోగము.

### చికిత్స :

ఎకోనైట్ :—ప్రారంభమున జ్వర మున్నపుడు వాడవలయును.

రూస్టాక్స్ :—ఈ రోగమునకు ముఖ్యమైనమందు. దీనిని చివరవరకు వాడవచ్చును. దీనివలన రోగము త్వరలో నెమ్మదించును.

యాపిస్ (Apis) :—దురద యెక్కువగ యున్నపుడు పనిచేయును.

మెర్క్యూరియస్ :—చీము పట్టినపుడు, పొక్కులు బాగుగ పక్వమైనపుడు పనిచేయును.

యాంటిమొంటార్ట్ :—పొక్కులు రసితోకూడియున్నను, కంపనములు బయలు దేరినను వాడదగును.

ఫెర్రంఫాస్ :—ప్రారంభమున జ్వరమునకు పనిచేయును.

కాలీసల్ఫ :—పొక్కులణగిపోయినపుడు పనిచేయును.

నేట్రంమూర్ :—మగతను, నీరువలె స్రవించునపుడు పనిచేయును.

గమనింపదగినవి :—రోగికి పాలపథ్యము మంచిది. చలిగాలి తగలనివ్వ రాదు. శిశువును గోకుకొనకుండ చూడవలయును.

## 19. టీకాలువేయుట Vaccination.

చంటిబిడ్డలకు మూడు మొదలారుమాసములలోపున టీకాలువేయుచుందురు. దీనివలన మశూచికము రాదనియు, వచ్చినను తేలికగాపోసి రోగికి ప్రమాద ముండదనియు సిద్ధాంతము. ఇందునుగురించి పాశ్చాత్యదేశములలో సైతము కొన్ని వ్యతిరేకాభిప్రాయములు ప్రబలియున్నవి. ఉపకార అపకారము లెట్లున్నను టీకాలను వేయుచునేయున్నారు. వీటి పటుత్వము కొంతకాలము వరకే యుండుననియు, 10, 15 సంవత్సరములకు తిరిగి వేయించుకొనుట మంచిదనియు చెప్పుదురు. ఆవు పొక్కులలోనుండి తీయురసమును మనుజుని శరీరములోని కెక్కించుదురు. ఆ రసమును బహుజాగ్రత్తగ యుంచుదురు.

లక్షణములు :—టీకాలువేసిన రెండవరోజున ఎర్రగా బయలుదేరును. జ్వరమువచ్చును. నాల్గవరోజున యెర్రని మొటిమలవలె కనపడును. తరువాత చీముతోగూడిన పొక్కులక్రింద మారును. అవి క్రమముగ వృద్ధియగును. సుమారిరువది రోజులకు పక్కుకట్టి రాలిపోవును. శాశ్వతమైన మచ్చ శరీరము మీద నిలిచిపోవును.

### చికిత్స :

ఎకోనైట్ లేక బెల్లడోనా :—ప్రారంభమున జ్వరమువచ్చినపుడీరెంటిలో నేదైనను వాడవచ్చును.

సల్ఫర్ :—వారంరోజులు గడచినపిమ్మట, దీనిని రోజుకు రెండు పర్యాయములు వాడినచో యితర దుర్గుణములేవియు రాకుండ కాపాడును.

రూస్టాక్స్ :—చెడురసమును వాడినమీదట కలుగు ఎగ్జిమా మొదలగు చర్మవ్యాధులకు బాగుగా పనిచేయును.

తూజా :—టీకాలవలన గలుగు దుర్గుణములకు, ముఖ్యముగా దీనివలన కలుగు నీళ్ళవిరేచనములకు మంచిది.

"For the bad effects of vaccination, especially for the diarrhoea caused thereby." —*Dewy's* Materia Medica.

ఫెర్రంఫాస్ :—ప్రారంభమున జ్వరమునకు మంచిది.

కాలీమూర్ :—వాపధికముగ యున్నను, ఎగ్జిమా మొదలగు చర్మవ్యాధులు బయలుదేరినను దీనిని వాడదగును. టీకాలవలన గలుగు దుర్గుణములకుమంచిది. ఇవిగాక మలాండ్రిసం, మెడోర్హినం, సైలీషియాకూడ వాడవచ్చును. టీకాలు వేసిన ప్రదేశమునకు రాపిడి తగులకుండ చూడవలెను.

## 20. గవదలు Mumps.

ఇదికూడ నొకవిధమైన అంటురోగము.

లక్షణములు :—చెవిక్రిందనుండు గ్రంథులు (Glands) ప్రారంభమున వాచును. అక్కడనుంచి వాపు పైకి క్రిందికి వ్యాపించును. దవడలు, మెడ కొయ్యబారి నొప్పిగా యుండును. బాలుడు నోరు తెరమటకు కష్టపడును. ఏమియు నమలలేకుండును. ఆహారము దినుటకు ప్రయాసపడును. గుటక వేయుటకూడ కష్టమే. ముఖమునకు వికారరూప మేర్పడును. ఒక వారము రోజులవరకు జ్వరము, తలనొప్పి యుండును. తరువాత క్రమముగ తగ్గుట ప్రారంభించి రెండు వారములకు నెమ్మదించును.

కారణములు:—సాధారణముగ వాతావరణ మార్పులవలన జనించు అంటు వ్యాధి.

## చికిత్స:

ఏకోనైట్ :—ప్రారంభమున జ్వరమునకు పనిచేయును.

మెర్క్యూరియస్ :—రోగము కుదుర్చుటకు సాధారణముగ నిది యొక్కటియే చాలును. నోటినుండి నీరెక్కువగ వచ్చునపుడును, గండమాల వ్యాధి గల పిల్లలకును (Scrofulous children) బాగుగ పనిచేయును.

బెల్లడోనా :—వాపు, నొప్పి, అధికముగ యున్నపుడును, జ్వరమునకును కూడ వాడదగును.

పల్సటిల్లా :—అండమ్మునకు, వృషణములకు మారినపుడు పనిచేయును.

ఫెర్రంఫాస్ :—ప్రారంభమున జ్వరమునకు మంచిది.

కాలీమూర్ :—వాపునకు బాగుగ పనిచేయును. నాలుక తెలుపుండును.

నేట్రంమూర్ :—నోటినుండి నీరెక్కువగ కారుచున్నను, వృషణములు వాచినను బాగుగ పనిచేయును.

ముఖ్యగమనింపు :—రోగిని ఎల్లప్పుడు పరుండనియ్యకూడదు. వేడినీళ్ళు కాపడము పెట్టుట మంచిది. చలిగాలి తగులనివ్వరాదు. దవడలు, మెడ, ఫ్లానల్ వస్త్రముతో గప్పియుంచుట మంచిది. సులభముగ జీర్ణమగు ద్రవపదార్ధముల నాహారముగ యిచ్చుచుండవలెను.

## 21. విసర్పి Erysipelas.

లక్షణములు :—బడలిక, ఆకలిలేకపోవుట, నిద్రలేకయుండుట, చలి, జ్వరము, తలనొప్పి, మలబద్ధము, వికారము, వమనము—యీ లక్షణములతో ప్రారంభమగును. పిమ్మట ముఖముమీదను, శిరస్సుయందును, మెడమీదను, వస్తియందును యెర్రని దద్దుర్లవలె పొక్కులు బయలుదేరును. నొక్కినచో యీ పొక్కులు తాత్కాలికముగ అణగిపోవుచుండును. ఆయా స్థలములు పొంగరించి వాచియుండును. ఈ పొక్కు లొక వైపునుండి మరియొక వైపునకు, ఒకచోటునుండి మరియొక చోటునకు వ్యాపించుచుండును. వ్యాధి సాధారణమైనచో 10 లేక 15 దినములలో నెమ్మదించును.

కాని కొందరిలో రోగము తీవ్రముగ వ్యాపించును. జ్వరము 102°-104°ల వరకు యుండుట, వస్తియందును, శిరస్సునందును, యింకా యితర భాగములకు వ్యాపించుట, ఆయాభాగము లెక్కువగ వాచుట, మండుట, పొక్కులు చీముపట్టి రసికారుట, ఒకానొకప్పుడు సంధికూడ యుండుట—యీ లక్షణములను గలిగినచో వ్యాధి బాగుగ ముదిరిన దనియు, తీవ్రమైనదనియు గ్రహించదగును. ఈ యవస్థలో చీముపట్టిన పొక్కులు పక్వమై, చివర దశలో పగిలి రసికారుచు, పుండ్లయి మాంసమునుకూడ క్రుళ్లజేయును. తీవ్రమైన పైత్య లక్షణములుకూడ కనుపించును.

కారణములు :—గాయములు తగిలినచోట్లను, టీకాలువేసిన ప్రదేశము చుట్టును, యెర్రబడి పొక్కులు బయలుదేరి మంటబెట్టుచుండును. అదియును గాక నాభినాళము ఛేదించినపుడు, నాభియందుండు పుండు పూర్తిగ మాననిచో విసర్పివ్యాధి జనించి, నాభినుంచి యితర ప్రదేశములకు వ్యాపించును. జీర్ణ

కోశమునందలి దోషములవల్లను, చలిగాలి సోకిననుకూడ వచ్చుచుండును. పరిశుభ్రమైనగాలి, వెలుతురు లేని గదులలో నివసించుటకూడ యొక కారణము. స్త్రీలకు ఋతుకాలమందుకూడ రావచ్చును. ఉప్పు, పులుసు, కారము విశేషముగ సేవించినను కలుగుచుండును.

## చికిత్స :

ఎకోనైట్ :—ప్రారంభదశలో జ్వరమున్నపుడు వాడవలయును.

రూస్‌టాక్సు :—చర్మరోగములకు చాలమంచిది. ముఖముమీదను, వామపార్శ్వమున సర్పి బయలుదేరినను, కుదురులేకయున్నను, బాగుగ పనిచేయును. దురద, మంటయుండి పిల్లవాడు బాధపడుచుండగా దీనిని వాడిన వెంటనే అద్భుతముగా పనిచేసినది.

కేంథారిస్ :—చర్మరోగముల కద్భుతముగ పనిచేయును. మంట లెక్కువగ నున్న విసర్పిరోగమునకు దివ్యౌషధము.

బెల్లడోనా :—ఎరుపు, వాపు, మంట, జ్వరము, దప్పి యుండి పొక్కులాకస్మికముగ లేచినచో పనిచేయును.

యుర్టికా యురెన్స్ (Urtica urens) :—కాళ్లు, చేతులు విశేషముగ వాచుట, శరీరమునందు మంటలుండుట—యీ లక్షణములకు పనిచేయును.

లేకసిస్ (Lachesis) :—వామపార్శ్వమున జనించినదానికిని, ప్రారంభమున నెర్రగయుండి, పిమ్మట ధూమ్రవర్ణముగ (Purple) మారిన దానికిని, రోగి బహు నీరసముగను, బద్ధకముగనుయుండి, కొద్ది సంధికూడ యుండినచో దీనిని వాడదగును.

హీపార్‌సల్ఫ Hepar Sulph :—శరీరమును తాకుటకు వీలులేనంత బాధయుండి చీముపట్టినపుడు బాగుగ పనిచేయును.

పల్సటిల్లా :—ఒకచోటునుంచి మరియొకచోటుకు సంచరించు విసర్పి రోగమునకును, చెవిమీద బయలుదేరిన రోగమునకును పనిచేయును.

ఇబ్‌థియోలం :—శరీరముమీద పైకివ్రాయుట కుపయోగించును.

గ్రాఫైటిస్ :—కుడివైపునుంచి ఎడమవైపునకు వ్యాపించు రోగమునకు పనిచేయును.

వెరాట్రుంవిరైడ్ :—దీని మాతృద్రావకము పైకి వ్రాయవచ్చును. మెదడునకు సంబంధించిన లక్షణములున్నచో దీనిని లోపలికికూడ వాడవచ్చును.

యుఫోర్బియం :— పొక్కులు పసుపుపచ్చని రసికారుచు, మంటలధికముగ యున్నపుడు బాగుగ పనిచేయును.

సల్ఫర్ :—చర్మరోగము లన్నిటి కమోఘముగ పనిచేయును.

ఫెర్రంఫాస్ :—ప్రారంభదశలో జ్వరము, యెరుపు యున్నపుడు పని చేయును.

నేట్రంసల్ఫ :—ఇది ప్రధానౌషధము. పొక్కులు లేచునపుడు వికారము, పసరు వమనమగుట, శరీరము పొంగరించి యెర్రబడి బాధయుండుట—ఈ లక్షణముల కమోఘముగ పనిచేయును.

"Chief remedy for erysipelas, with or without vomiting of bile. When the skin is smooth, red, shiny, painful and swelled." —*Chapman.*

కాలీసల్ఫ :—చివరదశలో పొక్కులు చితికి రసియోడ్చుటకు పని చేయును.

కాలీఫాస్ :—రోగము ముదిరి, ఆఖరుదశలో పొక్కులు చితికి పుండ్లు పడి, దుర్వాసనతోగూడిన స్రావముండి, మాంసమునుకూడ క్రుళ్ళజేయుస్థితిలో దీనిని వాడదగును.

నేట్రంమూర్ :—రోగము బాగుగ ముదిరినపుడు పనిచేయును.

ఇవిగాక యాపిస్, స్ట్రామోనియం, ఆర్నికా, కాలీమూర్ కూడ పని చేయును. కాల్కేరియాఫ్లోర్ కూడ రసికారునపుడు వాడదగును.

గమనింపదగిన విషయములు :—రోగికి చలిగాలి తగులనివ్వకూడదు. రోగి వాడినబట్టలు చీము, రసితోకూడి యుండును. కావున వాటిని, మలినమును శుభ్రపరచు వస్తువులతో బాగుగ నుతికి జాగ్రత్తగా వేరుగా యుంచవలెను. మలినములేకుండ శరీరమందలి నాయాభాగములు గోరువెచ్చని నీళ్ళతోగాని, లోషన్ తోగాని కడుగుచుండవలెను. రోగము ముదరకుండ పిక్రిక్ యాసిడ్ (Picric acid) నీళ్లుకలిపిన ద్రావకము (Solution) కార్బాలిక్ ఆయిల్, టించరు హైడ్రాస్టిస్ కూడ వ్రాయుట మంచిదే.

పథ్యము :—రోగికి తేలికయాహారము, ఉద్రేకము కలిగింపని యాహారము వాడవలయును. విశేషముగ కారము, పులుసు వాడరాదు.

# 22. అలజి లేక మూగగజ్జి Eczema.

ఇదికూడ తరుచు పిల్లలకువచ్చు నొకవిధమగు చర్మరోగము.

లక్షణములు :—జ్వరముతో ప్రారంభించును. ఆకలి మందగించును. బాలుడు పాలిపోయి, నీరసించియుండును. శరీర మెఱ్ఱబడి చిన్న పెసరబద్దకు మించని నీటిపొక్కులు గుంపులుగ బయలుదేరి, కుల, దురద, మంటయుండును. ఈ పొక్కు చితికి రసికారుచుండును. ఈ రసికారు ప్రదేశమంతయు నెండిన పిమ్మట పచ్చని అట్టుకట్టియుండును. రోగి వస్త్రములకు రసి యంటుకొన్న వస్త్రములన్నియు నెండినపిమ్మట అట్టుకట్టును. ఈ రోగము సాధారణముగ శరీరమంతయు వ్యాపించును. ముఖ్యముగ నెత్తిమీదను, చెవులు, చంకలు, పిరుదులు, యితర కీళ్ళమడతలు (bends of the joint)—ఈ ప్రదేశములలో నెక్కువగ యుండును.

ఈ రోగము వివిధ రకములు :—కొంతవరకు పొక్కులులేక దద్దుర్లచే చర్మము దళసరియగును. కొందరకు ముఖముమీదను, మెడమీదను, పాదములమీదను, చెవుల వెనుకభాగమందు, శరీరమునకు గాలితగులు యితరచోట్లను మాత్రమే యుండును. మరికొందరకు తొడలు, అండాశయము మొదలగు చోట్లను, యింకా కొందరకు నెత్తిమీదను లేచుచుండును.

ఈ రోగమునే మనవారు 'మంత్రే' మని పిలుతురు.

కారణములు :—వంశపరంపరగా రావచ్చును. ఎక్కువ వేడివలనగాని, చలివలనగాని, రాపిడివలనగాని కలుగవచ్చును. మూత్రముతో తడిసిన దుస్తులు శరీరమునకు తగిలినను వచ్చుచుండును. కావున శిశువులు మూత్రముతో తడిపిన పక్కబట్టలను యెప్పటికప్పుడు తీసివేయుచుండవలయును. సరియగు నాహారము లేకపోవుటకూడ యొక కారణము. పాలిచ్చు తల్లిగాని, దాదిగాని అనారోగ్యవంతురాలైనచో పాలదోషముచేకూడ రావచ్చును.

## చికిత్స :

క్రోటన్ టిగ్లియమ్ :—ముఖముమీద, జననేంద్రియములు, అండకోశముల యందు జనించినను, దురద యెక్కువగయుండి, గోకుకొన లేక కొద్దిగా గోకికొనినను ఉపశమించినచో దీనిని వాడదగును. బాగుగ పనిచేయును.

సిక్యూటా విరోసా :—ముఖముమీదను, శిరస్సుయందును పొక్కులు లేచి చితికి పచ్చని పక్కులు కట్టును. దురద మిక్కుటముగ యుండును.

పెట్రోలియం :—కర్ణములు, శిరస్సు వెనుకటి భాగమందును, జననేంద్రియములు, అండాశయము, కాళ్ళు, పాదములు, తొడలు, గుదస్థానము—యీ భాగములయందు జనించి రసి స్రవించుచుండును. ఒకానొకప్పుడీ భాగము లెండిపోయి పగిలి రక్తముకూడ కారును. శీతకాల, వర్షాకాలములయం దెక్కువగుచు, వేసవికాలములో తగ్గుచుండును. శీతకాలమం దధికమగుచు, చాల కాలమునుంచి యీ రోగముచే కాళ్ళమీద బాధపడుచున్న రోగికి యీ ఔషధము 200 తో నెమ్మదించెనని నాష్ వ్రాసియున్నాడు.

"I have cured a case of eczema of the lower legs of twenty years standing always worse in winter, with one prescription of the 200th."
—*Nash.*

మెర్క్యూరియస్ ప్రెసిప్ రూబర్ (Merc. Precip ruber) :—ఆసనమువద్ద, జననేంద్రియము, బొడ్డువద్ద చిన్న పొక్కులవలె బయలుదేరు ఎగ్జిమాకు మంచిది. నొప్పి, పగుళ్ళనుంచి రసియుండును.

—*Dr. Tooker.*

హెపార్ సల్ఫ (Hepar Sulph) :— చర్మ రోగములకు మంచిది. పొక్కులుగాని, దద్దుర్లుగానియుండి, నొప్పియుండును. శరీరమంతటను బయలుదేరు మంత్రపు పొక్కులకు మంచిది. చీము పట్టినపుడు బాగుగా పనిచేయును. రక్తముకూడ యుండవచ్చును. దుర్వాసన యుండును.

రూస్ వెనెనాటా :—దురద యెక్కువగాయుండి ఉష్ణోదకమువలన ఉపశాంతి నిచ్చినచో బాగుగ పనిచేయును.

రూస్టాక్స్ :—చర్మవ్యాధులకు చాల మంచిది. రాత్రులు దురద మంట అమితముగా యుండును. ఎంతగోకినను తనివితీరదు. వర్షాకాలమం దెక్కుచుండును. ఇట్టి లక్షణములుగల రోగమునకు పనిచేయును.

వయోలా ట్రైకలర్ (Viola Tricolor) :— ముఖముమీద లేచినను రాత్రులు దురద మంట యెక్కువగనున్నను, మూత్రము పిల్లి మూత్రమువలె వాసనగలిగి యున్నను బాగుగ పనిచేయును.

రానన్ బల్బ (Rananculus Bulb) :—అరచేతిలో లేచిన పొక్కులకు మంచిపనిచేయును.

"Blister-like eruptions (eczema) in the palms of the hands."
—*Nash.*

హెల్లిబోరస్ :—కుడిచేతి వ్రేళ్ళమీద పొక్కులు బయలుదేరి, మొదట తడిగాయుండి, పిమ్మట పక్కుకట్టును.

గ్రాఫైటిస్ (Graphites) :—చర్మరోగములకు దివ్యౌషధము. ఈ రోగమునకు ముఖ్యౌషధము. చెవులకు వెనుకభాగము, శిరస్సు, ముఖము, జననేంద్రియములు, కంటిరెప్పలు, అరచేతులు— యీ ప్రదేశములయందు పొక్కులు బయలుదేరి, తేనెవంటి ద్రవము స్రవించుచుండును. రాత్రులు దురద యెక్కువగనుండును. గోకినను, రాత్రికాలమందును అధికమగును.

*—Dr. Tooker.*

కాలీకార్బ (Kali Carb) :—పొత్తికడుపుమీదను, చన్మొనలచుట్టును బయలుదేరు ఎగ్జిమాకు పనిచేయును. *—Dr. Chatterjee.*

కోనియం :—ముసలిరూపుగల పిల్లలకు పనిచేయును.

సోరినమ్ Psorinum :—చెవి వెనుకభాగమున లేచును. శీతకాలములో జనించి, వేసవికాలములో తగ్గిపోవును. దుర్గంధయుక్తమైన చెమటపోయును. ఇట్టి లక్షణములు కలదానికి పనిచేయును.

మెజీరియమ్ 200 :—పిల్లలకు తలమీద బయలుదేరు 'పుర్రెమాదకు' బాగుగా పనిచేయును. దురద విశేషముగాయుండును.

అమోనియాకార్బ 30 :—పిల్లలకు కాళ్లమధ్య, ఆసనమువద్ద, జననేంద్రియములవద్ద బయలుదేరు ఎగ్జిమాకు పనిచేయును. దురద యెక్కువగాయుండి, గోకినచో శాంతించును.

ఒలియాండర్ :—చెవి, శిరస్సు వెనుకభాగమున బయలుదేరు ఎగ్జిమాకు మంచిది. శరీరము సున్నితము, నిగనిగలాడుచుండును. బట్ట తగిలినను నొప్పి.

*—Dr. Tooker.*

ఆర్జెంటం నైట్రికం 30 :—జననేంద్రియములమీద బయలుదేరు ఎగ్జిమాకు పనిచేయును. *—Dr. Chaterjee.*

అర్సెనికమ్ ఆల్బమ్ :—శరీరమున మంటలధికముగ యుండును. మరియు విశేషముగ పొరలూడుట, పొక్కులనుండి చీము కారుట—ఈ లక్షణములతో గూడిన ఎగ్జిమాకు పనిచేయును.

"When there is copious scaling, or thick, scaly eruptions exuding pus" These are the indications of Arsenicum in eczema. *—Dr. Dewey.*

డల్కెమారా :—కణతలమీదను, నొసటిమీదను, గడ్డముమీదను బయలు దేరును. దురదయుండును. ముఖ్యముగా చలిగాలివలన అధికమై, వేడిగాలివలన శాంతించును.

మెర్క్యూరియస్ :—ఇది ముఖ్యముగా నెత్తిమీద, గడ్డముమీద, కాళ్ళ మీద, చేతులమీద బయలుదేరినచో పనిచేయును. గోకినపిమ్మట రక్తము, మంటయుండును. ఈ రోగికి త్వరలో చెమటలుపట్టును.

*—Dr. Chaterjee.*

నేట్రంమూర్ :—కనుబొమలమీద, చెవుల వెనుకభాగమున మడతల లోను జనించును. గోళ్ళ చుట్టుయున్న చర్మము బద్ధలైయుండును. లవణ మధికముగ సేవించినచో జనించినదానికి పనిచేయునని వ్రాయబడెను.

నేట్రంఫాస్ :—దురదయుండి తేనెవంటి ద్రవము స్రవించునపుడు పని చేయును.

కాలీమూర్ :—చర్మరోగములకు మంచిది. శరీరమం దేభాగముననైనను చిక్కని తెల్లని ద్రవముతోకూడిన పొక్కులకును, పిల్లలకు నెత్తిమీద బయలు దేరు పుర్రెమాదకును, చెవుల వెనుకభాగమున బయలుదేరిన ఎగ్జిమా కాలీమూర్ 6x తో వారంరోజులలో నెమ్మదించెనని చాప్మన్ వ్రాసియున్నాడు.

కాలీఫాస్ :—రోగము ముదిరి దుర్వాసనగల రసికారునపుడు పనిచేయును.

కాల్కేరియాసల్ఫ:—గ్రంథులు వాచియుండును. పసుపుపచ్చని చీముతో కూడియుండు పొక్కులకు, పిల్లలకు తలమీద బయలుదేరు మంత్రమునకు బాగుగ పనిచేయును.

సైలీషియా :—పలచని రసికారునపుడు పనిచేయును. తలకు పాదములకు చెమటలుపోయు పిల్లలకు మంచిది.

నేట్రంసల్ఫ :—పైత్యలక్షణములకు పనిచేయును. పచ్చని నీటివంటి ద్రవము కారుచుండును.

కాలీసల్ఫ :—పసుపుపచ్చని రసికారునపుడు పనిచేయును. ఇవిగాక, సల్ఫర్, తూజా, సరసపరిల్లా, క్రిసరోబినమ్, ఐరిస్, బాసిలినమ్కూడ వాడ వచ్చును.

పై మందులు :—క్రోటన్ టిగ్లియమ్, ఆలివ్ఆయిల్తో కలిపి వ్రాయ వచ్చును. ఐరిస్, ఆర్నికా, యాపిస్—వీటి ద్రవరూపములను (Tinctures) కూడ వాడవచ్చును. పరిశుభ్రముగ నుండుట ముఖ్యము.

## 23. గజ్జి, చిడుము Itch.

ఇదియొకవిధమైన చర్మరోగము; అంటువ్యాధి. పెద్దవారిలో కొందరకు కలుగుచుండినను, తరుచు యెక్కువగ పిల్లలలోనే వచ్చుచుండును.

లక్షణములు :—చర్మముక్రింద పురుగు ప్రాకుచున్నట్లు గులగులలాడుచు దురద యెక్కువగ నుండును. దురదచే గట్టిగ గోకుచుందురు. అందువలన రక్తముకూడ వచ్చుచుండును. ఇది తరుచుగ వ్రేళ్లమధ్యను, తొడలలోను, పిర్రలమీదను, కాళ్ళమీద, చేతులమీద, గుదస్థానమందు, పొత్తికడుపుక్రింద బయలుదేరును. రాత్రులు దురద అధికమగుచుండును. ప్రారంభమున నీటితో గూడిన చిన్నపొక్కులు బయలుదేరి వృద్ధియై క్రమముగ చీముపట్టి, పోటు, సలుపు అమితముగ పెట్టుచుండును. జ్వరముకూడ రావచ్చును. చికిత్సలవలన నీ కురుపులు చితికి, చీముకారి కొద్దిరోజులకు యెండి పక్కుగట్టి యూడి పోవును. శరీరముమీద మచ్చలు పడినను కొంత కాలమునకు పోవును. ఈ గజ్జి కురుపులు సాధారణముగ ఒకచోట మానినచో మరియొకచోట లేచుచుండును.

కారణములు :—ఒకవిధమైన క్రిమి లోపల యుండుటచేతను, మలబద్ధము చేతను, రక్త మపరిశుద్ధమైనపుడును, నిత్యము స్నానము చేయకపోవుటచే ఒడలపరిశుభ్రముగ నుండుటచేతను, అజీర్ణముచేతను, యితర వ్యాధులచేర క్తము చెడిపోయినపుడును కలుగుచుండును.

### చికిత్స :

సల్ఫరు :—చర్మవ్యాధులకు దివ్యౌషధము. దురద హెచ్చుగానున్నపుడు, గోకిన పిమ్మట మంటలున్నపుడు, వ్యాధి రాత్రు లెక్కువగ నుండు నపుడు పనిచేయును.

ఎకోనైట్ :—దురద, జ్వర మున్నపుడు పనిచేయును.

సోరినమ్ :—చర్మవ్యాధులకు మంచిది. శరీరమున నీటిపొక్కులు బయలు దేరినను, దురద యెక్కువగ యున్నను పనిచేయును. పక్కయొక్క వేడిమి వలన అధికమగుచుండును.

ఆర్సెనికమ్ :—దురద, మంట, పొక్కులనుంచి నీరు కారుట—యీ లక్షణములకు పనిచేయును. ఒకప్పుడు రక్తముకూడ స్రవించును.

డోలికాస్ :—పొక్కులు లేకుండ దురద యెక్కువగానున్నపుడు పని చేయును.

కార్బోవెజ్ :—దురద, మంట, దుర్వాసన గల పుండ్లకు పనిచేయును.

హెపారు సల్ఫ :—కురుపులు చీముపట్టినపుడు పనిచేయును.

సెపియా:—రోకినచో మంటయున్నపుడు, తరుచుగ బయలుదేరు చీముతో కూడిన పొక్కులకు, తామరకుకూడ పనిచేయును.

కాలీసల్ఫ :—పసుపుపచ్చని చీముకారునపుడు వాడదగును.

కాలీమూరు :—చిక్కగ తెల్లని చీముకారుచుపుడు పిల్లల చిడుమునకు బాగుగా పనిచేయును.

కాలీఫాస్ :—దుర్వాసనగల చీము కారునపుడు, అరచేతిలోను, కాళ్ళ మీదను, చేతులమీదను శీతకాలములో వచ్చుదానికి పనిచేయును.

సైలీషియా :—చీము కారునపుడు కురుపులకు బాగాపనిచేయును. చీమును వెడలించుటలో నద్భుతముగ పనిచేయును.

నేట్రంమూరు :—వ్రేళ్ళ మధ్యను చెవుల వెనుకను బయలుదేరు చిడుమునకు బాగాపనిచేయును.

ఇవిగాక కోడినమ్, కార్బాలిక్ ఆసిడ్, సల్ఫ్యూరస్ ఆసిడ్, ఆసిడ్ బొరాసికమ్, నెప్తలిన్, ఐరిస్—వీటిని పైకికూడ వ్రాయవచ్చును.

గమనింపదగినవి :—శరీరమునకు కొబ్బరి నూనె గాని, ఆముదము గాని వ్రాయుట చాల మంచిది. పిమ్మట పరిశుభ్రముగ స్నానము చేయవలయును. మలినము పోవుటకు మంచి సబ్బుగాని, కుంకుడుకాయలుగాని పెట్టి రుద్దవలయును. రసితోకూడియున్న రోగి వస్త్రములను పరిశుభ్రముగ వేడినీళ్ళలో సబ్బుతో నుతకవలయును. మలబద్ధము లేకుండ చూచుట ముఖ్యము. బాహ్యౌషధమువలన తాత్కాలి కోప శాంతి యున్నను, లోపలకు సరియైన ఔషధముల నిచ్చి రక్తశుద్ధి చేయనిచో వ్యాధి తిరిగి జనించుచుండును.

## 24. ఒరుపులు Chilblains.

'Chilblains' అను పదమునకు ఆంధ్రమున 'ఒరుపులు' యని అర్థము. తరుచు వాడుచుందురు. వర్షాకాలమందు నీటిలో యెక్కువగ తిరుగుటచే పొక్కు లెక్కి దురదలు ప్రారంభించును. ఇది సాధారణముగా కాలి వ్రేళ్ళ మధ్యను, చేతివ్రేళ్ళలోను బయలుదేరుచుండును. కాని 'Chilblains' అను పదము దీనికేగాక, శీతకాలమందు పిల్లలకు గలుగు నొక విధమైన గజ్జికికూడ వాడుదురు.

లక్షణములు:—చర్మము కమిలి యెఱ్ఱబడి, వాచి దురద, మంటయుండును. దీనివలన పొక్కులు లేచి పుండ్లగుచుండును. ఇది సాధారణముగ పాదముల యందు, చేతుల వెనుక భాగమందు, వ్రేళ్లయందు, ఒకప్పుడు చెవులయందు కూడ కలుగుచుండును ఇది తరుచుగ శీతకాలములో సుకుమారులైన స్త్రీలకును, బలహీనులైన పిల్లలకును వచ్చుచుండును.

కారణములు :—శీతోష్ణస్థితియందు దకస్మాత్తుగ మార్పుగలిగినను శీతకాలమందు చలిచేత కాళ్ళు, చేతులు నిప్పులవద్ద కాచినను రక్తచలనము సరిగలేక మందముగ యున్నను నీ రోగము కలుగుచుండును.

## చికిత్స :

అగేరికస్ (Agaricus) :—ఇది యీ రోగమునకు ముఖ్యౌషధము. దురద, మంట యెక్కువగా నున్నపుడు బాగా పనిచేయును.

"In chilblains it is of greatest service, and is the first remedy to be thought of." —*Blackwood.*

దీనినే 200 పొటెన్సీలో వాడి కుదిర్చితినని నాష్ వ్రాసియున్నాడు.

పెట్రోలియం (Petroleum) :—రసియున్నపుడు, దురద, మంట లధికముగ నుండినను, శీతకాలమం దెక్కువగుదానికిని, విశేషముగా గోకినచో చీము పట్టినపుడును అద్భుతముగా పనిచేయును.

ఆర్సెనికమ్ :—చర్మ మెఱ్ఱగాను, మంటలతో యున్నపుడు పనిచేయును.

ఫాస్ఫరస్:—దుర్గంధయుతమైన రసికారునపుడు. దురద, మంట యున్నపుడు, ఆరోగ్యమైన పిల్లలకు వ్రేళ్లయందు కలిగినపుడు పనిచేయును.

హేమామెలిస్ :—ఈ రోగము తగిలిన భాగములు నీలవర్ణము కలిగినచో పనిచేయును.

కాలీఫాస్ :—దురదయుండి, దుర్గంధమైన చీము కారుచు, శీతకాలమం దధికమగుచు, కాళ్ళమీద బయలుదేరిన దానికి బాగుగా పనిచేయును.

కాల్కేరియాసల్ఫ :— పచ్చని చీము కారునపుడు పనిచేయును. దీనిని పైకికూడ వ్రాయవచ్చును.

సైలీషియా :— చీము కారునపుడు దీనిని లోపలకు పైకికూడ వాడవచ్చును.

ఫెర్రంఫాస్ :—ప్రారంభదశలో యెఱ్ఱగానున్నపుడు వాడదగును.

కాలీమూర్ :—వాపున్న పుడు వాడదగును. ఇవిగాక రూస్‌టాక్సు, పల్సటిల్లా, సల్ఫర్‌కూడా పనిచేయును.

పైకివ్రాయు మందులు :—రూస్‌టాక్సు ద్రావకముగాని, కాలెండ్యులా ద్రావకముగాని వేసలైనులో కలిపి వ్రాయవచ్చును. కేంథారిన్ ద్రావకము కూడ వాడవచ్చును. పెట్రోలియం స్పిరిట్‌తో పైన తోముటకూడ మంచిదే.

గమనింపదగినవి :— బాలుడు తగిన పరిశ్రమ తీసుకొని రక్తచలనము (Circulation of blood) బాగుగ యుండునట్లు చూడవలయును. పిల్లలను శీతకాలములో మంటలవద్ద కాళ్ళు, చేతులను కాచుకొన నివ్వకూడదు.

## 25. పీనస Catarrh.

పిల్లలకు త్వరలో జలుబుచేసి రొంప పట్టుచుండును. దీనిని నిర్లక్ష్యము చేసినచో ప్రమాదమైన వ్యాధులు జనించును.

లక్షణములు :—జలుబుచేసి ముక్కునుండి నీరు కారును. ముక్కు దిబ్బడ వేయును. దిబ్బడవలన శిశువు పాలను త్రాగలేక పోవును. స్వరభేదముండును. ఆకలి మందగించును. ముక్కుతో గాలి పీల్చలేక నోటితోనే పీల్చవలసి వచ్చును. నాసికాద్వారములు బంధించి నోటితో ఉచ్ఛ్వాస నిశ్వాసములను పీల్చుట చాల జబ్బు. వ్యాధి ముదిరినచో స్రావము చిక్కబడి పసుపుపచ్చగా గాని, తెల్లగాగాని యుండును. తుమ్ములుండును.

మానవులకు ముఖ్యముగా పిల్లలకు జనించురోగములలో నెక్కువ సంఖ్యకు జలుబుచేయుటయే ముఖ్యకారణము. డాక్టర్ హేవార్డ్ యిట్లు వ్రాసి యున్నాడు.

"Taking cold is, in fact, the cause of more numerous and more serious diseases than is any other single known cause; indeed it alone is the cause of one half the diseases that afflict our race."

—Taking cold by *Dr. John Hayward.*

ఊపిరితిత్తులు చెడిపోయినందున సంభవించు దగ్గు, క్షయ, ఉబ్బసము, న్యుమోనియా, కింకవాయువు (Croup) మొదలైన జబ్బులకు, జీర్ణకోశము పాడైనందున కలుగు అగ్నిమాంద్యము, అతిసారము, వాంతి గ్రహణి మొదలగు వ్యాధులకును, విసర్పి, అలజి మొదలగు చర్మవ్యాధులకును, నంజురోగములకు, కండ్ల జబ్బులకు, గొంతుక జబ్బులకు, మూత్ర వ్యాధులకు, పక్షవాతము,

మూర్ఛ మొదలగు వాతవ్యాధులకు, స్త్రీలకు కలుగు ఋతువ్యాధులకు—యిత్యాది రోగముల కన్నిటికి అయాభాగములయందు జనించు జలుబే ముఖ్య కారణము.

కారణములు :—సరియైన దుస్తులులేక చలిగాలిలో త్రిప్పినను, తిరిగినను, ఆకస్మికముగ కలుగు కాలమార్పులవల్లను, పాలిచ్చు తల్లిగాని, దాదిగాని జలుబు చేయు పదార్థములను సేవించినను, యెక్కువ తేమలో సంచరించినను, చన్నీటిలో తరుచు స్నానముచేసి తడిబట్టలతో యెక్కువ కాల ముండినను, బాలురకీ రోగము జనించుచుండును.

## చికిత్స :

ఎకోనైట్ :—ఇది ప్రధానౌషధము. రొంప జ్వరమునకు వజ్రాయుధము. సాధారణముగ మనవారు పిల్లలకు జలుబుచేసినపుడు కస్తూరి మాత్రలను వాడు చుందురు. కాని ఎకోనైట్ వాటికంటె రెట్టింపు పనిచేయునని చెప్పగలను. నేను స్వయముగ చాలమంది పిల్లలకు వాడియుంటిని. ఏ వ్యాధిలోనైనను ప్రారంభమున రొంప, జ్వరము యుండినచో దీనిని వాడినయెడల వ్యాధిని ముదరనివ్వదు.

"It may be looked upon as a specific in catarrhal fever and in the catarrhal symptoms occasioned by cold, damp, or the like, which it will often cut short."

(*Dr. Dudgeon* in Hahnemann Materia Medica)

"Aconite, administered in the beginning of any febrile affection, such as that caused by cold, will check the progress of the disease, and prevent the morbid localisation, by re-establishing normal circulation etc."

*— Dr. Mey Roffer.*

శాంబుకస్ :—పిల్లలకు రొంపపట్టి, ముక్కులు దిబ్బడవేసి, ఊపిరి నోటితో పీల్చవలసివచ్చినపుడు ఇది బాగుగా పనిచేయును.

యూఫ్రేషియా :—కండ్లనుంచి యెక్కువగ నీరు కారునపుడు పని చేయును.

డల్కెమారా (Dulcamara) :—తేమవలన గలిగి రాత్రు లధికమగు దానికి పనిచేయును.

మెర్క్యూరియస్ :—ముక్కులు దురద, మంటయుండి, తుమ్ము లెక్కువగానున్నపుడును, ముక్కునుండి నీరధికముగ కారునపుడును - బాగా పని చేయును.

పల్సటిల్లా :—వ్యాధి ముదిరి స్రావము చిక్కబడి పసుపుపచ్చగానున్న చో వాడదగును.

ఎల్లియంసేపా :—తుమ్ములెక్కువ, దుర్వాసనగల స్రావము, రొంప, దగ్గు, తలనొప్పి, స్వరభేదము, ముక్కులు దురద—యీ లక్షణములకు బాగుగా పనిచేయును.

ఫాస్ఫరస్ :—దీర్ఘ రొంపకు చాలామంచిది.

కాలిబైక్ :—స్రావము చిక్కబడి తీగెలవలె యున్నపుడు పనిచేయును.

అమోనియాకార్బ :—రాత్రియం దధికమై, ముక్కులు దిబ్బడవేసి, రోగి నోరుతెరచి యూపిరి పీల్చవలసియుండును. దగ్గు కొంచెముండును. యీ లక్షణముల కద్భుతముగ పనిచేయును.

కేమోమిల్లా :—పిల్లలకు బాగా పనిచేయును.

హెపార్ సల్ఫ (Hepar Sulph) :—ముక్కువాచి, మంట, నొప్పి యుండును.

సెబాడిల్లా (Sabadilla) :— ఇది రొంపలకు చాలామంచిది. విపరీతమైన రొంపపట్టి ముక్కునుండి నీరుకారుట, ముక్కు దిబ్బడవేయుట, మితిలేని తుమ్ములు, కండ్లుమంటలు, కంటినుండి నీరు కారుట—యీ లక్షణముల కద్భుతముగ పనిచేయును. డాక్టరు బోస్ యిట్లు వ్రాసియున్నాడు.

"Eyelids red and burning, lachrymation, coryza, running from nose and spasmodic sneezing."

—Materia Medica by *Dr. S. K Bose.*

ఫెర్రంఫాస్ :—ప్రారంభదశలో పనిచేయును. జ్వర మున్నపుడుకూడ మంచిపనిచేయును.

కాల్కేరియాఫ్లోరు :—దీర్ఘ రొంపలకు మంచిది. స్రావము తెల్లగాను, చిక్కగాను యుండును.

కాలీమూరు :—రొంప బాగా ముదిరి తెల్లగా చిక్కగాయుండి ముక్కు దిబ్బడవేసినపుడు పనిచేయును.

కాలీసల్ఫ :—స్రావము పచ్చగాను, పలచగాను యుండి, సాయంకాల మెక్కువగు రోంపకు పనిచేయును.

నేట్రంసల్ఫ:—తేమప్రదేశములో జనించుదానికిని, స్రావము ఆకుపచ్చగా నుండు రొంపకును పనిచేయును.

నేట్రంమూరు:—పలచని, నీటివంటి స్రావముకారు రొంపకు పనిచేయును.

మెగ్నీషియాఫాస్ :—వాసన తెలియనపుడు వాడదగును.

కాల్కేరియాఫాస్ :—రక్తహీనమగు పిల్లలకు మంచిది. తుమ్ములకు పని చేయును.

సైలీషియా :--దుర్వాసనతో కూడియున్న దీర్ఘరొంపలకు మంచిది.

పైన వ్రాయబడిన జలుబు రొంపలకేగాక, ముక్కులలో నొకవిధమగు కాయలు బయలుదేరి శ్వాసావరోధమును గలిగించు తీవ్రవ్యాధికికూడ 'పీనస' యను పదమును కొందరు వాడుదురు.

దీని లక్షణములు :--ముక్కులలో కాయలు బయలుదేరుట, శ్వాసావరోధము, నోటితో ఊపిరి పీల్చుట, ముక్కులు పెద్దవగుట, ద్రవపదార్థములను మ్రింగలేకపోవుట, నిద్రలో గుర్రుపెట్టుట, ముక్కు మాటలాడుట, చీదినపుడీ కాయలు క్రిందికి జారుచుండును.

చికిత్స :

శస్త్ర చికిత్స మంచిది.

కాల్కేరియాకార్బ, బారిటాకార్బ, తూజా, లైకోపోడియం (దిబ్బడలకు, నోటితో గాలిపీల్చుటకు మంచిది), కాలీబైక్, సాంగ్విసేరియా, ట్యూక్రియం, ఓపియమ్, నేట్రంమూరు, కాల్కేరియాఫాస్—వీటిని వాడదగును.

## 26. కింకవాయువు Croup.

ఇది పిల్లలకువచ్చు నొకవిధమైన శ్వాసకోశములకు సంబంధించిన వ్యాధి. సాధారణముగ రెండు మొదలు రెనిమిది సంవత్సరముల వయసుగలిగిన పిల్లలకును, బలమైన దృఢశరీరముగల మొగపిల్లలకును, క్షయరోగపీడితులైన తలిదండ్రులకు జనించిన పిల్లలకును (Scrofulous children) తరుచు వచ్చుచుండును.

లక్షణములు :—దీనిరాక ద్వివిధములు.

మొదటి విధము :—ఈ వ్యాధి జనించుటకు ముందు బాలునకు జలుబు చేసి రొంపపట్టును. జ్వరమువచ్చును. మొరుగుచున్నట్లు దగ్గుచుండును. గద్గద స్వరము, ముఖమెఱ్ఱబడుట, ఆయాసము, వేగమైన నాడి—ఈ లక్షణము లగపడును. ఇవియన్నియు పగలు తక్కువగను, సాయంకాలమగుసరికి ఎక్కువగను యుండును. కండ్లు జ్యోతులవలె ప్రకాశించుచుండును. ఈ విధముగ రెండుమూడు రోజులు గడచిన పిమ్మట సాయంకాల మెక్కువగు లక్షణములు కాని, రాత్రి ప్రకోపించి, యీలవేయుచున్నట్లు దగ్గువచ్చి, ఊపిరిపీల్చుట కష్టమై, బాలుని నిద్రనుంచి అకస్మాత్తుగ లేవదీయును. ఈ లక్షణములనుబట్టి కింకవాయువు (Croup) అని తెలియనగును.

రెండవ విధము :—పై లక్షణములు- రొంప, జ్వరము వగైరా యేమియు ముందుకనబడవు. శిశువు మామూలుగనే పగలంతయు సుఖముగ నాడుకొని సాయంత్రము యథాప్రకారముగ పండుకొనును. కాని 'దొంగ యింటిలోకి ప్రవేశించినట్లు' అకస్మాత్తుగ దగ్గువచ్చి, యూపిరియాడక శిశువును నిద్రనుంచి లేవదీయును. ఒకసారి ఫిట్ (Fit) వచ్చిన పిమ్మట శిశువునకు కొద్ది నిద్ర పట్టును. కాని వెంటనే ఫిట్టువచ్చి తిరిగి లేవదీయును. ఈ దగ్గు పొడిదగ్గుగా యుండును. ఆయాసముండును. ఊపిరిపీల్చుట కష్టముగయుండును. శిశువునకు కుదురుయుండదు. పండుకొనలేడు. తల్లిచేతులమీద నానుకొనియుండును. మెడ వాచియుండును. ముఖమెఱ్ఱగా యుండును. ఫిట్టుమధ్య దప్పియుండును. కాని విశేషముగ త్రాగలేడు. గొంతుక నొప్పియుండును. తరుచు మూత్రవిసర్జన చేయవలెనని యుండును. కాని కొద్దిమూత్రము మాత్రము వెళ్ళుచుండును. ఈ లక్షణములన్నియుగాని, చాలవరకుగాని యుండును. దీనిదగ్గు ప్రారంభమున కోడికూతకు పోలియుండి, హీనస్వరముండును. బుసకొట్టుచున్నట్లుగాని, రంపపుకోత ధ్వనినిగాని బోలియుండిన పొడిదగ్గు ముఖ్య లక్షణము.

ఈ వ్యాధి రెండురకములు :

1. వ్యాధి నెమ్మదిగ, శాంతగమనముతో (Mild course) నడచును. దుర్గుణములన్నియు క్రమక్రమముగా తగ్గిపోవును. రోగికి ప్రాణాపాయ ముండదు. కాని పూర్తిగ నెమ్మదించుట కొక పక్షమురోజులు పట్టును.

దీని లక్షణములు :—బుసకొట్టు ధ్వనితగ్గుట, క్రమక్రమముగ ఊపిరి పీల్చ

గలుగుట, రోగికి వెచ్చని చెమటలుబోయుట, శిశువు శాంతముగ కుదిరి పడుకొనుట, అన్నిటికంటె ముఖ్యముగా, పొడిదగ్గుపోయి, శ్లేష్మము పలచనై, దగ్గుతో కఫము తెగిపడుట—ఈ లక్షణములున్నచో శిశువునకు ప్రమాదముండదు. శిశువు దగ్గునపుడు కళ్లిని ఉమ్మివేయలేకపోయినను, కఫము తెగినయెడల విరేచనముద్వారా పోవును.

**2.** రెండవ రకము :—దుర్గుణములన్నియు వేగముగబుట్టి వ్యాధి భయంకరరూపము దాల్చును. ఇది 24 గంటలలోగాని, కొద్ది రోజులలోగాని నెమ్మదించవచ్చును. లేదా రోగిని జంపవచ్చును.

దీని లక్షణములు :—శిశువునకు స్థిమిత ముండదు. పక్కనుంచి తొందరగా లేచి, ఊపిరి పీల్చుట కేదో గొంతుకలో నడ్డ మున్నదని చెయ్యి నోటిలో బెట్టి తీయుటకు ప్రయత్నించును. తల వాల్చును. పక్కనుంచి లేచిపోవును. ఒకప్పుడు తిరిగి పడుకొనుచుండును. ముఖము, మెడసిరిలు(Veins of the neck) వాచును. గుండెలు దడదడ కొట్టుకొనును. క్రమేణా దగ్గు తగ్గును. దగ్గుయున్నను మొరుగుచున్నట్లును, పొడిగా నుండును. స్వరము మారిపోవును. లేదా క్షీణించును. వ్యాధి యింకను ముదిరినకొలది ఊపిరి పీల్చలేకపోవును. ఊపిరి పీల్చునపుడు దూరమునకు వినబడునంత పెద్ద బుసకొట్టినట్లుండును. శరీర మంతయు కంపమొందును. శిశువు అపరిమితమైన బాధపడును. ఏమియు తోచక, కుదురుయుండక యిటునటు కొట్టుకొనుట, గోళ్లు కొరుకుకొనుట, ఒడలు రక్కుకొనుట, కాళ్ళమీదను, చేతులమీదను బట్ట లూడదీయుట—యీ లక్షణము లన్నియు నుండును. శరీరము చల్లబడును. ముఖముమీదను, నొసటను చల్లని చెమటలు పోయును. నోరు ముక్కు ఆర్చుకొనిపోవును. ఊపిరి పీల్చుట కష్టమగును. నాడి తీవ్రము, దగ్గు ఉద్రుతము తగ్గును. స్వరము క్షీణించును. ముక్కుతో నూపిరి పీల్చలేక ఉచ్ఛ్వాస నిశ్వాసములు నోటితోనే జరుపవలసియుండును. ముఖము పాలిపోవును. ఆఖరుదశలో పెదవులు, ముఖము నీలవర్ణము గలిగియుండును. నాడి క్షీణించును. ఈ లక్షణము లన్నియు వ్యాధియొక్క ప్రకోపమును దెలియజేయును. ఇది చాల క్రూరమైన వ్యాధి. పై లక్షణములతో చివరకు ప్రాణాపాయము సంభవించును.

వ్యాధి ప్రారంభించినపుడు చివర కెట్లు పరిణమించునో చెప్పుట కష్టము. ఈ వ్యాధితో యితర రోగములుకూడ మిళితమైనచో ఆశ వదలుకోవలసినదే.

కారణములు :—ముఖ్యముగ చలిగాలి సోకినచో కలుగును. శీతోష్ణస్థితి

యం దకస్మాత్తుగ మార్పుకలిగినను (Sudden change of temperature) తరుచు తడి కాళ్ళతో యుండినను, ఆహారములో పోషణపదార్థములు తక్కువగ యున్నను, పాలు మానిన పిమ్మట బిడ్డకు సరియైన ఆహారము లేకపోయినను, శిశువును చెమ్మగాను, చీకటిగాను, పల్లముగాను యుండు గదులలో నుంచుటచేతను, యీ వ్యాధి జనించుచుండును. ఇదిగాక లోగడ స్కార్లెట్ జ్వరము, పొంగు, మశూచికముపడిన పిల్లలకును, బాల్యములోనే గాలిగొట్టము బహు చిన్నదిగానుండు పిల్లలకును కలుగుచుండును.

## చికిత్స :

ఎకోనైట్ :—ప్రారంభదశలో జ్వరము, తీవ్రనాడి, బిడ్డకు కుదురులేక యుండుట, శరీరము వేడి, యెర్రని ముఖము, కలత నిద్ర, నిద్రలో అటునిటు కదులుచుండుట, తరుచు లేచి యేడ్చుట—యీ లక్షణములు కనపడిన వెంటనే వ్యాధినిబట్టి, రోగి వయస్సునుబట్టి గంటగంటకుగాని, అరగంట కొకసారిగాని వాడినచో, చెమటలు పోసి, జ్వరము తగ్గి, బిడ్డకు సుఖమైన నిద్రపట్టును. దగ్గుతోకూడ కళ్ళెపడును. పిమ్మట రోగము తీవ్రరూపము దాల్చదు.

కేమోమిల్లా :—జ్వరము తగ్గి, ముఖ్యముగ రాత్రియందు దగ్గు బాధించుచు, శిశువు యేడ్చునపుడు పనిచేయును.

స్పాంజియా (Spongia) :—ఇది శ్వాసకోశములమీద అద్భుతముగా పనిచేయును. ఈ రోగమునకు ప్రధానౌషధము. బుసకొట్టుచున్నట్లు, రంపపు కోతయొక్క ధ్వనికలిగిన పొడిదగ్గు, రోగి తల పల్లముగాబెట్టి పరుండలేక పోవుట, చదువుటవల్లను మాట్లాడుటవల్లను పాడుటవల్లను మ్రింగుటవల్లను దగ్గు యెక్కువగుట, నిద్రలోనుంచి ఉక్కిరిబిక్కిరియై శ్వాసయాడక భయముతో, ఆందోళనతో, పెద్దదగ్గుతో లేచి కూర్చొనుట—యీ లక్షణములకు ఎకోనైట్ తరువాత దీనిని 30 లేక 200లో అవసరమునుబట్టి గంటకుగాని, అరగంటకుగాని ఒక మోతాదు చొప్పున వాడినచో యితర వైద్యసహాయ మక్కరలేకనే వ్యాధి నెమ్మదించును. దీని దగ్గు మొఱుగుచున్నట్లు, యీలవేయుచున్నట్లుకూడ యుండును. క్షయ లక్షణములనుగలిగి అందమైన ముఖవర్చస్సుగల స్త్రీలకు, పిల్లలకు బాగుగా పనిచేయును.

"It is of service in croup ; the respirations are wheezing, the cough is dry, sibilant, like a saw driven through a

pine board. It is worse from cold winds, while lying with the head low and before midnight."

—*Blackwood* Materia Medica.

ఈ మందు రోగతీవ్రతనుబట్టి పావుగంట కొకసారికూడ వాడవలసి యుండును. అట్టి తరుణములలో శిశువు నిద్రపోవుచున్నాడని తలచి మందిచ్చుట మానకూడదు. నిద్రనుండిలేపి ఔషధ మియ్యవలసియుండును. ఏమన, నిద్రలో నీవ్యాధి బలమగుచుండును. ఎంత దీర్ఘనిద్రపోయిన, వ్యాధి అంతముదురుచున్న దని గ్రహించవలెను. దీర్ఘ నిద్రనుంచి లేచినవెంటనే విపరీతమైన ఫిట్టువచ్చును. కావున నిద్రలోకూడ శిశువునులేపి ఔషధ మియ్యవలెను. జర్మన్ పుస్తకము నుంచి డాక్టరు ఫాస్టర్ యిట్లు భాషాంతరీకము చేసియుండెను.

"This cardinal rule must be observed; that the medicine must be given regularly and must not be discontinued during sleep, for while the child sleeps the disease is advancing, and the longer he sleeps, the graver the complaint becomes and the more formidable the following attack will be."

('Croup' translated by *Dr. Foster M. D.* from German Edition.)

హెపార్ సల్ఫ :—చలిగాలి తగులుటచే జలుబుచేసి రొంపపట్టివచ్చు దగ్గులకును, ఉదయమున యెక్కువగుదానికిని బాగుగా పనిచేయును.

యాంటిమోనియమ్ టార్టు :— గొంతుకలో శ్లేష్మము గురగురలాడుచు కఫము బయటికి వెలువడనపుడును, భోజనముచేయుటచే యెక్కువై, కుడి ప్రక్క పరుండినపుడు దగ్గు ఉపశమించునపుడును, ముఖము నీలవర్ణముగలిగి చల్లని చెమటలుపోయునపుడును బాగుగా పనిచేయును.

శాంబుకస్ :—అర్ధరాత్రివేళ నిద్రలో పెద్ద దగ్గువచ్చి ఉక్కిరిబిక్కిరియై శ్వాసావరోధము గలుగునపుడు, ముక్కులు దిబ్బడవేసినపుడు పిల్లలకు దివ్యౌషధము.

మెఫిటిస్ ప్యుటోరియస్ Mephitis Putorius :— శిశువునకు ఊపిరి తిరుగక శ్వాస బయటికి విడువలేనపుడు పనిచేయును.

కాలీబైక్ :—పొడిదగ్గు కాదుగాని, కఫము బహుగట్టిగాను, జిగురుగాను, తెల్లగాను యున్నపుడు పనిచేయును.

అయోడియం Iodium :—కండపుష్టిగల పిల్లలకు బాగుగా పనిచేయును. బాలుడు స్వరపేటికను (Larynx) గట్టిగ పట్టుకొనుచుండును. ముఖము పాలిపోయి చల్లగాయుండును. ఆకలి యెక్కువయుండును.

ఫెర్రంఫాస్ :—ప్రారంభమున జ్వరమున్నపుడు వాడవలయును.

కాలీమూర్ :—ఈ రోగమునకు చాలామంచిది. దీనిని ఫెర్రంఫాస్‌ను ఒకదానితరువాత నొకదానిని వాడినచో మంచిపనిచేయును. కఫము చిక్కగ, తెల్లగ జిగురుగయుండి, నాలుక తెల్లగాయున్నచో వాడదగును.

కాల్కేరియాఫ్లోర్ :—ఈ వ్యాధికి ముఖ్యమైనది. పై రెండౌషధములు త్వరలో పనిచేయనిచో దీనిని తప్పక వాడదగును.

కాలీఫాస్ :—రోగము ముదిరి ముఖముపాలిపోయి నిస్త్రాణ యున్నపుడు మంచిది.

కాలీసల్ఫ :—గొంతుకలో శ్లేష్మము గురగురలాడుచు బాధగా యున్నపుడు బాగుగా పనిచేయును.

ఇవిగాక బ్రైయోనియా, ఫాస్ఫరస్, కాస్టికమ్, బెల్లడోనా, బ్రోమియమ్, కాల్కేరియాఫాస్‌కూడా వాడవచ్చును. కాల్కేరియాసల్ఫకూడ మంచిదే.

ముఖ్యవిషయములు :—ఈ రోగములో శిశువునకు పంచదార వేడినీళ్ళలో కలిపి యిచ్చుటకూడ మంచిది. దగ్గుకు పనిచేయును. డాక్టర్ ఫాస్టర్ ఇట్లు వ్రాయుచున్నాడు.

"The warmth of the beverage and its softness and sweetness appear to have a beneficial effect on the organs affected and somewhat to modify the raw and harsh character of the cough, and with the application of special Croup remedies, which tend to separate the membranes, the sugar water tends to support their action on the masses."

('Croup' translated by *Dr. Foster*)

గొంతుకను వేడినీళ్ళతో కాపడముచేయుట, మెత్తనైన వస్త్రముచే గప్పి యుంచుట, మరుగుచున్న నీటిలో అయోడియం, బ్రోమైన్, కాలీబైక్ వీటిలో నేదైనను కొద్ది చుక్కలు వేసి ఆవిరిని నోటిలోనికి పీల్చుట, యుఫోర్బియమ్ పట్టీ (Euphorbium plaster) వేయుట—ఇవి యన్నియుకూడ చాలా యుపయోగము చేయును.

కొంతమంది పిల్లల కేమాత్రము చలిగాలి తగిలినను దగ్గు వచ్చు స్వభావ ముండును. అట్టివారిని తలిదండ్రులు చలిగాలిలో తిరుగకుండగ కనిపెట్టి చూచుచుండవలెను.

పథ్యము :—రోగము తీవ్రముగ నున్నపుడు మంచినీళ్లను దప్ప యితర ఆహార మేమియు నివ్వరాదు. కొంచెము నెమ్మదించిన పిమ్మట పాలు నీళ్ళు కలిపి యివ్వవచ్చును.

## 27. కోరింత దగ్గు Wooping Cough.

ఇది యొక విధమైన అంటురోగము. ఇది ముఖ్యముగ పిల్లలలో నెక్కువగ వచ్చుచుండును.

లక్షణములు :—దీనికి మూడు దశలు.

1. Catarrhal Stage. ఇది సాధారణముగ దగ్గుతోను, రొంపతోను ప్రారంభమగును. ఇది ప్రారంభ దశ.

2. Spasmodic or convulsive. పిమ్మట వారము రోజులలో దగ్గు యెక్కువగుట, ప్రారంభముకంటె అతి తరుచుగ వచ్చుచుండుట, పిల్లవాడు దగ్గుటచే ఉక్కిరిబిక్కిరియగుట, ముఖము నల్లబడుట—ఈ లక్షణము లుండును. పిమ్మట దగ్గుతో యీలవలె ధ్వనిగల ఉచ్ఛ్వాసములును, కాకి కూతవంటి ధ్వనులును బయలుదేరి, చివరకు 'హూప్' అను ధ్వనితో ముగియుచుండును. ఈ 'హూప్' అను ధ్వనితో ముగియుట శుభసూచికము. వాంతులు, ముక్కు, నోరు, చెవులనుండి ఒక్కొక్కపుడు రక్తస్రావముకూడ కలుగవచ్చును. ఈ ఫిట్టులు రెండు మూడు గంటల కొకసారిగాని, ఇంకా తరుచుగాగాని వచ్చుచుండును. ఫిట్టు వచ్చినపుడు శిశువుకు ఊపిరిసలుపక బాధపడును. దగ్గులేని సమయములో శిశువు ఉల్లాసముగానే కనుపించును. దగ్గు సాధారణముగ రాత్రులధికమగుచుండును. కావున రాత్రియందు దగ్గుతగ్గి వచ్చుట శుభలక్షణము. దీని పరిమితి సుమారు రెండు మాసములుండును.

3. Remission or decline. కొంతకాలమైన పిమ్మట కళ్ళి తెగి పడి పోవును. పిమ్మట క్రమముగ వ్యాధి నెమ్మదించి శిశువు బాగుపడును. ఇది ఆఖరుదశ. తగ్గుదశ.

శిశువు వయస్సు చిన్నదైనకొలది వ్యాధి ప్రమాద మెక్కువగుచుండును.

కారణములు :—అంటువ్యాధి. చలిగాలి విస్తారముగ తగిలినను, శిశువునకు

స్తన్యదోషమువలనను, సరియైన ఆహారము లేకపోయినను వచ్చుచుండును. శీతకాలములో నెక్కువగును. దీనితో న్యుమోనియా వగైరా వ్యాధులు కలిగినచో చాలా ప్రమాదము.

## చికిత్స :

ఫిట్టువచ్చి పిల్లవాడు ఊపిరిసలుపక బాధపడుచున్నపుడు ఔషధసేవ చేయుట మంచిదికాదు. ఏ మందువాడినను ఫిట్టులకు మధ్య విడువకుండా ఓపికతోవాడి ఔషధలాభమును పొందవలెను. అట్లుచేసినచో ముందువచ్చు ఉద్రేకము తగ్గుచుండును; పిల్లవాడికి సుఖముండును. దీనినే డాక్టరు టూకర్ వ్రాసియున్నాడు. ఇది ఆయన అనుభవముమీదనే వ్రాసియుండెను.

"The use of remedies during a paroxysm is out of question. Whatever therapeutic measures are adopted, they must be brought into use during the intervals, and must be used persistently and patiently in order to test their utility."

(Diseases of children by *Dr. Tooker* )

ఎకోనైట్ :—ప్రారంభమున రొంప, దగ్గు యున్నపుడు వాడినచో వ్యాధి ఉధృతము కానేరదు.

డ్రోసిరా Drosera :—ఈ వ్యాధికి ప్రధానౌషధము. వ్యాధి తరుగుచు ప్రకోపించుచుండును. అనగా ఫిట్టులు త్వరత్వరగా వెంటవెంటనే వచ్చుచుండును. అర్ధరాత్రి దగ్గు ఎక్కువగుచుండును. దీనితో వమనము, చల్లని చెమటలు యుండును. ఇంతేగాక నాసికా ద్వారములనుండి రక్తము స్రవించుచుండును. ఛాతి నొక్కినట్లుండును. డాక్టరు టూకర్ యిట్లు వ్రాసియున్నాడు.

"Cough causes a feeling of constriction in the chest, which is relieved by pressing on the stomach. Cough worse after midnight and is followed by retching and vomiting. Cold clammy perspiration; epistaxis frequently follows the paroxysms of coughing." —*Dr. Tooker.*

కొరేలియం రూబ్రం (Corallium Rubrum) :—దీనిని మినిట్ గన్ కాఫ్ (Minute gun cough) అనగా నిమిష నిమిషమునకు ప్రకోపించు దగ్గునకు వాడినచో అద్భుతముగా పనిచేయును. రాత్రులు ప్రకోపముచెందు

దగ్గునకు మంచిది. ఊపిరి ఆడనంత ఉద్రేకముగావచ్చును. నోటినుండి చిక్కని ఆమము వెడలును. పిల్లవాని ముఖము నీలవర్ణముగా మారును.

కాకస్ కాక్టి (Coccus Cocti) :—రాత్రియొక్క చివర భాగములో గాని, ప్రాతఃకాలమున శిశువు లేచునపుడుగాని దగ్గు యెక్కువగును. దగ్గుఫిట్టు (Paroxysms) వచ్చినపుడు నోటినుండి జిగురువంటి ఆమము త్రాడువలె వ్రేలాడుచు వమనము వెళ్ళును. ఇట్టి దగ్గునకు బాగుగా పనిచేయును.

ఆర్నికా:—ఫిట్టు అనంతరము నోటినుండిగాని, ముక్కునుండిగాని రక్తము స్రవించుదానికి పనిచేయును.

మెఫైటిస్ (Mephites) :—దగ్గు ఫిట్టులు రాత్రు లెక్కువగ వచ్చుచు, పగటిపూట తగ్గుచుండును. ఆహారానంతరము వమనము వెళ్ళుచుండును.

పెర్టూసిన్ :—వ్యాధి రాకుండ ఆపుదలచేయుట కిది బాగుగా పని చేయును.

ఇపెకాక్ :—పొడిదగ్గు, వికారము, వమనము, ముక్కు నోరు నుంచి నెత్తురుకారుట, ముఖము నల్లబడుట, గొంతుకిలో గురగుర, ఆయాసము, ఛాతియందు బరువు–యీ లక్షణములకు వాడవలయును. రాత్రులు దగ్గు అధిక మగుచు నోటినుంచి, ముక్కునుంచి రక్తస్రావము లుండును.

—*Dr Tooker.*

వెరాట్రుం ఆల్బమ్ :—నొసటను చల్లని చెమటలు పోయును. దగ్గునపుడు మూత్ర మప్రయత్నముగ పోవుచుండును.

కుప్రంమెట్ :—ఇది వ్యాధియొక్క రెండవ దశలో బాగా పనిచేయును. శ్వాస ఆడనంత విశేషముగ దగ్గు; దగ్గుతో డోకుయుండి, కంపములు (Convulsions) వచ్చి, శిశువు శరీరము కొయ్యబారి ముఖము నల్లబడినపుడు బాగుగ పనిచేయును. ఘనపదార్థములను తినినచో దగ్గధికమగుచు, ద్రవపదార్థములవలన శాంతించుచుండును. డాక్టరు టూకర్ యిట్లు వ్రాసియున్నాడు.

సినా :—క్రిమి లక్షణములతో–అనగా పాలిపోవుట, ముక్కు గోకు కొనుట, ఆసనము దురద–గూడిన దగ్గునకు పనిచేయును.

యాంటిమోనియంటార్ట్ :—కఫపూరితమై, గురక యుండును. శిశువునకు కోపమువచ్చినపుడు, భోజనము చేయునపుడు దగ్గధికమై, ఆహారము ఆమముతోకూడి వమన మగుటచే దగ్గు శాంతించును. డాక్టరు డ్యూయీ యిట్లు వ్రాసెను.

"Cough worse when the child is angry, or when eating; it culminates in vomiting of mucus and food."

—*Dr. Dewey.*

కాలీబైక్ :—చిక్కని జిగురువంటి కళ్ళెపడునపుడు పనిచేయును.

బెల్లడోనా :—రాత్రు లెక్కువగా వచ్చు పొడిదగ్గుకు మంచిది. దగ్గు యొక్క ఉద్రేకముచే పిల్లవాడు యేడ్చును. ముక్కునుండి నీరు, రక్తముకూడ యుండును. విరేచన మప్రయత్నముగ వెళ్ళును. గొంతుక నొప్పి; ముట్టుకొనినచో దగ్గు వచ్చును. తల, ముఖము వెచ్చగా నుండును. డాక్టరు టూకర్ యిట్లు వ్రాసెను.

హాయోసియామస్ :—రాత్రులు పడుకున్నచో దగ్గు అధికమగును. లేచి కూర్చున్నచో శాంతించును. ఏదైనను తినినను, త్రాగినను, మాట్లాడినను దగ్గు అధికమగును.

ప్రారంభదశలో బెల్లడోనాగాని, హాయోసియామస్‌గాని వాడి, పిమ్మట డ్రోసిరాగాని, ఇపెకాక్‌గాని వాడినచో మంచిపనిచేయునని డాక్టరు టూకర్ వ్రాసియున్నాడు.

ఫెర్రంఫాస్ :— కోరింతదగ్గులో రక్తవమనమగునపుడు పనిచేయును. జ్వరమున్నపుడు వాడవలయును.

మెగ్నీషియాఫాస్ :—ఈ రోగమునకు ప్రధానౌషధము. విడిచి విడిచి వచ్చు దగ్గునకును, చాలాకాలమునుంచి వచ్చు దగ్గునకును మంచిది.

This is almost a specific chief remedy.

కాలీమూర్ :—ఇదికూడ ముఖ్యమైనదే. తెల్లని కళ్లెపడుచు, నాలుక తెల్లగాయున్నపుడు మంచి పనిచేయును.

కాలీసల్ఫ :—త్రాడువలెనుండు పచ్చని కళ్లెపడుచు, క్రిందికి పడక, కొంతవరకువచ్చి తిరిగి గొంతుకలోనికి బోవు లక్షణముగల దగ్గునకు పని చేయును.

కాల్కేరియాఫాస్ :—పాలిపోయి రక్తహీనమగు పిల్లలకు పనిచేయును. మంచి రసాయనము.

జస్టీషియా అథతోడా (Justicia Adhatoda) 3x :— శ్వాసకోశముల జబ్బులకు చాలామంచిది. కోరింతదగ్గులకు బాగా పనిచేయును. రోజుకు రెండుమూడు మోతాదులివ్వదగును. ఇవిగాక డల్‌కెమారా, యాంబ్రగ్రీషియా,

మెర్క్యూరియస్, ఫాస్ఫరస్, లాబీలియాకూడ పనిచేయును.

ముఖ్యవిషయములు :—శిశువును చలిగాలిలో త్రిప్పకూడదు. తిరగనివ్వ కూడదు. వెచ్చనిదుస్తులు కప్పియుంచవలెను. రాత్రియందు ఫిట్టు వచ్చుట తోడనే కనిపెట్టి లేవదీసి కూర్చుండపెట్టవలెను. తేలికయై, సుళువుగ జీర్ణమగు ఆహారము మాత్రమే యిచ్చుచుండవలెను.

## 28. డిఫ్తీరియా Diphtheria మాంససంతానిక.

ఇది యొకవిధమైన అంటువ్యాధి. పెద్దవారిలో కొందరప్పుడప్పుడీ వ్యాధిచే బాధపడినను, తరుచు యెక్కువగ చిన్నపిల్లలకే వచ్చుచుండును. అందు ముఖ్యముగ రెండు సంవత్సరముల లోపల వయస్సుగలిగిన శిశువులలో నిది చాల ప్రమాదకరము.

లక్షణములు :—ఈ వ్యాధి రెండురకములు :—1. సామాన్య లక్షణములను గలిగిన సాధురకము. 2. భయంకర లక్షణములను గలిగిన క్రూరరకము.

1. సాధురకము Mild form :—గొంతుకనొప్పి, ఏమియు మ్రింగలేక పోవుట, అవయవములన్నియు నొప్పులు, శరీరము మంటలు, ఇది ప్రమాదకర మైనదికాదు. త్వరలో నెమ్మదించును.

2. క్రూరరకము Malignant Diphtheria :—చలి, జ్వరము, వణకుటతో ప్రారంభించును. నాడివేగము, శరీరమువేడి, ముఖమెర్రగానుండుట, గొంతుకనొప్పి, మెడ కొయ్యబారుట, గళగ్రంధులు (tonsils) మెడగ్రంధులు (glands of the neck) వాచి పెద్దవగుట, ఏమియు మ్రింగలేకపోవుట, గుటక వేయలేకపోవుట, దగ్గు—యీ లక్షణములుండును. వ్యాధి యింకను ముదిరినచో, ఎడతెగని వమనము, సంధి, మగత, నాసికనుండి రక్తము స్రవించుట, నాడి క్షీణించుట, శ్వాసావరోధము, మూత్రములో శ్వేతధాతువు (Albumen)— ఈ లక్షణము లగపడును. హృదయుమాగిపోవును. రోగి చనిపోవును. నోటినుండి, ముక్కునుండి రక్తస్రావము, మూత్రములో శ్వేతధాతువు— ఇవి శుభలక్షణములు కావు. ఈ వ్యాధిలో గొంతుకలో శోషరసము (lymph) స్రవించుచు, ఉపజిహ్వక, గళగ్రంధులయందు తెల్లని మరకలు బయలుదేరి, పెద్దవై దొంగపొరలు (False membrane) యేర్పడును. ఈ కారణముచే గుటకవేయుట కష్టమగును. శ్వాస వాసనగలిగియుండును. పక్షవాతముకూడ రావచ్చును.

కారణములు :—ఒకవిధమైన క్రిమిచే యీ వ్యాధి కలుగును. ఈ పురుగుచే జనింపబడిన విషము శరీరమంతయు వ్యాపించి రక్తమును పాడుజేసి యీ వ్యాధిని జనింపజేయును. ఈ పురుగు లోకశరీరమునుంచి మరియొక శరీరము లోనికి వెళ్లుచుండును. రక్తము విషపూరితమైన కొలది దినములలో యీవ్యాధి కలుగుచుండును. ముద్దుపెట్టుకొనుటవల్లను, శిశువుల కుపయోగించు పాలబుడ్డి వల్లను, పాలలో కలుపు నీటివల్లను, ఒక యింటిలోనుంచి మరియొక యింటి లోనికి తిరుగు పిల్లలవల్లను—ఇత్యాది కారణములచే యీ వ్యాధి వ్యాపించు చుండును.

## చికిత్స :

బెల్లడోనా :—ప్రారంభమున గొంతుకనొప్పికి మంచిది.

కాలీబైక్ :—గ్రంధులు వాచినను, గుటక వేయలేకపోయినను, చెవిలో పోట్లు పొడిచినను, నాలుక జిగురుగాయున్నను, శ్వాస వాసనయున్నను దీనిని వాడుట మంచిది.

డిఫ్థీరినమ్ 200 :—ఇది యీ వ్యాధికి ముఖ్యౌషధము. రోగమెంత క్రూరమైనదైనను యీ ఔషధము బాగుగ పనిచేయును. గ్రంధులు పెద్దవగుట, నాలుకవాచి ఎర్రబడుట, ముక్కునుంచి రక్తము కారుట—ఈ లక్షణములకు ముఖ్యముగ వాడుటకు తగినమందు. రోగానంతరమున కలుగు పక్షవాతమునకు కూడ బాగా పనిచేయును. బ్లాకువుడ్ యిట్లు వ్రాసియున్నాడు.

"In diphtheria of a malignant type when the glands are enlarged, and tender, and the tongue is red and swollen the discharges are offensive, there is great prostration, epistaxis, and post-diphtheritic paralysis is threatened."

(*Blackwood's* Materia Medica.)

ఫైటోలక్కా :—నాలుక నల్లని పొరచే కప్పబడినను, గొంతుకలో అగ్ని బంతి అడ్డమున్నట్లుండినను, ఊపిరి వాసనయున్నను, గ్రంధులు వాచినను, జ్వరమున్నను, శరీరమంతయు నలగగొట్టినట్లు నొప్పులున్నను, గుటక వేసినపుడు గొంతుకలోనుంచి చెవిలోనికి పోట్లు పొడుచుచున్నను ఇది బాగుగ పని చేయును.

మెర్క్యూరియస్ అయోడేటస్ Mercurius Iodatus :— ఇదికూడ యీ రోగమునకు చాలామంచిది. గ్రంధులువాచి నొప్పియుండుట, గుటక

వేయలేకపోవుట, లాలాజల మెక్కువగ ఊరుట, చిగుళ్లు వాచుట—వీటికి బాగా పనిచేయును.

లాక్‌నాన్‌థిస్ (Lachnanthes) :—మెడ కొయ్యబారి, నొప్పిగా యుండి, ఒక ప్రక్కకు తిరిగియున్నచో వాడదగును.

మెర్క్యూరియస్ సైయనేటస్ (Mercurius Cyanatus) :—ఇది కూడ యీ రోగమునకు ప్రసిద్ధిచెందిన మందు. నోటివెంట నీ రెక్కువగా కారునపుడు, ఊపిరి వాసన యున్నపుడు, రోగము నాసికకుకూడ వ్యాపించినపుడు, నాలుక తెల్లగా యున్నపుడు పనిచేయును. ఏర్పడిన పొర మొదట తెల్లగను, పిమ్మట నల్లగను యుండును. నిస్సత్తువ యెక్కువ యుండును.

కాలీ పెర్మాంగ్ (Kali Permang) :—గొంతుక, గ్రంధులు వాచుట, గుటకవేయలేకపోవుట, ఊపిరివాసనగా యుండుట—యీ మొదలగు దుర్గుణములతోయున్న క్రూరరకమునకు (Malignant diphtheria) బాగా పని చేయును. ఊపిరి వాసనగా యున్నపుడు అద్భుతముగా పనిచేయును.

"There is no remedy with which I am acquainted that will so rapidly and surely remove the offensive odour of the diphtheritic breath as the Permanganate. In this respect the chloride of potash closely resembles it."

—*Dr. H C. Allen.*

క్రొటాలస్ (Crotalus Horridus) :—రోగము తీవ్రరూపము దాల్చి ముక్కునుండి రక్తస్రావ మున్నపుడు దీనికి మించిన దింకొకటి లేదు.

"It is the chief remedy in diphtheria when the profuse epistaxis occurs which marks many cases of a malignant type."

—*Nash.*

బాప్టీషియా :—రక్తమంతయు విషపూరితమైనపుడు వాడదగును.

మూరియాటిక్ యాసిడ్ (Muriatic Acid) :—రోగము ముదిరి, గొంతుకలో పుండ్లు యున్నను, ఊపిరి వాసనగా యున్నను, నిస్త్రాణ అధికముగ యున్నను పనిచేయును. దీనిని పైకి గొంతుకకుకూడా వ్రాయవచ్చును. మరియు నీళ్ళలో కలిపి పుక్కిలిబట్టుటకుకూడ ఉపయోగింపవచ్చును.

కాలీమూర్ :—ఈ రోగమునకు ప్రధానౌషధము. ప్రారంభదశలో దీనిని ఫెర్రంఫాస్‌నుకూడ వాడవచ్చును. గళగ్రంధులు వాచుట, దొంగ పొరలు

యేర్పడుట, నాలుక తెల్లగా నుండుట—యీ లక్షణములకు మంచిది. దీనిని నీళ్ళలో కలిపి పుక్కిలిబట్టుట (Gargle) కూడా మంచిది.

నేట్రంమూర్ :—నోటినుండి నీరుకారుట, అతిసారము, ఆయాసము—యీ లక్షణములకు పనిచేయును.

నేట్రంఫాస్ :—నోటిపైభాగము, గళగ్రంథులు, నాలుక వెనుక భాగము పచ్చగానుండు దొంగరోగము (False diphtheria) నకు మంచిది.

కాలీఫాస్ :—నిస్త్రాణ అధికముగా నున్నపుడు పనిచేయును. మరియు రోగానంతరము కలుగు దృష్టిదోషము, పక్షవాతమునకు మంచిది.

ఇవిగాక కార్బాలిక్ యాసిడ్, లైకోపోడియం, ఆర్సెనికం, యాపిస్, లకెసిస్, కాల్కేరియాఫాస్ కూడా వాడదగును. కాల్కేరియాఫ్లోర్ కూడ మంచిది.

ముఖ్య విషయములు :—రోగి గది పరిశుభ్రముగా యుంచవలెను. రోగికి వాడు ప్రతి వస్తువు వేడినీళ్ళలో పరిశుభ్రముగా కడుగుట మంచిది. చలిగాలి తగులకుండ చూడవలెను. రోగము కొంచెము నెమ్మదించినను అజాగ్రత్తగా యున్నచో తిరిగి తీవ్రముగా రావచ్చును. రోగి గదియందు గంధకము పొగ వేయుట మంచిది. వాంతి యున్నపుడు మంచుగడ్డ నిచ్చుటచే మంచి పని చేయును.

పథ్యము :—రోగికి నీరసము రాకుండ పుష్టిచేయునటువంటివిన్నీ, సులభముగా జీర్ణమగునట్టివిన్నీ ఆహార మియ్యవలెను. పాలు, గ్రుడ్లు మొదలగునవి మంచివి. రోగి మ్రింగలేనియెడల ఆసనము ద్వారానైనను ఆహారము లోపలకు పంపవలెను.

## 29. Tonsillitis గవదకాయలు పెద్దవగుట.

తాలుమండలమున నాలుక మొదలు నానుకొని యిరుప్రక్కల రెండు గ్రంథులవలె రెండు మాంసపిండములుండును. వీటికి గళగ్రంధులనియు గవద కాయలనియు పేర్లు. ఆంగ్లమున వీటికి టాన్సిల్సు (Tonsils) అనిపేరు. ఇవి వాచి, పెద్దవై, నొప్పిగలిగించుటయే 'గళగ్రంథి రోగము' లేక గవదకాయల జబ్బు. ఈ రోగము తరుచు పిల్లలకు, యువకులకు, క్షయచిహ్నములు గల వారికి వచ్చుచుండును. కొందరకు సహజముగ పుట్టుకనుంచికూడ గళగ్రంథులు పెద్దవిగనుండుట కలదు.

లక్షణములు :—గళగ్రంథులు వాచి, పెద్దవై, తాకుట కతిసున్నితముగ నుండి బాధ కలుగజేయును. కొండనాలుక ప్రక్క ఆహారముపోయెడు మార్గమునుకూడ కప్పివేయునంత వృద్ధిగా కనబడును. ఆ కారణముచే గుటకవేయుట గాని, ఆవలించుటగాని బహుకష్టముగ నుండును. ఘనపదార్థములకంటె ద్రవపదార్థములను మ్రింగునపుడును, వట్టి గుటకవేయునపుడును నొప్పి తీవ్రముగ నుండును. కర్ణరంధ్రముల కడ్డుగనుండుట కీగళగ్రంధు లుపయోగపడుటచే ఆవలించునపుడు, మ్రింగునపుడు చెవియందు పోట్లుపొడిచి బాధయుండును. రోగికి కొద్ది చెముడు, స్పష్టముగ మాట్లాడలేకపోవుట, ముక్కుమాటలు, ఊపిరి కష్టముగ పీల్చుట, జ్వరము, తలనొప్పి, దప్పి, చలి— యీ లక్షణము లుండును. ఒకప్పుడొక గళగ్రంథియే వాచవచ్చును. లేదా కొందరకు రెండును పెద్దవై యుండవచ్చును. రోగము రెండింటికి వచ్చినచో దానిని Double Quinsy అనెదరు. దీనిలో జ్వరము తీవ్రముగనుండుట, గుటక బొత్తిగా వేయలేకపోవుట, మాట్లాడుట మిగుల కష్టముగానుండుట, ఊపిరి వాసన యుండుట—ఈ లక్షణములుండును. ఈ రోగి నోరు తెరచి పెద్దగుర్రుపట్టి నిద్రపోవును.

రోగారంభమున వాపు, మంట, ఎరుపు, నొప్పి—యీ గుణములను కనిపెట్టి వైద్యముజేయుట మంచిది. ఉపేక్షించినచో చీముపట్టి వ్రణములు బయలుదేరును.

రోగము 'ఉపజిహ్వకకు' (కొండనాలుక) కూడ వ్యాపించును. ఉపజిహ్వక నాలుకకు అంటుకొనునంత పెద్దదగును. గొంతుకలో చక్కలిగింత యున్నట్లుండి దగ్గువచ్చును.

కారణములు:—క్షయ చిహ్నము గలవారలకు, రక్తాధిక్యముగల యువకులకు (Plethoric persons), చలిగాలి తగిలినను, జలుబుచేసినను యీవ్యాధి కలుగుచుండును. ఆకస్మికముగ గలుగు కాలమార్పులవల్లను, వెచ్చగాయుండి చెమటలు పోయునపుడు చలిగాలిలో కూర్చున్నను, పొంగు మొదలగు వ్యాధులలోను, జీర్ణకోశము చెడిన పిల్లలకును, సరియైన గాలి, వెలుతురులేని యిండ్లలో నివసించు పిల్లలకును వచ్చుచుండును.

ఎకోనైట్ :—ప్రారంభమున జ్వరమునకు పనిచేయును. జలుబువలన గలిగినచో బాగుగా పనిచేయును. దీనిని బెల్లడోనాతో వరుసగ వాడవచ్చును. గుటకవేయుట కష్టముగ యున్నను తలనొప్పికిని పనిచేయును.

మెర్క్యూరియస్ బిన్ అయోడ్ (Me cu:ius Bin Iod) :— లాలాజల మెక్కువగ ఊరునపుడు, గుటకవేయుటకు కష్టముగ యున్నపుడు, వూపిరి వాసనగా యున్నపుడు, బాధ కర్ణములకు వ్యాపించినపుడు పనిచేయును.

బారిటా కార్బ్ (Baryta Carb) :—ఈ రోగమునకు ప్రధానౌషధము. చలిగాలి తగిలి జలుబుచేసిన వెంటనే గళగ్రంధులు వాచి పెద్ద వగునపుడు అద్భుతముగా పనిచేయును. దీనిని ప్రారంభమునుంచి వాడినచో, యితర ఔషధ మక్కరలేకయే రోగమును నెమ్మదింపచేయును. రోగమును ముదర నివ్వదు. టాన్సిల్స్ పెద్దవగుటచే జనించు దగ్గునకుకూడ పిల్లలలో బాగా పని చేయును. దీనిని గురించి డాక్టరు నాష్ యిట్లు వ్రాసియుండెను.

"It seems to have a peculiarly strong affinity for the throat, especially the tonsils, which become greatly inflamed, swollen, and suppurate as a consequence of the least exposure to cold. Thus it becomes one of our most valuable therapeutic agents in old quinsy subjects. Alone it is often sufficient to abort an attack of quinsy and with an occasional dose at long intervals with a high potency, to overcome the tendency thereto...you will find occasionally a case of chronic cough in children with enlarged tonsils reported in the journals as cured by this remedy."

డాక్టరు బ్లాక్‌వుడ్ యిట్లు వ్రాసియుండెను.

(Leaders by *Nash.*)

"It should be remembered in those children with enarged tonsils who are continually taking cold. They are sensitive to cool air and have a disposition to catch cold from washing the head or the least exposure."

(*Blackwood's* Materia Medica.)

డాక్టర్ రడ్డక్ యీ క్రిందివిధముగా వ్రాసెను.

ప్రారంభమున వాడినచో అద్భుతముగా పనిచేయును. దీర్ఘవ్యాధికికూడ మంచిది.

"If given early, before suppuration can supervene, this remedy will often disperse the engorgement. For this

purpose it seems to act best in high potencies 30 and upwards. It is also useful in chronic Tonsillitis."
—*Ruddock*.

లాక్ కానినమ్ Lac Caninum :—వాపు, నొప్పి మొదలగు బాధలన్నియు ఒకప్రక్కనుంచి మరియొకప్రక్కకు సంచరించునపుడు బాగా పనిచేయును. అల్లోపతి వైద్యులుకూడ త్వరలో కుదర్చలేని వ్యాధిని, యీమందు వాడి, వ్యాధి ముదరకుండ, చీము పట్టకుండ త్వరలో నెమ్మదిచేసితినని నాష్ వ్రాసియున్నాడు.

గుయాకమ్ Guaiacum :—గొంతుకలో మంటయుండినను, పొడిదగ్గుయున్నను పనిచేయును.

కేప్సికమ్ :—గళగ్రంధులు వాచినను, కొండనాలుక వాలినను కూడ పనిచేయును. దీనిని గండూషముగకూడ వాడుదురు. అనగా నీటిలోకలిపి పుక్కిలించుట (Gargle).

కాలీబైక్ :—దీనిని యీ రోగమునకును, ఉపజిహ్వికారోగమునకుకూడ వాడవచ్చును. కురుపులులేచి చీముకారునపుడు, దగ్గువచ్చి కఫము జిగురుగానున్నపుడు పనిచేయును.

లైకోపోడియం :—కుడివైపు వాపుతో ప్రారంభించి, యెడమవైపుకు వ్యాపించినచో పనిచేయును.

లేకెసిస్ :— వామగళగ్రంధి వాచినచో పనిచేయును.

హెపార్ సల్ఫ :—చీముపట్టినపుడు బాగా పనిచేయును.

ఫైర్రంఫాస్ :— ప్రాంరభదశలో నొప్పి, మంట, యెరుపు, జ్వర మున్నపుడు పనిచేయును. దీనిని ఉష్ణోదకములో గలిపి పుక్కిళిపట్టుటకూడ మంచిది.

కాలీమూర్ :—గళగ్రంధులపై తెల్లని పొక్కు లున్నను, వాచినను, నాలుక తెల్లగా యున్నను పనిచేయును. దీనినికూడ గండూషముగ వాడదగును.

సైలీషియా :—చీము పట్టినపుడు, కురుపు చితికి చీముకారుటకు బాగా పనిచేయును.

కాల్కేరియాఫాస్ :—గ్రంధులు వాచుట, నోరు తెరచునపుడు నొప్పియుండుట, గుటకవేయుట కష్టముగా నుండుట—వీటికి పనిచేయును. పిల్లలకు రక్తహీనులకు బాగా పనిచేయును.

నేట్రంమూర్ :—పాలు, నీరు మొదలగు ద్రవపదార్థములను త్రాగుటకు కష్టముగా యున్నను, లాలాజల మెక్కువగ ఊరుచున్నను ప్రతి రెండు గంటలకు వాడదగును. కొండనాలుక వాలినపుడు వచ్చు దగ్గునకు పనిచేయును.

గమనింపదగిన విషయములు :—ప్రారంభదశలో మంచుగడ్డ నోటిలోబెట్టి చప్పరించుట మంచిది. దీని వలన యెరుపు- మంట, నొప్పి తగ్గును. మంచుగడ్డ దొరకనిచో నీటియావిరి గొంతుకలోనికి పట్టుట మంచిది. వేడిపాలు, నీళ్లు కలిపి పుక్కిలిబట్టుటవలనకూడ బాధలు తగ్గి ఉపశాంతి యుండును. వెచ్చని పట్టీలు గొంతుకపైన, చెవివరకు వేయవచ్చును. రోగికి చలిగాలి తగులుట మంచిదికాదు. ప్రారంభమున ఉపేక్షచేసి వ్యాధిని ముదరబెట్టినచో శస్త్రచికిత్స చాల మంచిది.

బేసిలినం 200 :—మధ్యమధ్య దీర్ఘవ్యవధిలో ఒక్కొక్కసారి యిచ్చినచో మంచిపనిచేయును.

బారిటామూర్ 30 :—గళగ్రంథులు వాచుట, గుటకవేయలేకపోవుట, కర్ణబాధలు—వీటికి మంచిది.

## 30. గండమాల Scrofula.

రేగిపండు లేక ఉసిరికాయ ప్రమాణముగల గ్రంధులు చంకలలోను, కంఠమునందు, దవడలక్రింద, గజ్జలలోను జనించుచుండును. దీనినే గండమాల యని చెప్పుదురు. అనేకగ్రంధులు వరుసగ మాలవలెనుండుటచే యీ వ్యాధి గండమాలయని పిలువబడును.

లక్షణములు :—ఈ వ్యాధి రెండురకములు. రెండు రకములుకూడ క్షయ రోగ చిహ్నములుగ నెంచబడును.

**1.** మొదటి రకము :—దీనిని నల్లరకమనిగాని, అందవిహీనమైన రకమనిగాని యందురు (Dark type). నల్లని వెంట్రుకలు, దళసరియైన పై పెదవి, వెడల్పయిన నాసికారంధ్రములు, వికారరూపమైన ముఖము, చేతులు, గీతలతో గూడిన మొద్దువంటి గోరులు, అవయవములన్నియు సమముగా నభివృద్ధిచెందక పోవుట (Ill-proportioned body and limbs)—ఈ లక్షణములును, బుద్ధిమాంద్యత, మెడగ్రంధులు వాచుట, గవదకాయలు (Tonsils) పొడవగుట, చెవులనుండి స్రవించుట, కండ్లకలక, కంటిలోపువ్వు, అలజి (Eczema) మొదలగు చర్మవ్యాధులు, రికెట్సు మొదలగు ఎముకరోగములు—ఈ గుణములను కలిగియుండును. బిడ్డ యెదిగినకొలది పాలిపోయియుండును.

**2.** రెండవ రకము :—దీనిని Light type అందురు. అనగా అందమైన రకము. పల్చనైన చర్మము, అందమైన ఛాయ, గులాబిరంగుగల చెక్కిళ్ళు, పెదవులు, నీలవర్ణముగలిగి ప్రకాశించు నేత్రములు, పెద్దవైనకనుపాపలు, పొడుగైన కనుబొమలు, మెత్తని వెంట్రుకలు, గుండ్రని ముఖము, సుకుమార లక్షణములు, చిన్నయెముకలు, అపరిశుద్ధ రక్తనాళములు (Veins) చర్మముద్వారా కనపడుట, బుద్ధిసూక్ష్మత—ఈ లక్షణములతో గూడియుండును. ఈ గుణములుగల శిశువులు తరుచు కళ్ళిదగ్గు (Bronchitis) క్షయ, శిరస్సునందు నీరుచేరుట—ఈ మొదలగు వ్యాధులకు లోనగుదురు.

కారణములు :—ఆహార లోపమువల్లను, తేమప్రదేశములయందు నివసించుట చేతను, శరీర సాధకము లేకపోవుటవల్లను, పెద్దవారైనచో త్రాగుబోతుతనమువల్లను, సుఖవ్యాధులవల్లను—యీ రోగము జనించుచుండును. ఇంతేగాక యీ వ్యాధి వంశపారంపర్యముగ కలుగవచ్చును. రక్తసంబంధముగల దగ్గర బంధువులలో వివాహములు జరిగినచో వారి సంతతికి యీ వ్యాధి వచ్చునని చెప్పుదురు. తలిదండ్రులు క్షయరోగ కుటుంబమునకు చెందినచో బిడ్డలకీ వ్యాధి కలుగుచుండును.

## చికిత్స :

ఎకోనైట్ :—ప్రారంభదశలో జలుబుచేసిన వెంటనే వాడవలయును.

బెల్లడోనా :—వెలుతురు చూడలేకపోవుట, గ్రంధులు వాచి నొప్పియుండుట, గొంతుక నొప్పి—యీ లక్షణములకు వాడదగును.

కాస్టికమ్ :—నల్లని వెంట్రుకలను గలిగి, శ్వాసకోశ, మూత్రకోశములు సరిగాలేని గండమాల రోగులకు పనిచేయును.

కార్బోయానిమాలిస్ (Carbo Animalis) :— గ్రంధులు పెద్దవై వాచి, రాయివలె గట్టిగయున్నను, రోగి త్వరలో జలుబుచేయు తత్వముగలవాడైనను, నొప్పు లున్నను, యీ మందు యువకులకు బాగుగ పనిచేయును.

అయోడియం (Iodium):—నల్లని వెంట్రుకలుగల రోగులకును, గ్రంధులు వృద్ధియై, నొప్పి లేక గట్టిగ యున్నను, ఆకలి యెక్కువ యున్నను, క్షీణించువారికిని పనిచేయును.

కాల్కేరియాకార్బ :—అందమైన ముఖము. స్వచ్ఛమైన శరీర ఛాయ, నీలవర్ణముగల నేత్రములు గలిగి, యెంత స్వల్ప పనిచేసినను అలసటజెందు బల

హీనులైన గండమాల రోగులకును, శిరస్సునందు నీరుచేరునపుడును (Hydrocephalus) బాగా పనిచేయును.

కాల్కేరియా అయొడేటా (Calcarea Iodata) :— గవదకాయలు (Tonsils) వృద్ధియైనను, గ్రంథులు పెద్దవైనను పనిచేయును.

మెర్క్యూరియస్ అయోడేటస్ : - కంఠముయొక్క యెడమప్రక్కను గ్రంథులు వృద్ధియైనచో వాడదగును.

మెర్క్యూరియస్ కార్ :—కండ్ల కలకకు, నీరుకారుటకు పనిచేయును.

మెర్క్యూరియస్‌బిన్ :—గ్రంథులువాచుట, పొత్తికడుపు గట్టిగాయున్నపుడు పనిచేయును.

సైలీషియా :—బలహీనులకు, పెద్ద తలగలవారలకు చెవినుండి స్రవించునపుడు పనిచేయును. చీముకు చాలామంచిది.

కాలీమూర్ :—కంఠమువద్ద గ్రంథులువాచుటకు పనిచేయును.

కాల్కేరియాఫాస్ :—కృశించియున్నను, జీర్ణశక్తి తక్కువగయున్నను, గండమాల వ్యాధిగల బిడ్డలకువచ్చు కంపములకును (Convulsions) బాగా పనిచేయును. ఈ రోగమునకు ప్రధానౌషధము.

"Chronic enlargement of glands, principal remedy. Scrofulous enlargement of glands." —*Chapman.*

కాల్కేరియాఫ్లోర్ :— గ్రంథులువాచి గట్టిగ రాయివలె యున్నపుడు దీనిని వాడవలయును.

కాల్కేరియాసల్ఫ :—చీము పట్టినపుడు పనిచేయును.

"While Silicea hastens the process of suppuration in a normal manner, Calc. Sulph closes up the process at the proper time if it is present in the blood in proper quantity." —*Carey.*

ఇవిగాక మెగ్నీషియాఫాస్, సల్ఫర్ కాలీహైడ్రాయిడికమ్‌కూడ వాడవచ్చును.

లాపిస్‌ఆల్బా Lapis Alba :—ఇది యీ రోగమునకు చాలామంచిది. గ్రంథులువాచి పుండ్లుపడుటకు సిద్ధముగా నున్నపుడుకూడా పనిచేయును. డాక్టరు బోస్ యిట్లు వ్రాసియున్నాడు.

"Used successfully in glandular affections with tendency to cancer. It acts on the uterus and glands. It has also been proved an excellent remedy in Goitre and in scrofulous enlargements of the glands of the neck in long string"

(Materia Medica by *Dr. S K. Bose.*)

క్రోటన్‌టిగ్లియం, వయోలాట్రైకొలార్, హెపార్‌సల్ఫ, ఐరిస్—వీటిని ఈ వ్యాధిలో కలుగు చర్మరోగములకు వాడదగును.

మెర్క్యూరియస్, హెపార్‌సల్ఫ, పల్సటిల్లా, సైలీషియా—వీటిని యీ వ్యాధియందు జనించు కర్ణస్రావములకు వాడదగును.

ముఖ్య విషయములు :—ఈ రోగి పరిశుభ్రమైన గాలి తగులు ప్రదేశములలో పండుకొనవలెను. తగు మాత్రము పరిశ్రమ అవసరము. చలిగాలిలో విశేషముగ తిరుగరాదు.

ఆహారము :—ఈ రోగులకు జీర్ణశక్తి తక్కువై, ఆకలి మందగించి, రక్తక్షీణమగుటచే వారు చాల బలహీనులగుదురు. అట్టివారికి ఫెర్రం అయొడైడ్, కాడ్‌లివర్ ఆయిల్ బాగా పనిచేయును. వారికి బల మిచ్చు ఆహారము—అనగా పాలు, రొట్టి, గ్రుడ్లు మొదలగునవి—తప్పక యిచ్చుచుండవలెను. పాలు, నారింజపండ్లు మొదలగు శరీర పోషక పదార్థములను భుజించుచుండవలెను.

## 31. స్కర్వీ Scurvy.

ఈ వ్యాధి ముఖ్యముగ డబ్బాపాలు త్రాగు బిడ్డలకును, నూతనమైన శాకాహారములు తినని పెద్దవారలకుకూడ కలుగుచుండును.

లక్షణములు :—రక్తహీనము, నిస్త్రాణ, అవయవములలో నొప్పులు, పోట్లు ఉండుటచే వీటిని సరిగ ఉపయోగించలేకపోవుట, గుండెదడ, నీలవర్ణముగల పెదవులు, పండ్ల కుదుళ్లలో నెత్తురుగ్రమ్మి చిగుళ్ళు యెఱ్ఱబడుట, తాకినచో బిడ్డ యేడ్చుట—యీ లక్షణము లుండును. ఇంతేగాక యేమాత్రము దెబ్బ శరీరమునకు తగిలినను రక్తము చిమ్మి చర్మము నల్లగ కములును. గోకినచో పుండ్లు పడును. పాత పుండ్లు బయటపడును. నంజు, అతిసారము, గ్రహిణి, ముక్కు వెంబడి మూత్రము వెంబడి రక్తము పడుట—యీ గుణములు కలిగి రోగి శుష్కించి, హృదయ దౌర్బల్యముచే మృతినొందును.

కారణములు :— సరియైన పోషణ నిచ్చు ఆహారములేని బీదవారి బిడ్డ

లకేగాక, డబ్బాపాలను వాడు భాగ్యవంతుల బిడ్డలకుకూడ యీ వ్యాధి కలుగుచుండును. రికెట్సువలెనే యీ వ్యాధికూడ ఆహారమునకు సంబంధించినది. ఆహారములో గలుగు లోపము వల్లనే యీ వ్యాధులు రెండును జనించుచుండును. మనము భుజించు ఆహారములో రక్తవృద్ధిపరచి శరీరమునకు పోషణనిచ్చి, ఆరోగ్యమును కలుగజేయు పదార్థములు కొన్ని యుండును. వీటినే విటమిన్సు (Vitamins) అనెదరు. ఆరోగ్యమును బడయుటకే విటమిన్సు అత్యవసరము. ఇవి మనము భుజించు ప్రతి వస్తువులో నుండవు, కొన్నిటిలో తక్కువగను, కొన్నింటిలో అసలే లేకుండగను యుండును. ఇవిలేని పదార్థములను మనము భుజించుటచే రికెట్సు, స్కర్వీ, బెరిబెరీ మొదలగు వ్యాధులు కలుగుచుండును. ఇవి నూతనమైన శాకపదార్థములలోను, తోటకూర, గోంగూర మొదలగు పచ్చని ఆకుకూరలలోను, పాలలోను, నిమ్మ, నారింజ, ద్రాక్షఫలములలోను, క్యాబేజి, నీరుల్లి, బంగాళాదుంపలయందును విశేషముగ నుండును. కావున బిడ్డకిట్టి ఆహారమివ్వవలెను. కొబ్బరికాయలోని నీళ్ళుకూడ మంచిపనిచేయును. లవణ మధికముగ వాడుటమంచిది.

## చికిత్స :

ఈ వ్యాధి రాకుండ కాపుదల చేసుకొనుట సులభము. రోగము వచ్చిన పిమ్మట చికిత్స సులభసాధ్యము కాదు. పైన వివరించిన ఆహారములను వాడినచో ఈ వ్యాధి రాకుండ చేసుకొనవచ్చును. వ్యాధి అంకురించినను పైన వ్రాయబడినట్లు ఆహారము మార్చినచో రోగము నెమ్మదించి ఆరోగ్యము కలుగును. ఈ క్రింది ఔషధములను వాడదగును.

మెర్క్యూరియస్ :—ఈ రోగమునకు బాగా పనిచేయును. శిశువు చిక్కిపోయి, నీరసించుట, పాలిపోవుట, చిగుళ్లనుంచి రక్తముకారుట, అతిసారము, గ్రహణి, ఆకలి లేకపోవుట, ఊపిరి వాసనయుండుట—ఈ లక్షణములకు పనిచేయును.

ఫాస్ఫరస్ :—ఆకలియున్నను కృశించిపోవుట, రక్తహీనము, అతిసారము, ముక్కునుండి, చిగుళ్లనుండి రక్తస్రావము—ఈ గుణములకు వాడదగును.

టెరిబెంథినా :—మూత్రములో రక్తముపడుటకు పనిచేయును.

ఫెర్రంఫాస్ :—రక్తవృద్ధిచేయును. రక్తస్రావములకు మంచిది.

కాలీఫాస్ :—పండ్లచిగుళ్ళు నెత్తురుక్రమ్ముట, కుదుళ్ళలోనొప్పి ముక్కు—

నుండి రక్తముకారుట — వీటికిపనిచేయును.

కాలీమూర్ :—చిగుళ్ళనుండి రక్తముగారుటకు పనిచేయును.

నేట్రంమూర్ : —ముఖ్యమైన మందు. చిగుళ్ళు వాచుట, చిగుళ్ళనుంచి రక్తముకారుట, చిగుళ్లునొప్పి—వీటికి పనిచేయును.

ఇవిగాక బైర్యోనియా, సైలీషియాకూడ వాడవచ్చును. పరిశుభ్రమైన గాలి, వెలుతురు గలిగి, తేమలేని గృహములలో నివసించుటవలన ఆరోగ్యము కలుగును.

## 32. అశ్మరి Calculus.

ఈవ్యాధి పెద్దవారికి అరుదుగాను, పిల్లలకు తరుచుగాను గలుగుచుండును. ఈరోగమునకు మూలస్థానము వస్తి (మూత్రపుతిత్తి)

లక్షణములు :—వస్తియుబ్బుట, వస్తి సమీపస్థలము నందధికముగ బాధ, మూత్రమునందు దుర్గంధము కలుగుట, మూత్రకృచ్ఛ్రము, జ్వరము అరోచకము —ఈలక్షణములన్నియు అశ్మరివ్యాధి జనించుటకుముందు కలుగు పూర్వలక్షణములు. వ్యాధి జనించినపిమ్మట నాభియందును వస్తియందును శూల, మూత్రధార పలుతెరంగులుగ చీలికలై స్రవించుట, వస్తియందు గాయమై మూత్రము రక్తముతో గూడియుండుట, మూత్రములో ఘనపదార్థము లుండుటచేతను అశ్మరి మూత్రద్వారము నడ్డగించుటచేతను, మూత్రము బలాత్కారముగ విడువవలసివచ్చుట; యిట్లు విసర్జించుకాలమందు మంట, తీపు మొదలగు బాధలు మిక్కుటముగనుండుట, బాధచే మేఢ్రమును చేతబట్టుకొనుట, బొడ్డును పిసికికొనుట, కేకలువేయుట, మూత్రము మాటిమాటికి బొట్లు బొట్లువలె పడుట, పొత్తికడుపుయందు మంట, పోట్లు — ఈలక్షణములుండును.

కారణములు:—బాలురు సాధారణముగ, గురు, మధుర, శీతల, స్నిగ్ధ(జిడ్డు) పదార్థములను దినుటచేతను, పగలెక్కువగ నిద్రించుటచేతను, యీ వ్యాధి జనించును. మూత్రము ఘనీభవించి రాయివలె గట్టిపడి మూత్రద్వారము నడ్డగించుటచే మూత్రము బొట్లుబొట్లుగా పడుటయు మంటయు నుండును.

### చికిత్స :

బాలురకు శరీరంబును, వస్తియు చిన్నవిగ నుండుటచే వారికీ వ్యాధి సులభముగ కుదర్చవచ్చును.

లైకోపోడియం :—పొత్తికడుపు పొంగరించుట, మలబద్ధము, మూత్రములో యెర్రని యిసుక పదార్థ ముండుట—వీటికి పనిచేయును.

కేంథారిస్ (Cantharis) :—మూత్రము విసర్జించుట కతి తొందర కలుగుట, మూత్రము చుక్కలు చుక్కలుగ పడుట, మంట, తీపు—యీ లక్షణములకు మంచిది.

బెర్‌బెరిస్ వల్‌గారిస్ (Berberis Vulgaris) :—మూత్రాశయ (Bladder) ప్రదేశమంతయు మిక్కుటమైన బాధయుండి, ఆ బాధ మూత్రద్వారమునకు వ్యాపించుట, మూత్ర విసర్జనానంతరము మంట, మూత్రము పచ్చగాను, మడ్డిగానుయుండుట, మూత్రములో అడుగున తెల్లని పదార్థముండుట—యీ లక్షణముల కుపయోగపడును.

ఓసిమం సాన్క్ (Ocimum Sanc) :—మూత్రము మడ్డిగాయుండి తెల్లని పదార్థ మడుగునజేరును. లేదా యెర్రగాయుండి యిటుక పొడుము వంటి పదార్థ మడుగున జేరునపుడు పనిచేయును.

నేట్రంసల్ఫ :—మూత్రము విడుచునపుడు మంట, మూత్రములో నెర్రని యిసుకవంటి పదార్థ ముండుట, రాత్రులు మూత్ర విసర్జన కనుమాన మెక్కువగయుండుట, మూత్రము రంగు గలిగియుండుట—వీటికి పనిచేయును.

నేట్రంమూరు :—మూత్ర విసర్జన కాలమందు మంట, దురద, నడచునపుడు, దగ్గునపుడు, నవ్వునపుడు మూత్ర మప్రయత్నముగ వెడలుట, మూత్రములో యెర్రని యిసుకయుండుట, మూత్రము నల్లగాగాని, రక్త వర్ణముగాగాని యుండుట—యీ గుణములకు పనిచేయును.

సైలీషియా :—మూత్రములో చీము, యెర్రని యిసుకవంటి పదార్థ మున్నపుడు పనిచేయును.

కాల్కేరియాఫాస్ :—మూత్రము సన్నముగ పడుచు, మూత్రాశయమునందు బాధయున్నపుడు పనిచేయును.

మెగ్నీషియాఫాస్ :— మూత్రబంధనము, నొప్పి, భరించరాని బాధయున్నపుడు డీవ్యాధిలో బాగా పనిచేయును. వేడినీళ్ళతో వాడవలెను.

"Spasmodic retention of urine. Gravel for excessive pain."
—*Chapman.*

ఇవిగాక హెమిడెస్‌మస్‌ఇన్‌డికస్ (Hemedesmes Indicus) బెంజాయిక్ యాసిడ్, లకెసిస్‌కూడా వాడవచ్చును.

## 33. శయ్యామూత్రము Wetting the bed.

పిల్లలకు నిద్రలో అప్రయత్నముగ, తెలియకుండగనే మూత్రము స్రవించుచుండును. దీనిని గురించియే యిక్కడ వ్రాయబడుచున్నది. ఇదిగాక పిల్లలకు పెద్దవారికికూడ రాత్రియందే గాక దివమందు సైతము మూత్రము కొందరకు స్రవించుచుండును. దానిని గురించి ముందుప్రకరణములో వ్రాయబడును. ఆ వ్యాధిని 'Enuresis or incontinence of urine'అనియందురు.

శయ్యామూత్ర లక్షణములు :—పిల్లలకు పరుండునపుడు రాత్రులు నిద్రలో ప్రక్కమీదనే మూత్రవిసర్జనమై బట్టలు తడిసియుండును.

కారణములు :—వాతదోషములచేతను (Nervous disorders) అజీర్ణము వల్లను, క్రిములవల్లను కలుగుచుండును.

### చికిత్స :

అమోనియంకార్బ :—నరముల బలహీనమువల్లను (Nervous weakness), అజీర్ణమువల్లను కలుగుటానికి పనిచేయును.

సినా :—క్రిములవలన కలిగినచో బాగుగ పనిచేయును.

కాస్టికమ్ :—మూత్రావయవముమీద అద్భుతముగ పనిచేయును. మూత్ర కోశమునందు దురదయుండును. నిద్రించునపుడు ప్రథమ నిద్రలో మూత్రము తెలియకుండ స్రవించునపుడు, మూత్రములో ఘనపదార్థమున్నపుడు పని చేయును.

సేపియా :—శిశువు నిద్రించినవెంటనే మూత్రవిసర్జనమై బట్టలు తడిసి యుండును. ఇట్టిదానికి బాగుగ పనిచేయును.

సల్ఫరు :—దీర్ఘవ్యాధులకు, చర్మవ్యాధులున్న పిల్లలకు, అతి సుకుమారులకు పనిచేయును.

కాలీఫాస్ :—నరముల బలహీనత, మూత్రద్వారము దురద, నిద్రలేక పోవుట—ఈ లక్షణములుగల శయ్యా మూత్రమునకు చాలా మంచిపని చేయును.

నేట్రంఫాస్ :—క్రిములవలన కలిగినను, మూత్ర మాపుకొను శక్తిలేకపోయినను, మూత్రవిసర్జన సమయమందు మంటయున్నను దీనిని ముఖ్యముగా వాడదగును. అజీర్ణమువలన కలిగినను పిల్లలకిది పనిచేయును.

సైలీషియా 200 :—దీనినికూడ మధ్యమధ్య వారమున కొకమోతాదు యివ్వదగును.

నేత్రుంమూటు :—మూత్రమెక్కువగా అగుచున్నపుడు పనిచేయును.

ఇవిగాక, సిలికా, బెల్లడోనా, నక్సువామికా, మెగ్నీషియాఫాస్ కూడా వాడవచ్చును. చర్మవ్యాధులుగల పిల్లలకు గ్రాఫైటీస్ కూడ మంచిది.

ఉదా :—నాలుగు సంవత్సరముల వయస్సుగల పిల్లవాడు, నిద్రలో రాత్రులు తెలియకుండ మూత్రవిసర్జన మగుచుండెను. ఆసనము దురద యుండెను. పరీక్షించగా క్రిములు కనపడెను, 'సినా' వాడిన పిమ్మట సుఖముగా నుండెను. శయ్యామూత్రము కట్టెను. కొన్ని నెలలనుంచి యుండుటచే పది రోజులు వాడితిని (త|కా)

## 34. అజీర్ణము కడుపునొప్పి Dyspepsia-Colic.

పిల్లలకు తఱుచు సంభవించు వ్యాధు లన్నిటిలో అజీర్ణము ముఖ్యమైనది. ఈ వ్యాధి పెద్దవారలకు వచ్చు రోగములలోకూడ ప్రాముఖ్యము వహించుచుండును. కాని శిశువులలో అతి తఱుచుగ కలుగుచుండును. కడుపు నొప్పి, వాంతులు, అతిసారము, మలబద్ధము, గ్రహణి, శిశువు కృశించుట—యివి యన్నియు అజీర్ణరోగ రూపములే. ఈరోగములకన్నిటికి అజీర్ణమే ముఖ్య కారణము. అజీర్ణ లక్షణములన్నిటిలోను కడుపునొప్పి సాధారణ లక్షణము. కావున దీని చికిత్సనుగురించి ప్రారంభమున తెలుసుకొనదగును. మాటలురాని బిడ్డలలో వారి యేడ్పునుబట్టి దీనిని యెరుగనగును. కాని యేడ్చినంత మాత్రమున కడుపునొప్పియని గ్రహించుట తప్పు. కోపముచేతను, ఆకలిచేతను, ఏమియు తోచకనుకూడ యేడ్చుచుందురు.

కడుపునొప్పి లక్షణములు :—కడుపుమీద చెయ్యివేసి చూచినచో మెత్తగ నుండుటకు బదులు గట్టిగ రాయివలె చేతికితగులుట, శిశువు తనతొడలను పొట్టవద్దకు లాగుకొనుట, కాళ్ళు తన్నుకొనుట, విరోచనములో మెరుగుబిళ్లల వంటి అజీర్ధ పదార్ధములుండుట, బిడ్డ అపానవాయువు విడిచినపుడు యేడుపు మానుట.

కారణములు :—తల్లిపాలుత్రాగు పిల్లలకంటె పోతపాలుత్రాగు పిల్లలకు కడుపునొప్పి తరుచుగ వచ్చుచుండును. పాలను శుభ్రముగ తయారుచేయక పోవుట, పాలబుడ్లు నపరిశుభ్రముగ నుంచుట ముఖ్యకారణములు. గడ్డపాల నుంచి బిడ్డకు పోయుటకు పాలను తయారుచేసి నిల్వయుంచినచో అవి పులిసి పోయి అజీర్ణముచేసి కడుపునొప్పి కలుగును. బిడ్డకు ఆవుపాలను బోసినచో

అవి చిక్కగనుండుటచే సరిగ జీర్ణముకాక కుదపలుకట్టి ప్రేగులలోనికి చేరునపుడు కడుపునొప్పి జనించును. ఇంతేగాక అజీర్ణముచే ప్రేగులలో వాయువు పోక శూలవచ్చుచుండును. తల్లి స్తన్యముగుడుచు బిడ్డలకుకూడ యీ నొప్పి రావచ్చును. స్తన్యము చిక్కగనుండుట, అమితముగ నుండుట, కాలనియమము, పరిమాణనియమము పాటించక యేడ్చినపుడల్ల శిశువునకు పాలుపట్టుట —ఇవి ముఖ్యకారణములు. రెండవ ప్రకరణములో వ్రాయబడినట్లు పాపము కొందరు తల్లులు బిడ్డల యేడ్పునకు కారణమరయలేక పాలు పోయుచునే యుందురు. ఇందువలన వ్యాధి యెక్కువగుట తటస్థించును. మలబద్ధము కూడ కడుపునొప్పి కొక కారణము. కావున మలమును వెడలించుటకు సాధనములు చేయవలయును. క్రిములవల్లను, కొంచెము వయసువచ్చిన—బాలుడైనచో శరీరపరిశ్రమ లేకపోవుటవల్లను అజీర్ణముచేసి శూల జనించును.

## చికిత్స :

కోలోసింథిస్ :—శూలకు ప్రధానౌషధము. నొప్పి భరించ లేనంత యెక్కువగ నుండును. ముందుకు వంగుటచేతను, పొత్తికడుపుమీద యేదైనను పెట్టి గట్టిగ నొక్కుటచేతను ఉపశమించుచుండును. ఈ నొప్పి తరుచు వాంతి, అతిసారముతో యుండును. వేడివలనకూడ కొంత ఉపశాంతి యుండును.

"No remedy produces more severe colic than this one, and no remedy cures more promptly." —*Nash*, P. 392.

కేమోమిల్లా :—పొత్తికడుపు వాయుపూరితమై పొంగరించి పిల్లలకుతరుచు సంభవించు శూలకు బాగా పనిచేయును. శిశువు బాధతో ఇటునటు కొట్టుకొనుచుండును. ఎత్తుకొనినచో పిల్లవాడూరుకొనును. కోపస్వభావముగల పిల్లలకు మంచిపనిచేయును.

స్టాఫిసేగ్రియా :—పండ్లు నల్లగాయుండి, త్వరలో చెడిపోవుట, కండ్లు దురదలుండుట—ఈలక్షణములుగల పిల్లలకు గలుగు శూలకు పనిచేయును.

స్టానమ్ :—శిశువుయొక్క పొత్తికడుపును తల్లి భుజములమీద ఆనుకొని యెత్తుకొనునపుడు నొప్పి తగ్గుచుండును. ఈలక్షణము గలిగిన ఒక మొండి వ్యాధిని దీనితో కుదిర్చితినని నాష్ వ్రాసియున్నాడు.

వెరాట్రంఆల్బమ్ :—రోగి ఉపశాంతికొరకు యిటునటు పచారు చేయుచుండును. స్థిమితముగ కూర్చుండలేడు. నొసటను చల్లని చెమటలు పోయును.

బోవిస్టా Bovista :—ముందుకు వంగినను, ఆహారము తీసుకొనినను ఉపశాంతిగా నుండును.

డయొస్కోరియా :—పొత్తికడుపు వాయుపూరితమై యుండును. నొప్పి నాభిప్రదేశమున జనించి పొత్తికడుపంతయు వ్యాపించినచో యిది బాగుగపని చేయును.

జాలపా :—అతిసారముతో గూడిన శూలకు మంచిది.

కాక్యులస్ :—పొత్తికడుపు పొంగరించుట, అర్ధరాత్రి యెక్కువగుట, అపానవాయువు విడిచినచో తగ్గుట— ఈ లక్షణములుగల శూలకు మంచిది.

సెన్నా :—శిశువులశూలకు, పొత్తికడుపు పొంగరించినపుడు పనిచేయును.

ప్లంబమ్ :—నాభిప్రదేశమందు బాధ మిక్కుటముగ యుండినచో పని చేయును.

కార్బోవెజ్ :—వాయుపూరితమై కడుపుబ్బరము, నొప్పి యున్నపుడు దీనికిమించిన దింకొకటిలేదు. ఆధ్మానమునకు దివ్యౌషధము.

మెగ్నిషియాఫాస్ :—శూలలకు కోలోసింథిస్‌తో సమానముగ పనిచేయు లవణ మిదియొక్కటియే. గ్రహణితో కూడియుండినను, ముందుకు వంగుట చేతను, గట్టిగ నొక్కుటచేతను, వేడివల్లను (Hot applications) ఉపశాంతిగ నుండు నొప్పులకమోఘముగ పనిచేయును. అజీర్ణమువలన కాకపోయినను శిశువులకు వచ్చు శూలకు బాగా పనిచేయును.

"Colic of infants, with drawing up of the legs. Pain relieved by bending double Flatulent colic, eased by friction, heat or belching of gas, Colic coming and going by spells, Colic of newborn infants, when not caused by indigestion". —*Chapman.*

నేట్రంసల్ఫ :—పైత్యోద్రేకమువలన కలుగు శూలలకు పనిచేయును. కాలేయమునకు సంబంధించిన (Derangement of liver) శూలలకు మంచిది. విరోచనముతో శూల తగ్గును.

నేట్రంఫాస్ :—క్రిములవలన గలిగినను, అజీర్ణమువలన గలిగినను, శూలకు పనిచేయును. పెరుగు బిళ్ళలవలె వమనముండును.

కాల్కేరియాసల్ఫ :—కడుపులో గురగురలాడుట; అతిసారము లేక మలబద్ధము, బొడ్డుచుట్టునొప్పి, అపాన వాయువుతో తగ్గుట వీటికి పని చేయును.

కాల్కేరియాఫాస్ :—అజీర్ణమువలన గలిగినచో పిల్లలకు బాగా పని చేయును.

ఇవిగాక పల్సటిల్లా, లైకోపోడియం, నక్సువామికా, కాలీసల్ఫకూడా వాడదగును. చైనాకూడ కడుపుబ్బరమునకు శూలకు బాగా పనిచేయును.

ముఖ్యవిషయములు :—పాలుస్నిగ్ధమై శిశువునకు జీర్ణము కానిచో వాటిని నీళ్ళతో గలిపి పలచనచేయవలెను. కాలపరిమాణ నియమముల ననుసరించి పాలు పట్టవలెను. పాలలో వాము మూటవేసి కాచుదురు. ఇదికూడమంచిదే. ఆముదమును చేతికి రాచుకొని వెచ్చచేసి శిశువు పొట్టను కాచుట చాలా మంచిది. కడుపు నొప్పితో బాధపడు బిడ్డకు ఆ రోజున పాలు మానుట ముఖ్యము.

## 35. అజీర్ణము - వాంతి (Vomiting)

### బిడ్డలు కక్కుకొనుట అజీర్ణముయొక్క రెండవ లక్షణము.

లక్షణములు :— శిశువులు కొందరు పాలు త్రాగగనే కక్కుకొందురు. మరికొందరకు పాలు కొంతసేపిమిడినను సరిగ జీర్ణముకాక పెరుగు బిళ్ళలవలె వమనము కలుగును. త్రాగిన పాలకంటె ఎక్కువగ కనపడు పెద్దవమనము అతివేగముతో రావచ్చును. లేదా కొద్దికొద్దిగ ప్రతిదినము కక్కుకొనవచ్చును. ఒకప్పుడు పాలుగాక జిగురువంటి కఫము వెడలుచుండును. వమనమైన పిమ్మట బిడ్డకు మత్తుగలిగి నిస్త్రాణగ పడియుండును. కడుపునిండుగను, గట్టిగను యుండును. పుల్లత్రేణుపులు, మలబద్ధము లేక అతిసారము, నాలుక తెలుపు, ఊపిరి పులుపు వాసన, శిశువు మత్తువలన కండ్లు సగము మూసికొని పండుకొనుట— ఈ లక్షణము లుండును. కొద్ది జ్వరముకూడ యుండవచ్చును. స్తన్యమందిష్టముండదు. బిడ్డ క్రమముగా నీరసించి క్షీణించును. కావున చికిత్స త్వరలో చేయుట మంచిది.

కారణములు :—కాలనియమము, పరిమాణ నియమము లేక బిడ్డకు పాలు పోయుట, మొదలగు పైన కడుపునొప్పికి తెలియజేయబడిన కారణములే దీనికికూడ వర్తించును.

### చికిత్స :

ఎథూసాసైనేపియమ్ (Aethusa Cynapium) :— శిశువుల వాంతులకు దివ్యౌషధము మరియొకటి లేదని చెప్పవచ్చును. పాలు త్రాగినవెంటనే

కక్కుకొనుట, పిమ్మట బిడ్డ నిస్త్రాణతో మత్తుగ పండుకొనుట- ఇవి యీ మందు వాడుటకు ముఖ్యలక్షణములు. ఒకవేళ పాలు కొంచెము కాలము కడుపులో యిమిడినను, పుల్లని పెరుగు ముదపలవలె పెద్ద వమనమగును. దాహముండదు.

"It is one of our best remedies for vomiting of children" —*Nash.*

"One of the great characteristics of this remedy is violent vomiting of everything taken and especially an intolerance to milk, which is ejected, as soon as taken, in yellowish or greenish curds, or there is violent, sudden, forcible vomiting of frothy, curdled milk and frothy cheesy material Following the vomiting there is great weakness and exhaustion. The child is so exhausted it falls to sleep at once. But it soon awakens hungry, eats and vomits again. So that hunger after vomiting becomes characteristic." —(*Blackwood's Materia Medica*)

కాల్కేరియా ఆస్ట్రియారమ్ :— పుల్లని పెరుగువంటి, పదార్థమును వమనము జేసుకొనుట, పులిత్రేణుపులు, పుల్లని విరేచనములు, శరీరమంతయు పుల్లనివాసన, మలబద్ధము లేక దుర్వాసనతోగూడిన మలము వెడలుట– ఈ లక్షణములతోగూడిన వాంతులకు పనిచేయును. నెత్తిమీద చెమటలు పోయును. మాడున గుంట లుండును.

ఇపెకాక్ :—వికార మెక్కువగ నుండును. స్తన్యమందయిష్టము, వమనముతో ఆమముపడుట–యీ లక్షణములకు పనిచేయును.

వెరాట్రం ఆల్బమ్ :—ముఖమందు చెమట, నిస్త్రాణ, అతిసారము— వీటితోగూడిన వమనమునకు వాడదగును.

ఇన్గ్లువిన్ (Ingluvin) :—అజీర్ణ దోషముచే జనించిన కడుపు నొప్పి, వికారముతోకూడిన వాంతులకును, శిశువులకు కలరా వ్యాధిలో వచ్చు వమనములకును పనిచేయును.

నక్సువామికా :—మలబద్ధము, ఆహారము నందయిష్టము– యీ గుణము లున్నచో పనిచేయును.

పల్సటిల్లా :—ఆమముతోగూడిన అతిసారము, నాలుక తెలుపు, ఆమము

గాని పసరుగాని వమనమగుట—వీటికి పనిచేయును. ఈ రెండును జీర్ణకోశముమీద బాగుగ పనిచేయును.

కాల్కేరియాఫాస్ :—పాలు జీర్ణముకాక, పెరుగు కుదపవలె వమనమగుట దీనికి ముఖ్యలక్షణము. అప్పుడు దీనిని తప్పక వాడవలయును. జీర్ణకోశముమీద పిల్లల కద్భుతముగ పనిచేయును. పిల్లలకాహారమును బాగుగ జీర్ణము చేయును.

నేట్రంఫాస్ :—కడుపునొప్పి, ఉబ్బరము, పులిత్రేణుపులు, పుల్లని పదార్థములు వమనమగుట, శిశువులు పెరుగు కుదపలవలె కక్కుకొనుట—వీటికి అమోఘముగ పనిచేయును. పెరుగు ఓళ్ళలవలె కక్కుకొను పిల్లల కనేకమందికి ఒక్కటి రెండు మోతాదులతో నెమ్మదించెను.

నేట్రంమూర్ :—కడుపు నిండుగ యుండుట, త్రేణుపులు, వికారము, పెరుగువలె వమనము, కాఫీగింజలరంగువంటి వమనము—ఈలక్షణములకు పనిచేయును.

ఫెర్రంఫాస్ :—అజీర్ణలక్షణములుగల వమనములకు మంచిది.

నేట్రంసల్ఫ :—పైత్యలక్షణములుగల వమనములకు మంచిది.

ముఖ్యవిషయములు :—తల్లి స్తన్యము దోషమైనచో మాన్పించుటమంచిది. పాలిచ్చుటలో కాలనియమము ముఖ్యముగ పాటించవలెను. శిశువున కావుపాలు పట్టినచో కొంచెము సున్నపుతేట నీళ్ళనుకూడ యిచ్చినచో త్వరలో జీర్ణమగును. పిల్లవాడు కొంచెము పెద్దవాడైనచో మంచుగడ్డ కొంచెమిచ్చిన వమనము కట్టును.

## 36. అతిసారము Diarrhoea నీళ్ళవిరేచనములు

పిల్లలకు ప్రమాదము గలిగించు వ్యాధులలో అతిసారమొకటి. పెద్దవారికంటె పిల్లలకీ వ్యాధివలన తరుచు విపత్తులు సంభవించుచుండును. కావున దీనికి తరుణమందే తగుచికిత్స చేయవలయును.

లక్షణములు :— ఇది అనేక రకములు :

1. సాధారణమైనది మొదటి రకము. దుర్గంధములేక, జ్వరములేక పసుపుపచ్చని పల్చని విరేచనము లుండును. ఇది ప్రమాదమైనది కాదు.
2. విరేచనము లాకుపచ్చగ నున్నచో కాలేయమునుండి పైత్యరస మధికముగ పోవుచున్నదని గ్రహించవలెను.

3. విరేచనములు పులిసిపోయిన వాసనగలిగి తెల్లని పెరుగుబిళ్లలవలె పలుకులతో కూడియుండినచో అజీర్ణ మధికముగ యున్నదనియు, ఆహారము జీర్ణముకాలేదనియు తెలుసుకొనదగును. జీర్ణముకాని పదార్థము వమనము కూడ వెళ్ళును.
4. విరేచనములు శ్వేతరంగుకలిగినచో కాలేయము సరిగ పనిచేయుట లేదనియు, అగ్నిమాంద్య మనియు గ్రహించనగును.
5. నీళ్ళవిరేచనములు, మధ్య మలబద్ధ మున్నచో, మలబద్ధమే కారణమని యుహించదగును.
6. విరేచనము లకస్మాత్తుగ, అధికముగ ప్రారంభించి వాంతి యున్నచో కలరాకు సంబంధించి యుండును.
7. విరేచనములలో రక్తపు జీరగాని, రక్తముతోగూడిన ఆమముగాని యుండినచో రక్తాతిసారమనిగాని, గ్రహణియనిగాని యెరుంగవలయును.

అతిసారములో తరుచు వమనము, కడుపునొప్పి, ఉబ్బరము, జ్వరము—యీ లక్షణము లుండును. పాల యందిష్ట ముండదు. విరేచనము లధికమైనచో కాళ్లు, చేతులు చలువలు క్రమ్మును. శిశువు నీరసించును. కండ్లు గుంటలు పడును. నిద్రపోవునపుడు కండ్లు సగము మూసుకొనియుండును. మూత్రము కూడ క్రమముగ తగ్గును. ఈ లక్షణము లన్నియు వ్యాధియొక్క ప్రమాద అవస్థను తెలియజేయును.

కారణములు :—ఆహార మందలి లోపములు, సరియైన ఆహారము లేకపోవుట, తేమ, చలి—యివి ముఖ్యకారణములు. పోతపాలు త్రాగు బిడ్డలకీ వ్యాధి యెక్కువగ వచ్చుచుండును. ఆవు పాలు ఉదయమున పితికి వాటినే సాయంత్రమువరకు వాడుచుందురు. ఇది చాల దోషము. మరియు వాటిపై మూతవేసి చక్కగ జాగ్రత్తపెట్టక నిర్లక్ష్యము చేయుదురు. గడ్డపాలను వాడినచో పొంగునీళ్ళలోకలిపి చల్లారుటకై మూత తెరచి యుంచెదరు. ఇంతేగాక శిశువు త్రాగిన పిమ్మట నిల్వయున్నచో దాచిపెట్టి యుంచుటకూడ కొందరిలో కలదు. ఈ కారణములచే బయటనుంచి సూక్ష్మజీవులు పాలయందు ప్రవేశించి పాలను జెరుపును. అందువలన సరిగ జీర్ణముగాక అతిసారము జనించును. తేమ ప్రదేశము, చలిగాలి అజీర్ణమును పెంపు జేయును.

ఇవిగాక పైన అజీర్ణమునకు తెలియజేసినకారణములన్నియు చూడదగును. పొంగు, మశూచి, జ్వరము, కళ్ళిదగ్గు, కింకవాయువు (Croup) కోరింత

దగ్గు—యీవ్యాధులయందుకూడ అతిసారము రావచ్చును.

## చికిత్స :

వ్యాధి ప్రారంభమైన వెంటనే ఒక సంవత్సరములోపు వయసుగల శిశువైనచో ఆముదమును ఇచ్చుట మిక్కిలి శ్రేష్ఠమైన పని. విరేచనము లధికమగునని సంశయింపరాదు. ఆముద మిచ్చుటవలననే పేగుల యందుండెడి మలిన పదార్థమంతయు బయటికి వెడలిపోవును.

కేమోమిల్లా :—దంతములు మొలచునపుడు కలుగు విరేచనములకు ప్రధానౌషధము. దీనివిరేచనములు ఆకుపచ్చగను, నీళ్ళవలె పల్చగను, కుళ్ళిన కోడిగ్రుడ్డు వాసనగలిగి యుండును. చలిగాలిచే యెక్కువగును. నోరు, నాలుక ఆరిపోవును. పిల్లవాడు నిద్రలో యేడ్చుచుండును.

క్రోటన్‌టిగ్లియమ్ :—చిమ్మిలి గొట్టములోనుంచి వచ్చినట్లు అతివేగముగ ఒక్కసారి గభాలున విరేచనమగును. వేసవికాలములో పిల్లలకు వచ్చు విరేచనములకు పనిచేయును. దీని విరేచనములు పలచగ, పసుపుపచ్చగ నుండును.

పోడోఫిల్లం :—ఉదయమున, వేసవికాలములోను, పిల్లలకు పళ్ళువచ్చు సమయమందు జనించు అతిసారమునకు మంచిది. విరేచనము పెద్దదిగను, వాసన కలిగియుండును. పసుపుపచ్చగాగాని, ఆకుపచ్చగాగాని ఉండును. నీళ్ళవలె పల్చగ నుండును. కాలేయమునకు (Liver)సంబంధించిన జబ్బులకు చాల మంచిది.

ఒలియాండర్ (Oleander) :—జీర్ణముగాని పదార్థములతో కూడి, వాయువు వెడలునపు డప్రయత్నముగా నగు అతిసారమునకు మంచిది.

ఫాస్ఫరస్ :—గొట్టములోనుంచి పోసినట్లు విరేచన మగును. మధ్యమధ్య తెల్లని ఆమము పడుచుండును.

డల్‌కెమారా :— వర్షాకాలమందు, చలిగాలివలన గలుగు జలుబుచే జనించు విరేచనములకు మంచిది. దీని విరేచనము తెల్లగ, పులిసిన వాసనగలిగి యుండును.

కాల్కేరియా కార్బ్ :—బలిసిన పిల్లలకు, గండమాలవ్యాధిగల పిల్లలకు, పాలు త్రాగిన పిమ్మట కలిగి, తెల్లగను, మట్టి రంగుగనుండి, పెరుగు పిడపల వలె జీర్ణముకాని పాలు విరేచనమగుచు, కుళ్ళిన కోడిగ్రుడ్ల వాసన యుండినచో పనిచేయును.

సినా :—క్రిములకు పనిచేయును.

వెరాట్రంఆల్బమ్ :— వ్యాధి ముదిరినస్థితిలో బాగాపనిచేయును. అతి తరుచుగ, ఎక్కువగ, కడుగువలెనగు నీళ్ళవిరేచనములకును, కాళ్లు చేతులు చల్లపడినపుడును అద్భుతముగ పనిచేయును. మహావాతములకు దివ్యౌషధము. నిస్త్రాణ ; నొసటను చెమటలుండును.

బైరియోనియా :— వేసవికాలములో పిల్లలకు కలుగు అతిసారమునకు పనిచేయును.

పల్సటిల్లా :—ఆమముతోకూడి, ప్రేగులలో గురగురలాడుచు, రాత్రి యందెక్కువై, గురుపదార్థములను దినుటచే కలుగు విరేచనములకు పని చేయును.

కేంఫర్ :—విరేచనము లధికమై శరీరమంతయు మంచుగడ్డవలె చల్ల పడినచో దీనిని తప్పక వాడవలయును.

బాప్టీషియా :—దుర్వాసనతోకూడిన నీళ్ళ విరేచనములకు పనిచేయును.

ఇపెకాక్ :—నురగవలెను, ఆకుపచ్చగాను వెళ్లుచు, వికారము, వాంతి యుండును.

చైనా :—పసుపుపచ్చని, అజీర్ణ నీళ్ళవిరేచనములకు మంచిది. విరేచన కాలమందు నొప్పి యుండదు. నిస్త్రాణయుండును.

బిస్మత్ :—విరేచనము పెద్దదిగను, దుర్వాసన కలిగియుండును. త్రాగిన వెంటనే వమనమగును.

గ్రాటియోలా (Gratiola off) :—దీని విరేచనములు పసుపుపచ్చగాను నీళ్లవలెయుండును. వేసవికాలములో చన్నీళ్ళు విశేషముగ త్రాగినమీదట పిల్ల లకు వచ్చు అతిసారమున కమోఘమైనది.

ఆర్సెనికమ్ :—వ్యాధి ముదిరినపుడు పనిచేయును. రాత్రియం దధికమగుట, దాహము, ముఖము కృశించి పాలిపోవుట -యీ లక్షణములకు పనిచేయును.

నేట్రంసల్ఫ :—వర్షాకాలమందు తేమచే జనించునపుడు, విరేచనములతో అపానవాయువు లెక్కువగ వెడలునపుడు, విరేచనము ఆకుపచ్చగ నుండు నపుడు, ఉదయము లేచుటతోడనే విరేచనము కతి తొందర కలిగినపుడు, అప్రయత్నముగ మలవిసర్జనమగునపుడు పిల్లలకు దీర్ఘకాలమునుంచి యున్న అతిసారరోగమునకు బాగా పనిచేయును.

నేట్రంఫాస్ :—విరేచనము ఆకుపచ్చగాగాని, మట్టిరంగుగగానియుండి, పులిసిన వాసనగలిగియుండును. ఒక రోజు మలబద్ధము, రెండవరోజు నీళ్ళ

విరేచనములు, క్రిములచే గుదస్థానమందపరిమితమైన దురద, వేసవికాలమధిక మగును. కడుపునొప్పి యుండును.

నేట్రంమూర్ :—కడుపునొప్పియున్న దీర్ఘరోగమునకు మంచిది. ఒకరోజు మలబద్ధము, రెండవరోజున నీళ్ల విరేచనములు.

కాల్కేరియాఫాస్ :—దంతములు మొలుచు సమయములోగాని, అజీర్ణము వలనగాని పిల్లలకు కలుగు విరేచనముల కద్భుతముగ పనిచేయును. దీని విరేచనములు వెచ్చగ, నీళ్లవలె పల్చగయుండి వాసనయుండును. ఒకప్పుడు అజీర్ణముతోకూడి ఆకుపచ్చగాకూడ యుండును.

రూమ్; హెపార్‌సల్ఫ :—విరేచనములు పుల్లని వాసనయుండును. పిల్లవాని శరీరముకూడ పులుసువాసన కలిగియుండును.

ఇవిగాక యాంటిం క్రూడమ్, అయోడియం (Iodium), ఏలోస్, గాంబోజియా, కాలీఫాస్, సైలీషియా, యాసిడ్‌ఫాస్‌కూడ వాడవచ్చును.

ముఖ్యవిషయములు :—విరేచనము లధికముగ నుండినచో ఆహారమేమియు ఇవ్వరాదు. నీరసించునని తోచి అమాయకులైన తల్లులు కొందరు పాలుపట్టుదురు. ఇది చాల తెలివితక్కువపని. పాలుపట్టుట రోగమును వృద్ధిచేయుటయే. కావున ఒకటి రెండు రోజులాగి, పిమ్మట బార్లీనీళ్ళుగాని, చిట్టుడుకు నీళ్ళుగాని యిచ్చుట మంచిది. అన్నముతిను పిల్లలైనచో పిమ్మట పాత బియ్యము వేయించి వండిపెట్టవచ్చును. సోడా యిచ్చుట మంచిది. సున్నపు తేట నీళ్ళు పాలు యిచ్చినను మంచిదే. సున్నపునీళ్ళు (Limewater) త్వరలో జీర్ణము చేయును. రోగికి చలిగాలి తగులనివ్వక బట్ట కప్పియుంచుట శ్రేయస్కరము.

కొందరు తల్లులజ్ఞానముచే విరేచనములు కట్టుటకు తమపిల్లలకు నల్లమందు వాడుదురు. దీనివలన విరేచనములుకట్టి పిల్లలు మత్తుగా పడియుండుటజూచి మందు పనిచేసినదని సంతోషించుదురు. కాని దీనివలన తాత్కాలికగుణ మగపడినను, శరీరమందు చెడుగుణములు పుట్టి, నూతనరోగములు జనించి, పిల్లల ఆరోగ్యము చెడిపోవుచున్నదని గ్రహించలేకున్నారు. ఇట్టి మత్తుపదార్థములను పూర్తిగా నిషేధించవలయును.

## 37. గ్రహణి Dysentry.

అతిసారమువలె నిదికూడ పిల్లలలో ప్రమాదమును గలిగించు వ్యాధులలో నొకటి.

లక్షణములు :—వ్యాధి సాధారణమైనచో క్రమముగ ప్రమాదములేక తగ్గి పోవును. కాని వ్యాధి క్రూరమైనచో అనేకగుణములు పుట్టును. కొందరిలో చలి, జ్వరము, తలనొప్పి, వికారము, వాంతి—ఈ లక్షణములతో ప్రారంభ మగును. నాభివద్ద, పొత్తికడుపు నలుమునట్లు నొప్పి ప్రథమలక్షణము. పిమ్మట ప్రేగులలో నేదియో నొప్పిని కలుగజేయు పదార్థముండినట్లు బాధపడుచు, దానిని వెడలించుటకు రోగి తరుచు మలవిసర్జనకు కూర్చుండును. బహిర్దేశము నకు వెళ్ళుట కతితొందర కలుగును. కాని కూర్చుండినపిమ్మట ఆసనము తీపు కడుపునొప్పివల్ల యెంతముక్కినను బయటకురాక, కొద్దిచీము, నెత్తురుమాత్రము పడుచుండును. రోగారంభమున కొద్దిమలము చిన్నవుండలవలె పడినను, ఒకటి రెండు రోజులు గడచినపిమ్మట మలము లేకుండ కేవలము రక్తము కొద్ది చుక్కలు మాత్రమే పడును. పిల్లవాడు బాధచే నెక్కువగ తినుకుచుండును. తినుకునపుడు మలమునకు బదులు మలాశయము బయటకుజారి చూచుటకు భయము కలిగించును. వ్యాధి ముదిరినకొలది బయటకు వెళ్ళవలసిన అవసర మెక్కువగును. రోజుకు 30 లేక 40 సార్లుకూడ వెళ్ళవలసి వచ్చును. బిడ్డకు స్మారకము తెలియకయే విరేచనము (నెత్తురుచుక్కలు మాత్రము) అగుచుం డును. క్రమముగ బిడ్డ నీరసించి బలహీనమై, ముఖలక్షణములు మారి, నాడి నీరసించి, ఎక్కిళ్ళు ప్రారంభించి, సంధివచ్చి చనిపోవును.

రక్తస్రావము తగ్గుట, మలముపడుట, నీరసించకపోవుట, శరీరము వెచ్చగ నుండుట—ఇవి శుభలక్షణములు.

కారణములు :—ఈ వ్యాధి ఉష్ణప్రదేశములలో నెక్కువగ వచ్చుచుం డును. తీక్షణమైన వేడిపదార్థముల నమితముగ సేవించినను, అత్యుష్ణమైన పరి సరములనుంచి అతిశీతలమైన పరిసరములకు మారినను, భరించరాని వేసవికాల మకస్మాత్తుగ వర్షాకాలములోనికి మారినను, వర్షకాలములోవచ్చు అపరిశుభ్ర మైన బురదనీటిని త్రాగినను, సరియైన ఆహారము లేకపోయినను, ఈ వ్యాధి జనించును. బాలురలో కలుగు అతిసారము, విరేచనమురంగు రక్తపిత్తముగ మారి గ్రహణిలోనికి దింపవచ్చును. పైనవ్రాయబడిన నొప్పి, తీపు మొదలగు లక్షణములన్నియు నుండును. అతిసారమేగాక మలబద్ధమున్ననూ గ్రహణి లోనికి మారుచుండును.

## చికిత్స :

ఎకోనైట్ :—ప్రారంభమున జ్వరమున్నపుడు వాడవలయును. రక్త మధికముగను, చీము, మలము కొద్దిగ వెళ్లునపుడు వాడదగును.

మెర్క్యూరియస్ కార్ :—గ్రహణికి ప్రధానౌషధము. మలవిసర్జనకు పూర్వమందు, పరమందుకూడ తీవ్ర మిక్కుటముగ నుండును. మలవిసర్జన సమయమందు అపరిమితముగ తినుకుట; ప్రత్యేకము రక్తముగాని, రక్త మధికముగాని పడుట—యీ లక్షణములకు బాగుగ పనిచేయును.

మెర్క్యూరియస్ వైవస్ :—విరేచనములు, నెత్తురుతోను, జిగురుతోను కూడియున్నను, మల విసర్జనసమయమందును, అనంతరమందును భరింపరాని తీపుండినను, దొడ్డిలో యెంతసేపు కూర్చుండినను తృప్తిలేకపోయినను, దీనిని వాడినచో అద్భుతముగా పనిచేయును. జాన్సన్ యిట్లు వ్రాసియున్నాడు.

"Stools bloody mucus or green slimy. Violent tenesmus during and after stool. Wants to remain a long time at the chamber." —(*Johnson's* Family Guide.)

కోల్చికం ఆటమ్నేల్ :—పొత్తికడుపు పొంగరించియున్నను, విరేచనము తెల్లని జిగురు, ఆమము, రక్తముతో కూడియున్నను, ఆహారమం దయిష్ట ముండినను దీనిని తప్పక వాడవలయును. వంటచేయునపుడు వాసనకూడ గిట్టదు. లక్షణములు రాత్రి ఉద్రేకించును.

పోడోఫిల్లం :—విరేచనము చీము నెత్తురుతోకూడి, ప్రేగులలో గురగుర లాడునపుడు, మలాశయము జారినపుడు బాగుగ పనిచేయును.

హేమామెలిస్ :—రక్తస్రావము లన్నిటికి మంచిది.

ఇపెకాక్ :—వికారము, వాంతి, కడుపునొప్పి, ముక్కుటు, దుర్వాసన గలిగి, చీము రక్తముతోకూడి ఆకుపచ్చరంగుగాని, నల్లరంగుగానిగల విరేచనములు—యీ లక్షణములలో పిల్లల కమోఘముగ పనిచేయును. ఉద్రుతముగా నున్న కేసులలోకూడ పిల్లలకు వాడితిని. అద్భుతముగా పనిచేసెను.

"It is of service in dysentry, especially autumnal form, which is observed when the cool nights are followed by hot days." —*Blackwood.*

"An invaluable remedy for the children."

నైట్రిక్ యాసిడ్ :—రక్తస్రావము లన్నిటికి మంచిది. మల విసర్జనానంతరముకూడ అపరిమితమైన నొప్పి; ఏమియు తోచక యిటునటు తిరుగు చుండును.

ఇగ్నేషియా :— మలాశయము వెలుపలికి వచ్చినపుడు దీనికి మించిన

ఔషధ మింకొకటిలేదు. యీ లక్షణముగల గ్రహణిలో పిల్లలకు మెర్క్యూరియస్ కార్, ఇగ్నేషియా ఒకదానితరువాత ఒకటి నేను స్వయముగా వాడితిని. అమోఘముగ పనిచేసెను.

ఏగ్లిమార్మిలాస్ Aegle Marmelos :— గ్రహణికి ముఖ్యమైన దేశీయ ఔషధము. పిల్లల కద్భుతముగ పనిచేయునని ఛటర్జీగారు వ్రాసియున్నారు.

"Hindu specific in dysentry. Most valuable in the cases of children."

కోలోసింథిస్ :—నొప్పికి పనిచేయును. మెర్క్యూరియస్ కార్ వాడిన పిమ్మట కడుపునొప్పికి దీనిని వాడవలయును.

ఎలోస్ Aloes :—బొడ్డువద్ద అపరిమితమైన నొప్పి, పొత్తికడుపు ఉబ్బరము, విరేచనానంతరము నీరసము, రక్తముతోకూడిన విరేచనము, ఆసనమందు కోయుచున్నట్లు బాధ, తీపు—ఈ లక్షణములకు పనిచేయును.

నక్సువామికా :—తరుచు విరేచనానుమానము, ఎన్నిసార్లు వెళ్లినను అనుమానము తీరదు. విరేచనము నెత్తురుతోకూడియుండును. విరేచనానంతరము కడుపు నొప్పి, ఆసనము తీపు తగ్గుచుండును.

ఆర్టిస్టా రాడిక్సు Artista Radix :—బొడ్డువద్ద నొప్పితోకూడిన గ్రహణికి పనిచేయునని ఛటర్జీగారు వ్రాసియున్నారు.

కేప్సికమ్ :—ఆమము, రక్తముతోకూడిన విరేచనములు, కడుపుబ్బరము, ఎక్కువతినుకుట, మూత్రద్వారము మంట వీటికి పనిచేయును.

కాలీఫాస్ :—ప్రత్యేకము రక్తమధికముగ వెళ్లునపుడు వాసనయున్నపుడు బాగుగా పనిచేయును.

కాలీమూర్ :—పొత్తికడుపులో భరింపరానినొప్పి, తరుచు విరేచనమునకు వెళ్ళవలెనని తొందర, తెల్లని జిగురెక్కువగ వెళ్ళునపుడు బాగాపనిచేయును.

ఫెర్రంఫాస్ :—జ్వర మున్నచో దీనిని కాలీమూర్‌తో వాడవలయును.

మెగ్నీషియాఫాస్ :—కడుపునొప్పి అపరిమితముగనున్నచో దీనిని తప్పక వాడవలయును. రక్తము కట్టుటకు, విరేచనములు తగ్గుటకు మెర్క్యూరియస్ కార్ వాడిన పిమ్మట, ఆసనము తీపు, కడుపునొప్పికి మెగ్నీషియాఫాస్‌ను వాడినచో వెంటనే గుణ మిచ్చును. ఈ మాదిరిగా వాడి కుదిర్చితినని డాక్టరు లియొనార్డ్ వ్రాసియున్నాడు.

ఇవిగాక కేంథారిస్, ఆర్సెనికమ్, రూస్‌టాక్స్, ట్రాంబిడియమ్, బ్రైయోనియాకూడ వాడవచ్చును. కాల్కేరియాసల్ఫ (జిగటవిరేచనములకు).

ముఖ్యవిషయములు : గ్రహణికిముందు మలబద్ధమున్నచో, ఆముదము వెంటనే యిచ్చుట మంచిది. ఇందువలన గ్రహణి రాకుండ ఆపివేయును. లేదా సులువుగ తేలిపోవును. ఈ వ్యాధిలో అన్నము పెట్టుట మాని, సగ్గుజావ యిచ్చుట చాల మంచిది. దీనివలన యెక్కువ గుణ మిచ్చును. కడుపునొప్పికి వేడినీళ్ళ కాపడము పెట్టుటవలన గుణ మిచ్చును. రోగిని శాంతిగ పడుకొని యుండుట మంచిది.

## 38. మలబద్ధము Constipation.

మనుజులు కొన్ని దురభ్యాసములను తెచ్చిపెట్టుకొందురు. మలబద్ధముకూడ స్వయముగ తెచ్చిపెట్టుకున్న దురలవాటే. పెద్దవారి మలబద్ధ రోగము, వారు చిన్నతనములో స్వయముగాగాని, తల్లియొక్క అజాగ్రత్తవలనగాని యేర్పడిన దురభ్యాస ఫలితమే. కొన్ని దురలవాటులను క్రమముగ బుద్ధి తెచ్చుకుని మాన్పుకొనవచ్చును. కాని యీ దురలవాటును నాటుకొనిన పిమ్మట మాన్పుట దుస్సాధ్యము.

కాలనియమము ననుసరించి ప్రతిదినము ఒకే కాలమునకు బిడ్డను మలవిసర్జన జేయు అలవాటు తల్లి నేర్పవలెను. తల్లులు దీనిని నిర్లక్ష్యము చేసినచో బిడ్డ బద్ధకించును. పిల్లలకు దాని ఫలితము తెలియదుగదా! కావున సోమరితనమును మాన్పించి దురలవాటును దరికి చేరకుండ చేయవలసిన బాధ్యత తల్లుల యందే కలదు. వారిబాధ్యత వారు గ్రహించలేక మాటిమాటికి ఆముదము పోయుచుందురు. దానివలన తాత్కాలికముగ విరేచనములైనను, మరునాడే మలబద్ధ మేర్పడును.

"The bowels can be taught to act daily at any given time and this habit should be encouraged in every child. An efficient child's nurse will so train an infant that after the early months, the napkins are seldom soiled... Avoid severe purgatives, as the subsequent constipation is always more difficult to treat".

శిశువునకు ప్రారంభమున దినమునకు 3, 4 విరేచనము లగును. రెండు మూడు మాసములు దాటిన పిమ్మట సంఖ్య తగ్గును. ఒకసంవత్సరము గడచిన

తరువాత రోజుకు ఒకటి లేక రెండుకంటె ఎక్కువ కావలసిన అవుసరము లేదు.

మలబద్ధలక్షణములు :—మలము గట్టిగ, కొద్దిగ వెడలుచుండును. ఒకప్పుడు చిన్న చిన్న వుండలవలె గట్టిగ అతి కష్టముమీద వెడలుచుండును. ఈ వుండలను తెల్లని జిగురువంటి పదార్థముకూడ అంటుకొని యుండవచ్చును. పిల్లవాడు మలవిసర్జన సమయమందెక్కువ బాధ పడును. తలనొప్పి,స్థిమితము లేకపోవుట, ఉత్సాహము లేకుండుట, కడుపుబ్బరము, తరుచు విరేచనానుమానము, లేక అసలు అనుమానము లేకపోవుట, నిద్ర సరిగ పట్టకపోవుట, శయ్యా మాత్రము—ఈ లక్షణములు తప్పక యుండును. వ్యాధి ముదిరినచో వమనము, నోటియందు దుర్గంధముండును. కడుపునొప్పి సహజమే. తరుచు జ్వరముకూడ రావచ్చును.

కారణములు :—సరియైన ఆహారము లేకపోవుట, తల్లులు బిడ్డలకు మంచి అలవాటులను నేర్పకపోవుట, అవసరము కలిగినపుడు మలమూత్ర విసర్జనచేయుటకు బద్ధకించుట, ఆముదము మొదలగు విరేచనకారులను తరుచు వాడుటచే ప్రేగులు బలహీనము చెందుట, కార్జము (liver) సరిగ పనిచేయక అస్వస్థతగ నుండుట, బిడ్డకు పాలిచ్చు తల్లిగాని, దాదిగాని సరియైన ఆహారమును దేహ పరిశ్రమను దీసుకొనకపోవుట—ఈ కారణములచే పిల్లలకు మలబద్ధము కలుగుచుండును. పెద్దవారైనచో అమితముగ పుగాకుచుట్ట కాల్చుట, త్రాగుడు మొదలగు యితర దురభ్యాసములవలన కలుగును.

## చికిత్స :

నక్సువామికా :—తరుచు విరేచనానుమానము కాని, సరియైన విరేచనము కాక, కొద్దికొద్దిగ వుండలవలె గట్టిగ పడుచుండును. నిద్ర సరిగపట్టదు. దీనిని రాత్రులు పరుండునపుడు ప్రతిదినము వాడినచో పనిచేయును.

హైడ్రాస్టిస్ :—దీర్ఘకాలమునుంచియున్న మలబద్ధమునకును, పిల్లల మలబద్ధమునకును దివ్యౌషధమని నాష్ వ్రాసియున్నాడు.

సేపియా :—మలాశయమునందు (rectum) యేదియో బరువుండినట్లు తోచును. మలబద్ధము. కొద్ది విరేచనమైనను అనుమానము పోదు. మలవిసర్జనమున కెక్కువ తినికి బాధపడవలసివచ్చును. పిల్లలకు బాగుగాపనిచేయును. నాష్ యీవిధముగా వ్రాసియుండెను.

"Sepia is a remedy for constipation, and that of a very obstinate character. Like 'Selenium' it has great straining; but manual aid is necessary to accomplish the stool. This is mostly in children." (Leaders by *Nash*, P. 205.)

ఓపియమ్ :—ఆంత్రములు పనిచేయలేనపుడు, మలము గట్టిగ, నల్లగ, వుండలవలె యున్నపుడును, రోగికి మగతయున్నపుడును బాగా పని చేయును.

సానిక్యులా Sanicula :— పిల్లవాడు యెక్కువగా తినుచుండును. మలము కష్టముమీద కొంత బయటకువచ్చి తిరిగి లోపలకుపోవును. పిల్లలకు చాలామంచిది.

ప్లంబమ్ Plumbum :—మొండివ్యాధులకు పనిచేయును. మలము నల్లగ, గట్టిగ, వుండలవలె పడును. కడుపునొప్పి యుండును.

గ్రాఫైటిస్ Graphites :—మలము గట్టిగ వుండలవలె పడును. యీ వుండలు తెల్లని దారమువంటి అమముతో ఒకదానితోనొకటి కలిసియుండును.

"Stools hard and knotty; the lumps being united by mucus threads." —*Johnson.*

అల్యూమినా :—మృదువైన విరేచనమైనను శ్రమ యెక్కువుండును. విరేచనమునకు వెళ్ళవలెనని భ్రాంతియుండదు. పిల్లలకు చాలా బాగా పని చేయును.

బ్రైయోనియా :—ప్రేగులు ఆరిపోయి, విరేచనము ఆరిపోయి, గట్టిగ ఉండలవలెయుండి మంటయుండును. విరేచనానుమాన ముండదు. తలనొప్పి. పిల్లలకు మంచిది. నాష్ యిట్లు వ్రాసియున్నాడు.

"They (Bryonia and Alumina) are both excellent in infantile constipation, which is often a very obstinate affection to treat." —*Nash.*

వెరాట్రుంఆల్బ :—మలాశయము పనిచేయలేక శక్తిలేకపోవును. ప్రేగు లెండిపోవును. పిల్లలకు బాగా పనిచేయును. రడ్డక్ వ్రాసియున్నాడు.

"A paralysed state of the rectum with dryness of the bowels; useful very often in infants, as is also Silicea."

—*Dr. Ruddock.*

ఎలోస్ :—ఆసనము ముడుచుకొని పోయినట్లుండును. మలము గట్టిగ బంతులవలెపడుట, పొత్తికడుపు బరువుగ నుండుట—యీ లక్షణములకు పని చేయును.

మెగ్నీషియామూర్ :—పిల్లలకు దంతోత్పత్తి కాలమున వచ్చు మలబద్ధమునకు పనిచేయును. మేక పెంటికలవలె కొద్దికొద్దిగ చిన్నగోళీలవలె మలము పడును. ఇది బొద్దుగానున్న పిల్లలకు బాగా పనిచేయును.

నేట్రంమూర్ :—మలము గట్టిగాయుండి వెడలుట కష్టముగా నుండును. ప్రేగులు ఆరిపోవుట, తలనొప్పి, కండ్లు నీరుకారుట, నిద్రలో నోటినుంచి చొంగలు కారుట—యీ లక్షణములతో కూడిన మలబద్ధమునకు బాగుగా పనిచేయును.

కాలీమూర్ :—యకృత్ (Liver) దోషముచే పైత్యరసము తగ్గి, మలము తెల్లగాను, నాలుక తెలుపుగాని, బూడిద రంగుతోగాని కూడియున్న మలబద్ధమునకు మంచిది. బ్లాక్‌వుడ్ యిట్లువ్రాసెను.

సైలీషియా :—సరియైన పోషణలేక జీర్ణశక్తి తగ్గియున్న పిల్లలకును, మలాశయమునకు శక్తిలేక యెక్కువ శ్రమచే మలద్వారమువరకు వచ్చి తిరిగి లోపలకు పోవునపుడును, పాదములకు చెమటపట్టునపుడును బాగా పని చేయును.

కాలీసల్ఫ :—నాలుక పచ్చగాయున్న మలబద్ధమునకు మంచిది.

నేట్రంఫాస్ :—శిశువులకు మధ్యమధ్య అతిసారముతో కూడియున్న మలబద్ధమునకు మంచిది.

"Constipation of infants with occasional attacks of diarrhoea." —*Chapman.*

ఇవిగాక ఇగ్నేషియా, ఎనకార్డియం, కాస్టికమ్, సల్ఫర్, కాల్కేరియాఫ్లోర్, కాల్కేరియాఫాస్, నేట్రంసల్ఫకూడా వాడదగును. లైకోపోడియం కూడ మంచిది.

ముఖ్యవిషయములు :—తల్లులు భుజించు ఆహారముయొక్క గుణములు స్తన్యముద్వారా పిల్లలకు కలుగుచుండును. కావున తల్లులు సరియైన శాకాహారములను దినుటమంచిది. రెండు సంవత్సరముల వయసుగలిగిన బిడ్డ అయినచో ఒకచెంచా గ్లిసరైను నీళ్ళలోకలిపి ఉదయమున యివ్వవచ్చును. ఆలివ్ ఆయిల్ కూడ మంచి పనిచేయును. పిల్లలు కొంచెము పెద్దవారైనచో పండ్లు శాకా

హారము భుజించుట, ప్రాతఃకాలమున ఒకగ్లాసుతో మంచినీళ్ళను త్రాగుట— ఇవి మంచిపనిచేయును. వయసువచ్చిన పిల్లలైనచో శరీరపరిశ్రమ ముఖ్యమైనది. తరుణవ్యాధిలో ఎనీమా, ఆముదమువాడినను వాడవచ్చును. కాని తరుచు విరేచనౌషధములను వాడరాదు.

గమనిక : మలబద్ధమునకే గాక, కొందరిలో శరీరతత్వము మార్చుటకూడ అవసరమే.

## 39. కృశించిపోవుట లేక చిక్కిపోవుట Marasmus.

అజీర్ణ రోగమున కిది చివర లక్షణము. ఇది తరుచు పిల్లలకు వచ్చుచుండును. మనవారు 'పిట్ట పారుట' యను రోగ మిదియే యని తలచెదను.

లక్షణములు :—దీని పేరునుబట్టియే లక్షణములను దెలుపుచున్నది. బాలుడెంత తినినను, యెన్నిసార్లు పాలను త్రాగినను క్షీణించుచు చిక్కిపోవును. అజీర్ణముతోగూడిన అతిసారము, కాళ్ళు, చేతులు సన్నగిలుట, మెడ కృశించి సన్నముగా నుండుట, పొట్ట పెద్దదగుట, దంతములు, నడక ఆలశ్యముగా వచ్చుట, శరీరము ముడతలుపడి ముసలిరూపు వచ్చుట, రక్తము క్షీణించుట రోగి పాలిపోవుట—యీ లక్షణము లుండును. ఒకప్పుడు మలబద్ధ ముండును. చివరకు రోగము ముదిరినచో బాలుడు మరణించును.

కారణములు :—అజీర్ణమే ప్రధాన కారణము. సరియైన పోషణ లేకపోవుట, అనారోగ్యమైన ఆహార మిచ్చుట, తగినంత పరిశుభ్రమైన గాలి, వెలుతురులేని యిండ్లలో నివసించుటకూడ ముఖ్య కారణములే.

### చికిత్స :

కాల్కేరియాకార్బ్ :—ఈ రోగమునకు ముఖ్యౌషధము. అజీర్ణము, కాళ్లు చేతులు సన్నగిలుట, దంతములు నడక ఆలశ్యముగ వచ్చుట, రక్తము క్షీణించుట- యీ మొదలగు లక్షణము లన్నిటికి అద్భుతముగా పనిచేయును.

బారిటాకార్బ్ :—ఆకలి యెక్కువ, యెంత తినినను కృశించుట, పొట్ట పెరుగుట, యితర అవయవములు కృశించుట, పాదములమీద చమటలు పోయుట- యీ లక్షణములకు పనిచేయును.

అయోడియం (Iodium) :—ఆక లెక్కువ, తినినకొలది కృశించిపోవుట, అతి నీరసము- వీటికి పనిచేయును.

సర్సపరిల్లా (Sarsaparilla) :—మెడ కృశించుట, శరీరము ముడతలు పడుట—యీ లక్షణముల కీ రోగములో బాగా పనిచేయును.

"In marasmus Sarsaparilla stands alongside of Iodine, Natrum Mur, and Abrotanum. In Sarsaparilla the neck emaciates and skin (in general) lies in folds".

(*Nash* Leaders P.316.)

ఎబ్రొటేనం (Abrotanum) :—పోషణ సరిగా లేకపోవుటచే కలుగు దానికి పనిచేయును. కాళ్ళు నన్నగిలుట, అతిసారము—వీటికి పనిచేయును. క్రిందనుంచి పైకి శిశువు క్షీణించి పోవును. నాష్ యిట్లు వ్రాసియుండెను.

"Marasmus most pronounced in lower extremities, from malnutrition ; diarrhoea ; diarrhoea alternating with rheumatism". (Leaders by *Nash* P. 472,).

కాల్కేరియాఫాస్ :—ప్రధానౌషధము. ఈ రోగమునకు పిల్లల కద్భుతముగా పనిచేయును. జీర్ణశక్తిని వృద్ధిపరచును. అతిసారమును పోగొట్టును. కాళ్ళయందు బలము కలుగజేయును. ఇది మంచిరసాయనము.

కాలీఫాస్ :—దుర్వాసనతో గూడిన విరేచనములు, నరముల నిస్సత్తువ, అతిసీరసము, నిద్రలేకపోవుట—వీటికి బాగా పనిచేయును.

నేట్రంమూర్ :—ఆక లధికముగనుండుట, యెంతతినినను చిక్కిపోవుట, అతిసారము, మెడ కృశించుట, పాలిపోవుట—వీటికి పనిచేయును.

"No remedy is more hungry, yet he loses flesh while eating well." —*Nash*.

ఇవిగాక సల్ఫర్, సైలీషియాకూడ పనిచేయును.

ముఖ్యవిషయములు :—పిల్లలకు పండ్లు మొదలగు మంచిపోషణ నిచ్చు ఆహార మివ్వవలెను. పరిశుభ్రమైనగాలి, కొద్ది పరిశ్రమ ముఖ్యావసరము.

## 40. మెనింజిటీస్ Meningitis.

ఇది మెదడునకు, వెన్నుపామునకు ఆవరించియుండు పొరలకు ఉద్రేకము కలుగుటచే జనించు నొకవిధమైన వ్యాధి. ఇది చాల ప్రమాదమైనది. క్రూరమైనది. ఇది తరుచు చిన్నపిల్లలకే వచ్చుచుండును.

లక్షణములు :—ఇది అకస్మాత్తుగ తలనొప్పి, చలి, వమనముతో ప్రారం

భించును. స్థిమితముండదు. పిల్లవాడు యేడ్చుచు తల ఒకప్రక్కనుంచి మరి యొకప్రక్కకు కొట్టుకొనుచుండును. నాడి సరిగయుండదు. శరీరోష్ణము 102°, 103° వరకు యుండవచ్చును. నిస్త్రాణ, మలబద్ధము, పిమ్మట మెడకండరములు ముడుశించుకొనిపోయి, మెడ బిగబట్టి, కొయ్యబారి నొప్పియుండును. ఇతర అవయవములుకూడ నొప్పిగాయుండును. మెల్లచూపు. మలబద్ధ మధికమగును. వ్యాధి ముదిరి మత్తుకలుగును. సంధిలోనికి దింపును. కంపములు బయలుదేరును. కొద్దిరోజులలో రోగి చనిపోవును. ఈ రోగముయొక్క కాల పరిమాణములు 15 లేక 20 రోజులు.

కారణములు :—మెదడునకు ఉద్రేకము కలుగుటయే ముఖ్యకారణము. దెబ్బలవలన, గాయములవలన కలుగుచుండును.

## చికిత్స :

ఈ వ్యాధి పిల్లలలో కుదురుట చాలాకష్టము.

హెల్లిబోరస్ :—ఈ వ్యాధికి ముఖ్యమైనది. పిల్లవాడు ఏడ్చుట, తల యిటు అటు కొట్టుకొనుట, లలాటము ముడతలుపడుట, మెడ, శిరస్సు నొప్పులు, దవడలాడించుట, మూత్రకృచ్ఛము లేక మూత్రబంధనము, కంపములు—ఈ లక్షణములతో కూడినదానికి పనిచేయును.

యాపిస్ :—శిరస్సు తాకినచో నొప్పి, కేశములుకూడ ముట్టుకొనినచో విశేషనొప్పియున్నపుడు దీనిని తప్పక వాడవలయును. స్థిమితములేని నిద్ర, మత్తు, మధ్యమధ్య యేడుపుండును.

ఆర్నికా :—గాయములవలన, దెబ్బలవలన కలిగినచో పనిచేయును.

సిక్యూటావిరోసా :—మెడ కొయ్యబారుట, వెన్నెముక వంగియుండుట, కంపములు— వీటికి పనిచేయును.

కుప్రం :—కంపములకు, యీడ్పులకు మంచిది.

బెల్లడోనా ; హయోసియామస్ :—సంధిలక్షణములకు పనిచేయును.

బ్రైయోనియా :—కుట్టినట్లు నొప్పులకు మంచిది.

నేట్రంసల్ఫ :—ముఖ్యౌషధము. అపరిమితమైన తలనొప్పి.

ఫెర్రంఫాస్ :—జ్వరము, సంధియున్నపుడు పనిచేయును.

మెగ్నీషియాఫాస్ :—కంపములకు మంచిది. తల ఒక ప్రక్కకు తిరుగుట, మెల్లచూపు వీటికి పనిచేయును.

ఇవిగాక జింకమ్, జెల్సిమియమ్, కాల్కేరియా కార్బ్, కాల్కేరియా ఫాస్ కూడా పనిచేయును.

ద్రవ పదార్థము లాహారముగ నిచ్చుట మంచిది.

## 41. కపాలజలంధరము Hydrocephalus.

కపాలములో నీరుచేరుటచే కలుగు సంజురోగమునకు కపాలజలంధరమని పేరు. పది సంవత్సరములలోపు వయసుగల పిల్లలకీ వ్యాధి వచ్చుచుండును.

లక్షణములు :—తల్లి సుఖప్రసవము కాకపోయినచో పిల్లలు కొందరీ వ్యాధితోనే జనించుచుందురు. కపాలమునందలి యెముకలకు మధ్యనుండు ఖాళీలు పూడకపోవుటచే తల పెద్దదిగ నుండును. మాడపట్టుననుండు గుంటలు త్వరలో పూడకపోవుటచే యిట్లుండును. క్రమక్రమముగ శిరస్సు గుండ్రము గను, పెద్దదిగను అగుటచేతనే యీ వ్యాధిని గ్రహింపవచ్చును. రికెట్సు వ్యాధిలోకూడ తల పెద్దదగును. కాని ఆ వ్యాధిలో తల గుండ్రముగ పెరుగక, పలకలుదేరి చదరముగ పెట్టెవలె పెరుగుచుండును. తాకినచో తలయందలి యెముకలు మెత్తగ తగులును. ముఖము త్రికోణాకారముకలిగి చిన్నదిగ నుండును. ముందుకు పొడుచుకొనివచ్చు గుండ్రనిలలాటము, కృశించినశరీరము, ఉబ్బిన కండ్లు, క్రింది చూపు—యీ లక్షణము లీ రోగముగల శిశువును తెలియ జేయును. జార్జిరాయల్ యీ విధముగా వ్రాసియుండెను.

"Gradual enlargement of the globular head, open sutures and fontanelles, small face, protruding, round forehead with comparatively small and emaciated body, bulging and down -waid look of the eyes gives us a good picture of a hydrocephalic infant."

(Diseases of 'The Brain and Nerves' by *George Royal.*)

తలతాకినచో మెరక పల్లము తెలియనగును. వెంట్రుకలు మామూలుగ పెరుగవు. శిశువు ధ్వనివల్లను, వెలుతురువల్లను భయపడుచు శిరస్సు, కండ్లు త్రిప్పుచుండును. మెల్లచూపుకూడ యుండవచ్చును. మలబద్ధముండి, మలము గట్టిగ, దుర్గంధము కలిగియుండును. కడుపునొప్పి, నిద్రలో పండ్లుకొరుకుట, ఉలికిపడి కేకవేసి లేచుట, నడవలేకపోవుట, నడవగలిగినను, సరిగ నడవలేకుం డుట—యీ లక్షణములుండును. శిశువు పాలధికముగ త్రాగుచుండును. కాని కృశించియుండును. ముఖము ముడతలుపడి ముసలిరూపు కలుగును. పక్ష

వాతము, కంపములు, కింకవాయువు—యీ గుణములున్నచో వ్యాధియొక్క ఉద్భృతమును తెలియజేయును.

కారణములు :—ఈ వ్యాధి వంశపరంపరగ రావచ్చును.

"Heredity has been assigned as a cause." *George Royal.*

తల్లియొక్క కఠినప్రసవము, క్షయ, సరియైన పోషణ లేకపోవుట—ఇవి కూడ కొంతవరకు కారణములే.

## చికిత్స :

హెల్లిబోరస్ నైగర్ :—దీర్ఘవ్యాధులలో పనిచేయును. రోగి తెలివితక్కువగనుండుట, వెలుతురు జూడలేకపోవుట, మూత్రకృచ్ఛ్రము, నుదురు ముడతలు పడి ముసలిరూపు కలుగుట, ఏదియో నమలుచున్నట్లు దవడలాడించుట, ఒక కాలు, చెయ్యి కదలుచుండుట, తలయొకవైపునుంచి మరియొక వైపునకు త్రిప్పుట, ఉలికిపడి కేకవేయుట, నీరధికముగ త్రాగవలెనని కోరికయుండుట—ఈ లక్షణములకు బాగుగా పనిచేయును. ఇది ప్రధానౌషధము.

యాపిస్ Apis :–నంజువ్యాధికి చాలమంచిది. శరీరమందేభాగమున నంజు కనపడినను వాడవచ్చును. తాకినచో సున్నితముగనుండి నొప్పికలిగించును. నెత్తి ముట్టుకొనినచో నొప్పి, తలవెంట్రుకలుకూడ నొప్పిగానుండును. దప్పి లేకపోవుట దీనికి ముఖ్యలక్షణము. ఉదా : తల్లి క్షయరోగ కుటుంబమునకు చెందినది. శిశువునకు జననమునుంచి యీ రోగలక్షణములు కనపడెను. తల పెరిగియుండుట, అతిసారము, భయపడుట, స్మారకము సగము తప్పియుండుట, ముఖము ఉబ్బి పాలిపోవుట, దప్పిలేకపోవుట—ఈ లక్షణము లుండినపుడు 'యాపిస్' తో కుదిర్చితినని జార్జి రాయల్ వ్రాసియున్నాడు.

ఆర్జెంటమ్ నైట్రికం :—శిశువు కృశించిపోవుట, ముడతలుచే ముసలిరూపు కలిగియుండుట—ఈ లక్షణములకు పనిచేయును.

ట్యూబర్క్యులినం :—ఈ రోగమునకు బాగా పనిచేయును. తల విపరీతముగ పెరుగుట, కండ్లు ఉబ్బుట, ఒకప్రక్కనుంచి మరియొకప్రక్కకు కదల్పలేకపోవుట—తెలివితక్కువగాయుండి వెఱ్ఱివానివలె యుండుట, ఈ లక్షణములనుగలిగి క్షయరోగ కుటుంబమునకు చెందిన శిశువున కీ ఔషధముతో నెమ్మదిచేసితినని నాష్ వ్రాసియున్నాడు.

కాల్కేరియా కార్బ్ :—సరియైన పోషణలేనందున జనించిన వ్యాధికి

పనిచేయును. దీర్ఘతరుణవ్యాధులు రెంటికిని బాగుగపనిచేయును. దంతము లాలస్యముగ మొలకెత్తుట, తల పెరుగుట, మాడపట్టుననుండు గుంటలు పూడకపోవుట, వయస్సువచ్చినను శిశువు నడవలేకుండుట, మెల్లమూపు, శరీరము ముడతలుపడి కృశించుట — ఈ లక్షణముల కద్భుతముగ పనిచేయును. ఈ రోగముగల శిశువును కాల్కేరియాకార్బ 200, సల్ఫర్ 200 తోను కుదిర్చె నని సుప్రశిద్ధ వైద్యులొకరు వ్రాసినట్లు జార్జి రాయల్ వ్రాసియున్నాడు.

కాల్కేరియాఫాస్ :—సరియైన పోషణలేక కృశించి, రక్తక్షీణమైయున్న పిల్లల కమోఘముగ పనిచేయును. తల విశేషముగ పెరిగియుండుట, ఎముకలు గట్టిలేకపోవుట, శిశువు నడవలేకపోవుట—యీ లక్షణములకు బాగా పని చేయును.

కాలీఫాస్ :—దీర్ఘతరుణవ్యాధులు రెంటికిని పనిచేయును. శిశువు కృశించి యుండును.

ఇవిగాక ఐడోఫారమ్, హెడీరాహెలిక్స్, బారిటాకార్బ, సైలీషియా కూడ వాడవచ్చును.

ఈ రోగముగల శిశువు తలపై సూర్యకిరణములు పడులాగున ఎండలో నుంచినచో మంచిగుణమిచ్చును. ప్రారంభమున 20 నిమిషములు పిమ్మట 30, 40 నిమిషములువరకు పెంచవచ్చును. ఇందువలన చెమటపట్టి నీరుతీయును. వేడివలన శిశువునకు పోషణకలుగును. ఈ విధానము డాక్టర్ బార్ట్లెట్ వ్రాసియున్నాడు.

"A measure that has received but little attention is the application of solar heat. The method consists in exposing the child's occiput (back part of the head or skull) to the direct rays of the sun for 20 minutes each day, gradually increasing the duration of the same until the limit of 30 or 40 minutes is reached. It is believed that the local sweating acts to remove a portion of the effusion (escape of fluids of the body from their natural position) while the thermic (warm) iritation aids nutrition."

(*Clarence Bartlett's* Text Book of Clinical Medicine Treatment P. 853.)

కొందరు గట్టిగ కట్లుకట్టుదురు. ఇది యెంతమాత్రము మంచిదికాదు. నేర్పరి

రైన వైద్యునిచే శస్త్రచికిత్సకూడ చేయించవచ్చును. శిశువునకు పోషణనిచ్చి రక్తవృద్ధిచేయు ఆహారమిచ్చుట ముఖ్యము.

ముఖ్యవిషయములు :—కొన్ని కుటుంబములలో శిశువు శిరోగముతోనే జనించుచుందురు. అట్టి జననములు కలుగకుండ గర్భవతియైన తల్లికి ప్రతిదినము సల్ఫర్ 6, కాల్కేరియాఫాస్ 6 యిచ్చి ఆపుజేయగలిగితినని డాక్టరు వాన్ గ్రొగల్ చెప్పినట్లు రడ్డక్ వ్రాసియున్నాడు.

## 42. నంజు-జలోదరము Dropsy-Ascites.

ఇది ప్రత్యేక మొకవ్యాధిగ పరిగణించుటకంటె, యితర వ్యాధులయొక్క ఫలితముగాని, లక్షణముగాని గ్రహించదగును. శరీరమందు కొన్నిభాగముల యందు, అధికముగ నీరు చేరియుండును. ఇది పిల్లలలోను, పెద్దలలోనుకూడ తటస్థించుచుండును. కాని పిల్లలలోను, దుర్బలులలోను ఎక్కువప్రమాదకరము.

లక్షణములు :— ఈ వ్యాధి కనపడినపుడు అస్వస్థతగ నున్న భాగములను వ్రేళ్లతో నొక్కినచో గుంటలుపడి, యీగుంటలు క్రమముగా పూడుచుండును. రక్తచలనమున కేదియైన ఆటంకము కలిగినచో,రక్తము ప్రవహించకుండ నిలిచిపోయినచో ఈ వ్యాధికలుగును. సాధారణముగ పాదములయందు, ఉదరమందు ఎక్కువగ కనబడుచుండును. ఇతర అవయవముల యందుకూడ దీని లక్షణములు కనపడవచ్చును. మూత్రకృచ్ఛము, శ్వాసకృచ్ఛము, ఆయాసము, నడచుట కశక్తత, శరీరము తాకినచో నొప్పి, గుండెలలో దడ—ఈ లక్షణములు సామాన్యముగ కనపడుచుండును. ఉదరము నిగనిగలాడుట, బొడ్డుకు చుట్టు విశాలముగ నావరించి నీళ్ళచే నిండియున్నట్లుండుట, ఉదకపూర్ణంబైన తిత్తివలె గుళగుళ యను శబ్దముతోకూడి కదలుచుండుట—ఇవి జలోదర లక్షణములు.

కన్నులువాచి ఉబ్బియుండుట, శిశ్నము వక్రముగానుండుట, రక్తమాంసములు తగ్గి, బలము క్షీణించి, జఠరాగ్ని నశించుట, అతిసారము, విరేచనమైనను మాటిమాటికి ఉదరము జలముచే నిండుట—ఈ లక్షణములు రోగతీవ్రతను తెలియ జేయుటయే గాక, ఇట్టిరోగి జీవించుట దుర్లభము.

కారణములు :—రక్తచలనమున కాటంకము కలిగినను, శరీరమునకు విశేషముగ చెమట పోయుచున్నపుడు చలిలో కూర్చుండినను, రక్తహీనతవలనను, ఋతు సంబంధమగు జబ్బులవలనను, ఇతర అవయవముల అస్వస్థతవలనను నంజువ్యాధి కలుగుచుండును.

మూత్రగ్రంథులస్వస్థత జెందినచో కనురెప్పలు, జననేంద్రియములు, పాదములు, కాళ్ళు—వీటియందు నంజు కనబడును.

హృదయము, శ్వాసకోశములు అస్వస్థత జెందినచో, కాళ్ళు, చేతులయందే గాక శరీరమంతయు వ్యాపించును.

ఋతుసంబంధమైన జబ్బులచే కలిగినచో పాదములయం దెక్కువగ కనపడును. ఒకప్పుడు చేతులకు, ముఖమునకుకూడ నంజు కనపడవచ్చును. కార్జముగాని, ప్లీహముగాని అస్వస్థత జెందినచో ఉదరమందు నంజు కనపడి ఉబ్బును. దీనికే 'జలోదర' మని పేరు.

స్నేహపానము, వస్తి, వమనము, విరేచనము యీ చికిత్సలను జేసినపిమ్మట విశేషముగ చన్నీళ్ళను పానముజేసినను జలోదరము సంభవించును.

## చికిత్స :

ఏ వ్యాధుల ఫలితముగ నంజు కలుగుచున్నదో ఆ వ్యాధులకు చికిత్స జేయుట ముఖ్యము.

అపోసైనమ్ కెన్నాబియమ్ :—ఉబ్బు వ్యాధులకు ప్రధానౌషధము. ఈ వ్యాధిలో కనపడు లక్షణము లన్నిటికి పనిచేయును. చేతులయందు ఉబ్బు, బలహీనత, హృదయ దౌర్బల్యము, మూత్ర కృచ్ఛము, శ్వాస కృచ్ఛము, శరీరమంతయు నీటిచే ఉబ్బియుండుట, నిగనిగలాడుట, మలబద్ధము, క్షీణమైన నాడి, దప్పి యెక్కువ కాని నీటి యం దయిష్టత, త్రాగినను నొప్పి కలుగజేసి వమనమగుట, ఆయాసము—యీ లక్షణము లన్నిటియందు అద్భుతముగ పని చేయును.

యాపిస్ :—మూత్రము స్వల్పముగను, నల్లగను వెడలుట, దప్పిలేకుండుట, తాకినచో నొప్పి, మంట, చల్లదనమువలన మంటలు తగ్గుట—యీ లక్షణములలో వాడవచ్చును. జ్వరానంతరము, గర్భిణీ స్త్రీల కాళ్లకువచ్చు నంజునకు పనిచేయును.

ఆర్సెనికమ్ :—జలోదరము, నిస్సత్తువ, విశేష దప్పి కాని యెక్కువ త్రాగలేకుండుట, స్థిమితము లేకుండుట—వీటికి పనిచేయును.

ఎలాటేరియం (Elaterium) :—మూత్రమును జారీచేయించుటకు జలోదరములో దీనిని వాడదగును.

సిల్లా :—ఉబ్బు వ్యాధులలో మూత్రకృచ్ఛమునకు మంచిది.

పల్సాటిల్లా :—ఋతుసంబంధమైన జబ్బులచే జనించిన ఉబ్బు వ్యాధులకు పనిచేయును.

డిజిటాలిస్ :—పాదముల నంజునకు మంచిది. గుండెలలో దడ, హృదయ దౌర్బల్యమునకు దివ్యౌధము. హృద్రోగముచేగలుగు శోఫకు నిరుపమానమైనది. క్షీణించిన నాడి, గుండెలలో నంజు, జలోదరమునకు అద్వితీయమైనది. మూత్రకృచ్ఛ్రము, శరీరము నీలవర్ణము కలిగియుండును.

టెరిబింతినా :—వృక్కములయొక్క అస్వస్థతచే జనించు నంజువ్యాధికి పనిచేయును.

ఎడోనిస్ :—జలోదరమునకు మంచిది.

యాసిడమ్‌ఫ్లోర్ :—యకృత్ వ్యాధులచే జనించిన జలోదరమునకు పని చేయును.

యూరియా :—ఉబ్బువ్యాధులలో స్వల్పమాత్రమునకు తప్పక వాడదగిన ఔషధము.

చైనా :—ప్రాణపోషక రసములు నష్టపడుటచే (Loss of Vital fluids) కలుగు ఉబ్బువ్యాధులకు పనిచేయును.

నేట్రంసల్ఫ :—నీరుతీయుటకు ప్రధానౌషధము.

నేట్రంమూర్ :—దీనిని నేట్రంసల్ఫతో వాడదగును.

కాల్కేరియాఫాస్ :—రక్తక్షీణముచే కలిగిన ఉబ్బువ్యాధులకు మంచిది.

కాలీమూర్ :—హృదయము, కార్జము, వృక్కకములు — వీటి అస్వస్థతచే కలిగిన నంజువ్యాధిలోను, శరీరము నిగనిగలాడుట, నాలుక తెలుపు, శరీర మందలి నీరుసైతము తెల్లగనుండుట, పైత్యవాహికయొక్క అడ్డుచే జనించిన నంజురోగమునకు పనిచేయును.

కాల్కేరియాఫ్లోర్ :—హృద్రోగముచే జనించిన నంజునకు బాగా పని చేయును.

కాలీఫాస్ :—గుండెలలో దడకు పనిచేయును.

ముఖ్యవిషయములు :—దంపుడుబియ్యము తినువారికంటె మరబియ్యము తినువారిలో ఈ వ్యాధి ఎక్కువగ వచ్చుచుండును. కావున మరబియ్యము మానుటయేగాక దంపుడుబియ్యములో చేబియ్యము వాడుట ముఖ్యము. వ్యాధి ముదిరినచో వ్యధచికిత్స (Tap) మంచిది.

# 43. పచ్చకామెర్లు Jaundice.

ఇది కాలేయమునకు సంబంధించిన వ్యాధి. శిశువుల కాలేయము రక్తమును శుభ్రపరచలేని స్థితియందుండుటచే వారికీవ్యాధి ఎక్కువగ వచ్చుచుండును. ఈ వ్యాధి పెద్దవారిలోకంటె పిల్లలలో నెక్కువ ప్రమాదకరము. కావున వారికీ వ్యాధి లక్షణము లగపడినవెంటనే తగు వైద్యసహాయము బడయవలెను. ఉపేక్షించినచో ప్రాణహాని సంభవించును. శిశువులు కొందరీ వ్యాధిలక్షణములతో జనించుటయు కలదు. సాధారణముగ శిశువులలో కొందరికి జన్మించిన 10, 15 దినములవరకు కండ్లు పచ్చగనే యుండును.

లక్షణములు :—కంటిగ్రుడ్లు పచ్చపడుటతో ఈ వ్యాధి ప్రారంభమగును. గోళ్ళు, ముఖము, కాళ్ళు, చేతులు, శరీరమంతయు క్రమక్రమముగ పసుపు పచ్చని రంగుగామారును. దృష్టిలో దోషముండును. ప్రతివస్తువు పచ్చగ కనపడుచుండును. మలబద్ధముండును. మలము తెల్లగగాని, మట్టిరంగుగగాని వెళ్లుచుండును. మూత్రముకూడ పసుపురంగు కలిగి యుండును. మూత్రపుబొట్లు బట్టమీదపడినచో, బట్ట పచ్చనిరంగుగలదై యుండును. శరీరము దురద, నోరు చేదు, ముఖ్యముగ ప్రాతఃకాలమున త్రిప్పు వికారము, నీరసము, కడుపులో నొప్పులు, బలహీనత, నెమ్మదియైననాడి, తరుచు జ్వరము—ఈ లక్షణములుండును.

కారణములు :—ఆహార లోపమువలన కలుగు అజీర్ణమువల్లను, కాల మార్పులవల్లనుకూడ కలుగవచ్చును. కాలేయమునుంచి పైత్యరసము, పైకి వెడలకపోవుట, కాలేయములో పైత్యరసము ప్రవహించకపోవుట, పైత్యరసము పైత్య వాహికలగుండ క్రమముగపోక తిరిగి రక్తములోగలసి రక్తమును పాడు చేయుట—ఇవి ముఖ్యకారణములు. ఆకారణముచే బిడ్డల రక్తమునందును, కండ్లయందును పసుపుపచ్చనిరంగు ఏర్పడును. అది మూత్రద్వారముద్వారా కొద్దిగ వెడలుచుండును.

## చికిత్స :

మెర్క్యూరియస్ సోల్ :—కాలేయము నొప్పి, కుడిప్రక్క పరుండలేక పోవుట, ఆకలి మందగించుట, శరీరము, కండ్లు పచ్చపడుట, కాలేయమునుంచి పైత్యరసము ప్రవహించలేకపోవుట, తెల్లని మలముపడుట, మలబద్ధము— యీ లక్షణముల కద్భుతముగ పనిచేయును. ఈ రోగమున కిది ప్రధానౌషధము.

చైనా 200 :—కాలేయమునకు సంబంధించిన జబ్బుల కన్నిటికి ముఖ్య

మైనది. కాలేయము పెద్దదై గట్టిగ నొప్పి ఉండును. శరీరము పచ్చగనుండుట, విరేచనము తెలుపు—వీటికి పనిచేయును.

"China is one of our best remedies in chronic liver troubles. There is pain in the right hypochondria, and often the liver may be felt below the ribs, enlarged, hard and sensitive to touch. The skin and sclerotica are yellow, the urine dark coloured and stools light, lacking the colour due to a proper secretion of bile." *Dr Nash*

పోడోఫిల్లం:—పసుపుపచ్చని రంగుతో మూత్రము కొద్దిగ వెడలుచుండుట, తెల్లని విరేచనములు, త్రిప్పు, వికారము—యీ లక్షణములకు పనిచేయును.

చెలిడోనియం:—ఇది చాల ప్రశస్తమైన ఔషధము. పైత్యవాహికయందలి రక్తప్రవాహమునకు గోరోజనము (Gall stone) అడ్డుపడుటచే జనించి, కండ్లు, శరీరము పచ్చపడును. కాలేయము నొప్పి, నోరు చేదు, నాలుక చిక్కని పసుపురంగు, విరేచనము తెలుపు, మూత్రము పసుపురంగు, ఆకలి మందము, త్రిప్పు, వికారము, పైత్యవమనము—యీ లక్షణములకమోఘమైన ఔషధము. డాక్టరు నాష్ యిట్లు వ్రాయుచున్నాడు.

"If we should find pressive pain in the region of the liver, whether it be enlarged and sensitive to pressure or not, bitter taste in the mouth, tongue coated thickly yellow, with the red margins showing imprint of the teeth, yellowness of the whites of eyes, face, hands and skin; stools gray, clay coloured, or yellow as gold, urine also yellow, as gold, lemon coloured or dark brown leaving a yellow colour on vessel when emptied out, loss of appetite disgust and nausea, vomiting of bilious matter, and especially if the patient could retain nothing but hot drinks in the stomach, we would have a clear case for Chelidonium." —*Dr. Nash*

నక్సువామికా :—కాలేయము నొప్పి, మలబద్ధమునకు మంచిది.

కేమోమిల్లా :—పిల్లలకు బాగా పనిచేయును.

కాల్ మేగ్ Kalmegh :—పిల్లలలోవచ్చు కామెర్లకు బాగా పనిచేయును.

ఫాస్ఫరస్ :—శరీరము, కండ్లు పచ్చగానుండుట, మూత్రము గోదుమ

రంగు, విరేచనము తెలుపు, దగ్గు—ఈ లక్షణములతో కూడిన కామెర్లకు పనిచేయును.

ఫెర్రంఫాస్ :—ప్రారంభదశలో వాడదగును.

కాలీమూర్ :—కాలేయము నొప్పి, నాలుక తెలుపు, విరేచనము తెలుపు, మలబద్ధము, నోరుచేదు—యీ లక్షణములకును, చలిగాలివలన కలిగిన కామెర్లకును పనిచేయును.

నేట్రంసల్ఫ్ :—పైత్యరోగముల కన్నిటికి అద్భుతముగ పనిచేయును. కండ్లుపచ్చన, కాలేయము నొప్పియుండును.

కార్డూన్ :—కాలేయము నొప్పి, శరీరము, మూత్రము పచ్చగానుండుట, నోరుచేదు, వికారము—ఈ మొదలగు లక్షణములుగల కామెర్లకు మంచిది.

నేట్రంఫాస్ :—అతిసారముతో కూడిన కామెర్లకు పనిచేయును.

ఇవిగాక హైడ్రాస్టిస్, క్రోటాలస్, ఛైయోనియా, కాలీఫాస్, నేట్రంమూర్ కూడ వాడవచ్చును. లైకోపోడియంకూడ పనిచేయును.

ముఖ్యవిషయములు :—శిశువులకు మలబద్ధము లేకుండ కనిపెట్టుచుండవలెను. వారికి/అజీర్ణవ్యాధి తగులకుండ తేలికయైన ఆహారము కడుజాగ్రత్తగా నిచ్చుచుండవలయును. రోగి కొంచెము పెద్దవాడైనచో స్వల్పపరిశ్రమ తీసుకొనవచ్చును.

## 44. కుక్కముండ్లు లేక పైత్యపుదద్దుర్లు Nettle-rash.

ఇది తరుచు పిల్లలలో కలుగు నొక విధమైన చర్మరోగము.

లక్షణములు :—మెడమీద, చేతులమీద, యితర అవయవములమీద, చిన్న పొక్కులవలెగాని, దద్దుర్లవలెగాని బయలుదేరి యెక్కువ దురద పెట్టును. గోకినను, గట్టిగ రాచినను మంట లధిక మగును. అప్పు డవి చిన్న తెల్లని మొటిమలవలె యుండి (Wheals) దూలగొండి ముండ్లవలె మంట పెట్టును. జ్వరము, వికారము, వాంతి, దప్పి, ఆకలి లేకపోవుట, ఆయాసము, తెల్లని నాలుక, కుదురులేకపోవుట—యీ లక్షణములు వ్యాధియొక్క ఉద్రుతమును సూచించును.

కారణములు :—హీనజాతి పిల్లలు కొందరు నత్తగుల్లలలోనుండు మీనములను, పీతలను, కుక్కగొడుగులను—యీ మొదలగు అనారోగ్య వస్తువులను

తినుచుందురు. ఇతర పిల్లలుకూడ చాలమంది దోసకాయలు మొదలగు అజీర్ణ పదార్థములను తరుచు తినుచుందురు. ఇట్లు భుజించుటచే కలుగు అగ్నిమాంద్యమువల్లను, పైత్యోద్రేకమువల్లను యీ వ్యాధి కలుగుచుండును. మరియు చలిగాలి, తేమవల్లనుకూడ యీ వ్యాధి జనించుచుండును. మలబద్ధముకూడ ఒక కారణమే.

## చికిత్స :

పల్సటిల్లా :—ఆహార దోషమువలన కలిగిన అజీర్ణముచే యీ వ్యాధిజనించినచో పనిచేయును.

నక్సువామికా :—అజీర్ణమువల్లను, మలబద్ధమువల్లను కలిగినచో బాగా పనిచేయును.

డల్కెమారా (Dulcamara) :—చలిగాలివల్లను, తేమవల్లను కలిగి, అతిసారము, నోరు చేదు, నాలుక తెలుపు—యీ లక్షణములతో కూడినచో పనిచేయును.

యుర్టికాయురెన్స్ (Urtica urens) :— మధ్య తెలుపు, చుట్టు యెరుపుతో కూడిన దద్దుర్లకు, కుట్టినట్లు మంట యున్నను పనిచేయును.

"Useful in urticaria when the skin is elevated. There is a white central spot and a red areola ; this is altered with stinging." —*Blackwood.*

రూమెక్సుక్రిస్పస్ :— అపరిమితమైన దురద యుండి, చలిగాలివలన ఎక్కువయినచో వాడదగును.

యేపిస్ :—తేనెటీగ కుట్టినట్లు మంటలున్నపుడు పనిచేయును.

రూస్టాక్సు :—గోకినను, పక్కవేడివల్లను దద్దుర్లు యెక్కువయినచో పనిచేయును.

టిలియా యూరోపియా :—అపరిమితమైన దురదయుండి, గోకిన పిమ్మట నిప్పువలె మండుచుండును.

నేట్రంసల్ఫ :—పైత్యోద్రేకముచే శరీరమంతయు దద్దుర్లు బయలుదేరి, దురద, మంటతో కూడియున్నచో పిల్లలకమోఘముగ పనిచేయును. ఈ లక్షణములతోయున్న పిల్లవానికి రెండుమోతాదు లిచ్చితిని. అద్భుతముగ పనిచేసినది. శరీరము మామూలువలె యున్నది. (త॥ కా॥)

నేట్రంఫాస్ :—దద్దుర్లు, పొక్కులు, దురదతోకూడిన చర్మవ్యాధులలో పిల్లల కమోఘముగ పనిచేయును. అజీర్ణముకూడ పోవును.

నేట్రంమూర్ :—విడుపు జ్వరములో వచ్చునపుడు అతివేడివలన విపరీతమైన దురద, చురుకు, మనుమంటలకు వాడవచ్చును.

"Nettle rash in intermittent fever or nettle rash with violent itching due to over-heating or violent exercise. Stinging rash all over the body."

ఇవిగాక సల్ఫర్, యుస్టిలాగో, కాల్కేరియాఫాస్, కాలీఫాస్, కాలీమూర్ కూడ పనిచేయును. కాలీసల్ఫకూడ మంచిదే.

## 45. క్రిములు Worms.

### ఇవి మూడురకములు

**1.** నులిపురుగు Small thread-worm :— ఆంత్రములను బాధించు క్రిములలో నిది చిన్నరకము. ఇది సుమారు పాతిక, అరంగుళము పొడవుండి తెల్లగ ధారమును పోలియుండును. ఇవి గుంపులుగా నివసించుచు, ఎక్కువగా మలాశయము నాశ్రయించియుండును. అతివేగముగ ప్రాకుచు, ముట్టుకొనినచో ముడుచుకొని పోవుచుండును. కడుపులో నిదికలిగించు ఉద్రేకమునుబట్టి దీనికి (Maw-worm) అనిపేరుకూడకలదు. తల్లిస్తన్యమును త్రాగు పిల్లలకంటె నితరులలో నెక్కువయుండును. పిల్లల నెక్కువగ బాధించు నదీరకమే. ఇవి పెద్దవారిలోకూడ కనపడుచుండును. క్రింద వ్రాయుబోవు లక్షణములను బట్టియే గాక, నులిపురుగుచే బాధపడురోగిని నిద్రించుచుండగా పరీక్షించినచో గుదస్థానమందు నులిపురుగులు విశేషముగా తొందరతొందరగా ప్రాకుచుండుట కూడ కానవచ్చును.

**2.** ఏలుగుపాము Long round worm :— ఇది 6 మొదలు 15 అంగుళముల పొడవుగలిగి సాధారణ వానపాము (Earth worm)ను పోలియుండును. కాని తెల్లగనుండును. ఇది ముఖ్యముగ చిన్నప్రేగులలో నివసించియుండును. కాని పొట్ట (Stomach) లోనికికూడ పోయి వమనము ద్వారా వెళ్ళవచ్చును; లేదా క్రిందకు పురీషస్థానము(Colon) లోనికిపోయి విరేచనముద్వారా వెళ్ళవచ్చును. ఇవి గుంపులుగానుండక, ఒకటిగాని కొద్ది సంఖ్యలోగాని యుండును. ఇవి తరుచు మూడు మొదలు పదిసంవత్సరముల వయసుగల పిల్లల నెక్కువ బాధించు చుండును.

3. పెద్దపాము (Tape-worm). ఇవి కొన్ని అడుగులు మొదలు కొన్ని గజములుండును. ఇదికూడ ప్రేగులలో నివసించి యుండును. ఇది పెద్ద వారి నెక్కువగ బాధించుచుండును. ఇది తరుచు ఒంటరిగ నుండును.

లక్షణములు :—శూల, అతిసారము, శయ్యామూత్రము, గజ్జి మొదలగు చర్మరోగములు, డిఫ్తీరియా, కోరియా, కంపములు (Convulsions), మూర్ఛ—ఈ మొదలైన వ్యాధులకు క్రిములుకూడ ఒకముఖ్యమైన కారణమని వ్రాయబడియే యున్నది. కావున ఆయావ్యాధులను పైన చూడనగును.

ఇతర సాధారణ క్రిమి లక్షణములు :—గుదస్థానమున దురద, కడుపుబ్బ రము, శూల, మలవిసర్జన సమయమందెక్కువగ తినుకుట, ఆసనము తీపు, దుర్వాసనతోకూడిన విరేచనములు, జిగురుతోకూడిన మలముపడుట, నాసిక దురద, ఊపిరి వాసన, ముఖము పొంగరించియుండుట, శిశువు పాలిపోవుట, చిక్కిపోవుట, ఆకలి మందగించుట, స్థిమితము లేకుండుట, సరియైన నిద్ర పట్టకపోవుట, నిద్రలో శిశువు పండ్లు కొరుకుట, ఉలికిపడి లేచి యేడ్చుట, నిద్రలో చొంగ విశేషముగ కారుట, యెక్కువ కష్టముతోను, బాధతోను మూత్రవిసర్జన మగుట—యీ లక్షణము లున్నచో క్రిము లున్నవని గ్రహించ దగును. వమనము, దగ్గుకూడ ఒకప్పుడు యుండవచ్చును.

కారణములు :—సరియైన ఆహారము లేకుండుట, ఆంత్రములు పరిశుభ్ర ముగలేక మలినముతో కూడియుండుట, పిల్ల లధికముగ మధుర పదార్థములను దినుట—యీ కారణములచే తరుచు క్రిములు జనించుచుండును. ఇవిగాక యితర కారణము లనేకములు కలవు. అపరిశుభ్రమైన ఉదకమును పానముచేయుట, అపరిశుభ్రమైన భూములలో పండిన ఆకు కూరలుగాని, యితర శాకములు గాని పరిశుభ్రముగా కడుగక, సరిగా పచనముచేయక భుజించుట, పచ్చి మాంసము, క్రుళ్ళిన మాంసము, క్రుళ్ళిన పండ్లు, విశేషముగ నిలవయున్న పదార్థములను దినుట—యివికూడ కారణములే. మరియు పిల్లలు తరుచు వీథు లలో మట్టిలోను, ఇసుకలోను గోతులుతీసి ఆడుకొనుచుందురు. ఆ ప్రదేశములో కుక్కలు మొదలగు జంతువు లనేకములు మలవిసర్జనజేసి చెరిపియుండవచ్చును. ఆ కారణముచే క్రిమి గ్రుడ్లు మట్టిలో యుండును. పిల్లలాడుకొనునప్పుడు వారి చేతి గోళ్లలో ఆ గ్రుడ్లు ప్రవేశించును. వా రిండ్లకుబోయి చేతులు శుభ్రముగ కడుగుకొనక భుజించుటచే ఆ గ్రుడ్లు లోనికిపోయి క్రిము లగును. ఈ మొద లగు కారణములచే క్రిములు పుట్టుచుండును.

## చికిత్స :

సినా 200 :—క్రిముల కద్భుతముగ పనిచేయును. కడుపు పుబ్బరము, ముక్కు, ఆసనము దురద, నిద్ర సరిగ పట్టక పోవుట, శిశువు భయపడుట, నిద్రలో ఉలికిపడి కేకవేసిలేచుట, తరుచు మూత్రవిసర్జన, కాని కొద్దిగ, తెల్లగ పడుట, త్రిప్పు, వికారము—యీ మొదలగు లక్షణములకు బాగుగ పని చేయును.

సాంటోనినమ్ Santoninum :—క్రిముల కమోఘమైన ఔషధము. దీనికి మించినది మరియొకటిలేదు. ముక్కులు దురద, నిద్ర సరిగపట్టక శిశువు ఉలికిపడియేడ్చుట, పండ్లు కొరుకుట, ఆకలి లేకపోవుట, వికారము, వాంతి, దప్పి, పొత్తికడుపు రాయివలెనుండుట, శూల, తరుచు మూత్రవిసర్జన చేయ వలసివచ్చుట, శయ్యామూత్రము—ఈ మొదలగు లక్షణములకు వెంటనే గుణమిచ్చును. క్రిముల అనుమానము తగిలినచో దీనిని మరువరాదు.

స్పైజీలియా :—ముఖము పాలిపోవుట, కండ్లయెదుట నీలవర్ణముగల వల యాకారములు కనపడుట, నాభిచుట్టు నొప్పి, వికారము—ఈ లక్షణములలో క్రిములకు వాడదగును.

ట్యూక్రియం Teucrium :—మలాశయమునందుదురద, నిద్రలేకపోవుట, త్రిప్పు—ఈ లక్షణములలో నులిపురుగుకు పనిచేయును. ఇది పెద్దవారికి బాగా పనిచేయును.

యుర్టికా యురెన్సు :—నులిపురుగుచే గుదమందు రాత్రు లధికముగ దురద యున్నపుడు పనిచేయును.

సల్ఫర్ :— ఇతర లక్షణములు తగ్గినపిమ్మట, క్రిములచే కలిగినశూలకు దీనిని వాడదగును.

చైనా :—అతిసారము, గుదస్థానమున దురద, ముఖము పాలిపోవుట, కంటిముందు నీలవర్ణముగల రంగులు కనపడుట—యీ లక్షణములలో నులి పురుగునకు పనిచేయును.

నేట్రంఫాస్ 2x, 200 :—క్రిములకు ప్రధానౌషధము, పిల్లలలో ఆమ్ల పిత్తలక్షణములకు (Acidity) బాగా పనిచేయును. ప్రేగులలో నొప్పి, ముక్కు ఆసనము దురద, నిద్రపట్టకపోవుట, శిశువు నిద్రలో పండ్లుకొరుకుట — ఈ లక్షణములలో దీనిని వాడవలయును.

కాలీమూర్ :—తెల్లని నులిపురుగులకు మంచిది. గుదస్థానము దురద, నాలుక తెలుపుగా వుండును.

సైలీషియా:—మలాశయము ముఖ్య దురద, నులిపురుగుకు పనిచేయును.

నేట్రంమూర్ 12x 200 :—ఏలుగు పాములకు (Long intestinal worms) బాగా పనిచేయును.

కాల్కేరియాఫ్లోర్ :—గుదస్థాన మం దపరిమితమైన దురద బయలుదేరి శిశువును నిద్రనుంచి లేపుచున్నపుడు పనిచేయును.

ఫెర్రంఫాస్ :– అజీర్ణముతో కూడియున్నపుడు 'క్రిములకు వాడదగును.

ఇవిగాక సిక్యూటావిరోసా, నక్సువామికాకూడ వాడదగును. పెద్దపాములకు (Tape worms) ఫిలిక్సుమాస్ (Filix Mascolinus) పనిచేయును.

ముఖ్య విషయములు :—పైన వ్రాయబడిన సినా, సాంటోనిన్ మొదలగు క్రిమిహారములను వాడినచో క్రిములు నశించును. కాని మలినముతో కూడియున్న ప్రేగులు క్రిములకు ముఖ్యమైన నివాసస్థలము. కావున ఆంత్రములను పరిశుభ్రముగ నుంచుట ప్రధానమైన సంగతి. పై ఔషధములను వాడుచు, మధ్యమధ్య యెనీమాచేయుట మంచిది. అల్లోపతి వైద్యులు శిశువులకు రాత్రి పరుండునపుడు రెండు గ్రైనులు సాంటొనైన్ వాడుచు ఉదయమున ఆముదము నిప్పింతురు. మూడు గ్రైనులువరకు సాంటొనిన్, పోడోఫిల్లంతో యిచ్చినచో క్రిములను క్రిందికి పంపివేయుననియు, పిమ్మట లవణముతో కలిసిన ఉష్ణోదకమును యెనీమాచేసినచో క్రిములు పడిపోవుటయేగాక ఆంత్రములు పరిశుభ్రపడుననియు వ్రాసియుండిరి.

"Santonine 1 to 3 grains along with 1/4 grain of Podophyllum, is given to drive the worms down as far as possible. After that, repeated injections of warm water to which salt is added bring them away."

(*Dr. Chatterjee's* 'Family Physician'.)

ఇంకొక విధానము :—ఆరు ఔన్సుల నీళ్ళలో 5, 6 చుక్కలు టర్పెన్టైన్ వేసి రాత్రి పరుండుటకు ముందు యెనీమాచేసినచో ఆంత్రములు పరిశుభ్రపడుననియు, క్రిములు నశించు ననియు వ్రాసియుండిరి.

"Half a pint of water, in which 5 or 6 drops of oil of turpentine, or of Eau-de-Cologne, have been dissolved,

once or twice repeated, will generally suffice. The injection should be administered in the evening at bed time, and when the bowel is empty etc." —*Dr. Ruddock.*

ఇంకొక విషయము. క్రిములు వాటిగ్రుడ్లను రోగి గుదస్థానమువద్ద పెట్టును. అవి కొన్నిగంటలలో క్రిములై మలాశయము (Rectum) లోనికి పోవును. కావున గుదముచుట్టు క్రొవ్వుగాని, చమురుగాని వ్రాసినచో గుడ్లుకు తావుండదు. క్రిములు జనించనేరవు. రడ్డక్ వ్రాసియున్నాడు.

"The propagation of the most common varieties of worms—the Ascaris (round worm) and the Oxyuris (thread-worm) —may be prevented by the simple application of lard or oil around the anus of the patient."

—*Dr. Ruddock.*

ఈ క్రిములు ఒకచోటునుంచి మరియొకచోటుకు సంచరించుచుండును. ఏకపక్కపై నిద్రించు పిల్లలలో ఒకరినుంచి మరియొకరికి వ్యాపించును. ఆడక్రిములు త్వరలో వెళ్లుచుండును. కావున క్రిములచే బాధపడు పిల్లవానివద్ద యింకొకరిని పరుండబెట్టరాదు.

పథ్యము :- నిలవయున్న పదార్థములుగాని, అపరిశుభ్రమైన పదార్థములనుగాని భుజింపరాదు. అజీర్ణములేకుండ జూచుటముఖ్యము. అమితముగ భుజింపరాదు. పిల్లలను మధురపదార్థములు తినకుండ చూడవలయును. గారాబముచే పిల్లలకు బెల్లము, మిఠాయి మొదలైన తీపివస్తువులను నిత్యము పెట్టుచున్నచో, ఎన్ని ఔషధములను వాడినను నిష్ప్రయోజనము.

## 46. చన్నులు వాచుట Swelling of the breast.

బిడ్డ పుట్టినపుడు, బిడ్డయొక్క రొమ్ములయందు పాలవంటి ద్రవమొకటి యుండును. మూర్ఖులగు మంత్రసానులు కొందరు చన్నులను గట్టిగ నలిపి బాధ చేయుదురు. అందుచే నవి వాచి పుండుపడి చీముపట్టును. ఇది మరింత బాధకలిగించును.

### చికిత్స :

చీముపట్టనపుడు వాపు కనపడిన వెంటనే వేడినీళ్ళతో కాపడము చేయుట మంచిది.

కేమోమిల్లా :—చన్నులువాచుట, ఎరుపు, నొప్పి—వీటికి మంచిది.

బెల్లడోనా :—రొమ్ములు గట్టిగాయుండి, రంగుమారి బాగా ఎఱ్ఱగానున్నచో పనిచేయును.

హెపారుసల్ఫ :—చీము పట్టినచో బాగుగా పనిచేయును.

ఫెర్రంఫాస్ :—ఎరుపు, నొప్పికి ప్రారంభదశలో పనిచేయును.

కాలీమూరు :—వాపు బాగాయుండి చీము పట్టనపుడు పనిచేయును.

సైలీషియా 200 :—చీము పట్టినపిమ్మట బాగా పనిచేయును.

## 47. నాభిగుడకము Umbilical Hernia.

శిశువునకు నాభినాళము ఛేదించినపిమ్మట బొడ్డుచుట్టు కొంచెము వాపు, ఎరుపుగలిగి చీముకారు పుండు యుండును. అశ్రద్ధచేసిచో ప్రమాదము కలుగవచ్చును.

కారణము :—పదునులేని బండకత్తులతోగాని, మలినముతోకూడి అపరిశుభ్రముగానున్న కత్తులతోగాని శిశువుయొక్క బొడ్డును కోసినచో కలుగుచుండును. మరియు బొడ్డు కోసినపిమ్మట పరిశుభ్రముగా కడుగక పోయినను వచ్చుచుండును.

### చికిత్స :

నక్సువామికా 30, ఓపియం 30 :—ఒకదానితర్వాత నొకదానిని వాడినచో నెమ్మదించునని ఛటర్జీగారు వ్రాసియున్నారు.

ఉదయమున సల్ఫరు, రాత్రి పడుకొనునపుడు నక్సువామికా వాడినచో రెండు మూడు వారములలో నెమ్మదించునని డాక్టరు రడ్డక్ వ్రాసియున్నాడు.

లైకోపోడియం 200 :—ఇదికూడ మంచి పనిచేయును.

## 48. పేలు Lice.

పిల్లలలో కొందరు తలలో పే లెక్కువగ పుట్టుచుండును. ఎన్ని సార్లు తల్లి బిడ్డకు తలరుద్ది నీళ్ళు పోసినను, యెన్ని పర్యాయములు దువ్వి శుభ్రపరచినను కొందరిలో పేలు విడువకుండును. దీనికి చికిత్స యేమిటని హాస్యాస్పదముగ నుండును. కాని వాన్‌విల్లర్సు "స్టాఫిసేగ్రియా 30" వాడి, పిల్లలకు పేలు పోగొట్టితి ననియు, తిరిగి పేలు పట్టలేదనియు ఒక జర్మన్ వైద్య పత్రికలో వ్రాసినట్లు హోమోపతిక్ బుల్లెటిన్‌లో వ్రాసియున్నారు.

(Bulletin, Feb. 1933. P. 279

ఇదిగాక సోరినమ్, మెజీరియం, సాబడిల్లాకూడ పనిచేయును. నేట్రంమూరుకూడ పనిచేయును. సాబడిల్లా పైకికూడ వాడవచ్చును.

## 49. మన్ను తినుట.

కొందరు పిల్లలకు చిన్ననాటినుండియు మట్టి తినుట యందెక్కువ యిష్టముండును. ఇది చాల దురలవాటు. దీని వలన అనేక రోగములు జనించుచుండును. కావున తలిదండ్రులు వారి పిల్లలను మన్ను తినకుండ జాగ్రతగ చూచుచుండవలయును.

పాండు, అతిసారము, రక్తహీనము, నిస్సత్తువ, శ్వాస కాస, అగ్నిమాంద్యము—యిత్యాది కొన్ని వ్యాధులు మన్ను తినుటచే కలుగుచుండును. అట్టి పిల్లలకు పాలు త్రాగుట యందిచ్ఛ యుండదు.

చికిత్స :

పాండురోగమునకు:—కాల్కేరియాకార్బ, హెలోనియస్, చైనా, ఫెర్రంమెటాలికం, కాల్కేరియాఫాస్, నేట్రంమూరు, నేట్రంఫాస్, సైలీషియా మొదలగునవి పనిచేయును.

ఇతర రోగములకు ఆయా రోగ చికిత్సలను చూడదగును.

## 50. అండ వృద్ధి Orchitis.

లక్షణములు :—ఒక వృషణముగాని, రెండుగాని వాచును, ఎర్రపడును, నొప్పికూడ యుండును. ఒకప్పుడు బాధలేకుండ యుండవచ్చును. జ్వరముకూడ యుండవచ్చును.

కారణములు :—తలిదండ్రులు సుఖరోగులైనచో పిల్లలకీ వ్యాధి కలుగుచుండును. మేహవాతమువల్లను, దెబ్బలవల్లను కలుగుచుండును. కొందరి పిల్లలకు పుట్టుకతోనే యీవ్యాధి కలుగు చుండును.

చికిత్స :

ఆరమ్‌మెటాలికమ్ :—జీర్ణించిన సవాయివలన పిల్లల కీవ్యాధి తటస్థించినచో పనిచేయును.

క్లెమేటిస్, లేక, పల్సటిల్లా :—జీర్ణించిన సెగరోగమువలన కలిగిచో పని చేయును.

రోడెండ్రాన్ (Rhodendron) :—మేహవాతమువలన కలిగినచో నిప చేయును.

ఆర్నికా :—దెబ్బలవలన కలిగినచో మంచి పనిచేయును.

బెల్లడోనా :—వాపు, ఎరుపు, నొప్పియున్నపుడు బాగుగా పనిచేయును.

ఎకోనైట్ :—జ్వరమున్నపుడు వాడదగును.

అయొడీన్ (Iodine) :—దీనిని వాచిన భాగమునవ్రాసి మర్దనచేసినచో మంచిపనిచేయును.

సైలీషియా :—పిల్లల బుడ్డలకు పనిచేయును. పోషణ సరిగాలేని పిల్లలకు బాగా పనిచేయును.

కాలీమూర్ :—సెగరోగము అణచిపెట్టుట వలన కలిగిన అండవృద్ధికి మంచిది. పిల్లలలో బుడ్డకు బాగాపనిచేయును (Hydrocele in children)

ఫెర్రంఫాస్ :—జ్వరము, నొప్పియున్నపుడు పనిచేయును.

కాల్కేరియాఫాస్ :—దీర్ఘవ్యాధికి మంచిది. కొన్ని కేసులలో దీనివలనసే పూర్తిగా కుదరవచ్చును.

ఇవిగాక నక్సువామికా, కేంథారిస్, స్పాంజియా, నేట్రంమూర్. కాలీసల్ఫ కూడ వాడవచ్చును.

## 51. కడుపులోబల్ల

## Enlargement of liver and spleen.

ఇది కాలేయమునకు ప్లీహమునకు సంబంధించిన వ్యాధి. ఈ వ్యాధి పిల్లలలో వచ్చుచుండును. ఇది చాలా ప్రమాదకరమైనది. ఈ వ్యాధి లక్షణములను ప్రారంభదశలో కనిపెట్టి వెంటనే తగు చికిత్స చేయనియెడల బిడ్డపై యాశ వదలుకొనవలసినదే.

లక్షణములు:—కాలేయము ప్లీహము పెద్దవగుట, కుడిప్రక్కన నిండుగా యున్నట్లుండుట, నొక్కినచో గట్టిగాయుండి నొప్పియుండుట, సరిగా నిల బడలేకపోవుట, మలబద్ధము, త్రిప్పు, వికారము, వాంతి, తలనొప్పి, నీరసము, ముఖము పాలిపోయి దించుకొని నీరసించియుండుట, మూత్రము కొద్దిగా పచ్చ రంగుతో వెడలుట, జ్వరము—యీ లక్షణము లుండును. మరియు కాసెర్ల కుండు లక్షణము లుండును. ఒకప్పుడు విరేచనము లుండవచ్చును. నోరు చేదు, నాలుక తెలుపు యుండును.

కారణములు :—తరుచు యెక్కువగా డబ్బాపాలను వాడు పిల్లలకు వచ్చుచుండును. బీదవారిలో గాక ధనికు లిండ్లలో పిల్లలకు డబ్బాపాలను విశేషముగా వాడుచుండుటచే వారిలో యీ వ్యాధి అధికముగా వచ్చుచుండును. ఈ పాలకుతోడు అతిగారాబము, సుకుమారము, సోమరితనముకూడ సహాయపడును. డబ్బాపాలు సరిగా జీర్ణముగాక జబ్బుచేయుచుండును. మరియు కాల నియమములేక యేడ్చినపుడెల్ల పాలుపోయుట ఒకకారణము. తేలికగ జీర్ణముగాని పదార్థములను భుజించుట, అమితముగ భుజించుట, యెండలో విశేషముగ పరిశ్రమచేయుట, చలిగాలిలో తిరుగుట, కోపము, మనోవ్యాకులత— యివికూడ కారణములే.

## చికిత్స :

కార్డూన్ మేరియానస్ (Carduus Marianus) :—ఇది యీ రోగమునకు ముఖ్యౌషధము. కాలేయము పెద్దదగుట, నొక్కినచో గట్టిగాయుండి నొప్పి యుండుట, విరోచనము, మూత్రము పచ్చగా నుండుట, నాలుకమధ్య తెలుపు, చివర యెరుపు, నోరు చేదు, తలనొప్పి, వికారము, పుల్లని వమనము, శరీరము పచ్చన, కామెర్లు—యీ లక్షణములకు పనిచేయును. దీనిని కొంత కాలము వాడినచో యెటువంటి బల్లలైనను కరగిపోవును.

డాక్టరు డ్యూయీ యిట్లు వ్రాసియున్నాడు :—

"Jaundice, dull headache, bitter taste, tongue white in middle with red edges. Nausea and vomiting of an acid green fluid; bilious stools, urine golden yellow, fullness in the region of liver and stitching pains." —*Dr. Dewey.*

కాలేయము నొప్పి, శరీరము పచ్చన, నోరు అరుచి మొదలగు లక్షణములకు యితర ఔషధములేవియు పనిచేయనప్పుడుకూడ కార్డూన్ అద్భుతముగా పనిచేసెనని నాష్ వ్రాసియున్నాడు.

టరాక్సాకమ్ Taraxacum :—కాలేయమునకు సంబంధించిన వ్యాధులకు మంచిది. కాలేయభాగమంతయు నొప్పియుండును. పైత్యాధిక్యముచే కలుగు విరేచనములకు పనిచేయును.

టీలియా ట్రైఫోలియేటా Ptelea Trifoliata :— కాలేయము నొప్పి, బరువు. ఈ నొప్పి ఎడమప్రక్కన పరుండినచో అధికమగును. ఈ జబ్బులో

కాళ్ళకు, పాదములకు నీరుచూపినపుడు యీ ఔషధము 30 వాడి కుదిర్చితి నని నాష్ వ్రాసియున్నాడు.

సియనోథస్ Ceanothus :—ప్లీహము వృద్ధియై ఎడమవైపున నొప్పి యున్నపుడు బాగుగా పనిచేయును. ప్లీహమునకు సంబంధించిన వ్యాధుల కమోఘముగ పనిచేయును. ఆయాసము, శ్వాసకృచ్ఛము యుండును. ఈ రోగి తేమతోకూడిన చలిగాలికి భయపడును. ఈ గాలివలన బాధ అధికమగును. డాక్టరు డ్యూయీ యిట్లు వ్రాసియున్నాడు.

"It enlarges the spleen, producing a persistent pain in the left hypochondrium under the short ribs, with intense dispnoea. Acute and chronic splenitis, patient is worse in damp cold weather, is chill and dreads the cold."

—*Dr. Dewey*.

గ్రిండేలియారోబస్టా Grindelia Robusta :—ప్లీహము పెద్దదై భరించ రాని బాధయుండును. తాకుటకు వీలులేనంత సున్నితముగా (tender) నుండును. ముఖము పాలిపోవును.

అరమ్‌మూరు నేట్రొనేటం (Aurum muriaticum natronatum) :— శరీరము పచ్చన, విరేచనము తెలుపు, నాలుక తెలుపు, నోరు అసహ్యము, కుడి వైపుననొప్పి— యీ మొదలగు లక్షణములు గల కాలేయ వ్యాధిలో తన కీ ఔషధము 1000 పొటెన్సీలో డాక్టరు బరూచ్ యిచ్చెననియు, అద్భుత ముగా పనిచేసెననియు నాష్ వ్రాసియున్నాడు.

హీలియాంథస్ (Helianthus) :—ఇది ప్లీహమునకు సంబంధించిన వ్యాధులలో బాగుగా పనిచేయును. ప్లీహము వాపు, నొప్పి యుండును.

కియోనాంథస్ వర్జినికా (Chionanthus Virginica) :— కాలేయము వాచుట, పెద్దదగుట, మలబద్ధము, మూత్రము రంగుగా యుండుట, కాలే యము నొప్పి, కామెర్లు—యీ మొదలగు లక్షణములకు పనిచేయును.

చెలిడోనియం :—దీర్ఘ కాలేయ వ్యాధులకుకూడ పనిచేయును. కాలే యము నొప్పి, తలనొప్పి, వికారము, మలబద్ధము, నాలుక మూత్రము పసుపు రంగు— యీ లక్షణములలో కాలేయ జబ్బులకు (Liver complaints) మంచిది.

చైనా :—ఇది కాలేయము, ప్లీహమునకు సంబంధించిన వ్యాధులకు అమోఘ

మైనది. శరీరము, మూత్రము పసుపురంగు, విరేచనము తెలుపు మొదలగు కామెర్ల లక్షణములకు మంచిపనిచేయును.

"China is one of the best in chronic Liver troubles.... It is equally good in splenic diseases." —*Nash.*

మెర్క్యూరియస్ :—కాలేయము పెద్దదగుట, గట్టిగానుండుట, కుడి వైపున పరుండలేకపోవుట, శరీరము, నేత్రములు పచ్చబడుట, మలబద్ధము, విరేచనము తెలుపు, ఆకలి మందగించుట, నోరు అసహ్యము—యీ మొదలగు లక్షణములకు మంచిది.

బ్రైయోనియా :—కాలేయము పెద్దదై గట్టిగానుండుట, భరింపరాని నొప్పి, నొప్పియున్న వైపున పరుండినచో కొంత ఉపశాంతియుండును. మల బద్ధముండును.

మెగ్నీషియామూర్ :—కాలేయము పెద్దదగుట; తాకినను, కుడిప్రక్కన పరుండినను నొప్పి అధికమగుట, నాలుక పసుపురంగు, మలబద్ధము—యీ లక్షణములకు వాడదగును.

నక్సువామికా :—మత్తుపానీయములు త్రాగుటవలన, సోమరితనమువలన కలిగినను, అజీర్ణము, మలబద్ధము వున్నను పనిచేయును.

నేట్రంసల్ఫ ;—కాలేయము వృద్ధియగుట, కాలేయభాగము సున్నితమై అపరిమితమైన నొప్పి బాధ యుండును, ఈ నొప్పులు ఎడమప్రక్కన పరుండి నచో అధికమగును. శూల, పైత్యవమనము నల్లగాను, ఆకుపచ్చగా విరేచన ములు, కామెర్లు-వీటికి పనిచేయును. విరేచనములు ఉదయమున అధికమగును.

క్లోరీమూర్ :—కాలేయభాగమంతయు నొప్పి, మలబద్ధము, నాలుక, విరేచనము తెలుపు, నోరుచేదు—వీటికి పనిచేయును.

ఇవిగాక కోలెస్ట్రినా, లెప్టాండ్రా, పోడోఫిల్లం, ఫాస్ఫరస్, లైకోపోడి యం, నేట్రంమూర్ మొదలగునవికూడ వాడదగును. వెనుక వ్రాయబడిన కామెర్ల చికిత్సనుకూడ చూడుడు.

## 52. అనాసరోగము Verruca accuminata.

### ఇది పిల్లలకు కలుగు ఒకవిధమైన చర్మరోగము

నేనిది వ్రాసినపిమ్మట యీమధ్య గుంటూరులో ప్రచురింపబడుచున్న వైద్య ప్రదీపిక యను పత్రికలో అనాస జబ్బులనుగురించి వ్రాయబడిన ఒక

వ్యాసమును జదివితిని. అది చదివినపిమ్మట అనాస రోగమునుగురించి యిక్కడ ప్రకరణములో చివర చేర్చుటయే సమంజసమనితోచి దీనిని బాలరోగ ప్రకరణములో చేర్చితిని. వైద్యప్రదీపికలో వ్రాయబడిన వ్యాసమునం దీక్రిందివిధముగా యుండెను. ఆ వ్యాసమంతయు వ్రాయబూనుకొనలేదు. దాని సారాంశము మాత్రము వ్రాయుచుంటిని. అక్షరజ్ఞాన శూన్యులగు వంచకులు కొందరు అనాస వైద్యులమని బయలుదేరి దాని యుత్పత్తికూడ తెలిసికొనలేక అనాసరోగములు అనేకరకములని చెప్పుచు వింత వింత కృత్రిమనామములు పెట్టుచుందురట. విలాసార్థము నేను వాటిని ఈ క్రింద వ్రాయుచుంటిని.

1. జడ్డుఅనాస :—అనగా పిల్లలకు కలుగు దుర్గంధయుక్తమైన అజీర్ణ నీళ్ళ విరేచనము. ఇదియే పిల్లలకు వచ్చు కలరా. దీనినే 'క్షీరాలసక' మని యందురు. దీనినిగురించి వెనుక వ్రాయబడెను.

2. పొట్టఅనాస :—అనగా మలమూత్రములు సరిగా వెడలక కడుపుబ్బి శూల బయలుదేరును. పొట్టకు కలుగు వ్యాధిగనుక దీనికి పొట్టఅనాసయని నామ మిడిరి.

3. గొడ్డనాస :—ప్లీహాయకృతులు వృద్ధియై గొడ్డలివలె చేతికి తాకుటచే దీనికీ పేరు పెట్టిరి. దీనికే పిల్లలకు కలుగు కడుపులో బల్లయని యందురు. దీనిని గురించి వెనుక వ్రాయబడెను.

4. ఎండు అనాస :—పిల్లలకు కాళ్లు చేతులు సన్నగిల్లి పొట్టమాత్రము పెరిగి చిక్కిపోవుటచే నీపేరు పెట్టిరి. ఇదియే నేను వ్రాసియున్న పారిగర్భికమను రోగము.

5. గబ్బసంఅనాస-మిడేసరము అనాస :— ఇదియే వెనుక వ్రాయబడిన 'బాల పాపచిన్నెలు, ఛంటిబిడ్డగుణము'.

6. పొక్కుఅనాస :—బాలుని శరీరమందు దద్దుర్లు, పొక్కులు బయలుదేరు సర్పి, విసర్పి, వీటిని గురించి వెనుక చూడుడు.

7. కోతిఅనాస :—అపరిశుభ్రముచే బాలుని ముడ్డిపిఱుసి, ఎఱ్ఱబడి, పుండుపడి రసికారు 'అహిపూతనమ'ను వ్యాధి. దీనిలక్షణములు, చికిత్సకూడ వెనుక చూడుడు.

8. బొడ్డుపుండనాస :—వెనుక వ్రాసియుండిన 'నాభిగుడకమ'ను వ్యాధికి ఈ పేరు పెట్టిరి. నాభియందు పుండు యుండుటచే యీపేరు పెట్టి యుండవచ్చును.

9. గొర్రె అనాస :—కర్ణరోగములకీ పేరుపెట్టి యుండవచ్చునని వ్రాసియుండిరి. కారణము తెలియదు.

10. కంటి అనాస :—వెనుక వ్రాయబడిన 'కుకూణకమును' కంటి వ్యాధి. దీనికే 'కొయ్యకండలనియు' కూనలనియు కూడ పేర్లు గలవు.

11. పెసర అనాస :—పిల్లలశరీరమందు పెసరబద్దలవలె బయలుదేరు పొక్కులుగల మంత్రము లేకఅజగల్లిక (Eczema). దీని చికిత్సకూడ వెనుక వ్రాయబడెను.

12. పసిరిక అనాస :—పిల్లల శరీరము, కండ్లు మొదలగునవన్నియు పసుపు రంగుతోనుండు పచ్చకామెర్ల కీపేరు పెట్టియుండిరి. దీని చికిత్సకూడ వెనుక చూడుడు.

13. ఉచ్చ అనాస :—పిల్లలు పెక్కుసార్లు మూత్రమును విడుచుచుండు 'శయ్యామూత్రము' (Wetting the bed) మొదలగు మూత్రవ్యాధుల కీపేరు పెట్టియుండిరి.

ఈ విధముగా అనాసవైద్యుల మనుకొనువారు అనేకవిధములైన కల్పిత నామములను గల్పించి బాలరోగము లన్నింటిని ఏదోవిధముగా యీ అనాస రోగముక్రిందికి జేర్చుచుందురు.

కాని నేను తెలుసుకొనిన విషయములనుబట్టి యీక్రింది లక్షణములుగల దానిని 'అనాసరోగమని' వ్యవహరింతురనియు, కావున దీనినికూడ యిక్కడ జేర్చుట సమంజసమనియుతోచి వ్రాయుచుంటిని.

లక్షణములు :—బాలునకు రెండుపిర్రలమధ్య ఒఱసి, ఎర్రబడి, దద్దుర్ల వలె బయలుదేరి, బీటలువారి, పుండుపడి రసికారుచుండును. మరియు నొకవిధమైన దుర్మాంసముకూడ పెరిగి, ఎర్రగాను, కోడిగ్రుడ్డు ఆకారముగాను యుండి రసికారుచు, దుర్వాసనయుండునని వ్రాయబడెను. డాక్టరు డియర్ బోరన్ వ్రాసిన 'చర్మరోగముల'ను (Diseases of the skin by *Dr. Dearborn*) గ్రంథములో ఆసనమువద్ద బయలుదేరిన యీ రోగమును చూపించు నొకపటము వ్రాయబడెను. దానిక్రింద యీవిధముగా వ్రాసియుండెను.

"Verruca Accuminata situated above the anus between the lips of the buttocks. A reddish, projecting, vegeta-

ting mass with an offensive odour and foul secretion."
Diseases of the skin by *Dr F. M. Dearborn.*

కారణములు :— స్తన్యదోషమువల్లను, మలవిసర్జనానంతరము, స్నాన సమయమందు ఆసనము పరిశుభ్రముగా కడుగకపోవుటవల్లను, మలినమేర్పడి, దురద బయలుదేరి, పుండ్లుపడి రసికారుచుండును. అపరిశుభ్రమే ముఖ్య కారణము.

## చికిత్స :

గ్రాఫైటీస్ :—ఇది చర్మరోగములకు మంచిది. ఆసనము బీటలు వారుట, రసికారుట, రక్తము స్రవించుట, మంట మొదలకు లక్షణములలో అనాస రోగమునకు వాడదగును. మలబద్ధ ముండును.

"There is often eczema around the anus, and it is one of our best remedies for Fissura Ani." —*Nash.*

తూజా 30 :—సైకోటిక్ లక్షణములకు ప్రధా నౌషధము. ఆసనము బీటలువారుట మొదలగు లక్షణములకు యీ రోగములో మంచిపనిచేయును.

"Thuja warts are fissured, cut up having cauliflower appearance." —*Dewey.*

మెడోర్హినం 200 :—ఇదికూడ సైకోటిక్ లక్షణములకు మంచిది. కావు ననే యిందుకు సంబంధించిన అహీంపూతనము అనాసరోగములకు బాగుగా పనిచేయును.

రటన్‌హియా (Ratanhia) :—ఆసనము బీటలు వారును, మంట, తీపు యుండును. మలవిసర్జనానంతరము మంటయుండును.

సల్ఫర్ 30 :—చర్మరోగముల కన్నిటికి మంచిది.

నేట్రంసల్ఫ్ 1 :—పసుపుపచ్చని స్రావ మున్నపుడు పనిచేయును.

కాలీమూర్ :—తెల్లని, చిక్కని రసికారునపుడు పనిచేయును.

సైలీషియా :—ఆసనము బీటలువారుట, చీముకారుట, మలబద్ధము——ఈ లక్షణములకు వాడదగును.

ముఖ్యవిషయము :—ఆసనము పరిశుభ్రముగా కడుగు చుండవలయును.

# ఐదవ ప్రకరణము

ఈ అధ్యాయములో పిల్లలకు, పెద్దవారలకుకూడ కలుగు వ్యాధులను గురించి వ్రాయబడినది. అనగా జ్వరములు, శ్వాస కాస మొదలగునవి. ఈ వ్యాధులు బాలురకుకూడ సంభవించు చుండును. కావున యీ పుస్తకములో వ్రాయబడినవి.

## 1. సాధారణ జ్వరము Simple Fever.

లక్షణములు:—శరీరము వేడి, తాపము, చెమటలు లేకుండుట, చలి, వణకు, నోరు చేదుగ అసహ్యముగ నుండుట, యే పదార్థమందును యిష్టము రుచి లేక పోవుట, కారము గాను, పుల్లగనుండు పదార్థముల యందిష్టముండుట, ఒడలు నొప్పులు, ఆవలింతలు, నోరు ఆరిపోవుట, దప్పి, తుమ్ములు లేకపోవుట, మల బద్ధము, నాలుక తెలుపు, ఆకలి లేకపోవుట, అగ్నిమాంద్యము, మనసిమితము లేకుండుట, కన్నులనుండి నీరు కారుట, నిద్రపట్టకపోవుట, తలనొప్పి, రంగుతో కూడిన మూత్రము స్వల్పముగ వెడలుట—యివి సాధారణ జ్వర లక్షణములు. ఒకప్పుడు రొంప, దగ్గుకూడ యుండవచ్చును.

పై లక్షణములలోనుంచి. ఆయుర్వేద పరిభాష ననుసరించి తెలుసుకొను టకు వివిధ జ్వరంబులయొక్క గుణంబులను విడదీసి క్రింద వ్రాయుచుంటిని.

వాతజ్వర లక్షణములు :—నిద్రపట్టకపోవుట, నోరు ఆరిపోవుట, మల బద్ధము, వణకు, తుమ్ములు రాకుండుట, ఒడలు నొప్పులు, పోట్లు, కడుపు నొప్పి, ఉబ్బరము, నోటి యందరుచి, ఆవలింతలు.

పిత్తజ్వర లక్షణములు :—కండ్లు తిరుగుట, నోరు చేదు, ప్రలాపము, వమ నము, మలమూత్రములు పచ్చగనుండుట, అతిసారము, దప్పి, శరీరమునందు దద్దుర్లు.

కఫజ్వర లక్షణములు :—రొంప, దగ్గు, వాంతి, వగర్పు, ముక్కులు శ్లేష్మ ముతో నిండి యుండుట, రొమ్మునందు శ్లేష్మము నిండి నట్లుండుట, అగ్ని మాంద్యము, నేత్రములు సగము విప్పియుండుట, నోరు తియ్యగనుండుట, మలమూత్రములు తెల్లగనుండుట, నిద్ర అధికముగవచ్చుట, అన్నము రుచింప కుండుట.

పై లక్షణములలో అన్నియుగాని, కొన్నిగాని ఆయా జ్వరములలో కలుగుచుండును.

కారణములు :—దేహప్రకృతికి సరిపడని ఆహార విహార లోపములచే కలుగు దోషములు, అజీర్ణము, మలబద్ధము ముఖ్యకారణములు.

ఇవిగాక కాలమార్పు, తేమలోను చలిగాలిలోను తిరుగుట, తడిబట్టలు తరుచు కట్టుకొనుట, దెబ్బలు, గాయములు—ఇవికూడ కారణములే.

## చికిత్స :

ఎకోనైట్ :—ప్రధానౌషధము. జ్వర తీవ్రమునుబట్టి అరగంట కొక మోతాదు చొప్పున చెమటలుపోయువరకు వాడవచ్చును.

"It has been termed the homoeopathic lancet."

బెల్లడోనా :—తలనొప్పితోకూడిన జ్వరమునకు వాడదగును.

రూస్‌టాక్స్ :—ఒడలు నొప్పులతోకూడిన వాతజ్వరమునకు మంచి పనిచేయును.

జెల్సిమియమ్ : - వణకు విశేషముగా నున్నపుడు దీనిని వాడినచో అద్భుతముగా పనిచేయును.

బాప్టీషియా :—అజీర్ణము, అతిసారము, ప్రలాపము మొదలగు లక్షణములతోకూడిన పిత్తజ్వరములకు బాగా పనిచేయును.

డల్‌కమారా :—తేమలో తిరుగుటవలన, తరుచు తడిబట్టలు కట్టుటవలన కలుగు జ్వరమునకు పనిచేయును.

బ్రైయోనియా :—దగ్గు, దప్పి, అజీర్ణము, ఒడలు నొప్పులు, పోట్లు, పగలు నిద్ర ఎక్కువగ వచ్చుట—ఈ లక్షణములుగల వాతకఫ జ్వరములలో వాడదగును.

నక్సువామికా :— అజీర్ణము, మలబద్ధమున్నపుడు అద్భుతముగా పని చేయును.

కేంఫర్ :—అకస్మాత్తుగ చలి, వణకు యున్నపుడు పనిచేయును.

ఫెర్రంఫాస్ :—ముఖ్యౌషధము. తీవ్రవాడి, తీవ్రమైన వేడియుండి అజీర్ణముతో కూడియున్నపుడు, మూత్రము స్వల్పముగ పడునపుడు జ్వరములలో అమోఘముగ పనిచేయును.

నేట్రంసల్ఫ :—అతిసారము, కండ్లుతిరుగుట, ప్రలాపము, నోరుచేదు,

మూత్రము పచ్చగా నుండుట—ఈ లక్షణములుగల పైత్యజ్వరమునకు బాగా పనిచేయును.

కాలీఫాస్ :—నిద్రపట్టకపోవుట, నోరు ఆరిపోవుట, కడుపునొప్పి, మల బద్ధము, ఆవలింతలు, వణుకు— ఈ లక్షణములతో కూడిన వాతజ్వరముల కమోఘమైనది.

నేట్రంమూర్ :—రొంప దగ్గు, రొమ్మునందు శ్లేష్మము నిండియున్నట్లుండి గురగురలాడుట, అన్నము రుచింపకుండుట, మూత్రము తెలుపు లేక నలుపు, నిద్ర ఎక్కువగ పోవలెనని కోరిక. రాత్రి మామూలు నిద్రచాలక ఉదయమున లేచుసరికి అలసట చెందినట్లుండుట—ఈ లక్షణములతో కూడిన కఫజ్వరము లకు మంచి పనిచేయును.

కాలీసల్ఫ :—సాయంకాలమున శరీరోష్ణము (Temperature) అధిక ముగానుండి నాలుక పసుపుపచ్చగా నున్నపుడు పనిచేయును. చెమట త్వరలో పట్టించును.

జ్వరములకు ప్రధానమైన ఫెర్రంఫాస్ 12X వాడుచు, ఇతర లక్షణము లనుబట్టి ఆయా లవణములను వాడుటమంచిది. జ్వరము తగ్గినతర్వాత బిడ్డకు పుష్టిచేయుటకు మధ్యమధ్య కాల్కేరియాఫాస్ 6X యివ్వవగును.

పథ్యము :—సాధారణముగ జ్వరము ఆమదోషంబుచే జనించుచుండును. కావున రోగికి లంకణము చేయించుట మంచిది. ఇందువలన ఆమదోషము నశించి, అగ్నిదీప్తికలిగి, ఆకలి, జీర్ణశక్తి, కలిగినపిమ్మట పథ్యము పెట్టుట మంచిది.

## 2. సన్నిపాతజ్వరము Typhoid Fever.

ఇది చాల ప్రమాదకరమైన జ్వరము. దీనిని గురించి ప్రత్యేక మొక గ్రంథము వ్రాయవచ్చును. ఇచ్చట దాని లక్షణములను, చికిత్సను గురించి క్లుప్తముగా వ్రాయుచుంటిని. ఈ వ్యాధి తగిలినచో గృహవైద్యముమీద ఆధార పడి యుండుటకంటె అనుభవముగల వైద్యునకు చూపించుట శ్రేయస్కరము. ఇది సాధారణముగ 5 మొదలు 35 సంవత్సరములవయసుగల వారికిని, ఆగష్టు, సెప్టెంబరు, అక్టోబరు మాసములలోను యెక్కువగ వచ్చుచుండును. దీని సాధారణపరిమితి మూడు వారములు. కాని తీవ్రమైన కేసులలో 5 లేక 6 వారములుకూడ పీడించుచుండును.

లక్షణములు :

మొదటి వారము :—రోగారంభమున తల నొప్పి, అలసట, ఆకలి లేక పోవుట, మలబద్ధము, యే పనిచేయుటయం దిష్టము లేకుండుట, నాలుక మధ్య తెల్లగను, అంచు లెర్రగ నుండుట, ప్లీహము కొంచెము వృద్ధియగుట, నాడి నెమ్మది, సాయంత్రము కొంచె మెక్కు వగుచు, ఉదయమున 1, 2 డిగ్రీలు తగ్గుచుండు జ్వరము ; యిట్లు ఉదయమున తగ్గుచుండుట శుభసూచికము. ఉదయమున శరీరోష్ణము (Temperature) యెక్కువైనను, హెచ్చు తగ్గులు లేక సదా 104, 105 డిగ్రీలు జ్వర మున్నను ప్రమాదము.

రెండవ వారము :—ఈ వారములో శరీరోష్ణము బాగా అధికముగా నుండును. నాడి తీవ్రమై యుండును. రోగి మొద్దువలె తెలివితక్కువగనుండును. కళ్ళెదగ్గు (Bronchitis), అతిసారము, పక్కబట్టలు పీకుట మొదలగు సంధి లక్షణములు, ముఖము పాలిపోవుట, స్థిమితము లేకుండుట (Restlessness) యెక్కువ రంగుతో మిశ్రమైన మూత్రము వెడలుట, వస్తి (పొత్తికడుపు) యందు నొప్పి, గుళగుళ ధ్వని, వస్తి పొంగరించుట—యీ లక్షణములుండును. ఇవిగాక యీ వారములోనే ఛాతిమీద, పొత్తికడుపుమీదను, గులాబిరంగు గల మచ్చలు బయలుదేరును. వీటిని మచ్చ లనుటకంటె వాపు లనుట మంచి దేమో. ఏమన అవి శరీరముకంటె కొంచె మెత్తుగ నుండును. కాని నొక్కినచో అణగిపోవుచుండును. పిల్లలలో యీ లక్షణము కనపడినపిమ్మట జ్వరముతగ్గుట ప్రారంభించును.

మూడవవారము :—అట్టి పిల్లలకు మూడవ వారమునుంచి అతిసారము, జ్వరము, అవయవములయందు నొప్పులు—ఇవి తగ్గుట ఆకలి పుట్టుట, శరీరోష్ణము తగ్గుట, రాత్రియందు నిద్రపట్టుట, నాలుక శుభ్రపడుట—ఈ లక్షణములు క్రమముగ కనపడును. యివి శుభచిహ్నములు. అట్లుగాక రోగ మప సవ్యముగ నడచినచో, సంధి ఎక్కువగుట, పొత్తికడుపు పొంగరించుట, రక్తస్రావము, శరీరోష్ణ మధికమగుట, పక్కబట్టలు చించివేయుట, మతిలేక బట్టలిటునటు తడుముట (Pick and fumble), స్మారకము తప్పుట, తనచుట్టు ఏమిజరుగుచున్నదో తెలియకపోవుట, అతినీరసము, చెవిలో హోరుమను శబ్దములు వినబడుచు పోటుగానుండుట, శిరస్సును యిటునటు త్రిప్పి కొట్టుకొనుచుండుట, చేతులు వణకుట, కనుపాపలు పెద్దవగుట, ముక్కునుండి రక్తముకారుట, అధిక ప్రేలాపన, శరీరము మంటలు, కంపములు (Convulsions)—ఇట్టి దుర్గుణములన్నియు జనించును.

నాల్గవ వారము ;—రోగము సవ్యముగ నడచినచో జ్వరము పూర్తిగ తగ్గును. దుర్గుణములేవియు నుండవు. కాని రోగము వక్రగతిని నడచినచో (In severe and fatal cases), మూడవవారములో జనించు దుర్గుణము లన్నియు ప్రకోపించును. ఎక్కువ మత్తు, ప్రేలాపసంధి, అప్రయత్నముగ మలమూత్రవిసర్జన మొదలైన లక్షణములన్నియు వృద్ధియై రోగి మరణించును. కొన్ని మొండిరోగములు 5, 6 వారములవరకు ఊగులాడును. కాని లాభము లేదు.

శరీరోష్ణము (Temperature) ఎప్పుడైనను 107 వరకు ఎక్కినను, ఉదయమెన్నడైన 105 దాటినను ప్రమాదమే. కొన్ని కేసులలో మూడవవార ములో శుభలక్షణము లగుపించి రోగము తిరుగబెట్టవచ్చును. కావున కడు జాగ్రత వహించవలయును. అతిసారమున్నను, మలమేమాత్రము వెడలకున్నను యీ వ్యాధి ప్రమాదమైనది. ఈ వ్యాధిలో ఊపిరితిత్తులుకూడ చెడిపోయి దగ్గు వచ్చును. ప్రేగులలో బెజ్జములుపడుట (Perforation of the bowels), రక్తస్రావము, అతిసారము, ఊపిరితిత్తులు చెడిపోవుట—ఈ లక్షణములు ప్రమాదమును సూచించును. తగినజాగ్రత వహించనిచో క్షయవ్యాధి రాగలదు.

కారణములు :—ఆహార దోషమువల్లను, త్రాగెడు నీరు పరిశుభ్రముగ లేకపోయినను, పాలలో అపరిశుభ్రమైన నీరు కలిపి త్రాగినను, రోగి బట్టల వల్లను—ఈ మొదలగు కారణములచే జనించుచుండును. అపరిశుభ్ర ఆహారము వల్లను, మురికినీటి పానమువల్లను యీ రోగబీజమైన నొకవిధమైన క్రిమి (Eberth's Bacillus Typhosus) శరీరములో ప్రవేశించి రక్తమును విష పూరితముగ జేయును. ఈ క్రిమి తిరిగి రోగియొక్క మలమూత్రములద్వారా గాని, ఉమ్మిద్వారాగాని బయటకువచ్చి ఆహారమును, నీటిని జెరుపును. అవి సేవించుటచే ఆరోగ్యవంతునకుకూడ ఈ వ్యాధి కలుగుచుండును.

## చికిత్స :

బాప్టీషియా 30 :— సన్నిపాత జ్వరములకిది ప్రధానౌషధము. రోగారంభ మున దీనిని వాడినచో ఉద్ధృతములేమియు జనించవు. శరీరమంతయు నలగగొట్టి నట్లు నొప్పులు, పక్కమీద యిటునటు కొట్టుకొనుట, నాలుకమధ్య తెల్లగ, అంచులెర్రగనుండుట, పొత్తికడుపుబ్బరము, నీళ్ళవిరేచనములు, మలమూత్ర ములు చెమటవాసన యుండుట, చలి, వణుకు—ఈ లక్షణములలో బాగుగా పనిచేయును.

"This remedy is of great value, modifying and even cutting short, the attacks by destroying the poison in the blood. Its influence in this disease is comparable to that of Aconite in simple fever." — *Ruddock*.

"A great Typhoid remedy." —*Nash*.

Hitherto I used. But now I use 30 Potency. —*Nash*.

ఆర్సెనికమ్ :—స్థిమితము లేకుండు (Restlessness), చచ్చిపోవుదునని భయము, నిస్త్రాణ, కొద్ది దప్పి, అతిసారము, ప్రేగులయందు పుండ్లు—యీ లక్షణములలో పనిచేయును. దీని లక్షణము లన్నియు మిట్ట మధ్యాహ్నము గాని, అర్ధరాత్రియందుగాని ప్రకోపించుచుండును.

బ్రైయోనియా 30 :—ఒడ లంతయు నొప్పులు, కదలినచో బాధ లెక్కువగుట, మలబద్ధము, క్రొత్తప్రదేశమునకు వచ్చినట్లును, తిరిగి తన స్వస్థానమునకుపోవలయుననియు చెప్పుచుండెడి సంధి, దగ్గు, తలనొప్పి-వీటికిపనిచేయును.

రూస్‌టాక్సు :—శరీరము నొప్పి, రోగి ఉపశాంతికొరకు యిటు నటు కొట్టుకొనుట, నాలుక యెండిపోయి, యెర్రగను, ముక్కోణాకారము కలిగిన యెర్రని కొనయున్నపుడు పనిచేయును. కడు పుబ్బరము, అతిసారమునకు కూడ వాడవచ్చును.

"The tongue is brown, dry, cracked or red with a triangular red tip. The abdomen is tympanic and the diarrhoea is involuntary, brown and cadaverous." —*Blackwood*.

లేకెసిస్ (Lachesis) :—ఊపిరితిత్తులు చెడిపోయినందువలన జనించు బాధలకు పనిచేయును. ప్రేలాపసంధి, శరీరము వణుకు, నాలుక జాపలేకపోవుట, ప్రేగులనుంచి రక్తస్రావము—యీ లక్షణములకు వాడదగును. నాష్ యిట్లు వ్రాసియున్నాడు.

"Under Lachesis we have haemorrhages from the bowels of decomposed blood, which occur mostly during the course of exhausting, acute diseases like Typhoid." *Nash*.

హాయోసియామస్, బెల్లడోనా, స్ట్రామోనియమ్ :—ఈ మూడును సంధి త్రయము (Trio of delirium remedies) సంధిలో అద్భుతముగ పని చేయును.

హాయోసియామస్ :—రోగి ముఖము పాలిపోయి దించుకొనిపోయి

యుండుట, మాట స్ఫుటము లేక యేదియో గొణుగుకొనుట, చాలసేపటికిని గాని మాట పైకి రాకపోవుట, పక్కబట్టలు లాగుకొనుట, కామోద్రేకమైన ప్రేలాపన, రోగి లజ్జవిడిచి గుడ్డవిప్పి మర్మస్థానమును బహిరంగ పరచుట, అతినీరసము, అప్రయత్నముగ మలమూత్రములు వెడలుట—ఈ లక్షణములుగల సన్నిపాతసంధిలో అమోఘముగ పనిచేయును.

బెల్లడోనా:—తీవ్రసంధి, ముఖ మెర్రగానుండుట, కండ్లు ఎరుపు, రక్తము శిరస్సునకు వేగముగ ప్రవహించుట, శిరస్సువేడి, శరీరము చల్లన, మెదడునందు రక్తము కూడియుండుట—ఈ లక్షణములకు వాడదగును. ఈ సంధిలో రోగి భూతములను, భయంకరాకారములను, మృగములను, పురుగులను చూచుచున్నట్లుండి, భయపడుచు, వాటినుంచి తప్పించుకొని పారిపోవుటకు కోరుచుండును. నవ్వుట, పండ్లుకొరుకుట, దగ్గరయున్నవారిని కొట్టుట కొరుకుట—ఈ లక్షణములుండును. 30 లోపు వాడుట మంచిదికాదు.

"No remedy has more persistently violent delirium than Belladonna." —*Nash.*

పైమందులు రెండు కొద్దిచుక్కలు కాగుచున్న నీటిలోవేసి రోగిని ఆవిరి పీల్చనిచ్చుట కూడ మంచిది.

స్ట్రామోనియమ్ :—దీనిసంధిలో ప్రేలాపన ఎక్కువగ నుండును. గట్టిగ అరచుట, పాడుట, నవ్వుట, యేడ్చుట, ఇకిలించుట, అతి దీనముగ ప్రార్థించుట, పక్కమీద ఒకప్పుడు అడ్డముగను, ఒకప్పుడు నిలువుగను తిరుగుచుండుట, తలగడమీదనుంచి అకస్మాత్తుగ తల పైకెత్తుచుండుట, నోరు గరగర లాడుట, నాలుక బండబారి కదపలేకపోవుట, దుర్వాసనగల విరేచనము లేక మలబద్ధము, మూత్రబంధన ఈ లక్షణములను గలిగియుండి చివరకు చూపు కనపడక, చెవులు వినపడక, నోరు కట్టుపడి నోటినుండి మాటరాకుండును. ఇట్టి స్థితిలో స్ట్రామోనియమ్ దగ్గర లేకపోయినచో చావు నిశ్చయము.

"Above all remedies loquacious." —*Nash.*

"Indicated when there is furious delirium." *Blackwood.*

నక్సుమోస్‌చాటా Nux Moschata:—మగత, నిద్రఎక్కువ, పొత్తి కడుపు ఉబ్బరము, కడుపులో గురగుర, నోరు, నాలుక గొంతుక ఆరిపోవుట, నాలుక నోటి పైభాగమున కంటుకొని యుండుట, కాని దప్పిమాత్రము లేకుండుట—యీ లక్షణములకు వాడదగును.

జెల్సిమియం :—శరీరమంతయు వణకుచుండుట, వణకుటచేత నాలుకపైకి చాపలేకపోవునపుడు వాడదగును.

యాసిడ్ మూర్ లేక మూరియాటిక్ ఆసిడ్ :—మలమూత్రము లప్రయత్నముగ వెడలునపుడు, నోటిలో వాసనగల పుండ్లున్నపుడు, రోగి నీరసముచే ప్రక్కనుంచి క్రిందికి జారునపుడు, స్మారకములేక యేదియో గొణుగుకొనునపుడు పనిచేయును.

ఆర్నికా :—మలమూత్రము లప్రయత్నముగ పోవునపుడు, మెత్తని పక్కసైతము రోగికి గట్టిగనుండునపుడు, మగతయున్నపుడు, ముఖమెర్రగ నున్నపుడు యిది పనిచేయును.

కార్బోవెజ్ :—శరీరమంతయు చల్లబడి, కళ్లయందు కాంతితగ్గి, ముఖము దించుకొనిపోయి చావుకు సిద్ధమైయున్న రోగికి చివరదశలో అద్భుతముగ పనిచేయును. రోగి గాలికొరకు విసురుమని కోరుచుండును.

క్రోటాలస్ హారిడస్ :— గుదస్థానమునుండి రక్తస్రావ మున్నపుడు (Rectal haemorrhage) పనిచేయును.

ఫెర్రంఫాస్ :—ప్రారంభదశలో చలిజ్వరమునకు, రక్తస్రావమునకును పనిచేయును.

కాలీమూర్ :— ముఖ్యౌషధము, ఫెర్రంఫాస్‌తో వాడుట మంచిది. నాలుక తెలుపు, నీళ్ళవిరేచనములు, కడుపుబ్బరము, రక్తవమనము—వీటికి బాగుగ పనిచేయును.

కాలీఫాస్ :—దుర్గుణము లెక్కువగనున్నపుడు వాడదగినది. నీరసము, నిద్రలేకపోవుట, అతిసారము, నోరు ఆరిపోవుట, మాటరాకపోవుట, సంధి, మగత, గొణుగుకొనుట, మనోవికారములు (Hallucinations) హృదయ దౌర్బల్యము, రక్తవమనము—ఈ లక్షణముల కమోఘముగ పనిచేయును.

నేట్రంమూర్ :— నాలుక పొడి ఆరిపోవుట, మత్తు, దప్పి—వీటికి పనిచేయును.

నేట్రంసల్ఫ :—పైత్యోద్రేకముచే గలుగు లక్షణములకు బాగా పని చేయును. నీళ్ళవిరేచనములు పిత్తప్రకోపమును తెలియజేయు రంగు గలిగి యుండును.

కాల్కేరియాసల్ఫ :—అతిసారము కూడియున్నపుడు పనిచేయును.

ఇవిగాక ఫాస్ఫరస్ (ఊపిరితిత్తులకు, జబ్బులకు), మెలిలోటస్ఆల్బా

ముక్కునుండి రక్తము కారుటకు), అల్యుమెన్ (ప్రేగులనుంచి రక్తస్రావమునకు, ఆయిలాంధస్ కూడ వాడవచ్చును.

ముఖ్య విషయములు :—జ్వరములోగాని, జ్వరము తగ్గిన కొద్ది రోజులవరకుగాని రోగి ఘనపదార్థము లాహారముగ నివ్వరాదు (Solid feod). బార్లీనీళ్లు, మంచినీళ్ళు, పండ్లరసము మొదలగునవి యిచ్చుట మంచిది. పొత్తికడు పుబ్బరముగనుండి, అతిసార మున్నపుడే ఆహారముకూడ యివ్వకూడదు. గోరువెచ్చని నీళ్ళలోగాని, చన్నీళ్ళలోగాని బట్టతడిపి శరీరమునద్దుట మంచిది. ఉష్ణోదకము ఆసనముద్వారా యిన్‌జెక్షన్ చేయుటచే ప్రేగులు శుభ్రపడును. జ్వరము తగ్గిన పిమ్మట మలమూత్రములు మామూలు స్థితిలో నున్నపుడు క్రమక్రమముగ అన్నము పెట్టవచ్చును. రోగికి పూర్తియైన విశ్రాంతి నివ్వవలెను. రోగము నెమ్మదించిన కొన్ని మాసములవరకు యేపనియు చేయరాదు.

"No man can be considered as fit for work for three or four months after an attack of severe Enteric fever."

## 3- చలిజ్వరము Intermittant Fever.

చలి కుదుపుతో ప్రారంభమగుటచే చలిజ్వర మనియు, విడిచి విడిచి వచ్చుటచే విడుపు జ్వర మనియు, మన్యపు ప్రదేశములలో అనగా అడవి ప్రాంతములలో జనించుటచే మన్యపు జ్వర మనియు దీనికి నామాంతరము.

ఇది త్రి విధములు :

1. ప్రతి దినము వచ్చు జర్వము (Quotidian).
2. దినము విడచి దినము వచ్చు జ్వరము (Tertian).
3. ప్రతి నాల్గవరోజున వచ్చు జ్వరము (Quartan) అనగా జ్వరమునకు మధ్య రెండురోజులు నాగాయుండును.

లక్షణములు :—ఈ జ్వరము త్రిగతులను పొందియుండును.

1. చలి —ఈ జ్వరము చలితో ప్రారంభమగును. నిస్సత్తువ, అలసట, చలి, వీటితో ఆరంభించును. వెన్ను వెంబడి చల్లని నీళ్ళుపోసినట్లు. చలికుదుపు, వణకు యుండును. ముఖము పాలిపోవుట, నాలుక తెలుపు, మూత్రము స్వల్పముగ తరుచు విసర్జించుట—ఈ లక్షణములుండును.
2. వేడి :—పిమ్మట ఒక అరగంటకుగాని గంటకుగాని శరీరము వేడియెక్కి,

జ్వరము, తలనొప్పి, దప్పి, ఒడలు నొప్పులుండును. మూత్రమెక్కువ రంగుగలిగి స్వల్పముగ వెడలుచుండును. ప్లీహము పెద్దదగును.

3. చెమట :—పిమ్మట రెండు మూడు గంటలకు చెమటలు పోయుట ప్రారంభమగును. రోగికి సుఖవు కలుగును. జ్వరము తగ్గును. దప్పి తగ్గును. ఆకలి పుట్టును. రోగికి నిద్రపట్టును. ప్రారంభమున నొసటను, ఛాతిమీదను, చెమటపట్టి, పిమ్మట శరీరమంతయు చెమట పోయును. మొత్తము సుమారు ఆరుగంటల కాలము పట్టును. తిరిగి చలి, జ్వరము వచ్చువరకు రోగి కులాసాగానే యుండును.

కారణములు :—ఇంటిచుట్టు పేడకుప్పలు. మురికి గోతులుండుటచే దోమ లధికముగ జనించు చుండును. ఈ దోమ (anopheles) కాటు ఈ జ్వరమునకు ముఖ్యకారణము. కావున నివసించు యిండ్లవద్ద మురుగునీరు నిలవయుండకుండ చేయుట, పేడకుప్పలు లేకుండ చూచుట ముఖ్యావసరము. మరియు రక్తములోనుండు నొకవిధమైన క్రిములవలన జనించు చుండును.

## చికిత్స :

చైనా :—ఇది రోజువిడిచి రోజువచ్చు జ్వరమునకు బాగుగాపనిచేయును. ఈ రోగమునకు ముఖ్యౌషధము, ప్రారంభమున చలియున్నపుడు దాహ ముండదు. కాని చెమట పట్టినపుడు మాత్రము దప్పియుండును. దీని చలి మోకాళ్ళక్రింద ప్రారంభమై శరీరమంతయు వ్యాపించును.

"Chill without thirst, and heat without thirst, but great thirst in the sweating stage, which is very profuse and debilitating." —*Ruddock.*

"The chill begins in the lower extremities below the knees, and extend to the body." —*Blackwood.*

ఆర్సెనికమ్ :—ప్రారంభమునుంచి చివరవరకు దప్పి విశేషముగనుండును. పార్శ్వపునొప్పి, వేడిపానీయములను కోరుచుండును. బలహీనము, స్థిమితము లేకుండుట రాత్రి 1–3 గంటలమధ్య లక్షణము లెక్కువగుచుండును.

ఇపికాక్ :—క్వైనా వాడినవారికి తప్పక దీనిని వాడవలయును. యీ జ్వరమునకు దివ్యౌషధము. క్వైనాకంటె అనేకరెట్లు ఎక్కువ అద్భుతముగ పనిచేయును. వికారము, వాంతి, దగ్గుయున్నపుడు అమోఘముగ పనిచేయును. నాష్ యిట్లు వ్రాసియున్నాడు.

"Ipecacuanha is a well-known intermittent fever remedy in our school...It is certainly preferable to the inevitable quinine prescription of the old school." —*Nash*.

యూపటోరియమ్ పర్ప్యూరమ్ Eupatorium Purpurum :—వెన్ను వెంబడి చలి ప్రారంభమై పైకిక్రిందికి వ్యాపించును. చలి, వణుకు యున్నంత సేపు దప్పియుండదు.

కాప్సికమ్ :—అపరిమితమైన చలి, శరీరము చల్లన, చలికిముందు నొప్పులు. వీపులో రెండు భుజముల మధ్య ప్రదేశములో చలి ప్రారంభించును. చలికి ముందు దప్పియుండును. త్రాగినపిమ్మట వణుకు—ఈ లక్షణములలో వాడదగును.

యూపటోరియమ్ పెర్ఫోలియాటమ్ :—ఈ జ్వరములో ఎముకలు నొప్పియున్నను, ఉదయము 7-9 గంటలమధ్య చలి వచ్చినను, చలికిముందు నొప్పు లున్నను, చలి, ఉష్ణము—యీ రెండు స్థితులమధ్య పసరువమనమైనను, చలికి ముందు, చలిలోను దప్పియున్నను, తల నొప్పి యున్నను, చెమటలు పోయుటతోడనే తలనొప్పి తప్ప తక్కిన గుణము లుపశమించినను—యీ మందు వాడదగును.

మెనియాన్థిస్ :—చేతులు, పాదములు చల్లగను, మిగిలిన శరీర మంతయు వెచ్చగ నున్నపుడు పనిచేయును.

యాంటిటార్ట్ (Antim Tart) :—చలిలో దప్పి లేకపోయినను, మగత యెక్కువగ నున్నను పనిచేయును.
రూస్టాక్స్ :—చలిలో దగ్గుయున్నపుడు పనిచేయును.

ఇగ్నేషియా :—చలితో దాహము, ముఖము యెరుపు, జ్వరములో శరీర మంతయు మరద—వీటికి పనిచేయును.

చైనాసల్ఫ :—వెచ్చని గదిలోనున్నను వణకుచుండును. వణకుతో చెమట పోయుచుండును.

నిక్టాన్థిస్ (Nyctanthes):—చలిజ్వరములోను, పైత్యజ్వరములోను మంచిది. యకృత్ ప్లీహము వృద్ధియై సున్నితముగ నున్నను, మలబద్ధము, మూత్రము విశేషమైన రంగుగలిగి స్వల్పముగ వెడలుచున్నను, నీరు త్రాగినపో పసరధికముగ వమనమైనను, యీ మందు తప్పక వాడవలయును.

కార్బోవెజ్ :—సాయంకాలము చలివచ్చినను, చలికిముందు తలనొప్పి

యున్నను, చలి యెక్కువసేపున్నను, చేతులు, పాదములు, చల్లగయున్నను పనిచేయును. క్వైనా వాడియున్న వారికి బాగా పనిచేయును.

ఓపియం :—చలితో జ్వరము వచ్చును. చలిలో రోగికి నిద్రమత్తువచ్చును. చలి, వేడి యీ రెండు స్థితులలో దప్పి యుండదు.

బాప్టిసియా :—మురికి నీరు త్రాగుటచే జనించినచో పనిచేయును. తల నొప్పి, నిస్త్రాణ, స్వల్పమూత్రము, సంధి—వీటికి పనిచేయును.

సినా :—క్రిములచే జనించినచో పిల్లలకు బాగుగా పనిచేయును.

ఫెర్రంఫాస్ :—జ్వరమున్నను, జీర్ణముకాని పదార్థము వమనమైనను దీనిని వాడదగును. క్వైనా విశేషముగ వాడినవారలకు దీనిని తప్పక వాడ వలయును. రక్తహీనులకు మంచిది.

నేట్రంమూర్ :—ఉదయము 10, 11 గంటలమధ్య చలి, జ్వరము ఎక్కు వగుట, దప్పి, జ్వరములో నోటియందు నీటిపొక్కులు బయలుదేరుట, మల బద్ధము, ఆకలిలేకపోవుట, నీరసము, తలనొప్పి—ఈ లక్షణములలో బాగా పనిచేయును. క్వైనా వాడినపిమ్మట దీనిని వాడినచో దాని విరుగుడుగ పనిచేయును. చలిజ్వరములకు ప్రధానౌషధము. దీనివలన అనేక రోగులకు నెమ్మదిచేసితినని డాక్టరు బ్రూక్ వ్రాసియున్నాడు.

నేట్రంసల్ఫ :—ఈ రోగముయొక్క అన్ని అవస్థలలోను వాడవచ్చును. ప్లైహోద్రేకమును తగ్గించుటకు పనిచేయును. ముఖ్యమైన మందు.

ఇవిగాక లైకోపోడియమ్, సీడ్రన్ (Cedron), కాల్కేరియా కార్బ, సాలిస్ఆల్బ, కాలీమూర్ కూడ వాడవచ్చును. కాలీసల్ఫకూడ వాడదగును.

ముఖ్యవిషయములు :—ఈ రోగమునకు అల్లోపతి వైద్యులు విశేషముగ క్వైనా వాడుచుందురు. వారేగాక ఆయుర్వేద వైద్యులుకూడ వారి మూలిక లను మూలత్రోసి యీ రోగమునకు క్వైనా వాడుచున్నారు. కొన్ని హోమోపతి గ్రంథములలోకూడ దీనిని యీ రోగమునకు చికిత్సగా వ్రాసి యున్నారు. దీనివలన తాత్కాలికముగ గుణమిచ్చినట్లు కనపడినను, శరీర మందనేక క్రొత్తరోగములు జనించుచుండును. దీనివలన రోగము అణచిపెట్ట బడుటయేగాని పూర్తిగ నివారణ యెప్పటికి కాదు. కావున దీనిని వాడుట యెంతమాత్రము మంచిదికాదు. సారూప్య ఔషధ శాస్త్రమునకు తండ్రియగు హానిమన్ కూడ దీనిని తీవ్రముగ ఖండించియున్నాడు.

పథ్యము :—జ్వరమువచ్చు రోజున సులభముగ జీర్ణమగు తేలిక యాహా

రము స్వల్పముగ భుజించవలెను. ప్రారంభదశలో చలియున్నప్పుడు ఉష్ణోదకము పానముజేయవలయును. జ్వరమున్నప్పుడు బార్లీనీళ్లు నారింజపండ్లరసము మొదలగు ద్రవపదార్థములను వాడవలయును.

## 4. కఫోద్బల సన్నిపాతము Pneumonia

ఇది ఊపిరితిత్తులకు సంబంధించిన వ్యాధి. స్త్రీలకంటె పురుషులలోను, అందులో పిల్లలకును ఎక్కువ తరుచుగ వచ్చుచుండును. పెద్దవారిలో కూడ కొందరు దీనివలన బాధపడు చుందురు. ఒకే మనుజుడు దీనివలన అనేకసార్లు బాధ పడవచ్చును.

లక్షణములు :—అకస్మాత్తుగ అపరిమితమైన చలితో ప్రారంభించును. ఈ చలి వెనువెంటనే రొంపభారము, తలనొప్పి, జ్వరము, అపరిమితమైన నొప్పులు (Stabbing pains) బయలు దేరును. ఈ నొప్పి చన్మొనల క్రింద భాగమున ఎక్కువగనుండును. దీనితో దగ్గు ప్రారంభించును. శ్వాస అధికమగును. దగ్గు వల్లను, ఊపిరి పీల్చుటవల్లను, ఆయాసము, నొప్పులు వృద్ధియగును. రెండవ రోజునగాని మూడవరోజునగాని న్యుమోనియా లక్షణములు బాగుగా వృద్ధి పొందును. కఫము గట్టిగ, జిగురుగ నుండును. దగ్గినపుడు బాధ అధికమై రోగి తనచేతులతో తనప్రక్కలను గట్టిగపట్టుకొనును. శరీరోష్ణము 104, 105 వరకు హెచ్చును. హృదయము నిమిషమునకు 120 సార్లుగాని, ఇంకాపైనిగాని కొట్టు కొనును. (మామూలుగ 72 సార్లు) ఊపిరి పీల్చుట 50 సార్లువరకు హెచ్చును. (మామూలుగ 18 సార్లు) ఊపిరి బైటకు విడుచునపుడు ధ్వనియు, ముక్కు లెగర వేయుటయు కాననగును. రోగి బాధగ నున్నవైపున పండుకొను చుండును. మూత్రమెఱ్ఱగ, స్వల్పముగ వెడలుచుండును. నిద్రపట్టదు. శరీరము వేడి. ముఖము పాలిపోయి పొంగరించి యుండుట, నాలుక తెలుపుయుండును. శరీరోష్ణము (temperature) సుమారు పదిరోజులవరకు ఉండును. అకస్మాత్తుగ తగ్గిపోయి (crisis) వచ్చును. చెమటలు పోయును. కొద్ది సంధి కూడ యుండును.

న్యుమోనియా ద్వివిధములు :

1. లోబార్ న్యుమోనియా (Lobar pneumonia):-అకస్మాత్తుగ బాధలతో ప్రారంభమై హెచ్చు తగ్గులు లేక, crisis వలన జ్వరము పడిపోయి, ఒక ఊపిరితిత్తిమాత్రమే చెడిపోయినదానికి 'లోబార్ న్యూమోనియా' అని పేరు.

2. బ్రాంకో న్యుమోనియా (Broncho pneumonia):-క్రమక్రమముగ వచ్చి యింతకుముందు కఫ్ఫదగ్గుయుండి (Bronchitis), హెచ్చు తగ్గులతో కూడి క్రమముగా Lysis వలన జ్వరముపడిపోయి, రెండు ఊపిరితిత్తులు చెడిపోయిన దానికి 'బ్రాంకో న్యుమోనియా' అని పేరు.

ఈ వ్యాధి త్రి గతులను పొందుచున్నది:

1. First stage of congestion :—ప్రథమ అవస్థలో ఊపిరితిత్తిలో రక్త మధికముగ కూడియుండి, నురగవంటి కఫము కొంచెము గట్టిగాయుండి; బాధగాయున్న భాగముపై చెవిపెట్టి వినినను, Stethoscope తో పరీక్షించినను చిటపటమను ధ్వనులు వినపడుచుండును (minute cre pitations).

2. Second stage of hepatization:--రెండవ దశలో చిక్కని జిగురు వంటి కఫముతో కూడియుండి, పేరుకొని గట్టిపడి బయటకు వెడలక రోగికి అపరిమితమైన బాధ కలిగించును. కఫము తుప్పురంగు కలిగియుండును. నాడి వేగముగా, నీరసముగా యుండును. సంధి యుండును. ధ్వనులు పరీక్షించినచో మొద్దుగాయుండును. రోగికి ఆయాసము, ఒగర్పు అధికముగానుండును.

3. Third stage of Resolution :—మూడవ దశలో కఫము పల్చనై సులువుగ వెడలుచు, రోగికి బాధ తగ్గి, రోగము తిరుగుముఖము పట్టును. పరీక్షించినచో ధ్వనులు క్రమముగా చిటచిటమను ధ్వనులలోనికి మారి, పిమ్మట క్రమక్రమముగా ప్రతిధ్వనించు గుల్లశబ్దములు వినపడును (Hallow resonant Sounds). ఇవి ఆరోగ్యవంతున కుండవలసిన ధ్వనులు.

కారణములు :—ఒక విధమైన క్రిమి ఊపిరితిత్తిలో ప్రవేశించుటచే ఈ రోగము కలుగు చున్నది. దీనికే 'Pneumococcus bacillus' అని పేరు. గాలి మార్పులవల్లను, గాయములవల్లను, పొంగుపడిన పిల్లలకును, శ్లేష్మ జ్వరములోను కలుగుచుండును. విశేష శరీరపరిశ్రమజేసి, వెంటనే దుస్తులను విప్పి చలిగాలిలో కూర్చుండినచో, రక్తముపేరుకొని, రక్తచలనము మందగించి ఊపిరితిత్తులు చెడిపోయి న్యుమోనియా వ్యాధి కలుగును. సరియైన దుస్తులులేక పిల్లలు చలిగాలిలో తిరిగినను, తడిబట్టలతో యుండినను కలుగుచుండును.

## చికిత్స :

ఎకోనైట్ :—ప్రారంభమున వాడినచో మంచి పనిచేయును. దప్పి, నిద్రలేమి తగ్గువరకును, చెమటలు పోయువరకును గంటకొకసారి వాడవలయును.

బ్రైయోనియా :—దగ్గు, ప్రక్కనొప్పులకు మంచిది. జ్వరలక్షణములకు ఎకోనైట్. దీనిని ఒకదానితరువాత నొకదానిని వాడవచ్చును. రోగినొప్పివున్న వైపున పరుండును. కదలినచో నొప్పు లధికమగును. దప్పియుండును.

బెల్లడోనా :—ప్రథమదశలో పనిచేయును. ముఖము పొంగరించి, తల నొప్పి, సంధియున్నపుడు పనిచేయును.

వెరాట్రమ్ విరైడ్ Veratrum Viride :—ప్రథమదశలో వాడదగును. హృదయవేగమునకు నాడివేగమునకు పనిచేయును. బలహీనమైన హృదయము గలవారికి వాడరాదు. వాడినచో ప్రమాదము తటస్థించవచ్చును.

లైకోపోడియమ్ :—కుడి ఊపిరితిత్తి చెడిపోయినను, ఊపిరితిత్తులు కఫముతో నిండియున్నను, శ్వాసకృచ్ఛమునకును (dyspnoea), 4 మొదలు 8 గంటలవరకు రోగలక్షణములు ప్రకోపించినను యిది బాగుగ పనిచేయును. దీనిని వాడుటవలన క్షయలోనికి దింపకుండ అనేకమంది రక్షింపబడిరి. కదలిక వల్లను, బహిరంగమైన గాలిలోను శాంతించును.

"Lycopodium has often saved neglected, mal-treated, or imperfectly cured cases of Pneumonia from running into consumption." —*Nash*

ఫాస్ఫరస్ Phosphorus :— ఈ రోగమునకు దివ్యౌషధము. దీనికి మించినది మరియొకటిలేదని చెప్పవచ్చును. శ్వాసకోశములమీద అద్భుతముగ పనిచేయును. ఈ రోగి యెడమ ప్రక్కన పరుండలేడు. ఆయాస మెక్కువ. చల్లని పానీయములను త్రాగవలెనని యుండును. పాదములు, చేతులు, మంటలు, నిస్త్రాణ ; స్థిమిత ముండదు. ఇది యువకులకు బాగా పనిచేయును. కఫము తుప్పురంగు గలిగి, చిక్కగ జిగురువలెనుండు Stage of Hepatization లో వాడినచో అమోఘముగ పనిచేసి రోగమును తిరుగు ముఖము పట్టించి, కఫమును పలచనచేసి Stage of Resolution త్వరలో తెప్పించును.

యాంటిమోనియమ్ టార్ట్ (Antimonium Tart):—ఇది ముఖ్యముగ పిల్లలకు, ముసలివారికి బాగాపనిచేయును. శ్వాసకోశములకు సంబంధించిన యే వ్యాధిలోనైనను దీనిని వాడవచ్చును. ఊపిరితిత్తులు జిగురువంటి చిక్కని కఫముతో కూడియుండి, గురగురలాడుచు, కఫము పైకి వెలువడక ఆయాస మధికముగనున్న Stage of Hepatization లో దీనిని వాడినచో, కఫము పల్చనజేసి, ఆయాసము తగ్గించి Stage of Resolution త్వరలో తెప్పించి.

రోగము నెమ్మదిచేయును. బ్రాంకోన్యుమోనియాలో బాగా పనిచేయును. ఈ రోగికి మగత యెక్కు వుండును.

"Antimonium Tart is one of our best remedies for Hepatization of lungs remaining after Pneumonia" Nash.

చెలిడోనియమ్ :—యకృత్ వ్యాధులతో కూడియున్నను, దగ్గుతో కుడివైపున నొప్పి యెక్కువగనున్నను, దీనిని వాడినచో క్షయలోనికి దింపకుండ కాపాడును. దీనిని ముఖ్యముగ పిల్లలలో పొంగుపడిన పిమ్మట వచ్చు న్యుమోనియా వ్యాధికి వాడవలయును.

ఆర్సెనికమ్ :—ఊపిరిపీల్చుట కష్టముగనుండుట. ఎక్కువ నిస్త్రాణ, అర్ధరాత్రి అధికమగుట, శరీరము చల్లబడుట—యీ గుణములకు పనిచేయును.

ఇపికాక్ :—ఊపిరితిత్తులు కఫముతోనిండి, వికారము, వాంతితోకూడియుండు ఉక్కిరి బిక్కిరియగు దగ్గునకు పనిచేయును. కఫ మధికముగానుండి ఊపిరితీయునపుడు గురగుర ధ్వనితోకూడి ముఖము పాలిపోయియున్నపుడు న్యుమోనియాలో పిల్లల కమోఘముగా పనిచేయును. నాష్ యిట్లు వ్రాపియున్నాడు.

"Infantile Pneumonia, with chest loaded with mucus, rapid, wheezing respiration, sufface blue, pale face, finds a very effective remedy in Ipecacuanha." —Nash.

అమోనియా కార్బ్ :—ఇన్ఫ్లుయంజా పిమ్మట వచ్చు న్యుమోనియాకు పనిచేయును. ఎడతెగని దగ్గుయుండును. దీని బాధ తెల్లవారగట్ల అధికమగును. ముసలివారికి బాగా పనిచేయును

కాలీ హైడ్రోయిడికమ్ (Kali Hydrodicum) :— న్యుమోనియా తరువాత విడవకుండవచ్చు దగ్గునకు మంచిది

సాన్గ్వినేరియా :—కుడి ఊపిరితిత్తి చెడిపోయినపుడు పనిచేయును.

ఫెర్రంఫాస్ :—ప్రారంభదశలో జ్వరము, దగ్గు ఉన్నపుడు పనిచేయును.

స్ట్రెంసల్ఫ :—దగ్గినపుడు రోగి లేచి బాధచే తన చేతితో ప్రక్కలకు గట్టిగ పట్టుకొనును. ఎడమ ఛాతీలో నొప్పియున్నపుడు పనిచేయును.

కాలీమూర్ :—తెల్లని కఫముతోకూడిన దగ్గుకు పనిచేయును.

కాలీసల్ఫ :—కఫము పసుపుపచ్చగ నున్నచో పనిచేయును. చెమట పట్టినపుడు దీనిని వాడినచో చెమట పట్టించును.

ఇవిగాక కాలీబైక్, రూస్‌టాక్స్, నేట్రంమ్యూర్ కూడ వాడవచ్చును.

గమనింపదగిన విషయములు :—ఆయాసముతో బాధపడుచున్న న్యుమోనియా రోగిని మాట్లాడించకూడదు. వేడినీళ్ళ యెనీమా పట్టుటచే పేగులు శుభ్రపడి మంచి గుణ మిచ్చును. పైన వ్రాయబడిన మొదటి రెండవస్థలలోను-రక్త మధికముగా కూడియుండి కఫము చిక్కపడి గట్టిగ, జిగురువలె యుండి పైకి వెలువడక బాధ అమితముగ నున్నపుడు—వెచ్చని అవిసిగింజల పట్టీలు linseed-meal poultices గాని యాంటిఫ్లోజిస్‌టిన్ లేక యాంటిఫ్లెమిన్ పట్టీలనుగాని ఛాతీకి ముందు వెనుకకూడ వేసినచో కఫమును పలుచనజేసి, బాధ తగ్గించి, రోగికి సుఖ మిచ్చును. మరియు ప్రారంభదశలో ఫెర్రంఫాస్ కలిపిన ఉష్ణోదకములో బట్టలను తడిపి ఛాతికి వేయుటచేకూడ మంచి పనిచేయును.

## 5. దగ్గు Cough.

పిల్లలను తరుచు బాధించు వ్యాధులలో దగ్గు కూడ ముఖ్యమైనదే. దీనిని ప్రత్యేకముగ ఒక వ్యాధివలెగాక, యితర వ్యాధులయొక్క లక్షణముగ పరిగణింపవచ్చును. ఇది కొన్ని వ్యాధులు కలుగుటకు ముందుగాని, కొన్ని వ్యాధులలో మధ్యగాని, కొన్నింటిలో చివరగాని వచ్చుచుండును.

లక్షణములు :—కంఠమునందు, నోటియందు ముండ్లున్నట్లుండుట, ఏపదార్థమును మ్రింగలేకపోవుట—ఈ లక్షణములతో ప్రారంభమగును. పిమ్మట గుండెలలో నొప్పి, కణతలు నొప్పి, తరుచు దగ్గుట, వమనమగుట, కంఠస్వరము మారుట, ముఖము కృశించుట—యీ లక్షణములుండును. దగ్గు పొల్లుపొల్లులుగా వచ్చి పిల్లవానిని ఉక్కిరి బిక్కిరి చేయును. పండుకొన నివ్వదు. ఈ దగ్గు కఫములేక పొడిగా యుండవచ్చును. లేదా కఫముతో కూడియుండవచ్చును. కఫముతో కూడియున్నచో, నోరు జిగురుగా, అసహ్యముగానుండి, అన్నమునందు రుచి లేకయుండును. రొంప, జ్వరము కూడ యుండవచ్చును.

కారణములు :—పొగ, దుమ్ము నోటియందు, ముక్కులోను ప్రవేశించి శ్వాసము నడ్డగించుట, చలిగాలి సోకుటచే గలుగు రొంపవలన శ్వాస కోశములస్వస్థత చెందుట. మిక్కుటమైన దేహ పరిశ్రమ చేయుట. తేమనేలను సంచరించుట, పరిశుభ్రమైన గాలిరాని చీకటి యిండ్లలో నివసించుట, రూక్షంబైన అన్నమును భుజించుట, న్యూనాధికముగ భుజించుటచే ఆమాశయము అస్వస్థత చెందుట, మలమూత్రముల యొక్కయు, తుమ్ముల

యొక్కయు వేగమును నిరోధించుట, కొండనాలుక వాలుట, గళగ్రంథులు పెద్దవగుట—యీ కారణములచే దగ్గు వచ్చుచుండును.

చికిత్స :

ఎకోనైట్ :—జ్వరముతో కూడిన పొడిదగ్గునకు, జలుబుచేసి రొంపపట్టి వచ్చు దగ్గునకు పనిచేయును.

యాంటిటార్ట్ :—కఫముతో కూడి గురగురలాడుచు, కఫము పైకి వెడలక పిల్లవాడు పరుండలేనపుడు పనిచేయును.

ఇపికాక్ :—శ్వాసకోశముల జబ్బులకు ప్రధానౌషధము. దగ్గు పొల్లు పొల్లుగా వచ్చి పిల్లవానిని ఉక్కిరిబిక్కిరిచేసి, రొమ్ములయందు శ్లేష్మముకూడి నొక్కినట్లుండి నొప్పి యున్నపుడు, వికారము, వాంతి యున్నపుడు అద్భుతముగ పనిచేయును. శ్వాస ఆడక ఉక్కిరిబిక్కిరిచేయు దగ్గులలో పిల్లలకి మోఘముగ పనిచేయును. చాలమంది పిల్లలకు వాడి చూచితిని. వారి పాలిటి సంజీవి.

ఫాస్ఫరస్ :—తుప్పురంగుగల కఫము వెడలునపుడు, ఛాతిమీద పెద్దబరు వుండునట్లు భారముగ నుండునపుడు, మాట్లాడినను, నవ్వినను, భుజించినను యెక్కువగునపుడు, గొంతుకలో గిలిగింతయుండి, చలిగాలికి యెక్కువగునపుడు బాగుగ పనిచేయును.

బ్రైయోనియా :—దగ్గినపుడు తల, ఛాతినొప్పి యుండును. కఫము తెల్లగగాని, పసుపుపచ్చగగాని యుండి నెత్తురు జీర కలిగియుండును.

స్పాంజియా :—రాత్రి యందధికమగు పొడిదగ్గునకు పనిచేయును.

అగారికస్ :—మాటిమాటికి వచ్చు దగ్గునకు, తుమ్ములతో కూడియున్న దగ్గునకు పనిచేయును. కళ్ళె సగ్గుబియ్యమువలె నుండును.

"Constant irrtation to cough...... Violent cough ends with sneezing."

బెల్లడోనా :—రాత్రివచ్చు పొడిదగ్గుకు తలనొప్పితో కూడియున్నచో మంచిది. పిల్లలకు బాగా పనిచేయును.

"Tickling, short, dry cough; worse at night. Great children's remedy." —*Dr. Chatterjee.*

పల్సటిల్లా :—ఆరుబయట పరిశుభ్రమైన గాలిలో ఉపశాంతిగ నుండును. గాలిలేని ఉష్ణమైన గదిలో యెక్కువగును.

హాయోసియామస్ :—రాత్రియందు ముఖ్యముగ పరుండినచో అధికమగుచు, కూర్చున్నచో తగ్గుచుండును.

కేమోమిల్లా :—శీతకాలములో పిల్లలకు జలుబువలన వచ్చినను, రాత్రులు నిద్రలో ఎక్కువైనను పనిచేయును.

స్టాఫిసేగ్రియా :—పగలు భోజనానంతరము వచ్చు దగ్గునకు, మాంసము తినిన పిమ్మట వచ్చు దగ్గునకు పనిచేయును.

కాలీబైక్ :—జిగురుగానుండి తీగసాగుచున్న కఫమున్నపుడు పనిచేయును.

డ్రోసిరా :—కోరింతదగ్గుకు, రక్తజీరతో కూడిన కఫమున్నపుడు పనిచేయును.

స్కిల్లా :—చల్లని పానీయములను త్రాగినచో ఎక్కువగును.

మెగ్నీషియాఫాస్ :—పండుకొనునపుడు, రాత్రి, చలిగాలివలన ఎక్కువగు దగ్గునకు, కోరింతదగుకు మంచిది. ఛాతి బిగపట్టి నొప్పియుండును. కళ్లెపడదు; పొడిదగ్గు.

ఫెర్రంఫాస్ :—దగ్గుతో మూత్రవిసర్జన మగునపుడు, జ్వరమున్నపుడు పనిచేయును.

కాలీమూర్ :—దగ్గు పెద్దధ్వనితో కూడియుండి, తెల్లని, చిక్కని కఫము వెడలునపుడు పనిచేయును.

నేట్రంసల్ఫ :—పైత్యోద్రేకముచే కలుగు దగ్గుకు మంచిది.

నేట్రంమూర్ :—పలచనినీళ్లవలెను, ఉప్పగనుండు కఫము పడునపుడు వాడదగును. దీర్ఘదగ్గులకు మంచిది.

సైలీషియా :—దీర్ఘవ్యాధికి మంచిది. చిక్కని పసుపురంగుగల కఫము వెడలునపుడు పనిచేయును.

ఇవిగాక కాస్టికమ్, సాంబుకస్, లేకెసిస్, స్టానమ్, కోనియం, కాలీకార్బ్, సల్ఫర్, కాలీసల్ఫకూడ వాడవచ్చును. పైనవ్రాయబడిన 'గళగ్రంధిరోగము'లో చికిత్సలనుకూడ చూడనగును.

## 6. ఉబ్బసము Asthama.

లక్షణములు :—పిల్లలలో తరుచు జలుబుచేసి రొంపపట్టి శ్వాసకోశములు చెడిపోవుట తటస్థించుచుండును. ఊపిరి పీల్చుట కష్టముగనుండును. కఫము

కూడుకొని గురగురలాడుచు గొంతుకలో పిల్లి కూతలు బయలుదేరును. దీనిని ఉపేక్షచేయుట ప్రమాదకరము. మరికొందరకు లంఘణములలో ఊపిరితిత్తులు అస్వస్థత చెందును. కఫము ప్రకోపించును. ఒగర్పు, ఆయాసము కలుగును. ఇది ముదిరినచో ఉబ్బసముగ పరిణమించును.

ఒగర్పు, ఆయాసము (Asthmatic fit) వచ్చుటకు పూర్వము కొందరికి గుండెలలో బరువు, తలనొప్పి, రొంప, కడు పుబ్బరము, వికారము, నిద్రలేక పోవుట, మలబద్ధము, నీరసము—యీ లక్షణము లన్నియుగాని, కొన్నిగాని కనపడుచుండును. మరికొందరికి యిట్టి లక్షణము లన్నియులేక ఒకప్పుడక స్మాత్తుగా ఆయాసము వచ్చుటయు కలదు. కొందరకు మబ్బు పట్టిన వెంటనే 'ఫిట్టు' వచ్చుచుండును. కొందరకు భోజనము చేయుటతోడనే వచ్చుచుండును.

ఈ వ్యాధియందు ఆయాసము తెరలుతెరలుగ వచ్చుచుండును. ఈ తెరలు (fits) సామాన్యముగ రాత్రియందును, అందు ముఖ్యముగ 2-4 గంటలమధ్య కాలములో యెక్కువగ కలుగుచుండును. రక్తచలనము మందముగనుండి రక్తము కూడికొని యుండుటచే ఊపిరియందలి రోషమునకు సహాయ మగు చున్నది. ఊపిరి ఆడక రోగి నిద్రనుంచి అకస్మాత్తుగ లేచి కూర్చొనును. కఫ ప్రకోపముచే గొంతుకలో గురగుర, పిల్లిమోతలు, గుండెలలో బరువు, ఛాతి మీద పెద్ద బరువు పెట్టినట్లు నొక్కియుండుట (constriction of the chest), చెమటలు—యీ లక్షణములతో రోగి బాధపడుచు ప్రాణము పోవు నేమో యని తోచుచుండును. ఎటు కూర్చున్నను కష్టమే. పడుకొనలేడు. ఆయాస మెక్కువ. పడక కుర్చీలో కూర్చుండుట, మంచముమీద వెనక యెత్తుగ పరుపు, బాలీసుపెట్టి ఆనుకొని కూర్చొనుట, ముందుబల్లమీదగాని, పరుపుమీదగాని మోచేతులు ఆనుకొని కూర్చునుట, కిటికీనిగాని, గుమ్మమును గాని, చేతులతో ఆనుకొని ముందుగ వంగి ఊపిరికొరకు పెనుగులాడుట— యిట్టి పనులను రోగి చేయుచుండును.

కఫము తెగిపడక ఆయాస మధికముగ నుండును. కఫము తెగిపడినచో బాధలు తగ్గును. ఈ ఫిట్టు రెండు మూడు గంటలుండును. కొందరిలో ఇంకా కొంత ఎక్కువకాల ముండవచ్చును. పిమ్మట శ్లేష్మముపడి గుండెలో బరువు, ఆయాసము తగ్గి రోగికి నిద్ర పట్టును.

ఈ వ్యాధివలన ప్రాణభయ మెక్కువ లేకపోయినను బాధ మిక్కుట మగుటచే, బాధకంటె చావే మంచిదని తోచుచుండును. 'ఫిట్టు' ఉద్ధృత

ముగా వచ్చినపుడు ప్రాణము పోవునట్లే రోగి భావించుచుండును.

కారణములు :—రాత్రులుగాని, పగలుగాని అకాల అమిత భోజనములు చేయుటచే కలుగు అగ్నిమాంద్యము కాలమార్పు పొగలోను దుమ్ములోను విశేషముగ తిరుగుట, మలబద్ధము జలుబుచేసిగాని, జ్వరములోగాని శ్వాసకోశములు చెడిపోవుట—యివి ముఖ్యకారణములు. ఇవిగాక వెనుక దగ్గుకు వ్రాయబడిన కారణములుకూడ చూడదగును. మరియు యీ వ్యాధి వంశ పరంపరగ కూడ రావచ్చును.

## చికిత్స :

ఇపికాక్ :—ఛాతియందు బరువుగనుండుట, బిగపట్టి యుండుట, కఫపూరితమైన గొంతుకలో గురగుర, వికారము, దగ్గు— యీ లక్షణములకు పని చేయును. పిల్లలు దగ్గుచే ఉక్కిరి బిక్కిరి అగునపుడు బాగా పనిచేయును. ముఖము పాలిపోయి యుండును. ఫిట్టువచ్చినపుడు దీనిని ప్రతి పావుగంటకు వాడదగును.

సాంబుకస్ :—ముఖ్యముగ పిల్లలకు రాత్రియందకస్మాత్తుగ వచ్చు 'ఫిట్టు' కు పనిచేయును. ఊపిరి సలుపదు. నొసటిమీద చెమట లెక్కువ పోయుచుండును. డాక్టర్ క్లార్కు యిట్లు వ్రాసియున్నాడు.

"Especially in children, attack beginning in the night. Sweat on throat and neck." —*Clarke*.

డాక్టరు బ్లాక్‌వుడ్‌కూడ యిట్లు వ్రాసియున్నాడు.

"Attacks appear suddenly at night. Child turns blue, gasps for breath and seems as though dying; drops off into another sleep, awakens in another attack. Dry heat while sleeping, followed by profuse perspiration upon awakening."

(Diseases of the Lungs by *Blackwood*.)

నక్సువామికా :—ఉద్రేకమును గలిగించు వస్తువులను వాడు అలవాటు కలిగియున్నను, సోమరియైనను, కోపిష్ఠియైనను, మలబద్ధమున్నను బాగా పని చేయును. దీనిని ఇపికాక్‌తో వాడదగును. తెల్లవారగట్ల 3 గంటలకు ఎక్కువగుదానికి పనిచేయును.

నెప్తాలినమ్ :—ఉబ్బసము జ్వరము (Hay fever) తో కూడియున్నను

తుమ్ములు, కండ్లు యెరుపు, మంటలు, గొమ్ములలోను, పొత్తికడుపు నొప్పిచే రోగిబట్టు తరుచు వదులు చేయుచుండుట, బయటిగాలిలో ఉపశాంతిగ నుండుట — ఈ లక్షణములుగల ఉబ్బసమునకు పనిచేయును. డాక్టర్ బ్లాక్ వుడ్ యిట్లు వ్రాసియున్నాడు.

"There is much sneezing, the eyes are inflamed and painful and the head hot. The asthma is spasmodic in character, and is better in open air. There is more soreness of the chest and abdomen ; so that the patient must loosen his clothing to relieve pain."

(Diseases of the Lungs by *Blackwood*)

ఎకోనైట్ :—ఫిట్టువచ్చి ఊపిరాడక శ్వాసకృచ్ఛ్రము, ఆతురత యున్నపుడు అద్భుతముగ పనిచేయును. ఉబ్బసపు వ్యాధిగల స్త్రీ గుండెలలో బరువు, నొప్పి, ఆయాసముతో బాధపడుచు ఊపిరాడక మృత్యువు సంభవించునని భయపడుచుండగా, ఎకోనైట్ యివ్వబడెను. పదినిమిషములలో ఫిట్టు తగ్గి బాధ నివారణ అయ్యెనని డాక్టర్ రడ్డక్ వ్రాసియున్నాడు.

లాబేలియా :—ఊపిరి ఆడకపోవుట, ఛాతి బిగపట్టుట, త్రిప్పు, వికారము—ఈ లక్షణములతో యున్నపుడు పనిచేయును.

అరేలియా (Aralia) :—సాయంకాలముగాని, ఒక నిద్రపోయిన పిమ్మట గాని యెక్కువగు దగ్గునకు పనిచేయును. గొంతుకలో పిల్లికూత లెక్కువగ నుండును.

స్క్విల్లా :—కండ్లనుండి నీరుకారుట, తుమ్ము లెక్కువగ వచ్చుట, కళ్ళిపడుట, గురగురలాడుట—యీ లక్షణములకు పనిచేయును.

కాలీ కార్బ్ (Kali Garb) :—అధికముగ కళ్ళిపడుచు రాత్రి 3 గంటలకు యెక్కువగునపుడు బాగా పనిచేయును. దీనిని స్వయముగా వాడితిని. ఉద్పృతము వెంటనే తగ్గి సుఖముగా నిద్రపట్టెను.

ఆర్సెనికమ్ :—రాత్రులు పడుకొన్నపుడు యెక్కువగును. ముఖము నీలవర్ణముగలిగి లేక పాలిపోయి యుండును. ముఖ్యముగ ముసలివారిలో దీర్ఘ ఉబ్బసమునకు పనిచేయును. రాత్రి 1-3 గంటల మధ్య బాధ అధికమగును. ఇదికూడ నా స్వానుభవములో బాగుగా పనిచేసెను. ఈ రోగికి వేడి పానీయములవల్లను, యెడమ ప్రక్క పరుండినను శాంతించును.

డల్ కెమారా :– వర్షాకాలములో వచ్చు ఉబ్బసమునకు మంచిది.

సోరినమ్ :—బయట గాలిలోను, కూర్చున్నను యెక్కువగుచు, పడు కున్నచో తగ్గుచుండును. అట్టిదానికి పనిచేయును.

"Asthma worse in the open air and from sitting up. Relieved by lying down."

(Diseases of the Lungs by *Blackwood.*)

బ్లాటా ఓరియన్‌టాలిస్ :– ఈ వ్యాధికి ప్రత్యేకముగ తయారుచేయబడిన ఔషధము.

హెపార్‌సల్ఫ :—దీర్ఘ ఉబ్బస వ్యాధికి మంచిది. శీతకాలములో అధిక మగుచు, వర్షాకాలములో తేమతో కూడిన చలిగాలిలో శాంతించును.

"The Hepar asthma is worse in dry cold air and better in damp." —*Nash.*

కాలీఫాస్ :—ప్రధానౌషధము. ఏ మాత్ర మాహారము పుచ్చుకొనినను 'ఫిట్టు' వచ్చుచుండును. పెద్ద మోతాదులలో నివ్వవలెను.

కాలీమూర్ :—జీర్ణకోశమునందలి లోపములచే కలుగు ఉబ్బసమునకు పని చేయును. మలబద్ధము, నాలుక దళసరిగ తెల్లగనుండుట, చిక్కని తెల్లని కఫము ప్రయాసమీద పడుట—యీ లక్షణములుండును.

నేట్రంసల్ఫ :— యువకులకు బాగా పనిచేయును. వర్షాకాలములో ఎక్కువగుదానికి మంచిది. పూర్తిగ నివారణగుటకు ప్రతిరాత్రి ఒక మోతాదు చొప్పున కొంతకాల మివ్వవలెను.

నేట్రంమ్యూర్ :—వర్షాకాలములో ఎక్కువగుట, మలబద్ధము, కఫము తెగిపడకుండుట, కడుపుబ్బరము, కండ్లు నీరుకారుట, ఉదయమున దగ్గు వృద్ధి యగుట—యీ లక్షణము లున్నచో బాగా పనిచేయును.

కాలీసల్ఫ :—దగ్గినచో పసుపుపచ్చని కళ్లెపడుచు, వెచ్చని గదిలోగాని, వేసవికాలములోగాని అధికమగుచు, చల్లగాలిలో ఉపశాంతిగనుండు వ్యాధికి మంచిది.

కాల్కేరియాఫాస్ :— ఆయా లక్షణములనుబట్టి పై లవణములతో వాడుచు, మధ్యమధ్య దీనిని పిల్లలకిచ్చినచో బాగా పనిచేయును.

ఇవిగాక సెనిగా, యాంటింటార్ట్, సేబడిల్లా, ఆంబ్రోసియా, కుప్రం, సినాపిన్‌నైగ్రా, మెగ్నీషియాఫాస్‌కూడ పనిచేయును.

తాత్కాలికోపశాంతులు :—మలబద్ధము లేకుండ చేసినచో ఉద్ధృతము తగ్గును. కావున విరేచనమున కౌషధముగాని, ఎనీమాగాని వెంటనే యివ్వవలెను. మస్తుగ భోజనముచేసిన వెంటనేవచ్చినచో వమనమగుటకు ఔషధమిచ్చుట మంచిది. వమనమైనచో బాధతగ్గును. కొందరకు నోరు పట్టగలిగినంత ఉష్ణోదకము త్రాగినచో ఫిట్టు తగ్గుచుండును. మిక్కిలి వేడిగానున్న కాఫీనీరు (పాలు, చక్కెర లేకుండ) త్రాగినచో ఒకప్పు డుపశాంతినిచ్చును. రోగికి వెన్ను వెంబడి తోముచుండిన కొంతబాధ నివారణయగును. యూకలిప్టస్ ఆయిల్ కూడ మర్దనచేసినను మంచి పనిచేయును. మరియు ఫిట్టు వచ్చినపుడు నల్లవుమ్మెత్త చూర్ణము పొగపీల్చినను ఆయాసము ఒగర్పు వెంటనే తాత్కాలికముగతగ్గి సుఖము కలిగించును.

గమనింపదగిన విషయములు :—ఈ రోగి ఆహారములో కడుజాగ్రత్త వహించినచో వ్యాధి విశేషముగ బాధ పెట్టదు. రాత్రులు ప్రొద్దుపోయి భుజించుట, అమితముగ భుజించుట త్వరలో జీర్ణముకాని బరువైన పదార్థములను భుజించుట—వీటిని మానవలెను. తాను భుజించుటకు శక్తికలిగినంతకూడ భుజించకూడదు. తేలికయైన ఆహారమును తీసుకొనుచు కొద్ది ఆకలితో లేచిపోవుట మంచిది. నోరు కట్టిపెట్టుకొని జిహ్వాచాపల్యమును జంపుకొన్నచో విశేష బాధ యుండదు. సాయంకాలము తేలికగ పెందలకడ భుజించి రాత్రి పండుకొనువేళకు జీర్ణమగునట్లు చూడవలెను. ఆయాసమును గలిగించు పరుగు విశేష పరిశ్రమ మొదలగునవి పనికిరావు.

## 7. కళ్లిదగ్గు Bronch tis

పిల్లలకు సంభవించు వ్యాధులలో ముఖ్యమైన వాటిలో నిదియొకటి. పెద్దవారలకుకూడ యీ వ్యాధి కలుగుచుండును. కాని పిల్లలలో నెక్కువ ప్రమాదకరము. ఊపిరితిత్తులయొక్క గాలిగొట్టములు వాచును.

లక్షణములు :—ప్రారంభమున జలుబుచేసి రొంప పట్టును. పిమ్మట జ్వరచిహ్నములు కనబడును. అప్పుడు బిడ్డను గాలిలో తిరుగనివ్వరాదు. జ్వరముతో తలనొప్పి, నిస్త్రాణ, దగ్గు ప్రారంభించును. దగ్గు తరుచుగ వచ్చుట, ధ్వనితో కూడియుండుట, ఛాతి నొక్కినట్లుండి బిగపట్టి నొప్పియుండుట, ఊపిరి కష్టముతో పీల్చుట, ఊపిరి తీయునపుడు గొంతుకలో పిల్లికూతలవలె

ధ్వనులు—యీ లక్షణములుండును. ఈ వ్యాధియొక్క తెరలు తరుచు రాత్రి యందెక్కువగ వచ్చుచుండును.

ఒకసారి 'ఫిట్టు' వచ్చిన పిమ్మట శిశువునకు నెమ్మదించి తిరిగి నిద్రపట్టును. కాని నిద్రలో కఫముకూడుకొని దగ్గుతెర తిరిగికలిగి బిడ్డను లేపుచుండును. ఈ దగ్గు ప్రారంభమున పొడిగయుండి, పిమ్మట చిక్కని పసుపురంగుగల, నురగ వంటి కఫము వెడలుచుండును. ఈ కఫమును ఉమ్మివేయవలెనని తెలియక బిడ్డ మ్రింగుచుండును. కళ్లిలో రక్తపు జీరకూడ యుండవచ్చును. దగ్గుతో ఒక ప్పుడు వమనమగుచుండును. అప్పుడు బిడ్డకు ఖులాసాగానుండును. మూత్రము వివర్ణమై స్వల్పముగ వెళ్లుచుండును. నాలుక అసహ్యముగ నుండును. శరీరోష్ణ మధికముగ నుండును. దగ్గినపుడు తలనొప్పి ; సాధారణముగ యీ వ్యాధి వారగరోజులలో తగ్గుట ప్రారంభించును. పైలక్షణములున్నచో వ్యాధి ప్రమా దమైనదికాదు.

కాని శరీరమందు చల్లని చెమటలుపోయుట, పెదవులు, చెక్కిళ్ళు పాలి పోవుట, పాదములు, చేతులు చల్లబడుట, ఉక్కిరిబిక్కిరియగుట, దగ్గుటకు కూడ శక్తిలేకపోవుట, వేగమైన శ్వాస, ముక్కుపుటము లెగరవేయుట, స్మారకము తప్పుట—ఇవి ప్రతికూల చిహ్నములు. ఈ లక్షణములున్నచో బిడ్డ బ్రతుకుట దుర్లభము.

కారణములు :—సరియైన దుస్తులు లేక పిల్లలు చలిగాలిలో తిరుగుట చేతను, దుమ్ము పీల్చుటచేతను కలుగుచుండును. కోరింతదగ్గుచే బాధపడిన పిల్లలకు, పొంగుపడి బలహీనమగు పిల్లలకిది తరుచు కలుగుచుండును.

## చికిత్స :

ఎకోనైట్ :—ప్రారంభమున రొంప, జ్వరము యున్నపుడు బాగా పనిచేయును. ఈ లక్షణములను గనిపెట్టి మొదటనే వాడినచో వ్యాధి ముద రదు. రడ్డక్ యిట్లు వ్రాసియున్నాడు.

"If administered early and frequently it will materially shorten the attack and perhaps be alone curative"

—*(Ruddock.)*

బ్రైయోనియా :—జ్వరము కొంచెము తగ్గిన పిమ్మట, పొడిదగ్గు, దగ్గు వలన రొమ్ములలో నొప్పి, దగ్గినపుడు ఛాతిని చేతితో గట్టిగపట్టుకొనుట, మలబద్ధము—ఈ లక్షణములకు పనిచేయును. పిల్లలలో ఉక్కిరిబిక్కిరియగు

దగ్గులలో తరుణ వ్యాధియందు చాలమంచిది.

"Bryonia is useful in the acute attacks of children with suffocative cough, great agitation and anxiety" (*Ruddock*)

ఇపెకాక్ :—వికారముండినచో పనిచేయును. బ్రైయొనియాతో వాడ వచ్చును. కఫము గురగురలాడుచుండును.

ఫాస్ఫరస్ :—దీర్ఘవ్యాధులకు మంచిది. శ్వాసకోశముల యందు దద్ధ్యుతముగ పనిచేయును. ఛాతీయందు బరువు, నొప్పి యుండును.

కాలీబైక్ :—ఇది యీ రోగమునకు ప్రధానౌషధము. కఫము చిక్కగ, జిగురుగ నున్నపుడు బాగా పనిచేయును. దీర్ఘవ్యాధికి మంచిది.

యాంటిమోనియమ్ టార్ట్ :—కఫము గురగురలాడుట, గొంతుకలో పిల్లి కూతలవలె ధ్వనులు, ముఖము పాలిపోవుట, మగత—యీ లక్షణము లుండును. కఫము విశేషముగ యుండి, సులువుగా పైకి వెడలనప్పుడు పిల్లల కమోఘముగ పనిచేయును.

కేమోమిల్లా :—ఒక చెక్కిలి యెరుపు, రెండవది తెలుపు. పిల్లలకు దివ్యౌషధము.

ఆర్సెనికమ్ :—మిక్కిలి నీరసించిన వారికి, వృద్ధులకు బాగా పనిచేయును.

హెపార్ సల్ఫ :—దగ్గువలన స్వరభేద మున్నను, ధ్వను లున్నను పనిచేయును.

కార్బోవెజ్ :—వృద్ధులకు, దీర్ఘరోగమునకు మంచిది.

"Chronic Bronchitis in the aged." —*Ruddock.*

కేంథారిస్ (Cantharis) :–ఇది శ్వాసకోశములమీద పనిచేయుదని తలచుదురు. కాని యీ వ్యాధిగల రోగికి మూత్ర విసర్జన సమయములో కోయుచున్నట్లు మంట యుండి, కఫము చిక్కగ, తీగెలవలె నున్నపుడు దీనిని వాడి నెమ్మదిచేసితినని నాష్ వ్రాసియున్నాడు. గెరన్సీ వ్రాసిన దాని నాధారముగ గైకొని నాష్ దీనిని వాడియుండెను.

"Guernsey wrote: 'It is a singular fact, though known to most practitioners, that if there be frequent micturition attended with burning, cutting pain, or if not so frequent and the cutting burning pain attends the flow, Cantharis is almost always the remedy for whatever other

suffering there may be, even in inflammation of the brain or lungs.' "

Also "Cantharis should always be remembered and studied in treating affections of the air passages when the mucus is tenacious." (Taken from *Nash*).

శాన్గ్వినేరియా కెనడెన్సిస్ Sanguinaria Canadensis :— ఊపిరి కళ్ళి ఎక్కువ వాసనతో కూడియున్నపుడు పనిచేయును.

స్పాంజియా :—గుండెలలో బరువు, వేడి పానీయములవలన ఉపశమించి మాట్లాడినను, పాడినను, చలిగాలివలనను ఎక్కువగుచు, రాత్రులు వచ్చు దగ్గుకు పనిచేయును.

కాలీసల్ఫ :—పసుపుపచ్చని కళ్ళియున్నపుడు పనిచేయును.

ఫెర్రంఫాస్ :—పిల్లలకు ప్రారంభదశలో జ్వరమున్నపుడు పనిచేయును.

కాలీమూర్ :—వ్యాధి రెండవదశలో వాడదగును. కఫము చిక్కగ, జిగురుగ తెల్లగయుండి నాలుక మొద్దుగ తెల్లగ యున్నపుడు బాగా పనిచేయును.

నేట్రంసల్ఫ :—వర్ష కాలములో నెక్కువగు దగ్గుకు పనిచేయును. ఛాతి నొప్పి, దగ్గినపుడు రోగి రొమ్ముమీద చెయ్యివేసికొని పట్టుకొనును.

నేట్రంమూరు :— తరుణవ్యాధికి మంచిది. దీర్ఘవ్యాధికికూడ పనిచేయును. కఫము పల్చగ నుండును.

సైలీషియా :—చల్లని పానీయములు త్రాగినచో వ్యాధి ఉద్రేకము జెందును. కఫము చిక్కగ పసుపుపచ్చగ నుండును.

ముఖ్యవిషయములు :—ఈ వ్యాధి ఒకప్రక్కగాని రెండుప్రక్కలకుగాని సంభవించుచుండును. చెవిప్రక్కను ఆనించి వినినచో ధ్వనులువినబడును. అస్వస్థత జెందినవైపు వెచ్చని పట్టీలను వేసినను, వెచ్చని ఒత్తడములిచ్చినను మంచి పనిచేయును. ఈ రోగి ద్రవపదార్థములను వాడుచుండవలెను. పాలు, బార్లీ నీళ్ళు మొదలగునవి మంచివి. బిడ్డలకు రక్తవృద్ధిజేసి బలము కలుగుటకు కాడ్ లివర్ ఆయిల్ వాడుట చాల ప్రశస్తము.

## 8. క్షయ Consumption.

జ్వరములలో సన్నిపాత జ్వరము, దగ్గులలో క్షయదగ్గు అసాధ్య రోగములు. అనగా ఎక్కువ ప్రమాదకరమైనవి. బహుక్రూరమైనవి. సన్నిపాత

జ్వరమువలెనే క్షయరోగమును గురించి ఒక ప్రత్యేకగ్రంథము వ్రాయవచ్చును. ఇక్కడ దాని వివరములు క్లుప్తముగా వ్రాయబడెను.

లక్షణములు :

ప్రారంభదశ (First Stage) లక్షణములు :

1. ఉదయముపూట రోగికి మిక్కిలి బాధకరమగు పొడిదగ్గు ప్రారంభించును.
2. ఏమాత్రము స్వల్ప పనిచేసినను రోగి ఎక్కువ అలసటజెందును. ఆయాసము పడును. శ్వాస విశేష కష్టముతో తీసికొనవలసి యుండును. ఎత్తు ప్రదేశములుగాని, మేడ మెట్లుగాని ఎక్కలేకపోవును.
3. నాడి మిక్కిలి వేగముగ కొట్టుకొనును. 120 గాని, యింకా పైనగాని యుండవచ్చును.
4. శరీరోష్ణము (Temperature) సాయంకాల మెక్కువగుచుండును. ఉదయమున తగ్గుచుండును.
5. రోగి క్రమముగ క్షీణించుచుండును. ఇది ముఖ్యలక్షణము. దీనినిబట్టి రోగమును గ్రహింపవచ్చును.

"Progressive emaciation, in the absence of any other known cause, is one of the earliest and most important symptoms of consumption."

('Consumption' by *Dr. Ruddock*)

6. అగ్నిమాంద్యము, జీర్ణశక్తితగ్గి ఆకలి మందగించును.
7. ఉమ్మివేయునపుడు రక్తము పడును. ప్రారంభదశలో రక్తపు జీరగాని, కొద్ది రక్తముగాని పడుచుండును.
8. కంతులు లేచును (Tubercles). గ్రంథులు వాచును. ముఖ్యముగా మెడ గ్రంథులు, డొడ్డక్రింద వాచును.

రెండవ దశ (Second Stage) లక్షణములు :

1. దగ్గధికమై ఉదయముననేగాక యితర సమయములలోకూడ వచ్చుచుండును. కఫ మెక్కువగ వెడలుచుండును. అది పసుపువర్ణముగలిగి నీటియందు తేలు స్వభావముకలదై యుండును.
2. రక్తపిత్త మధికముగనుండును. కఫముతోగాని, దగ్గినపుడు ప్రత్యేకముగగాని నోటినుండి విశేషముగ రక్తము పడుచుండును.

3. ఆయాస మధికమగును. శ్వాసకృచ్ఛ్రము (dyspnoea)
4. రాత్రి జ్వర మెక్కువగ వచ్చును.
5. రాత్రులు చెమటలధికముగ పోయుచుండును.
6. ఆకలి ఒకవేళ బాగాయున్నను, రోగి నీరసించి క్షీణించును. రక్తక్షీణ మగును. శుష్కించిపోవును.
7. ప్రక్కలలోను, రొమ్మునందు తరుచు పోట్లు నొప్పులు బయలుదేరును.
8. స్వరము క్షీణించును.
9. మూత్రము ఎరుపువర్ణము కలిగియుండును.
10. శ్వాస అధికమగును. నాడి వేగముగనుండును. ఆరోగ్యముగనుండు మను జుడు నిమిషమునకు 14 మొదలు 18 సార్లు ఊపిరితీయుచుండును. క్షయ రోగి నిమిషమునకు 24 మొదలు 28 సార్లు ఊపిరి తీయుచుండును. (Respirations) రోగము ముదిరినకొలది సంఖ్య అధికమగుచుండును.
11. అతిసారము పుట్టును. రోగము ప్రేగులలోనికికూడ వ్యాపించు సూచనలు కనపడును.

ఈ లక్షణములన్నియు వ్యాధియొక్క ఉద్వృతమును సూచించును. చివరకు రక్తము కక్కుకొని రోగి మరణించును. శ్వాస, అతిసారము, రక్తక్షీణత, రక్తవమనము, స్వరభేదము—ఇవి అసాధ్య లక్షణములు. ఈ లక్షణములతో రోగి బ్రతుకుట దుర్లభము.

కారణములు :— ఊపిరితిత్తులయందు అనగా శ్వాసకోశములయందు ఒక విధమైన క్షయ పురుగు ప్రవేశించి శ్వాసకోశములను పాడుచేసి క్షీణింప చేయును. రోగియొక్క కళ్ళెయందు ఊపిరియందుకూడ యీ పురుగుండునని కనిపెట్టబడెను. దీనినే 'Tubercle Bacillus' అని చెప్పుదురు. ఈ పురుగు అనేక మార్గముల ద్వారా శరీరములో ప్రవేశించుచున్నది. రోగి మనవద్ద కూర్చుని దగ్గినపుడు, తుమ్మినపుడు ఆ గాలిని మనము పీల్చుటచేతను, రోగి కళ్ళె ఉమ్మివేసినపుడు పురుగులు గాలిలో ప్రవేశించుటచే, పాడైన గాలిని పీల్చుటచేతను, రోగి కళ్ళెమీద వాలిన ఈగలు తిరిగి మనము భుజించు ఆహారముమీద వాలుట చేతను, యీ పురుగు ప్రవేశించిన పానీయములను త్రాగుట చేతను, రోగి పక్కమీద మనము పరుండుటచేతను—యీ మొదలగు కారణములచే క్షయ పురుగులు శరీరములో ప్రవేశించి క్షీణింపజేయును. మరియు యీ వ్యాధి తలిదండ్రులనుంచికూడ సంక్రమించుచుండును. కావున నీ రోగముగల

వారు వివాహము చేసుకొనకుండ యుండుట మంచిది. వివాహమువలన సంతానమునకీ వ్యాధి వ్యాపించినవారగుదురు. ఇంతేగాక అపరిశుభ్రమైన గాలి, తేమ ప్రదేశములలో నివాసము, రాత్రులు విశేషముగ మేల్కొనుట, దుమ్ములోను, చీకటి గృహములలోను, గనులలోను, ఫ్యాక్టరీలలోను పనిచేయుట, బలమైన ఆహారము లేకపోవుట, విచారము, కోపము మొదలగు మానసిక రోగములు—యిట్టి కారణముల వలనకూడ ఈ వ్యాధి జనించుచుండును.

### చికిత్స :

ఎకోనైట్ :—ప్రారంభమున జ్వరమున్నపుడు, చనిపోవునని భయమున్నపుడు పనిచేయును. రక్తమధికముగ కూడియున్నపుడు, రక్తనాళముల నుండి నెత్తురు తీయుటకు వైద్యులు శస్త్రచికిత్స మొదలగు చికిత్సలనేకములు చేయుచుందురు. అట్టి చికిత్స లేమియు నక్కరలేకుండ ఎకోనైట్ వాడినచో బాగా పనిచేయును. డాక్టరు రడ్డక్ క్షయ చికిత్సలో వ్రాసియున్నాడు.

"In Aconite we have a remedy which answers this purpose (to diminish local congestion) better than the lancet or the leech without the consequent loss of strength." *Ruddock's* Consumption.)

కాల్కేరియా కార్బ :—అజీర్ణరోగుల కమోఘముగ పనిచేయును. ఆకలి తక్కువ, రక్తహీనము, ఎత్తుఅయిన ప్రదేశము లెక్కునపుడు విశేషమైన ఆయాసము, ఱొమ్ములలోనొప్పి—యీ లక్షణములకు మంచిది. క్లోమము అస్వస్థత జెందును. గళగ్రంథి రోగముగల పిల్లలకును, ఋతుస్రావ మెక్కువగ నుండు స్త్రీలకును అద్భుతముగ పనిచేయును. రడ్డక్ 'క్షయ' చికిత్సలో వ్రాసియున్నాడు.

"This noble remedy is well adapted to those constitutions in which the digestion or assimilation of food is imperfect...Other indications are a want of firmness of the bones, slow or difficult dentition, scrofulous swellings, extreme sensitiveness to cold and damp, cough, easily induced fatigue, acid eructations, relaxed bowels gradual wasting, and in females, too frequent and profuse period. It is specially adapted to children and females, to those who have previously exhibited scrofulous symptoms, and

to the pre-tubercular condition generally."
(*Ruddock's* 'Consumption' P. 102.)

ఫాస్ఫరస్ :—ఈ వ్యాధియొక్క ప్రారంభదశలో ముఖ్యముగ వాడతగినది. పొడిదగ్గు రాత్రి ఎక్కువగుట, ఎడమప్రక్కన పరుండ లేకపోవుట, గుండెలలోనొప్పి, మాట్లాడినను, గట్టిగ చదివినను, నవ్వినను, దగ్గువచ్చుట, చెమటలు, అతిసారము, కఫములో కొద్దిగ రక్తజీర—యీ లక్షణములకు పని చేయును.

ఆర్సెనికమ్ :—పడుకొన్నచో దగ్గు, ఆయాసము అధికమగుట, రొమ్ము బిగబట్టి నొప్పి కలుగుట, దప్పి, అతిసారము, రోగి క్షీణించుట, దగ్గినపుడు గుండెలలో మంట, రక్తజీరతోకూడిన కఫము—వీటికి మంచిది. దీనిని ముఖ్యముగ రోగముయొక్క ఆఖరుదశలో వాడదగును.

"Arsenicum is valuable in all stages of the disease, especially in the last." *Ruddock.*

బెల్లడోనా :—రాత్రు లధికముగవచ్చు దగ్గునకు, తలనొప్పి, కఫములో రక్తముపడుట—వీటికి వాడదగును.

హాయోసియామస్ :—రాత్రులు పడుకొన్నచో ఎక్కువగు దగ్గుకు పనిచేయును.

బ్రయోనియా :—రొమ్ము, తల బ్రద్దలగునట్లు విపరీతమైన పొడిదగ్గు, ప్రక్కలోపోట్లు, నొప్పులు వీటికి పనిచేయును.

అయోడియమ్ Iodium :—గ్రంధులువాచుట, రక్తక్షీణము, అతిసారము, ఆకలెక్కువ కాని, ఎంతతినినను క్షీణించుచుండును. ఈ లక్షణముల కద్భుతముగ పనిచేయును.

"The remarkable hunger, relieved by eating, with progressive emaciation is the first in importance." —*Nash.*

ఆర్సెనైట్ ఆఫ్ సోడా Arsenite of Soda :— విపరీతమైన దగ్గు, అపరిమితమైన కళ్ళె, క్షయ జ్వరము, రాత్రి చెమటలు, అతిసారము, శ్వాసకోశములయందు వ్రణములు—యీ లక్షణములకు ముఖ్యముగ వాడదగినది.

హైడ్రాస్టిస్ :—ఆకలి మందగించినపుడు పనిచేయును.

ట్యూబర్ క్యులినమ్ :—రోగి చాల నీరసించినపుడు క్షయవ్యాధిలో మంచి పనిచేయును. కాని దీనిని బహుజాగ్రత్తగా వాడవలయుననియు, తక్కువ

పొటెన్సీలలో (Lower potencies) వాడిన ప్రమాదకరమనియు ఘటర్జీగారు అభిప్రాయ పడుచున్నారు.

హెపార్ సల్ఫ :—శ్వాస కోశములకు సంబంధించిన బాధలన్నిటికి మంచిది. ఈ వ్యాధియొక్క ప్రథమావస్థలో వాడదగును. బొంగురు కంఠము లేక స్వరహీనము, తరుచు రక్తముతో కూడిన కఫము, ఆయాసము, రాత్రి చెమటలు, ఆహారము తినినపిమ్మట నొప్పులు, శీతగాలిలో ఎక్కువై, ఉష్ణ ప్రదేశములో శాంతించుట—యీ లక్షణములకు వాడదగును.

ఇపెకాక్ :—రక్తపిత్తము, వికారము, వాంతి, దగ్గు—వీటికి మంచిది.

స్పాంజియా :—బొంగురు స్వరము, రొమ్ములో బరువు, సాయంకాలము దగ్గు ఎక్కువగుట, వేడి పానీయములవలన ఉపశాంతిగ నుండుట, ఊపిరి సలుపని దగ్గువలన నిద్రలోనుంచి లేచుట, తల పల్లముగ బెట్టి పరుండ లేకపోవుట, మాటలాడినను, చదివినను, గుటకవేసినను దగ్గువచ్చుట, క్షయ జ్వరము, నోరు చేదు—యీ లక్షణములకు పనిచేయును.

కాలీహైడ్రోయిడికమ్ :—గ్రంథులు వాచుట, రాత్రులు చెమట, అతి నీరసము, దగ్గు, కఫము—వీటికి మంచిది.

బ్రోమైన్ :—గ్రంథులు వాచుటకు పనిచేయును.

లైకోపోడియమ్ :—ఆమ్లపిత్తము(Acidity), ఆధ్మానము(Flatulence), మలబద్ధము మొదలగు అజీర్ణ లక్షణములకు, నీరసించుట, రాత్రులు చెమట, ప్రారంభమున క్లోమము (Right lung), అస్వస్థతజెంది, పిమ్మట పుప్పుసము (Left lung) నకు వ్యాపించుట, సాయంత్రము 4 మొదలు 8 గంటలవరకు రోగ లక్షణము లెక్కువగుట—యీ లక్షణములకు దీనిని వాడవలయును.

స్టానమ్ :—సాయంత్రము మొదలు అర్ధరాత్రివరకు అధికమగు పొడిదగ్గు, క్షయజ్వరము, నవ్వినను, పాడినను యెక్కువగు దగ్గు, తియ్యని, ఆకుపచ్చని కఫము—యీ లక్షణములకు మంచిది.

పల్సటిల్లా :—బలమైన ఆహారముచే కలుగు అజీర్ణ లక్షణములకును, ఉదయము కళ్ళెదగ్గు, సాయంత్రము పొడిదగ్గు యున్నపుడును పనిచేయును.

నక్స్‌వామికా :—మలబద్ధము, కడుపుబ్బరము మొదలగు అజీర్ణ లక్షణములకు పనిచేయును. ఇది ముఖ్యముగ సోమరులకు, మనోపరిశ్రమ యెక్కువగ వున్నవారికి, మత్తుపానీయముల కలవాటుపడినవారికి బాగా పనిచేయును.

ఎబ్రోటెనమ్ :—ఆకలి బాగా యున్నను, యెక్కువగా చిక్కిపోయి నపుడు బాగా పనిచేయును.

ఫెర్రంఫాస్ :—జ్వరము, దగ్గు, ఛాతియందు నొప్పి, ఊపిరితిత్తులనుంచి రక్తస్రావము, కఫములో నెత్తురు జీర, రోగి క్షీణించుట—యీ లక్షణములకు దివ్యౌషధము, మంచి రసాయనము.

నేట్రంమూర్ :—కఫము నీళ్ళవలెపలచగ, నురగవలెయుండుట, ఉమ్మిలో నెత్తురుపడుట, కఫము ఉప్పగయుండుట—వీటికి మంచిది. రక్తపిత్తమునకు ఫెర్రంఫాస్‌తో వాడదగును.

కాల్కేరియాఫాస్ :—అజీర్ణ రోగులకు దివ్యౌషధము. ప్రారంభదశలో వాడదగును. అగ్నిమాంద్యము, రోగి నీరసించుట, రక్తహీనము, చెమటలు—యీ లక్షణములకు మంచిది.

సైలీషియా :—ఇది ముఖ్యౌషధము. రాత్రులు పాదములకు చెమట, మలబద్ధము, ఆకలి లేకపోవుట, పచ్చరంగుగల చిక్కని కఫము పడుట—యీ లక్షణములకు మంచి పనిచేయును. క్షయ జ్వరముకూడ యుండును.

ఇవిగాక బేసిలినమ్, కాలీకార్బ, సల్ఫర్, క్రియసోట్, లారోసిరాసస్ (Laurocerasus), కాలీమూర్‌కూడ వాడవచ్చును.

కాల్కేరియాసల్ఫ :—దీర్ఘదగ్గు, కఫములో రక్తము ఉన్నపుడు పని చేయును.

ముఖ్యవిషయములు :—ఈ రోగము రాకుండ ఆపుదల చేసుకొనుటకు మార్గము లెక్కువగనున్నవి. కాని రోగ మంకురించిన పిమ్మట పూర్తిగ నివారణయగుట దుర్లభము. మొదట వ్రాయబడిన ప్రారంభలక్షణము లగుపడిన వెంటనే ఆరోగ్యకరమగు ఎత్తయిన కొండప్రదేశములకు వెళ్ళి నివసించినచో పరిశుభ్రమైన గాలి తగులుటచే రోగ మభివృద్ధిచెందక ఉపశాంతిగ నుండును. రోగికి తగినంత విశ్రాంతి యుండవలయును. వేళకు నిద్ర భోజనము ముఖ్యము. రక్తవృద్ధిపరచు బలమైన ఆహార మిచ్చుచుండవలెను. అనగా గ్రుడ్లు, పాలు, వెన్న, పండ్లు, రొట్టె మొదలగు పదార్థములను, కాడ్‌లివర్ ఆయిల్, చ్యవనప్రాశలేహ్యము, లోహ రసాయనములు మొదలగు రసాయనములను (tonics) వాడినచో మంచి పనిచేయును. పాలు, ముఖ్యముగ మేకపాలు, విశేషముగ వాడుట మంచిది. మేక శరీరములో క్షయపురుగునకు తావులేదు. కావున మేక పాలు దీర్ఘకాలము సేవించిన క్షయవ్యాధి కుదరవచ్చును.

ఈ రోగముగల తలిదండ్రులు బిడ్డలను ముద్దు పెట్టుకొనరాదు. వారిని దగ్గిర కూర్చుండ బెట్టుకొని అన్నము పెట్టరాదు. ఏవిధమైన అంటు తగులకూడదు. ఇట్లుల జేసినచో పిల్లలకీవ్యాధి రాకుండ కాపాడవచ్చును. ఈ రోగి పడుకున్న పక్కమీద యితరులు పరుండరాదు. ఈ రోగి కఫమును గుడ్డలలోబట్టి, ఆగుడ్డలు తగులబెట్టుట మంచిది. రోగి పిల్లవాడైనచో కఫము వెడలునపుడు ఉమ్మివేయవలెనని తెలియక తరుచు మ్రింగుచుండును. అట్లు మ్రింగకుండ కని పెట్టి చూడవలెను.

ఈ రోగి పరిశుభ్రమైన గాలిలో తిరుగుచుండవలెను. కాని విశేష శరీర పరిశ్రమ పనికిరాదు. ఈ రోగికి అధిక పరిశ్రమవలన అజీర్ణము కలుగవచ్చును.

"Consumptive patients should indeed be much in the open air but at the same time avoid any but gentlest exercise; such patients lack endurance, and if exercise be carried too far, digestion will inevitably suffer, and the nutritive processes be inadequate to repair the wasted tissues." —*Ruddock*.

## 9. రక్తపిత్తము Haemorrhage.

ముక్కు, నోరు, గుదము, మేఢ్రము మొదలగు రంధ్రములద్వారా రక్తముపడు రోగమునకు రక్తపిత్తమని పేరు.

లక్షణములు :—శరీరమున బలములేక నీరసముగ నుండుట, రోగి కృశించుట, శరీరము పాలిపోవుట, శ్వాసకాసము, జ్వరము, వాంతి, మత్తు, తాపము, మూర్ఛ, గుండెలలో దడ, భరింపరాని బాధ, దప్పి, మలవిసర్జన కాలములో కోష్ఠమందు బాధ, అజీర్ణము, అన్నద్వేషము— ఇవియన్నియు రక్తపిత్తమునకు సంబంధించిన ఉపద్రవములు. ఈ రోగి శరీరమెప్పుడు చల్లదనమును కోరుచుండును.

రోగికి రక్తస్రావము ఊర్ధ్వముఖంబునగాని, అధోముఖంబునగాని కలుగుచుండును. ఊర్ధ్వముఖంబున వెడలినచో, కన్నులు, నోరు, చెవులు, నాసికా ద్వారములనుండియు, అధోముఖంబున వెడలినచో, మేఢ్రము, యోని, గుద ద్వారములనుండియు స్రవించుచుండును.

నోటినుండిపడు రక్తము ద్వివిధంబులు :— శ్వాస కోశములనుండిగాని,

కడుపులోనుంచిగాని వచ్చుచుండును. రెంటికినిగల భేదము క్రింద చూపబడుచున్నది.

| కడుపులోనుంచి వచ్చు రక్తము | శ్వాసకోశములనుంచివచ్చు రక్తము |
|---|---|
| 1. రక్తము నల్లరంగుగలిగియుండును. | 1. రక్తము మిక్కిలి ఎర్రగనుండును. |
| 2. రక్తము వమనమగును. | 2. రక్తము దగ్గినపుడు పడుచుండును. |
| 3. ఆహారముతోగూడి నురగ లేకనుండును. | 3. ఉమ్మితోగూడి నురగగా యుండును. |
| 4. వికారము, కడుపుబాధయుండును. | 4. రొమ్మునయందు నొప్పి, ఆయాసము, శ్వాసకృచ్ఛము యుండును. |
| 5. మలముతో రక్తము పడును. | 5. మలములో రక్తముండదు. కాని దగ్గినపుడు కళ్ళెలో మ్రింగినచో, రక్తము మలములో కనబడును. |

డాక్టర్ రడ్డక్ గ్రంథమునుంచి గ్రహించబడెను.

కారణములు :—ఎండలో విశేషముగ సంచరించుట, స్త్రీ సంభోగము, దేహపరిశ్రమ అధికముగ జేయుట, తీక్ష్ణమై, మిక్కిలి వేడిగల పదార్థములను భుజించుట— వీటిచే కలుగుచుండును. మరియు రక్తనాళమునకు దెబ్బతగిలినను, ఘాటైన రేచనీయములు, వమనౌషధములు వాడినను, స్త్రీలకు ఋతుదోషముల వలననుకూడ కలుగుచుండును.

## చికిత్స :

హేమామెలిస్ (Hamamelis) :—రక్తస్రావములకు ప్రధానౌషధము. ఏ ద్వారమునుండి రక్తము స్రవించుచున్నను అద్భుతముగ పనిచేయును. దీని రక్తము చిక్కగ, నల్లగ నుండును.

ఇపెకాక్ :—ఏమార్గమునుంచియైనను ఎర్రనిరక్తము స్రవించునపుడ మోఘముగ పనిచేయును. వికారముండును.

"It has haemorrhages from the nose, Stomach, rectum, womb, lungs and bladder! from all the orifices of the body. So does Crotalus, but the blood in Ipecacuanha is bright red, not decomposed. —*Nash*.

సల్ఫ్యూరిక్ యాసిడ్, నైట్రిక్ యాసిడ్ కూడ వాడదగును.

గుదద్వారమునుంచి రక్తస్రావము :—గ్రహణి చికిత్స చూడుడు. నక్సు వామికా, యీస్క్యులస్ (Aesculus), కొల్లిన్‌సోనియా (Collinsonia). సల్ఫర్, మలబద్ధము రక్తస్రావముగల మూలశంఖకు పనిచేయును. హేమామెలిస్ చాలా మంచిది.

నోటినుండి రక్తస్రావము :—క్షయవ్యాధి చికిత్స చూడుడు. హేమామెలిస్, ఫెర్రంఫాస్, ఇపెకాక్, వగైరాలను వాడదగును.

మూత్ర ద్వారమునుంచి రక్తస్రావము :—హేమామెలిస్, కేంథారిస్ (Can·haris), టెరిబెంథినా, మిల్లిఫోలియమ్, ఎకోనైట్, థ్లాస్పి, కార్బోవెజ్, ఫెర్రంఫాస్, నేట్రంమూర్—వీటిని వాడదగును.

నాసికా ద్వారములనుంచి రక్తస్రావము :—క్రోటాలస్, మెలిలోటస్, ఎరిగెరాన్ (Erigeron), ఆర్నికా, అమోనియమ్ కార్బ్, కాక్టస్ (Cactus), కార్బోవెజ్, ఫాస్ఫరస్, ఫెర్రంఫాస్ (పిల్లలకుచాలామంచిది) కాలీఫాస్ (సుకుమారులకు మంచిది), నేట్రంమూర్(బలహీనులకు మంచిది), నేట్రంసల్ఫ (ఋతు కాలమునకు ముందుకలుగుదానికి మంచిది).

చెవులనుండి రక్తస్రావము :— మెర్క్యూరియస్‌సోల్, గ్రాఫైటిస్ (Graphites), కాల్కేరియాసల్ఫ, కాలీఫాస్.

దెబ్బలవలన రక్తస్రావము :—ఆర్నికా దివ్యౌషధము. దీనిని పైకికూడ వాడవచ్చును.

చైనా :—రక్తస్రావములచే జనించు నీరసము, దుర్బలత్వము, మూర్ఛ (Faintness) లేక సొమ్మసిల్లుట, కాళ్లు చేతులు చల్లబడుట—యీ లక్షణములకు అమోఘముగ పనిచేయును.

## 10. మశూచి Small-pox.

ఇది యొకవిధమైన అంటువ్యాధి. సాధారణముగ ఒక మనుష్యునకు జీవితములో ఒకసారికంటె ఎక్కువరాదు.

లక్షణములు :—ఈ రోగమును పంచ గతులక్రింద విభజింప వచ్చును (Five stages).

1. వణుకు, జ్వరము, వికారము, వాంతి, బద్ధకము (Drowsiness), తలనెప్పి నడుము గొంతుక—వీటియందునొప్పి—యివి ప్రారంభమున కనపడు లక్షణములు

2. పిమ్మట జ్వరమధికమగుట, శరీరోష్ణము 104°, 105° వరకు హెచ్చుట, నాడివేగము, అటుపిమ్మట రెండు రోజులకు నొసటను, ముఖముపైన, మణికట్టుమీద ఎర్రని పొక్కులు బయలుదేరి బాధపెట్టును.

3. దీనితో జ్వరము 101°, 102° వరకు తగ్గును. పిమ్మట మూడు, నాలుగు రోజులలో శరీరమంతయు పొక్కులు బయలుదేరును. అయిదవ రోజున ప్రతిపొక్కు నీటితోనుండి మధ్య గుంటగను, చుట్టు ఎర్రగను, మట్టము (Base) గుండ్రముగ నుండును.

4. పిమ్మట మూడురోజులకు యీ పొక్కులు చీముపట్టి మశూచి వాసన బయలుదేరును.

5. సుమారు పదిరోజులకు ఎండుట ప్రారంభమగును. పదునాల్గవరోజున పక్కుకట్టుట ప్రారంభించును. 20,23 రోజులలో యీ పక్కులూడి పోవును. శరీరమున ఎర్రని గుంటలు పడును.

కాని కొందరిలో పొక్కులు బాగుగా పోసిన పిమ్మట జ్వర మొకప్పుడు తిరిగి 104°, 105° వరకు హెచ్చును. దీనికి రెండవ జ్వరమని పేరు. ఇది సాధారణముగ 10, 11 వ రోజులలో హెచ్చును. ఇది చాల ప్రమాదకరము. దీనితో పోతమిక్కుటమై, పొక్కులన్నియు కలిసిపోయి యుండును. శరీరమందు ఖాళీయుండదు. ఈ స్థితిలో జ్వరముతగ్గక, సరియైన మార్గమున నడువక, సంధి మగత, విరేచనములు కలుగును. ఇట్టి తీవ్రమైన కేసులలో ముక్కుమీద, కండ్ల మీద, నాలుకపైన, నోటిలోను, గొంతుకలోను పొక్కులు పోయును. నోటి వెంబడి చొంగ విశేషముగ కారుచుండును. చేతులు, పాదములు, ముఖము పొంగరించి యుండును. కండ్లు మూసుకొని పోవును. ఈ లక్షణములతో కూడిన వ్యాధి కుదురుట దుర్లభము. ఒకవేళ కుదిరినను కంటిలో పువ్వులు లేచి చూపు సరిగ కనపడకపోవుట, కర్ణరోగములు జనించి మాట వినపడక పోవుట మొదలగునవి తటస్థించుచుండును.

ఈ వ్యాధియందు పిల్లలలో అతిసారము, పెద్దలలో మలబద్ధము తరుచు కలుగుచుండును. పెద్దలలో అతిసారమున్నచో ప్రమాదకరము.

## చికిత్స :

యాంటిెంటార్ట్ :—వికారము, వాంతి, దగ్గు, నిస్త్రాణ, వెన్నునొప్పి, నాలుక మొద్దుగానుండుట—యీ లక్షణములలో పనిచేయును. కంపములు

రాకుండ ఆపుజేయును. మశూచి అనుమానము తగులగనే దీనిని వాడినచో మంచి పనిచేయును.

ఎకోనైట్ :—జ్వరము, నాడివేగమునకు మంచిది.

బెల్లడోనా :—సంధి మత్తు లేక మగత, తలనొప్పి, జ్వరము—వీటికి మంచి పనిచేయును.

యాపిస్ మెల్లిఫికా :—ముఖము, కనురెప్పలు పొంగరించుట, కండ్లుమూసు కొనిపోవుట, కంఠమువాచి గుటకవేయుట కష్టముగనుండుట—ఈ లక్షణము లకు చాలమంచిది.

మెర్క్యూరియస్ :—నోటినుంచి చొంగ విశేషముగ కారుట, గొంతుక నొప్పి—యీ గుణములకు పనిచేయును.

సల్ఫర్ :—దురద ఎక్కువ, పొక్కులు పచ్చగ నల్లగ యున్నపుడు పనిచేయును. దీనినివాడినచో వ్యాధి అనంతరము కలుగు యితర రోగములను రాకుండ కాపాడును.

మొమోర్డికాఛారంటియా :—దీని మాతృద్రావకము వాడినచో వ్యాధి ఉద్ధృతము కాజాలదు. అతిసారమున్నపుడు దీనిని వాడకూడదని ఘటర్జీగారు వ్రాసియున్నారు.

కేంఫర్ :—శరీరమంతయు చల్లబడినపుడు పనిచేయును.

రూస్టాక్సు :—నొప్పులకు పనిచేయును.

ఫాస్ఫరస్ :—న్యుమోనియా లక్షణములకు మంచిది.

బ్రైయోనియా ; కాలీబైక్ :– కళ్ళదగ్గున్నచో వాడదగును.

తూజా ; హైడ్రాస్టిస్ :—ఈ రెండును యీ వ్యాధికి చాలమంచి ఔష ధములు. ప్రారంభమునవాడినచో వ్యాధిని ఆపుజేయును. గుంటలు పడనివ్వవు.

మలాండ్రినమ్, వేక్సినినమ్ (Vaccininum), వేరియోలినం, సర్రాసీనియా (Sarracenia) :— ఇవి వారమున కొకసారి వాడబడినచో వ్యాధి రాకుండ కాపాడును.

కాల్కేరియాసల్ఫ :—పొక్కులు చీముపట్టినస్థితిలో మంచిపనిచేయును.

కాలీమూర్ :—ఈ వ్యాధికి ప్రధానౌషధము.

ఫెర్రంఫాస్ :—జ్వరమునకు మంచిది. కాలీమూర్‌తో వాడవలయును.

నేట్రంమూర్ :—పొక్కులు ఒత్తుగా ఒకదానిమీద ఒకటిపోసి శరీర

మంతయు నలుముకొనినను, నోటినుండి చొంగకారుచున్నను, మగతయున్నను దీనిని వాడదగును.

కాలీసల్ఫ :—కాలీమూర్ వాడినపిమ్మట దీనిని వాడినచో పక్కులు రాలిపోయి, క్రొత్తచర్మము పట్టును.

బాహ్యోపచారములు :—అలివ్ ఆయిల్ వ్రాయుట, కార్బాలిక్ లోషనుతో కడుగుచుండుట మంచిది. హైడ్రాస్టిస్, గ్లిసరిన్ కలిపి శరీరమునకు వ్రాయుచున్నచో గుంటలు విశేషముగ పడకుండ ఆపును. కళ్ళు పటికనీళ్లతోగాని, వేడినీళ్ళతోగాని కడుగుటమంచిది. కాళ్ళు, చేతులు వేడినీళ్ళతో తుడుచుచుండవలయును. వేపాకు బాగుగానూరి ఆ ముద్దను రోగి శరీరమంతయు పూయుటవల్లను, వేపచిగుళ్ళు లికరిస్ పొడుము (Liquorice powder) తో నూరి, ఆ మాత్రలు రోగికి నీళ్ళతోవాడినను మంచిపనిచేయునని ఘటర్జీగారు వ్రాసియున్నారు.

ముఖ్యవిషయములు :—రోగిని బాగుగ వెలుతురుగల గదిలో నొంటరిగ నుంచవలెను. విషవాయువులు వ్యాపించకుండ విషహరములను (Disinfectants) వాడవలయును. లేనిచో క్రిములు బట్టలను, గోడలను అంటిపెట్టుకొని వ్యాధిని వ్యాపింపజేయును. రోగికి మలబద్ధములేకుండ చూడవలయును. ద్రవపదార్థములు (పాలు, వగైరా) మాత్రము వాడవలయును. నీరసములేకుండ చూడవలయును. పిల్లలు దురదచేత శరీరము గోకుకొనుటకు యత్నింతురు. వారట్లు గోకుకొనకుండ చూడవలయును. చిన్నపిల్లలైనచో చేతులు కట్టివేయుట మంచిది.

## 11. మూత్ర మప్రయత్నముగపడుట Eneuresis.

లక్షణములు :—నాల్గవ అధ్యాయములో పిల్లలకు కలుగు శయ్యామూత్రమునుగురించి వ్రాయబడెను. అదిగాక కొంతమంది మేల్కొనునపుడుకూడ పిల్లలేగాక పెద్దవారుసైతము మూత్ర మాపుకొనలేకుందురు. మూత్రవిసర్జన కతితొందర కలుగుచుండును. అనేక పర్యాయములు వెళ్ళవలసి వచ్చును. నడచునపుడు, దగ్గినపుడు, తుమ్మినపుడు మూత్రమప్రయత్నముగ చుక్కలు చుక్కలుగ స్రవించుచుండును. కొందరకు పగటిపూట అధికముగ నుండును. మరికొందరకు రాత్రు లధికమగును. కొందరిలో మూత్రద్వారము దురద, మంటకూడ యుండవచ్చును.

కారణములు :—నరముల దుర్బలత్వము వలనను, మూత్రపుతిత్తియొక్క బలహీనతవలనను, క్రిములవలన, అజీర్ణదోషమువలన, పెద్దవారైనచో అనేక రకముల దురలవాటులవలనకూడ కలుగుచుండును.

## చికిత్స :

రూస్ ఆరోమేటికా :—మూత్ర రోగములకు మంచిది. పెద్దలలోగాని, పిల్లలలోగాని పగలుగాని రాత్రులుగాని మూత్ర మప్రయత్నముగాను, చుక్కలుగాను, ఎక్కువగాను పడుచు బాధయున్నపుడు వాడదగును.

పల్సటిల్లా:— దగ్గునపుడు, నడచునపుడు, నిద్రలోను మూత్రవిసర్జన మగుచో పనిచేయును. పిల్లలకు స్త్రీలకు బాగాపనిచేయును.

కాస్టికమ్ :—నడచునపుడు, దగ్గునపుడు, తుమ్మినపుడు, చీదునపుడు, నిద్రలోను మూత్రమప్రయత్నముగ స్రవించుచు, చుక్కలు చుక్కలుగ పడుచుండినను, మూత్రద్వారము దురదయున్నను, మలబద్ధమున్నను అద్భుత ముగ పనిచేయును.

కేంథారిస్ :— మూత్రము కొద్ది కొద్దిగా వెడలుచు మంటతో కూడి యుండును.

సినా :—క్రిములవలన కలిగినచో బాగా పనిచేయును.

ఈక్విసిటమ్ హైయెమ్ :—మూత్రపిండములలో నొప్పి. తరుచు మూత్ర విస ర్జనానుమాన ముండును.

బెల్లడోనా :—మూత్రకోశము మంట యుండును. అతి చురుకైన పిల్ల లకు బాగా పనిచేయును.

జెల్ సిమియమ్ :— మూత్రనాళము బలహీనమై యీ వ్యాధి జనించినపుడు పనిచేయును. పెద్దవారికి బాగా పనిచేయును.

నక్సువామికా :—దురలవాటువలన, జీర్ణకోశమునకు సంబంధించిన దోష మువలన కలిగి, మూత్రమాపుకొనలేక పోయినచో పనిచేయును.

ఫెర్రంఫాస్ :—పగలు మూత్ర మెక్కువసార్లు వెడలుచుండును. ఆపు కొనుటకు శక్తిచాలక విసర్జన కతి తొందర కలుగుచుండును. నడుచునపుడు, దగ్గునపుడు చుక్కలు చుక్కలుగ కారుచుండును. ఈ గుణములలో అత్యద్భు తముగ పనిచేయును. ఇది పిల్లలకు బాగా పనిచేయును. నేను దీనిని నాకుమా రులలో నొకనికి వాడితిని. ఈ క్రింది లక్షణములుండెను. పగలనేకసార్లు

గంటకు నాలుగు, అయిదు పర్యాయములుకూడ, అతి తొందరగ మూత్ర విసర్జన చేయవలసివచ్చుట, నడచునపుడుకూడ బొట్లుబొట్లుగ కారుట, రాత్రులు పరుండిన పిమ్మట తగ్గుట. ఈ గుణములలో ఫెర్రంఫాస్ వారముదినములు వాడితిని. అద్భుతమైన గుణము కనపడెను. పిమ్మట మరికొన్ని దినములు వాడితిని. పూర్తిగ తగ్గిపోయెను. ఇప్పటికి ౫ సంవత్సరములైనది. ఖులాసాగా యున్నాడు. (త।కా)

కాల్కేరియాఫాస్ :—పిల్లలకు, పెద్దలకుకూడ పనిచేయును. మూత్రములో వీర్యము పడుచుండును.

కాలీఫాస్ :—నరముల బలహీనతవలన కలిగినచో బాగా పనిచేయును. ఈ లక్షణముగల హిస్టీరియా స్త్రీలకు మంచిది.

నేట్రంమూర్ :—మూత్రమధికముగ వెడలునపుడు పనిచేయును.

నేట్రంఫాస్ :—క్రిములున్నచో బాగా పనిచేయును. అజీర్ణమునకుకూడ మంచిది. పిల్లలకు బాగా పనిచేయును.
వలనకూడ సంభవించును.

కాల్కేరియాఫ్లోర్ :—రాత్రులు మూత్రమధికముగ వెళ్ళుట (Nocturnal eneuresis), తరుచు తొందరకల్గుట, మంట, పోటు, దుర్వాసన వీటికి పనిచేయును.

## 12. మూత్రకృచ్ఛ్రము Suppression of urine.

లక్షణములు :—మూత్రద్వారమున బాధకలిగి మూత్రము మిక్కిలి కష్టముచే వెడలుచుండును. తరుచు అనుమానము. మాటిమాటికి కొద్దిగ పడుచుండును. మూత్రము చిక్కగ, రంగుతో కూడియుండును. వస్తియందును, అంగమునందును మిక్కుటమైన బాధయుండును.

కారణములు :—అజీర్ణపదార్థములను భుజించుట, అధికముగ భుజించుట, తీక్షణమైన ఔషధసేవ చేయుట—వీటివలన కలుగుచుండును. వాతరోగముల వలనకూడ సంభవించును.

### చికిత్స :

కెన్నబీస్‌సతీవా :—మూత్రము కొద్దిగాను, చుక్కలు చుక్కలుగాను, రంగుగాను, కష్టముగాను వెడలుచు, రక్తమిశ్రమమై మంటయుండును.

మూత్రనాళము సున్నితము ; ఏమాత్రము రాపిడితగిలినను బాధయుండును.

కేంథారిస్ :—మూత్రము కొద్దికొద్దిగాపడుచు, మంటతో కూడియున్నపుడు బాగా పనిచేయును. మూత్రవ్యాధులకు మంచిది.

ఎకోనైట్ :—జ్వరము, వాతముతో కూడియున్నపుడు వాడదగును.

టబాకమ్ Tabacum :— మూత్రద్వారమునందు నొప్పి యున్నపుడు పనిచేయును.

చిమాఫిలా :—మూత్రము రంగుతోకూడినపుడు మంచిది.

టెరిబెంథినా :—మూత్రవిసర్జన సమయములో మంట, మూత్రము నల్లగాను, పొగరంగుగానుండును. మూత్రములో రక్తముపడును. మూత్రకృచ్ఛ్రమునకు దివ్యౌషధము.

"In the Terebenthina Kidney troubles, there is apt to be more stangury than with Berberis and more blood in the urine. The urine becomes brown, black or smoky in appearence from more or less admixture of blood. For burning and smarting on passing urine, Turpentine stands nearer to Cantharis or Cannabis Sativa." —*Nash*.

నక్సువామికా :—అజీర్ణదోషమున్నపుడు పనిచేయును.

ఫెర్రంఫాస్ :—జ్వరమున్నపుడు, అప్రయత్నముగ మూత్రము పడునపుడు వాడవలయును.

కాలీఫాస్ :—వాతదోషములకు మంచిది.

కాలీమూర్ :—చిక్కని మూత్రము పడునపుడు పనిచేయును.

నేట్రంసల్ఫ :—మూత్రము రంగుతో కూడియుండును. పైత్యాధికమునకు మంచిది.

నేట్రంఫాస్ :— మూత్రకృచ్ఛ్రమునకు మంచిది. అజీర్ణ దోషములను పోగొట్టును.

"Assists the flow of urine, should there be total suppression." —*Chapman*.

ఇవిగాక ఓపియమ్, స్ట్రామోనియం, సల్ఫర్, ఆర్సెనికమ్, సికేల్ కూడ వాడవచ్చును. లైకోపోడియంకూడ మంచిదే.

అశ్మరీవ్యాధి చికిత్సకూడ చూడుడు.

## 13. మూత్రబంధనము Retention of urine.

లక్షణములు :—బాధ స్వల్పముగ నున్నను, మూత్రబంధనము విశేషముగ నుండును.

కారణములు :—మూత్ర, పురీషములయొక్కయు, శుక్లముయొక్కయు వేగమును నిరోధించుట చేతను, రూక్షంబులగు పదార్థంబులు సేవించుట చేతను, వాతాదిదోషములచేతను, మూత్రబంధనము కలుగుచుండును.

### చికిత్స :

సేబాల్ సెర్యులేటా :— మూత్రము చుక్కలుగా పడుట, కష్టముమీద పడుట, మూత్రబంధనము- వీటికి పనిచేయును.

కేంఫర్ (Camphor):— మంటతో కూడియున్నచో పనిచేయును. శిశువులలో కలుగు మూత్రబంధమునకు మంచిది. చటర్జీగారు వ్రాసెను.

"Spt. Camphor :— Sudden retention of urine with burning. Retention of urine of the new-born children."

*Dr. Chatterjee.*

మెగ్నీషియాఫాస్ :—మూత్ర బంధనమునకు మంచిది. దీనిని ఉష్ణోదకముతో వాడవలయును.

ఇవిగాక ఎకోనైట్, బెల్లడోనా, పల్సటిల్లా, నక్సువోమిక్ ఫాటా, ఇగ్నేషియా, కాస్టికమ్, కేంథారిస్, స్ట్రిక్‌నీన్, ఫెర్రంఫాస్, కాలీమూర్ కూడ పనిచేయును.

అశ్మరీవ్యాధి చికిత్సకూడ చూడుడు.

## 14. ఎక్కిళ్లు Hiccough.

కారణములు :—మిరపకాయలు మొదలగు పదార్థములను, మలబద్ధము కలుగజేయు పదార్థములను, గురుపదార్థములను, శీతంబులైన అన్నపానాదులను సేవించినను, పొగ, దుమ్ము వలనను, భారమైన పనులు చేయుటవల్లనూ, ఉపవాసమువల్లను, శైత్యాధిక్యమువల్లను—ఈ మొదలగు వాటివల్ల ఎక్కిళ్లు కలుగుచుండును.

### చికిత్స :

సాంబుకస్ :—శీతలమువలన కలిగినచో పనిచేయును.

నక్సువామికా, పల్సటిల్లా :—అజీర్ణముచేతను, గురుపదార్థములు సేవించు

టచేతను, మలబద్ధమువల్లను కలిగినచో ఇవి రెండును మంచి పనిచేయును.

మెగ్నీషియాఫాస్ :—వేడినీళ్ళతో కలిపి యివ్వదగును.

నేట్రంమూర్ :—పైత్యాధిక్యముచేతను, క్వయినా వాడినపిమ్మట కలుగు ఎక్కిళ్ళకు పనిచేయును.

ఇవిగాక యాంటింటార్ట్, కార్బోవెజ్, బెల్లడోనా, ఇగ్నేషియా, వెరాట్రంఆల్బ, సికేలే మొదలగునవికూడ వాడదగును.

ఎక్కిళ్లు స్వల్పముగ నున్నచో మంచినీళ్ళవలన తగ్గును. గుడ్డకాల్చి, పొగను నోగి ముక్కువద్ద పెట్టినచో ఎక్కిళ్లు తగ్గునని ఛటర్జీగారు వ్రాసియున్నారు.

## 15. కర్ణరోగములు Ear diseases.

లక్షణములు :—చెవిలో పోటు, అనేకవిధములైన ధ్వనులు (కర్ణనాదము) చెవినుండి దుర్గంధయుతమైన చీముకారుట (పూతికర్ణము)—ఈ మొదలగు లక్షణములతో చెవిబాధలు కూడియుండును. చెవినుండికారు చీము పలచగ గాని, చిక్కగ పసుపురంగుగగాని, తెల్లగ జిగురువలెగాని యుండును. ఒకప్పుడు దురద, మంటకూడ యుండవచ్చును.

కారణములు :—చలిగాలి విశేషముగ సోకినను, పండ్లజబ్బులవల్లను, స్నానానంతరము చెవులు శిరస్సు బాగుగ తుడుచుకొనకపోయినను, క్రిములు, కీటకములు మొదలగు అన్యపదార్థములు కర్ణములయందు ప్రవేశించినను—ఈ వ్యాధులు జనించుచుండును. ముఖ్యముగ వాతప్రకోపముచే చెవిబాధలు విశేషముగ కలుగుచుండును. ఇంతేగాక మశూచి, పొంగు మొదలగు జబ్బులలో కూడ కర్ణరోగములు వచ్చుచుండును.

### చికిత్స :

ఎకోనైట్ :—శీతకాలములో చలిగాలివలన కలిగినచో వాడదగును. ప్రారంభదశలో మంచిది. జ్వరముండును.

కేమోమిల్లా :—శీతగాలివలన కలిగినను, పోట్లధికముగనున్నను, తాకినచో నొప్పియున్నను పనిచేయును.

పల్సటిల్లా :—చెవివాచి ఎఱ్ఱగనున్నను, చెవిలోనుంచి యేదియో బయటకు

వచ్చుచున్నట్లున్నను, పలచని స్రావమున్నను, పొంగుపడిన పిమ్మట యీబాధ కలిగినను బాగా పనిచేయును.

యాపిస్ :—రెండుచెవులు వాచి, ఎరుపుకలిగి, పోటున్నపుడు మంచిది.

లైకోపోడియమ్ :—ప్రారంభమున కుడిచెవివాచి ఎర్రగనుండి, పిమ్మట ఎడమచెవికి వ్యాపించినను, చీముకారుచున్నను పనిచేయును.

లేకెసిస్ Lachesis :—ప్రారంభమున ఎడమచెవివాచి, పోటుబయలుదేరి కుడిచెవికి వ్యాపించినచో పనిచేయును.

మెర్క్యూరియస్‌సోల్ :—దుర్వాసనగలిగి, రక్తముతోకూడిన స్రావమున్నచో పనిచేయును.

సోరినమ్ :—దుర్గంధయుక్తమైన చీముకు పనిచేయును.

టెల్లూరియమ్ (Tellurium) :— పలచని నీళ్ళవంటి స్రావమున్నపుడు పనిచేయును.

హెపార్‌సల్ఫ :—వాసనతోకూడిన చీముకు మంచి పనిచేయును.

ఫైటోలక్కా :—గుటకవేసినపుడు రెండు చెవులలోను పోట్లుపొడుచును.

గ్రాఫైటీస్ :—వాసనతోకూడి, రక్తమిళితమై, దుర్వాసనగల పలచన నీళ్ళవంటి స్రావమున్నచో బాగా పనిచేయును.

చైనా :—చెవిలో ధ్వనులకు మంచిది. గంటవాయించినట్లుండును.

ఆర్జెంటమ్‌నైట్రికమ్ :—చెవుడుకు పనిచేయును.

పెట్రోలియమ్ :—ధ్వనులకు, మాటసరిగ వినపడకపోయినను బాగా పనిచేయును.

బారీటామూర్ :—చెవినుంచి చీముకారునపుడు పనిచేయును.

స్టాఫిసేగ్రియా :- గళగ్రంధులువాచి, మాట వినపడకపోయినచో పని చేయును.

కాస్టికమ్ :—చెవిలో వివిధరకముల నాదములతో కూడిన చెముడుకు అమోఘముగ పనిచేయును.

కాల్కేరియాకార్బ :—క్వయినా వాడినపిమ్మట సరిగ మాటవినపడక పోయినచో దీనిని వాడదగును.

కార్బోవెజ్ :—చెవుడుకు వాడదగును.

ముల్లిన్ ఆయిల్ :—చెవిపోటు మొదలగువాటికి ప్రత్యేకౌషధము. దీనిని ప్రత్యేకముగగాని, గ్లిసరిన్‌తో కలిపిగాని పైకి వాడవచ్చును.

కాల్కేరియాఫాస్ :—చెవిలో పోట్లకు మంచిది.

మెగ్నీషియాఫాస్ :—చెవిలో, ముఖ్యముగ కుడిచెవి వెనుక, నొప్పికి మంచిది. నరముల బలహీనతచే కలిగిననొప్పికి, చెముడుకుకూడ పనిచేయును.

సైలీషియా :—దుర్వాసనగల చీముకు చాలామంచిది.

కాలీమూర్ :—వాపు, తెల్లనిస్రావము, చెముడు—వీటికి పనిచేయును. చీదునపుడు చెవి బ్రద్దలగునట్లుండును.

ఫెర్రంఫాస్ :— జ్వరము, చెవివాపు, మంట, గుటకవేయునపుడు గొంతుక నుంచి చెవిలోనికి నొప్పి వ్యాపించుట—వీటికి మంచిది.

కాల్కేరియాసల్ఫ :—కుడిచెవిలో సంగీతపు ధ్వనులు, చిక్కగ పసుపు రంగు గలిగి, రక్తముతో కూడిన స్రావము; చెముడు; కుడిచెవిమీద పొక్కులు—వీటికి పనిచేయును.

నేట్రంమూర్ :—చెవిలో దురద, మాట సరిగ వినపడకపోవుట, చీము కారుట, నమలినపుడు చెవిలో ధ్వనియగుట—వీటికి మంచిది. క్వయినా వాడి నపిమ్మట కలిగిన చెముడుకు కూడ పనిచేయును.

ఇవిగాక మెజీరియమ్, కాప్సికమ్ (పోట్లకు) కాల్కేరియాప్లోరు (నాదములకు) కూడ వాడవచ్చును.

కాలీసల్ఫ :—చెవులనుండి, ముఖ్యముగా కుడిచెవినుండి నీళ్లవంటి పసుపు రంగుగల స్రావమున్నను, సాయంకాలమధికమైనను దీనిని వాడవలెను. దీనిని వేడినీళ్లలో కలిపి, పిచకారీచేయుట కూడ మంచిది.

## 16. పండ్లరోగములు Toothache etc.

పళ్లుతీపు, నొప్పి, పుప్పిపళ్లు, చిగుళ్లు ఎఱ్ఱబడుట, వాచుట, ముఖము పొంగరించుట, జ్వరము, నోటినుండి నీరుకారుట, ఏపదార్థమును నమలలేక పోవుట—యీ బాధలుండును.

కారణములు :—చలిగాలి, అజీర్ణము, పండ్లు శుభ్రముగ నుంచకపోవుట, క్రిములు మొదలగు కారణములచే పండ్లవ్యాధులు కలుగుచుండును.

## చికిత్స :

కేమోమిల్లా :—చలిగాలివలన, వేడిపదార్థములను భుజించుటవలన, రాత్రి కాలమందు, అధికమగు బాధలకు మంచిది. ఇది పిల్లల కమోఘముగ పని చేయును.

"Toothache if anything warm is taken into the mouth." —*Nash*

మెర్క్యూరియస్ :—పుప్పిపళ్ళు, నొప్పి ముఖమంతయు వ్యాపించుట, చల్లని పానీయములను త్రాగినచో వృద్ధియగుట, ముఖము పొంగరించుట, నోటి నుండి ఉమ్మి నీరధికముగ కారుట—వీటికి మంచి పనిచేయును.

క్రియసోట్ :—పుప్పిపళ్ళకు మంచిది. చిగుళ్ళువాచి ఎర్రబడి బాధ యుండును. పిల్లలలో పండ్లు త్వరలో చెడిపోవునపుడు, చిగుళ్ళ బాధయున్న పుడు అమోఘముగ పనిచేయును.

"A child that has a mouth full of decayed teeth, with spongy, painful gums, will find its best friend in Kreosote." —*Nash.*

నక్సువామికా :—అజీర్ణమువలన కలిగినచో పనిచేయును.

ఎకోనైట్ :—జ్వరము, యిగుళ్ళువాపు, ఎరుపు, నొప్పి యుండును.

మెగ్నీషియాకార్బ :—రాత్రి యెక్కువగు బాధలకు గర్భిణీస్త్రీలకు పనిచేయును.

బెల్లడోనా :—మంట, చురుకుచురుకుమను నొప్పులుండును. దీనిబాధలు కణతలకుకూడ వ్యాపించును.

కాఫీక్రూడా Coffea Cruda :—పండ్లు చివుక్కుమనిలాగుట, చురుకు మని నొప్పియుండును. ఈ బాధలు చల్లనినీళ్ళు నోటిలోపోసుకొని యుంచి నచో తగ్గుచుండును.

"Jerking toothache; relieved by holding ice water in the mouth, returns when water becomes warm." —*Nash.*

ప్లాన్టాగో (Plantago):—దీని మాతృద్రావకము పైకికూడ వాడవచ్చును.

మెగ్నీషియాఫాస్ :—వేడి పానీయముల వలన బాధలు తగ్గుచుండును. రాత్రి యెక్కువగుచుండును.

స్ట్రెంమూంర్ :— చలిగాలి తగిలినను, తాకినను, నమలినను నొప్పి ఎక్కు

వగును. మధ్యాహ్నము రాత్రి బాధ అధికమగును. కంటినుంచి, నోటినుంచి నీరుకారును. ఋతుకాలమందధికమగును. చిగుళ్ళనుంచి రక్తము స్రవించుచుండును.

ఫెర్రంఫాస్ :—జ్వరము; చిగుళ్ళువాపు, ఎరుపు ఉండును. పండ్లు సలుపుచుండును. చలివలన తగ్గుచు, వేడివలన అధికమగును.

కాలీఫాస్ :—వాతరోగము గలవారికి (Nervous Subjects) చిగుళ్ళనుంచి రక్తము కారునపుడు మనోపరిశ్రమ ఎక్కువగలవారికి బాగా పని చేయును.

సైలీషియా :—కురుపువేసి చీము పట్టునపుడు, రాత్రులు బాధ లెక్కువగునపుడు పనిచేయును.

కాల్కేరియాఫాస్ :—పుప్పిపండ్లకు మంచిది. పండ్లు త్వరలో చెడిపోవుచుండును. రాత్రులు నొప్పి అధికమగును.

ఇవిగాక పల్సటిల్లా, మెజీరియమ్, యాంటిమోనియమ్ క్రూడమ్ కూడ పని చేయును. పండ్లనొప్పులకు, కదలుటకు కాల్కేరియా ఫ్లోర్ కూడ మంచిదే.

## 17. తలనొప్పి Headache.

లక్షణములు :—శిరస్సు పైభాగముననగాని, కండ్లకు పైభాగమంతయుగాని, ఒకపార్శ్వముననగాని మిక్కుటమైననొప్పి, బాధ కలుగును. ఒకప్పుడు సూదులతో పోట్లు పొడిచి నట్లుండును. తల బద్దలగునట్లుగాని, పెద్దదగు నట్లుగాని యుండును. తల తిరుగుట, వికారము, వాంతి కూడ ఒకప్పుడు కలుగుచుండును. తలనొప్పి ప్రత్యేకముగ రావచ్చును. లేదా యితర రోగములతో కలిసి యుండవచ్చును.

కారణములు :—అజీర్ణము, అమితముగ భుజించుట, మలమూత్రవేగముల నడ్డగించుట, మలబద్ధము, దేహపరిశ్రమ, మనోపరిశ్రమ అధికముగ చేయుట, ఎండలో దిరుగుట, అలసట పొందుట, అభిఘాతము, తేమప్రదేశములో తరుచు సంచరించుట, రాత్రుల యందెక్కువకాలము మేల్కొనుట, విశేషముగ చదువుట, రక్తపిత్తము, బలహీనము—యీ మొదలగు కారణములచే శిరో రోగము జనించును. చుట్టకాల్చుట, కాఫీత్రాగుటకూడ కారణములే.

### చికిత్స :

నక్సువామికా :—మలబద్ధము, అజీర్ణమువలనగాని, చుట్ట, కాఫీ, యితర

మత్తు పానీయములవలనగాని సోమరితనమువలనగాని కలిగినచో పనిచేయును. ఎండలోవచ్చు తలనొప్పికికూడ పనిచేయును. తల తిరుగుచున్నట్లుండును.

పల్సటిల్లా :—ఒక పార్శ్వము నొప్పి యున్నను, దప్పి లేకపోయినను, యెక్కువ చమురుగల గురుపదార్థములు భుజించినను (Fat food), అజీర్ణ మున్నను దీనిని వాడవలయును.

గ్లోనోయిన్ (Glcnoine) :—శిరోరోగములకు ముఖ్యౌషధము. తల నొప్పి సూర్యోదయముతో ప్రారంభించి, పగలెల్ల బాధ యుండి, సూర్యాస్త మయముతో తగ్గుచుండును. ఎండవల్లగాని, వెచ్చని గదిలోగాని, వేసవికాల ములోగాని బాధ వృద్ధియగుచుండును. నాష్ యిట్లు వ్రాసియున్నాడు.

"This is one of our great head remedies...... For sun-stroke it is probably oftener indicated than any other remedy; also for the after-sufferings therefrom......Warm room increases the headache and warm bed the faceache."

—*Nash.*

డల్ కెమారా :—తేమవలన కలిగినచో పనిచేయును.

బ్రైయోనియా :—రాత్రులు మేల్కొనినను, వంగినను, దగ్గినను అధిక మైనపుడు, తల పగిలిపోవునట్లుండినను పనిచేయును.

బెల్లడోనా :—శిరస్సు వేడి, కండ్లు ముఖము నిప్పుకణములవలె యెర్రగ నుండుట, రక్తము శిరస్సునకు వేగముగా ప్రవహించుటవలన నొప్పి కలుగును.

ఆర్నికా :—దెబ్బవలన గలిగినచో పనిచేయును.

ఇపెకాక్ :—త్రిప్పు, వికారము, వాంతికి పనిచేయును.

సేపియా :—మలబద్ధముతో కూడియున్నను, ఒక పార్శ్వము నొప్పి యున్నను పనిచేయును.

తూజా :— మేకు కొట్టినట్లు నొప్పియుండును. టీ త్రాగుటచే కలుగు పార్శ్వపు నొప్పులకు మంచిది.

ఐరిస్ :—పసరు వమనముతో కూడియున్నను, కుడిపార్శ్వము నొప్పి యున్నను పనిచేయును.

రూస్‌టాక్సు :—వాత నొప్పులకు మంచిది.

ఇగ్నేషియా :—చుట్ట, పొడుము, కాఫీ, చలిగాలి, మనోపరిశ్రమ, విచా రము—వీటి వలన అధికమైనచో బాగా పనిచేయును.

జెల్‌సిమియమ్ :—మనోపరిశ్రమవలన, చుట్ట కాల్చుటవలన, తల పల్లముగ పెట్టుకొని పరుండుటవలన తల నొప్పి అధికమగుచు, నొక్కుటవలన, ఉద్రేకము కలుగజేయు పదార్థములవలన (Stimulants) తాత్కాలికముగ ఉపశమించు తలనొప్పికి మంచిది. మూత్రము జారీఅగుటచే తగ్గు తలనొప్పులకు పని చేయును.

ఎపిఫేగస్ :—ఎక్కువ పరిశ్రమవలన కలిగినచో మంచిపనిచేయును.

సైక్లామెన్ Cyclamen :—ఉదయమున ఋతుకాలమందు వచ్చు నొప్పులకు మంచిది.

ఎనకార్డియమ్ :—మనోపరిశ్రమవలన కలిగినచో వాడదగును. మలబద్ధముండును.

కాలీఫాస్ :—మనోపరిశ్రమ ఎక్కువచేయువారికి మంచిది. ముఖ్యముగ విద్యార్థులకు బాగా పనిచేయును. అలసటపొందుటచే కలిగినను, వాతనొప్పులకు (Nervous headaches) పనిచేయును.

కాలీమూర్ :—మలబద్ధముతో కూడియున్నచో వాడదగును.

నేట్రంసల్ఫ : -- పైత్యోద్రేకముచే కలిగి, పసరువమనము, తలతిరుగుట మొదలగు పైత్యలక్షణములున్నచో బాగా పనిచేయును.

నేట్రంమూర్ :—ఋతుకాలమందు, ఋతుదోషముచే కలిగినచో, ఆడపిల్లలకు పనిచేయును. మలబద్ధముతో కూడియున్నను, దీర్ఘనొప్పి అయినను కూడ వాడదగును. ఉదయమున ఎక్కువగును.

ఫెర్రంఫాస్ :—అజీర్ణ పదార్థములతో కూడిన వమనమున్నను, కణతలు బ్రద్దలగునట్లు నొప్పియున్నను, కదలినచో ఎక్కువైనను వాడదగును.

మెగ్నీషియాఫాస్ :--కండ్లముందర మిణుకుమిణుకుమను వెలుతురులు కనపడుచు, ఉష్ణోపచారములవలన తలనొప్పి తగ్గుచు, చలిగాలివలన, చన్నీటివలన అధికమగుచో వాడదగును.

కాల్కేరియాఫ్లోర్ :—మలబద్ధముతోకూడిన తలనొప్పికిని, వికారముతో కూడియున్నపుడును, మధ్యాహ్నము అధికమగుచు, సాయంకాలము తగ్గుదానికి పనిచేయును.

సాంగ్విసేరియా 200 :—వెలుతురువల్లను, ధ్వనివల్లను అధికమగుచు, నిద్రలోను, తల గట్టిగా నొక్కిపట్టినను శాంతించుచుండును.

ఇవిగాక కాఫీక్రూడా, అగేరికస్, కాక్క్యులస్, కాలీసల్ఫ మొదలగు వాటినికూడ వాడవచ్చును. లేకెసిస్‌కూడ మంచిదే. (ఎడమవైపు బాధలకు).

## 18. నిద్రపట్టకుండుట Sleeplessness.

లక్షణములు :—దీనిని ప్రత్యేక మొక వ్యాధికంటె యితర వ్యాధులలో గలుగు నొక లక్షణమని చెప్పదగును. కలత నిద్ర, నిద్రలో యేడ్చుట, ఉలికి పడి లేచుట మొదలగు లక్షణము లుండును. తరుచు కలలుకూడ వచ్చు చుండును.

కారణములు :—అజీర్ణము, భయము, మనోవ్యాధి, నీరసము, కాఫీ, టీ మొదలగునవి త్రాగుట, యితర వ్యాధులవలన కలిగిన అస్వస్థత.

### చికిత్స :

పిల్లలలో నిద్రపట్టకపోవుటను గురించి రెండవ అధ్యాయములో 'నిద్ర' ను గురించి చూడదగును.

ఎకోనైట్ :—మనోవ్యాకులతవలన నిద్రలేకపోయినను, నిద్రలో కలవ రింత, స్వప్నములు వచ్చినను దీనిని వాడదగును. శిశువులలో భయమువలన నిద్రపట్టకపోయినచో బాగుగా పనిచేయును.

బెల్లడోనా :—నిద్రలో ఉలికిపడి లేచుటకు పనిచేయును.

కేమోమిల్లా :—కోపోద్రేకముచే కలిగినచో పిల్లలకు బాగా పనిచేయును. "Children with irritability." స్థిమిత ముండదు. పిల్లవాడు తరుచు యేడ్చుచుండును. కాని యెత్తుకొనినచో వూరకుండును.

నక్స్‌వామికా :—అజీర్ణముచే కలిగినచో పనిచేయును.

లైకోపోడియమ్ :—పగలు నిద్ర ; రాత్రులు నిద్రలేకపోవుట.

ఇగ్నేషియా :—విచారము, భయమువలన నిద్రలేకపోయినచో తప్పక వాడదగును.

తూజా :—'టీ' త్రాగినందువలన కలిగినచో పనిచేయును.

యాంబ్రగ్రీషియా :—వ్యాపార యోచనలచేగాని, నరములకు సంబంధిం చిన బాధలచేగాని నిద్రపట్టనపుడు వాడదగును.

సైప్రిపీడియమ్ (Cypripedium) :—చిన్న పిల్లలు రాత్రులుకూడ నిద్ర

పోక పడుకొని నవ్వుచు, ఆడుకొనుచున్నపుడును, సంతోషకరమైన భావములు తట్టుచు నిద్రపట్టనపుడును పనిచేయును.

ఓపియం :—మగత, నిద్రమత్తు, బద్ధకము కాని నిద్రపట్టదు. పిల్లలకు పెద్దలకుకూడ పనిచేయును.

ఫెర్రంఫాస్ :—రక్త క్షీణమువలన నిద్ర పట్టకపోయినను స్వప్నములు వచ్చుచున్నను పనిచేయును.

కాలీఫాస్ :—ముఖ్యౌషధము. ఆవలింతలు, ఒడలు విరుపులుండును. కాని నిద్రరాదు. మనోపరిశ్రమవలన గాఢనిద్ర పట్టదు.

నేట్రంమూర్ :—నిద్రపోవలెనని భ్రాంతి యుండును. కాని నిద్రపట్టదు. ఏవియో ఆలోచనలు తట్టుచుండును. నిద్రలో నోటినుంచి చొంగ అధికముగ కారుచుండును. ఉదయమున లేచుసరికి బడలికగా నుండును.

నేట్రంసల్ఫ :—స్వప్నము లధికముగ వచ్చుట, నిద్రనుంచి భయపడి లేచుట, నోరు చేదు.

సైలీషియా :—భయంకరమైన స్వప్నములు, ఉలికిపడుట, కలవరింతలు, పగలు నిద్ర.

ఇవిగాక పల్సటిల్లా, సేపియా, సల్ఫర్, కాఫీక్రూడా, మెగ్నీషియాఫాస్ కెన్నబిస్ ఇండికా, ప్యాసిఫ్లోరా ఇన్కార్నేటా, జెల్సిమియం, సిమిసిఫ్యూగా కూడ వాడదగును.

## 19. వీర్యనష్టము Spermatorrhoea.

ఈ వ్యాధి సాధారణముగ విద్యార్థులలో నెక్కువ కలుగు చుండును. వయసువచ్చిన పిల్లలలోను, కొందరి యువకులలోను కనిపించు చుండును. ఈ వ్యాధి ప్రమాదకరమైనదనియే చెప్పవచ్చును. దీనిని నిర్లక్ష్యము చేసినచో ప్రాణహానికూడ సంభవించును. మనుజునకు బలము వీర్యము. అట్టివీర్యము నష్టమైనచో బలహీనుడగును. నిద్రలో స్వప్నములు వచ్చినగాని, స్వప్నములు లేకుండగాని స్ఖలనమగుచుండును. మరియు మూత్రముతో గలిసిగాని, మూత్ర విసర్జనానంతరముగాని వీర్యము పడిపోవుచుండును.

లక్షణములు :—సంతోషము లేకపోవుట, జ్ఞాపకశక్తి క్షీణించుట, నీరసము, నడుము, కాళ్లులాగుట, అజీర్ణము, మలబద్ధము, ఉల్లాసముగ తోడి వారలతో మాట్లాడుటకు యిచ్ఛలేకుండుట, తలనొప్పి, కండ్లు దించుకొని

పోవుట, రక్తము క్షీణించి పాలిపోవుట, హృదయదౌర్బల్యము, గుండెలలో దడ — ఈ మొదలగు లక్షణములుండును. సంభోగశక్తి నశించును.

కారణములు :—విద్యార్థులు తరుచు శృంగార కావ్యములు నవలలు చదువుట, చెడుసహవాసములచే ముష్టిమైధునము మొదలగు దురలవాటులకు లోనగుట, నీతిమార్గమైన సంభాషణలనుజేయుట, వినుట, దేహపరిశ్రమ చేయక రాత్రింబగళ్ళు చదువుచుండుట— ఈ కారణములచే విద్యార్థులలో నీవ్యాధి కలుగుచుండును. క్రిములవలన చర్మవ్యాధులు జనించుటచే పిల్లలు అంగమును గోకుచు, ముందుకు వెనుకకు లాగుచుందురు. ఇట్లుచేయుటచే తాత్కాలికముగ ఉపశాంతియుండి సుఖముకలిగించినను, అనేక దుర్గుణములు జనించును. అజీర్ణము, మలబద్ధము, మనోవ్యాధి, అధికముగ స్త్రీ సంభోగము చేయుట—ఇవికూడ యీ రోగమునకు కారణములే.

## చికిత్స :

ఈ రోగము చికిత్సకు సాధారణ కుటుంబ వైద్యముపై ఆధారపడుట కంటె అనుభవముగల వైద్యునకు చూపించి సలహాపొందుట మంచిది.

స్టాఫిసేగ్రియా :—ఈ వ్యాధికి చాలామంచిది. ముష్టిమైధునము మొదలగు దురలవాటులచే కలిగినదానికి బాగా పనిచేయును. రాత్రులు స్ఖలనమగుట, జ్ఞాపకశక్తి క్షీణించుట, కండ్లు దించుకొనిపోవుట, నీరసము, నడుములాగుట వీటికి అద్భుతముగ పనిచేయును. సంభోగశక్తి నశించినపుడుకూడ బాగా పనిచేయును.

చైనా :—రాత్రులు స్ఖలనమగుట, అజీర్ణము, ఉల్లాసము లేకపోవుట, నీరసము— ఈ లక్షణములకు చాలా మంచిది.

ఫాస్ఫారిక్ యాసిడ్ :— ఈ వ్యాధివలన నీరసము కలిగినను, కామోద్రేకము నశించినను పనిచేయును. దురలవాటుచే పిల్లలకీవ్యాధి తటస్థించినచో బాగా పనిచేయును.

సెలేనియమ్ Selenium :— నిద్రలో వీర్యస్ఖలనమగుట, అతినీరసము, కాళ్లు, చేతులు, ముఖము కృశించుట, సంభోగ వాంఛయేగాని, సంభోగించుటకు అశక్తత, మలబద్ధము, ఉదయమున లేచుటతోడనే తల తిరుగుట— యీ గుణములకు పనిచేయును. ఇది ముఖ్యముగ వాడవలసిన ఔషధము.

సాలిక్సునైగ్రా :—దీని మాతృద్రావకము మంచిపనిచేయును. ముప్పది చుక్కలువరకు వాడవచ్చును (ఛటర్జీ గారు (నాసిరి).

లైకోపోడియమ్ :—కడు పుబ్బరము, మలబద్ధము, మనస్సునకు ఉల్లాసము లేకపోవుట, జ్ఞాపకశక్తి క్షీణించుట, సంభోగశక్తి లేకపోవుట—వీటికి బాగా పనిచేయును.

"Lycopodium is one of our best remedies for impotence."
—*Nash*.

సేబాల్ సెర్రులేటా (Sabal Serrulata) :—ముష్టిమైథునము వల్లను, అతి సంభోగమువల్లను, కలిగిన వీర్యనష్టమునకును; పుంసత్వము క్షీణించినను పనిచేయును.

డామియానా :—మంచి రసాయనము.

కాలీఫాస్ :—నరముల దుర్బలత్వమును పోగొట్టును. దురలవాటులచే కలిగినచో బాగా పనిచేయును.

నేట్రంఫాస్ :—వీర్యము నీళ్లవలె పలచనగును. స్ఖలనమైన పిమ్మట నీరసము, వణుకు ఉండును.

కాల్కేరియాఫాస్ :—నీరసమునకు మంచిది. శరీరమునకు బలము నిచ్చును.

ఫెర్రంఫాస్ :—మంచి రసాయనము.

ఇవిగాక నక్సువామికా, కేంథారిస్, కోనియం, ప్లాటినా, మెగ్నీషియాఫాస్కూడ వాడదగును. కాల్కేరియాసల్ఫకూడ వీర్యనష్టమునకు నపుంసకత్వమునకు వాడినచో మంచిపని చేయును.

## 20. దెబ్బలు; పుండ్లు: కాల్పులు.

ప్రారంభమున దెబ్బవలనగాని, కాట్లు వలనగాని రక్తము కారునపుడు దానిని ఆపుజేయుట ముఖ్య కర్తవ్యము. చిన్నదైనచో గట్టిగా నొక్కిపట్టిన యెడల రక్తము కట్టును. లేనియెడల కాలెండ్యులాగాని, హేమామెలిస్గాని, ఆర్నికాగాని—వీటి ద్రావకము (Lotion) లను వాడినచో రక్తము కట్టును. లేక ఫెర్రంఫాస్ పొడుమును వాడినను రక్తము కట్టును. దీనిని వాడినచో పుండుకూడ త్వరలో మానును.

రక్తము కట్టిన పిమ్మట అన్య పదార్థము లేకుండ పుండును పరిశుభ్రముగా కడుగవలయును. తరువాత కాలెండ్యులా ద్రావకముగాని, హేమామెలిస్గాని, హైడ్రాస్టిస్గాని వేసలైన్లో కలిపి వ్రాయుచు కట్టుకట్టవలెను. దీని

వలన చీము పట్టకుండ ఆపుచేయును. ఒకవేళ చీముపట్టినచో హెపార్ సల్ఫ గాని, సైలీషియాగాని వాడతగును.

దెబ్బలకు, నొప్పులకు ఆర్నికాగాని, బెల్లడోనాగాని వాడినచో బాగుగా పనిచేయును.

పైన వ్రాసిన మందులతోపాటు, లోపలికికూడ ఆర్నికా, హేమామెలిస్, ఏకోనైట్, ఫెర్రంఫాస్ వాడవచ్చును.

ఇవిగాక బెల్లిస్ పెరిన్నిస్, హైపెరికమ్, స్టాఫిసేగ్రియా, రూటా, రూస్ టాక్స్, కాలీమూర్, కాల్కేరియాసల్ఫకూడ వాడవచ్చును.

కాల్పులకు యుర్టికాయురెన్స్ గాని, కేంథారిన్ ద్రావకముగాని వాడదగును. లేదా మిథిలేటెడ్ స్పిరిట్ వెంటనే కాలినచోట వేసినచో పుండ్లు చీముపట్టక త్వరలో మానిపోవును.

సున్నపు తేటలో కొబ్బరినూనె వేసి బాగుగా చిలికి కాలిన పుండ్లకు వ్రాసినచో మంచి పని చేయును. దీనినే మనవారు 'నవనీతము', ఇంగ్లీషులో దీనిని 'Carron Oil' అందురు.

పుండ్లు, కాల్పులు ప్రమాదమైనచో అనుభవముగల వైద్యుని సహాయము పొందుట మంచిది. ఇవి చీము పట్టినపుడు కాల్కేరియాసల్ఫ వాడినచో అద్భుతముగా పనిచేయును.

——

# ఆరవ ప్రకరణము

## వస్తుగుణదీపిక

ఈ పుస్తకములో వ్రాయబడిన వ్యాధులకు సూచింపబడిన ఔషధములలో ముఖ్యమగు సారూప్య ఔషధములు 41, లవణములు 12 ప్రత్యేకించి వాటి గుణములను సంగ్రహముగా నీ ప్రకరణములో వ్రాసియుంటిని. ఈ వ్రాయబడిన ఔషధములు యిందు సూచింపబడిన రోగములకేగాక యింకా స్త్రీ రోగములకు, సుఖరోగములకు మొదలగు అనేకవ్యాధులకు పనిచేయును. కావున యీ వస్తుగుణదీపిక ఆయా ఔషధములను గురించి పూర్తిగా తెలుపబడినదని గ్రహించరాదు. ఈ పుస్తకములో వ్రాయబడిన రోగములకు మాత్రమే ఆ ఔషధము లెంతవరకు పనిచేయునో, ఏయే రోగములకు ఏయే గుణముల మీద పనిచేయునో వ్రాయబడియున్నది. లవణములు 12 తో సహా యిందు వ్రాయబడిన 53 ఔషధములను దగ్గరయుంచుకొని జాగ్రత్తపెట్టుకొన్నచో యిందుండు సమస్త రోగములకు సాధ్యమగునంతవరకు ప్రతివారును స్వయముగానే చికిత్స చేసుకొనవచ్చును.

## ఎకోనైట్

ఇది ముఖ్యముగా రక్తపుష్టిగలవారికి, లావుగా నుండువారికి పనిచేయును. ఈ రోగికి శరీరకష్టమువలనగాని, మానసిక కష్టములవలనగాని భయమెక్కువగా నుండును. ముఖ్యముగా చనిపోవుదునను భయముండును. మనస్థిమిత ముండదు. శీతగాలి తగులుటవల్లను, జలుబుచేయుటవల్లను కలుగు సమస్త వ్యాధులకు ప్రధానౌషధము. జలుబుచేసి రొంపపట్టి ఊపిరాడక బాధపడుచున్నపుడు పిల్లల కమోఘముగ పనిచేయును. పీనస, జ్వరము, దగ్గు, పొంగు, కళ్ళిదగ్గు (Bronchitis), క్షయ, న్యుమోనియా, గళగ్రంధిరోగము, గండమాల, కింకపాయువు మొదలగు వ్యాధులన్నిటిలోను ప్రధమావస్థలో దీనిని వాడినచో వ్యాధియొక్క ఉద్రేకమును తగ్గించును. దీని జ్వరములో శరీరము వేడి, తాపము ఉండును. కాని చెమటలుండవు. జలుబుచే కలుగు కండ్లవ్యాధులకు, పండ్లవ్యాధులకు, కర్ణరోగములకుకూడ బాగా పనిచేయును. మూత్ర కృచ్ఛ్రము, మూత్రబంధనము, మూత్రము విడుచునపుడు బాధ మొదలగు మూత్రవ్యాధులకుకూడ మంచిది. మూత్రద్వారమునుంచి, నాసికా ద్వారముల

నుంచి కలుగు రక్తస్రావములకు మంచిది. దీని లక్షణములు రోగి ఎడమప్రక్కన పరుండినచో ఉద్రేకించుచుండును. సన్నిపాతజ్వరము, మలేరియాజ్వరములలో నిది పనిచేయదు.

## ఎథూసా సైనేపియమ్

ఇది నరముల బలహీనతగలవారికి మంచి పనిచేయును. పిల్లల కక్కులకు అమోఘమైనది. పాలు త్రాగినవెంటనే పిల్లవాడు కక్కుకొనుచుండును. లేదా కొంచముసేపు యిమిడినను పెద్ద పెరుగుబిళ్ళలవలె డోకుకొనును. వమనమైన వెంటనే మగతవచ్చును. నీరసముగానుండును. దంతములు మొలచుకాలములో కలుగు వికారగుణములకును, క్షీరాలసకము (Infantile cholera) లో కలుగు వాంతులకు, విరేచనములకుకూడ బాగా పనిచేయును. దీని కంపములలో (Convulsions) కండ్లు క్రిందికిపోవుట, తల పైకి యెత్తలేకపోవుట, ముఖము దించుకొనిపోవుట, బొటనవ్రేళ్ళు కొంకరలుపోవుట—యీ లక్షణములుండును. దాహముండదు.

## యాంటిమోనియమ్ టార్టారికమ్

ఇది ముఖ్యముగా పిల్లలకు, వయసుముదిరిన పెద్దవారికి బాగా పనిచేయును. ఊపిరితిత్తులమీద అద్భుతముగ పనిచేయును. పిన్నవారిలోగాని, పెద్దవారిలోగాని కఫముపేరుకొని, గొంతుకలో గురగురలాడుచు, ఛాతి నొక్కినట్లుండి, శ్వాసావరోధము కలిగినపుడు, శ్లేష్మము వెలువడక బాధపడునపుడు అమోఘముగా పనిచేయును. ఉబ్బసము, న్యుమోనియా, భోజనానంతరము కలుగు వికారము, వాంతి, పిల్లలలోవచ్చు కోరింతదగ్గు, కళ్ళదగ్గు, కింకవాయువు (Croup)—వీటికన్నిటికి మంచిది. కలరా వ్యాధికికూడ మంచిది. రోగికి నిస్త్రాణ, మగత అధికముగనుండును. పాలవలన రోగ మధికమగుచుండును. మశూచిలో నిది దివ్యౌషధము. ప్రారంభమున వాడినచో మంచి పనిచేయును. పొంగుకుకూడ వాడదగును.

## యాపిస్

ఇది ఉబ్బరోగములకు ప్రధానౌషధము. పిల్లలకు వచ్చు కపాలజలంధరమునకు (Hydrocephalus), జలోదరమునకు దివ్యౌషధము. మూత్రము స్వల్పముగా వెడలుట, దాహము లేకపోవుట—యీ లక్షణములుగల ఉబ్బువ్యాధిలో

బాగాపనిచేయును. విసర్పి, పైత్యపు దద్దుర్లు (Urticaria) మొదలగు చర్మ వ్యాధులకు, 'డిఫ్తీరియా' అను కంఠ వ్యాధికిని మంచిది. దీని బాధలు కుట్టు చున్నట్లుండి మంట లుండును. పిల్లలకు బాధ లేకుండ, అప్రయత్నముగ నగు పలచని విరోచనములకు, టీకాలు వేయుటచే జనించు బాధలకుకూడ వాడ దగును. విడుపు జ్వరములోకూడ పనిచేయును. దీని లక్షణములు తాకుట చేతను, వేడివల్లను, నిద్రపోయి లేచిన పిమ్మటను ఉద్రేకించుచు, చల్లదనమువలన ఉపశమించుచుండును. కర్ణరోగములకు, మశూచిలో కను రెప్పలు పొంగరించి కన్నులు మూసికొనిపోవునపుడుకూడ పనిచేయును.

## ఆర్నికా

ఇది దెబ్బలకును, దెబ్బలవలన శరీర మంతయు నలగగొట్టినట్లుండినను, దెబ్బలచే గలుగు నొప్పులకు, రక్తస్రావములకు, మూర్ఛకు, గాయములచే గలుగు ధనుర్వాతమునకు అమోఘముగ పనిచేయును. దీనిని లోపలికి పైకికూడ వాడ వచ్చును. పిల్లలకు వచ్చు పొడిదగ్గు, కోరింత దగ్గులకుకూడ మంచిది. దగ్గు వచ్చుటకు ముందు పిల్లవాడు యేడ్చును. మరియు దగ్గునపుడు ముక్కునుంచి రక్తముకూడ పడుచుండును. సన్నిపాత జ్వరములో సంధి లక్షణములకు, రోగికి స్మారకము పూర్తిగాలేక మత్తుగా యున్నపుడు, మలమూత్రము లప్రయత్నముగ పోవునపుడు బాగా పనిచేయును. దెబ్బల కారణములచే జీర్ణకోశము చెడిన అగ్నిమాంద్యమునకుకూడ పనిచేయును. గాయముల వలన గలుగు మెనింజిటీస్‌నకు, కండ్ల జబ్బులకు మంచిది. దెబ్బలచే గలుగు తలనొప్పులకు వాడవచ్చును.

## ఆర్సెనికం

ఇది శ్వాసకోశములమీద అద్భుతముగా పనిచేయును. ఉబ్బసమునకు చాల మంచిది. రోగికి ఊపిరాడక, తల పల్లముగా బెట్టి పరుండలేక లేచికూర్చుండును. రాత్రి 1–3 గంటలమధ్య దీని లక్షణము లుద్రేకించుచుండును. రోగికి స్థిమితము లేకపోవుట, నిస్త్రాణ, మంటలుయుండును. శరీరము మంట, దప్పి, ఆహారమం దయిష్టము—ఈ లక్షణములుండును. జీర్ణకోశముమీదకూడ పనిచేయును. ఏ కొద్ది ఆహారము తినినను, ఏమాత్రము పానీయము త్రాగినను కడుపునొప్పి, వాంతియుండును. అతిసారమునకు, గ్రహణికి, సన్నిపాతజ్వరమునకు, మన్యపు జ్వరమునకుకూడ పనిచేయును. దురద, మంట, రసితోకూడియుండు గజ్జి,

ఎగ్జిమా, ఒరుపులు (Chilblains) మొదలగు చర్మవ్యాధులకు, మంటతో కూడియుండు నేత్ర, కంఠ (Diphtheria) రోగములకు, న్యుమోనియా, ఉబ్బసము, క్షయ మొదలగు శ్వాసకాసరోగములకు, రొంపకుకూడ చాల మంచిది. దీని లక్షణములు చలిగాలివలనగాని, చల్లని పానీయమువలనగాని ఉద్రేకించుచు, ఉష్ణోపచారములవలన ఉపశమించుచుండును. ఉబ్బు, జలోదరమునకుకూడ పనిచేయును. దప్పియుండును.

## బాప్టిసియా

ఇది రక్తముమీద బాగుగా పనిచేయును. అపరిశుభ్రమైన జలముత్రాగినను అపరిశుభ్రమైన ఆహారము భుజించినను, ఒకవిధమైన క్రిములచే రక్తముచెడి విషపూరితమగును. అట్టిస్థితిలో ఈ ఔషధమును వాడినచో రక్తమును శుభ్రపరచి శరీరమును బాగుచేయును. కావుననే పైకారణములచే జనించు సన్నిపాతజ్వరము, చలిజ్వరముల కిది అమోఘమైనది. అందు ముఖ్యముగా సన్నిపాతజ్వరమున కిది సంజీవివంటిది. చలి, వణుకు, శరీరమంతయు నలగగొట్టినట్లు నొప్పులు, నిస్త్రాణ, మగత, కునుకులేకపోవుట, యిటుఅటు కొట్టుకొనుట, నిద్రపట్టకపోవుట, ఏదియో గొణుగుకొనుట, జవాబుసరిగా చెప్పలేకపోవుట, తాను రెండుభాగములక్రింద విడగొట్టబడినట్లు చెప్పుట, కడుపుబ్బరము, అతిసారము, మలము, మూత్రము, చెమటకుకూడ వాసన కలిగియుండుట — యీ మొదలగు లక్షణములకన్నిటికి సన్నిపాతజ్వరములో అద్భుతముగా పనిచేయును. మరియు తలనొప్పి, నిస్త్రాణ. మూత్రము జారీగా కాకపోయినపుడు చలిజ్వరములోను, రక్తము విషపూరితమైనపుడు డిఫ్తీరియా వ్యాధిలోను కూడ పనిచేయును.

## బేరిటాకార్బ

ఇది పిల్లలకు చాల ఉపయోగమైన ఔషధము. జ్ఞాపకశక్తి బాగుగాలేని పిల్లలకు, మరుగుజ్జు పిల్లలకు బాగా పనిచేయును. ఈ పిల్లలు మానసికముగను, శారీరకముగను మిక్కిలి నీరసముగ నుందురు. వీరికి శరీర పౌష్టవ ముండదు. తల విపరీతముగ పెద్దదగుట, యితర అవయవము లభివృద్ధిచెందక యుండుట. చిక్కిపోవుట (Marasmus), రికెట్సు, కపాలజలంధరము మొదలగు వ్యాధులకు పనిచేయును. గళగ్రంధి రోగమునకు (Tonsillitis) ప్రధానౌషధము. కంఠమునందలి గ్రంథులు వాచి, చీము పట్టినపుడు పనిచేయును. కొండనాలుక

వాచుటచేతను, గళగ్రంధి రోగమువలనను పిల్లలకు వచ్చు దగ్గులకు మంచిది. ఏమాత్రము చలిగాలి తగిలినను వ్యాధి అధికమగుచుండును. ఇది పీనస రోగము నకుకూడ బాగుగా పనిచేయును.

## బెల్లడోనా

ఇది పిల్లల రోగమునకు కేమోమిల్లా (Chamomilla)తో సమానముగా పనిచేయును. (Belladonna is one of our best remedies in the diseases of children even vieing with Chamomilla.) దీని రోగములు అకస్మాత్తుగ వచ్చుచు పోవుచుండును. ఒక నిమిషము కులాసాగా యుండి రెండవ నిమిషములో సుస్తీగా యుండును. ముఖ మెర్రగాను, వెచ్చగానుండుట ముఖ్య లక్షణములు. రక్తము శిరస్సున కెక్కువగ ప్రవహించుటచే తల వేడిగా నుండును. తలనొప్పి. ఈ నొప్పి ముందుకు వంగినను, పరుండినను అధికమగుచుండును వాపు, నొప్పి, యెరుపులతోకూడి యుండు నేత్రరోగములకు, మూర్ఛలకు, కోరింత దగ్గులకు, చంటిబిడ్డ గుణమునకు, గొంతుక వాచి గుటకవేయలేకపోవు నోటిరోగములకు, డిప్తీరియా, గవదలు, పొంగు, విసర్పి, స్కార్లెట్ జ్వరములకు, మూత్ర మప్రయత్నముగ పడుట, మూత్రబంధనము మొదలగు మూత్ర వ్యాధులకు, న్యుమోనియా ప్రథమ దశలోను, టైఫాయిడ్ జ్వరములో తీవ్రమైన సంధి లక్షణములకు, తలనొప్పితోకూడిన సాధారణ జ్వరములకు బాగుగా పనిచేయును. దీని లక్షణములు సాయంకాలము మూడుగంటలకును, అర్ధరాత్రివేళయందును, పరుండినను ఎక్కువగుచు కప్పుకొని యుండినచో తగ్గుచుండును. ప్రారంభదశలో కురుపులువేయుటకు పూర్వము యెరుపు, వాపు, నొప్పియున్నపుడు దీనిని తక్కువ పొటెన్సీలలోవాడిన వెంటనే హరించును.

## బ్రియోనియా

పిల్లలకు వేసవికాలములో కలుగు ఉడుకు విరేచనములకు బాగుగా పని చేయును. న్యుమోనియాలోను, కఫ్లిదగ్గు (Bronchitis) లోను, ఊపిరితిత్తులు చెడిపోయి, దగ్గుచే బాధపడుచు కఫము వెడలకయున్నపుడు వాడదగును. నోరు ఆర్చుకొనిపోయి దాహ మధికముగనుండును. విరేచనానుమానములేని మలబద్ధమునకు మంచిది. మేహవాతపు నొప్పులకు దివ్యౌషధము. నడుము నొప్పికి పనిచేయును. దీని బాధలన్నియు వేడివల్లను, కదలికవల్లను ఉద్రేకించు

చుండును. జీర్ణకోశముమీద పనిచేయును. వేసవికాలములో అధికముగ భుజించుటవలన కలుగు అజీర్ణమునకు మంచిది. దగ్గు, అజీర్ణముతోకూడిన జ్వరములకు, మలబద్ధము, సంధి లక్షణములతోకూడిన సన్నిపాత జ్వరములకు వాడదగును.

## కేంథారిస్

ఇది మూత్రవ్యాధులకు దివ్యౌషధము. తరుచు మూత్రవిసర్జనకు తొందర కలుగుట, మూత్రద్వారము మంట, మూత్రము స్వల్పముగ బొట్లువలె పడుట మొదలగు లక్షణములతోకూడిన మూత్రకృచ్ఛ్రము, మూత్రబంధనము, అశ్మరి వ్యాధులలో బాగుగా పనిచేయును. పై లక్షణములతోకూడిన కిల్లిదగ్గు (Bronchitis) లో కూడ వాడదగును. ఇంతేగాక యీ గుణములుగల ఏ వ్యాధికైనను పనిచేయును. నీటితోనిండి, మంటతోకూడి, పెద్ద పొక్కులు బయలుదేరు విసర్పి రోగమునకు, దురద, మంటతోకూడిన ఎగ్జిమారోగమునకు అద్భుతముగా పనిచేయును. రక్తవిరేచనములకు మంచిది. వీర్యస్ఖలనమునకు పనిచేయును. ఏ అవయవములోనైనను మంటలున్నపుడు వాడదగును. ఆసనములో, మూత్రద్వారములో, గుండెలలో, నోటిలో, కడుపులో, ప్రేగులలో మంటలున్నపుడు తప్పక దీనిని వాడదగును. కాలినపుండ్లకు, చర్మవ్యాధులకు దీనిని పైకికూడ వ్రాయవచ్చును.

## కార్బోవెజిటాబిలిస్

ఇది జీర్ణకోశముమీద అద్భుతముగా పనిచేయును. కడుపు వాయుపూరితమై, ఉబ్బరముగాను, నొప్పిగా నుండును. త్రేణుపులు వచ్చుచుండును. త్రేణుపులవలన ఉబ్బరము కొంత తగ్గుచుండును. మలబద్ధము లేక అతిసారము. ముఖ్యముగా బలహీనులైన పిల్లలలో కలుగు దుర్వాసనతో కూడియున్న విరోచనములకు పనిచేయును. ఆహారమందయిష్టము. ముసలివారిలో వచ్చు ఉబ్బసము కళ్లిదగ్గులకు మంచిది. క్షయవ్యాధిలో ఆఖరుదశలో వాడవచ్చును. చలి ఎక్కువగానుండి కాళ్ళు చేతులు చల్లబడినపుడు చలిజ్వరములో పనిచేయును. చిగుళ్ళనుంచి, మూత్రద్వారము నాసికా ద్వారములనుంచి కలుగు రక్తస్రావములకు మంచిది. ప్రాణపోషక రసములు నశించి రోగి క్షీణించియుండు పాండురోగములకు, దురద, మంట, నెత్తురుతోకూడిన గజ్జికి, చెవిలోచీముకు, చెముడుకు కూడ వాడదగును. ఏరోగముయొక్క చివర దశలోనైనను శరీర

మంతయు చల్లబడి, రోగి కదలలేక చనిపోయినట్లు పడియుండి, చల్లని చెమటలు పోయుచు, చల్లని ఊపిరితీయుచు, స్వరహీనమై, నాలుక చల్లబడియున్న మహావాతములలో అద్భుతముగా పనిచేయును. ఆమ్ల పిత్తమునకు (Acidity) ఆధ్మానమునకు (flatulence) దివ్యౌషధము. దీనికి మించినది మరియొకటిలేదు. ఈ రోగి తరుచు విసరమని కోరుచుండును.

## కేమోమిల్లా

ఇది బాలరోగములకు ప్రధానౌషధము. తరుచు ఏడ్చుచు, ఎత్తుకొనినచో ఊరకుండు పిల్లలకును, కారణము లేక కోపపడి ఏడ్చుపిల్లలకును, ఒకచెంప వేడిగా, ఎర్రగాను, రెండవచెంప చల్లగా పాలిపోయినట్లుండు పిల్లలకు కలుగు విరోచనములకేగాక, యితర దుర్గుణము లన్నిటికి అద్భుతముగా పనిచేయును. ఈ విరోచనములు కోడిగ్రుడ్డువాసనగలిగి, ఆకుపచ్చగాను, పల్చగ నుండును. కడుపునొప్పి, పీనస, శీతకాలములోవచ్చు దగ్గులకు, చంటిబిడ్డగుణము, చలిగాలి వలన కలుగు కర్ణరోగములు, పండ్లరోగములు, కోపముచే నిద్రరాకపోవుట, కళ్లిదగ్గు, కాసెర్లు—యీ వ్యాధులన్నిటిలోను పిల్లలకు బాగా పనిచేయును. రాత్రు లధికమగు మేహవాత నొప్పులకు మంచిది. రాత్రులు నిద్రలో పిల్లలకు వచ్చు పొడిదగ్గునకును, కోపకారణముచే కలుగు యేవ్యాధికైనను బాగా పనిచేయును. ఈ రోగికి స్థిమిత ముండదు. నిద్ర పట్టదు. చలిగాలి భరించలేడు. చలిగాలివలన జనించు బాధ లన్నిటికి మంచిది. కాఫీ మొదలగునవి వాడుట వలన కలుగు దుర్గుణములను బోగొట్టును.

## చైనా

ఇది రక్తస్రావములకు బాగా పనిచేయును. రక్తస్రావమువలనగాని, ప్రాణపోషకద్రవములు నష్టపోవుటవలనగాని, శుక్లనష్టమువలనగాని కలుగు ఉబ్బు, పాండురోగములకు (anaemia) నిస్సత్తువునకు అద్భుతముగా పనిచేయును. నిస్సత్తువచే కండ్లు చీకట్లు క్రమ్ముట, చెవిలో హోరు, ధ్వనులు ఉండును. పిల్లలు ముష్టిమైధునమునకు లోనై, శుక్లనష్టము, నపుంసకత్వము మొదలగు వ్యాధులను దెచ్చిపెట్టుకొందురు. అట్టివాటికి బాగుగా పనిచేయును. పొత్తి కడుపు వాయుపూరితమై, ఉబ్బరము, నొప్పియుండును. త్రేణుపులవలన ఉబ్బరము తగ్గదు. ఆహారము సరిగా పచనముగాక అజీర్ణ పదార్థముతో కూడిన పసుపుపచ్చని నీళ్ళ విరేచనములకు మంచిది. విరేచన సమయములో నొప్పి

యుండదు. వాయు వధికముగ వెడలు చుండును. మరియు కార్జము, ప్లీహము, పెద్దపగుటచే కలుగు వ్యాధులన్నిటికి పనిచేయును. కామెర్లకు మంచిది. దినమువిడిచి దినమువచ్చు మన్యపుజ్వరములలో అన్ని అవస్థలలోను పనిచేయును. చలి, వణుకు, నిద్రలో చెమట ఉండుట. పిల్లలకు దీర్ఘకాలము స్తన్యపానముచేయుటచే కలుగు దుర్బలత్వమునకు అమోఘముగా పనిచేయును.

## సిక్యూటా విరోసా

ఇది బాలురకు వచ్చు వాతరోగములకు బాగా పనిచేయును. పిల్లలు స్మృతి లేక పడియుండు కంపములలో వాడదగును. మూర్ఛ, చంటిబిడ్డగుణము, అపస్మారములకు మంచిది. నడుము ధనస్సువలె వంగి, నోటినుండి నురగలుకారు ధనుర్వాతమునకు ప్రధానౌషధము. అజీర్ణమువలనగాని, దెబ్బలవలనగాని, క్రిములవలనగాని కలుగు పై వ్యాధులకు పనిచేయును. ఎగ్జిమా మొదలగు చర్మ వ్యాధులలోకూడ పనిచేయును. ముఖముమీద, తలమీద పసుపుపచ్చని చీముతోకూడిన పొక్కులకు మంచిది.

## సినా

"It is of great advantage to us Homoeopaths to cure the little patients." —*Nash.*

ఇది బాలరోగములను కుదుర్చుటకు మిక్కిలి ఉపయోగకారి. ఇది ఆంత్రములమీద బాగా పనిచేయును. బాలురకు కలుగు క్రిమిరోగమునకు ప్రధానౌషధము. ముక్కు, ఆసనము దురద, నిద్రలో పండ్లుకొరుకుట, ఉలికిపడుట సరియైన నిద్రలేకపోవుట, కలతనిద్ర, వట్టి గుటకలువేయుట, ఒకప్పుడు అధికమైన దొంగఆకలి, ఒకప్పుడు అసలు ఆకలిలేకపోవుట, మూత్రము తెలుపు, తరుచు మూత్రవిసర్జన—యీ మొదలగు క్రిమిలక్షణములకు మంచిది. పిల్లవాడేదియో కావలెనని కోరుచుండును కాని చెప్పలేక ఎక్కువగా ఏడ్చుచుండును. ముఖము ఒకప్పుడు ఎర్రగా, వెచ్చగాను, చెంపలు గోధ్రగానుండును. ఒకప్పుడు ముఖము పాలిపోయి కండ్లచుట్టు చక్రములవలె కనపడుచుండును. క్రిములవలన గలుగు శూల, అతిసారము, శయ్యామూత్రము, చంటిబిడ్డగుణము, కోరియా మొదలగు వ్యాధులకు బాగా పనిచేయును. కోరింతదగ్గుకు మంచిది.

## కుప్రమ్

ఈడ్పులకు (Spasms), తిమ్మెరలకు (Cramps), కంపములకు (Con-

vulsions) ప్రధానౌషధము. కలరా మొదలగు వ్యాధులలో కాళ్లు, చేతులు తిమ్మెరలుగానుండి లాగుచుండుట, కోరింత దగ్గులో శిశువు కొయ్యబారి, ఊపిరాడక ఉక్కిరిబిక్కిరియగుట, కాళ్లుచేతులు మెలివేసుకొనుట, స్మృతిలేక పడియుండుట, స్మృతి వచ్చిన పిమ్మట వమనమగుట, చంటిబిడ్డగుణము, కోరియా, మూర్ఛ, ధనుర్వాతము, మెనింజిటీస్ మొదలగు వ్యాధులలో కలుగు యీడ్పులకు, కంపములకు, స్కార్లెట్ జ్వరములలోనుకూడ బాగా పని చేయును. దీని యీడ్పులు వ్రేళ్ళయందు ప్రారంభించి శరీర మంతయు వ్యాపించును.

## కాల్కేరియా కార్బ

ఇది పిల్లలకు ముఖ్యముగా వాడవలసిన ఔషధము. పిల్లలకు పండ్లు ఆలశ్యముగ వచ్చుట, యెముకలు బలహీనముగనుండి, పిల్లవాడభివృద్ధి చెందక, అంగసౌష్టవములేక చాలకాలమువరకు నడవలేకయుండు రికెట్సు వ్యాధికిని, కాళ్లు, చేతులు సన్నగిలి శుష్కించి, చిక్కిపోవునపుడును (Marasmus) మట్టి, సుద్ద మొదలగునవి తినుటచే పిల్లలకు కలుగు అజీర్ణము, పాండురోగమునకును, పెరుగుబిళ్ళలవలె వెళ్లు వమనములకు, పాలుత్రాగిన వెంటనే తెల్లగ పలచగ వెళ్లు విరేచనములకు, కండ్లకలకకు, దీర్ఘకాలము స్తన్యపానముచేయుటచే జీర్ణశక్తి చెడిపోయి దుర్బలులగు పారి గర్భికరోగమునకు, క్షయరోగమునకు, గండమాల రోగమునకు, కపాలజలంధరమునకు (Hydrocephalus), మలబద్ధమునకు, కామెర్లకు, కుక్కముండ్లు (Urticaria) మొదలగు చర్మ వ్యాధులకు బాగా పనిచేయును. ఈ రోగి మలబద్ధ మున్నపుడే ఖులాసాగా వుండును. రోగికి శరీరమంతయు పుల్లని వాసన గలిగియుండును. దంతములు మొలచు సమయములో పిల్లలకు వచ్చు సమస్త రోగములకు దివ్యౌషధము. మంచి రసాయనము.

## డ్రోసిరా

ఇది కోరింతదగ్గునకు ప్రధానౌషధము. పిల్లవాడు రాత్రి పరుండిన వెంటనే యెక్కువగుచు, ఊపిరి ఆడక బాధించుచుండును. కొంతసేపు బాధించిన పిమ్మట చివర వమనమువచ్చిన దగ్గు ఆగుచుండును. ఒకప్పుడు ముక్కునుండి, నోటినుండికూడ రక్తము పడుచుండును. పొంగు పడినపిమ్మటవచ్చు దగ్గులకు, రక్తపుజీరతోకూడిన దగ్గులకు, రొంప, తుమ్ములున్నపుడు పనిచేయును.

## యూఫ్రేషియా

ఇది కండ్లజబ్బులకు ప్రధానౌషధము. కండ్లు మంటలు, నీరు కారుట, దురద ఎరుపు, ఒరుచుట, వెలుతురు జూడలేకపోవుట, రెప్పలు మూతలుపడుట, కండ్లు పుసులు,—యీ మొదలగు లక్షణములకు అద్భుతముగా పనిచేయును. పువ్వులకుకూడ మంచిది. రొంపపట్టి వచ్చుదగ్గు, తుమ్ములకు, కండ్లనుంచి నీరు కారుచున్నపుడు, పొంగు పడినపిమ్మటవచ్చు దగ్గులకు పనిచేయును. దీని దగ్గు పగలధికమగు చుండును.

## జెల్‌సిమియమ్

ఇది నరముల బలహీనతగలవారికిని, పిల్లలకును బాగుగా పనిచేయును. ఈ బలహీనతచే ధైర్యములేక యితరులతో మాట్లాడుటకు కూడ భయపడు చుండును. పిల్లవాడు పడిపోవుదునను భయముచే కేకలువేయుచు తల్లినిగాని, దాదినిగాని గట్టిగా కౌగలించుకొనును. ఎక్కువ వణుకు యుండును. చలితో కూడిన వణుకు కాదు. వణుకుచే రోగి యేదైన ఆధారముగ పట్టుకొనవలెనని యుండును. వణుకుకు ముఖ్యౌషధము. వాత రోగములకు (Nervous diseases) దివ్యౌషధము. కావుననే చంటిబిడ్డగుణము, మూర్ఛ, అపస్మారము, కోరియా మొదలగు వ్యాధులలో బాగుగా పనిచేయును. మూత్రనాళముల బలహీనతచే మూత్ర మప్రయత్నముగ పడుట (Eneuresis), పిల్లలకు తగ్గుచు, హెచ్చుచువచ్చు జ్వరమునకు (Remittent fever), వణుకుతో కూడిన జ్వరములకు, మనోపరిశ్రమవల్లను, ఎండవేడిమివల్లను అధికమగుచు, మూత్రము జారీగాఅగుటచే తగ్గు తలనొప్పులకును, అధైర్యముచేతను, భయముచేతను కలుగు విరేచనములకును మంచి పనిచేయును.

## గ్రాఫైటిస్

ఇది చర్మవ్యాధులకు బాగుగా పనిచేయును. ఈ చర్మవ్యాధులుగల పిల్లలు రాత్రులు పక్కలో మూత్రవిసర్జనచేయుచుందురు. ఎగ్జిమావ్యాధి (మంత్రము)కి ప్రధానౌషధము. పొక్కులనుంచి తేనెవలె చిక్కని స్రావమున్నపుడును, పొక్కు లెక్కువగా నెత్తిమీద, ముఖముమీద, మర్మస్థానములయందు, చెవి వెనుకభాగమున బయలుదేరినచో మంచి పనిచేయును. పగుళ్లకు, దురదకు, పుప్పిగోళ్లకు, విసర్పికి మంచిది. జఠరకోశముమీదకూడ బాగుగాపనిచేయును. మలబద్ధమునకు దివ్యౌషధము. కడుపునొప్పి, పులిత్రేణుపులు, మలము ఉండ

లుగా పడుట, దుర్వాసనగల అజీర్ణ విరేచనములు, చెవినుంచి వాసనతో కూడిన స్రావము—వీటికి పనిచేయును. చర్మవ్యాధులచే వృషణములు వాచి పెద్దవగునపుడు పనిచేయును.

## హెపారుసల్ఫ్

ఇది పిల్లల జబ్బులలో చాల ప్రాముఖ్యమైన ఔషధము. ఇది ముఖ్యముగా గొంతుకరోగములలోను, గ్రంధులమీదను, చర్మరోగములమీదను, శ్వాస కోశముమీదను, జీర్ణకోశముమీదను అమోఘముగా పనిచేయును.

కురుపులు, పుండ్లు, కాల్పులు, గోరుచుట్టు, వ్రణములు, గ్రంధులు—యేవి యైనను చీముపట్టుట ప్రారంభించినచో దీనిని తప్పక వాడవలెను. చీముపట్టిన పొక్కులతోకూడిన సర్పి, చీము, నెత్తురుతోకూడిన మంత్రపు పొక్కులు (eczema), చీముతోకూడిన గజ్జికురుపులు, చీముపట్టిన స్థితిలో గళగ్రంధి రోగమునకు, గండమాలవ్యాధి, చన్నులువాచి చీముపట్టుట, చెవిలో దుర్వాసనగల చీముకారుట మొదలగు వ్యాధులలోను; గవదకాయలు పెరుగుట (tonsils) చలిగాలి తగులుటచే జలుబుచేసి, రొంపపట్టి, ముక్కులు దిబ్బడ వేసి, కళ్లిరాక, ఉదయమున అధికమగు దగ్గుతోకూడిన కింకవాయువు, ప్రారంభదశలో రక్తమిశ్రమమైన కఫముతోకూడిన క్షయ, చలిగాలిలో అధిక మగుచు, తేమతోకూడిన వర్షకాలములో ఉపశమించు ఉబ్బసము, కళ్లిదగ్గు, బొంగురుకంఠము మొదలగు శ్వాసరోగములలోను, దీర్ఘ అజీర్ణ రోగములోను అద్భుతముగా పనిచేయును. ఈ అజీర్ణ రోగి పుల్లని పదార్థములను కోరుచుండును. పిల్లవానియొక్క విరేచనమేగాక శరీరమంతయు పుల్లనివాసన కలిగి యుండును. విరేచనము బహుకష్టముమీద అగుచుండును. మరియు మూత్రము కూడ కొద్దికొద్దిగా స్రవించుచు, ఎంతసేపటికిని పూర్తిగాక యింకను మిగిలి పోయినట్లుండును.

ఈ రోగి తాకుడు, నొప్పి, చలిగాలి యెంతమాత్రమును భరించలేడు. (Hypersensitiveness to touch, pain and cold air). ఇదియే ఈ ఔషధమునకు ముఖ్యలక్షణము. కురుపులలోను, వ్రణములలోను దీనిని హెచ్చుపొటెన్సీలో ప్రారంభమున వాడినచో ఎదగకుండచేయును. తక్కువ పొటెన్సీలో నిచ్చిన త్వరలో చితికి మానిపోవును.

## ఇగ్నేషియా

ఇది నరముల బలహీనతగలవారికి బాగుగా పనిచేయును. వాతరోగములకు

(Nervous diseases) దివ్యౌషధము. నరముల బలహీనతచేతను, భయము చేతను, విచారముచేతను కలుగు కంపములకు, ఈడ్పులకు మంచిది. కావున దీనిని చంటిబిడ్డ గుణము, మూర్ఛ, అపస్మారము, కోరియా మొదలగు వ్యాధులలో ముఖ్యముగ వాడదగును. విరేచన సమయమందెక్కువ బాధయుండును. గ్రహణిలో బాలుడేమాత్రము తినికినను మలాశయము పైకి వచ్చునపుడు అద్భుతముగా పనిచేయును. విచారమువలన, భయమువలన నిద్రపట్టనపుడును, మలేరియా జ్వరములోను, మూత్రబంధనమునకు, ఎక్కిళ్లకు, మనోపరిశ్రమ వలన కలుగు తలనొప్పికికూడ వాడదగును.

## ఇపెకాక్

ఇది శ్వాసకోశములమీదను, జీర్ణకోశములమీదనుకూడ బాగుగా పని చేయును. దగ్గు, కోరింతదగ్గు, ఉబ్బసము, కఫ్లిదగ్గు, క్షయ మొదలగువాటికి దివ్యౌషధము. రొమ్ములు బిగబట్టుట, గొంతుకలో పిల్లికూతలు, దగ్గుచే ఉక్కిరిబిక్కిరియై పిల్లవాడు బాధపడుట, కొయ్యబారుట—ఈ లక్షణములకు మంచిది. చలిజ్వరమునకు, ముక్కు, నోరు, ఆసనము, ఊపిరి తిత్తులనుంచి రక్త స్రావములకు ప్రధానమైనది. పొంగులోకూడ పనిచేయును. పిల్లలలో గ్రహణికి ముఖ్యౌషధము. కడుపునొప్పితో కూడియుండు విరేచనములకు మంచిది. కడుపుబ్బరము, త్రేణుపులు యుండును. త్రిప్పు, వికారము, వమనము వచ్చినట్లుండుట—ఇవి దీనికి ముఖ్యలక్షణములు. వికారము, వాంతితోకూడియుండు ఏ రోగమునకైనను వాడవచ్చును.

## కాలీబైక్

ఇది బలిసియున్నవారికి, త్వరలో జలుబుచేయు పిల్లలకు పనిచేయును. పిల్లలకు ముక్కునుండి చిక్కని జిగురువంటి తీగెలుసాగు స్రావమున్నపుడును, నోటినుంచి చిక్కని జిగురువంటి తీగెలుసాగు కఫము వెడలునపుడును, ఆసనమునుంచి జిగురువంటి ఆమము పడునపుడును అద్భుతముగా పనిచేయును. కావున యీ లక్షణములుగల దగ్గు, కోరింతదగ్గు, కఫ్లిదగ్గు, పీనస, కింకవాయువు, న్యుమోనియా మొదలగు వ్యాధులలో తప్పకవాడదగును. పొంగు, గళగ్రంధిరోగమునకుకూడ పనిచేయును. కఫ్లిదగ్గుకు (Bronchitis) ప్రధానౌషధము. మరియు భోజనమైన పిదప నొప్పి, బరువుగలిగి తీగెలవంటి పదార్థము వమనమగునపుడుకూడ వాడదగును. దీనిబాధ లకస్మాత్తుగ వచ్చిపోవుచు

ఒకచోటినుంచి మరియొకచోటికి మారుచుండును.

## లైకోపోడియం

ఇది ముఖ్యముగా జీర్ణకోశముమీదను, శ్వాసకోశముమీదను పనిచేయును. ముసలివారికి, పిల్లలకుకూడ మంచిది. దీనిని తరుణవ్యాధులలోకంటె దీర్ఘవ్యాధులలో యెక్కువగ వాడుదురు. తరుణవ్యాధులలోకూడ మంచిదే. జీర్ణశక్తి క్షీణించి పిల్లలు చిక్కిపోయి ముసలివారివలె అగుపడునపుడు బాగా పని చేయును. దీర్ఘ అజీర్ణరోగులకు, కడుపు వాయుపూరితమై పొంగరించి, ఉబ్బరముగానుండి, గురగురలాడునపుడు, మలబద్ధమునకు, కాలేయమునకు సంబంధించిన కామెర్లు మొదలగు వ్యాధులకు, ముక్కులు దిబ్బడవేసి ఊపిరి సలుపకుండు పీనసరోగమునకు, ఊపిరితిత్తులుచెడిపోయి బాధించుదగ్గు, న్యుమోనియా క్షయ మొదలగు వ్యాధులకు, మూత్రకృచ్ఛ్రము అశ్మరి, మూత్రములో ఎర్రని యిసుకయుండుట మొదలగు మూత్రరోగములకు, మలేరియా జ్వరములకు, శిశువులకు గజ్జలలో, చంకలలో మలినముచే దురద, మంట, రసికారు పొక్కులు బయలుదేరు అహిపూతనము మొదలగు చర్మవ్యాధులకు, రాత్రులు నిద్రపట్టకపోవునపుడు, డిఫ్తీరియా, గళగ్రంధి రోగములకు, కర్ణరోగములకు వాడదగును. పిల్లలు దుస్సహవాసముచే ముష్టిమైధునమునకు అలవాటుపడి పుంసత్వమును బోగొట్టుకొని జీవితసౌఖ్యమును లేకుండ చేసుకొందురు. అట్టి వారికి అద్భుతముగ పనిచేసి సంభోగశక్తి నొసంగి ప్రాణదానముచేయగల దివ్యౌషధము. దీని బాధలన్నియు సాయంత్రము 4 మొదలు 8 గంటలవరకు అధికమగుచు, కుడివైపున ప్రారంభించి, యెడమవైపుకు వ్యాపించును. ఈ రోగి చీకటికి భయపడుచుండును. ప్రతిపనియు- భోజనము, నడక మొదలగు నవన్నియు తొందరగా చేయుచుండును.

## మెర్క్యూరియస్

ఇది నోటిజబ్బులకు ప్రధానౌషధము. నోరు పూత, పుండ్లుపడుట, పుండ్లు రసికారుట, మంట, నోరు దుర్వాసన, నోటినుండి నీరధికముగ కారుట, పండ్లు పోటు, పుప్పిపళ్లు, పండ్లు కదలుట, చిగుళ్ళ బాధ—ఈ మొదలగువాటికి దివ్యౌషధము. మరియు కొండనాలుక పెద్దదగుట, గళగ్రంధిరోగము, గండమాల, డిఫ్తీరియా, పీనస, గుటకవేయలేకపోవుట వీటికి చాలామంచిది. ఇంతేగాక గవదలకు ప్రధానౌషధము. గ్రహణికి ముఖ్యౌషధము. ఆసనము తీపు,

మలాశయము పైకివచ్చుట, ఆకుపచ్చని విరేచనములు—వీటికి పనిచేయును. చెవిలో చీము, పోటు, రక్తస్రావము, చెముడు మొదలగు కర్ణరోగములకు, చంటిబిడ్డగుణము, నేత్రరోగములు, ఎగ్జిమా, కామెర్లు, స్కార్‌లెట్ జ్వరములో కలుగు నోటిపుండ్లు, పొడిదగ్గు, పిల్లలకు దంతములువచ్చు సమయములో కలుగు విరేచనములు, రాత్రులు మాత్రమధికముగ ఎక్కువసార్లు విడుచుట, స్కర్వీ, ఆటలమ్మ—వీటి కన్నిటికి బాగాపనిచేయును. ఇదిచాలా ఉపయోగకరమైన ఔషధము.

## నక్సువామికా

జీర్ణకోశమునకు సంబంధించిన వ్యాధులకన్నిటికి అద్భుతముగ పనిచేయును. జీర్ణదోషముచే కలుగు దగ్గు, కోరింతదగ్గు, తలనొప్పి, జ్వరము, కడుపునొప్పి, మలబద్ధము మొదలగువాటికిని, సోమరితనము, ముష్టిమైధునము, అతిజారత్వము, కాఫీ, పుగాకు, మత్తుపానీయములు, అతిభోజనము, వీటివలన కలుగు అజీర్ణము, మలబద్ధమునకు దివ్యౌషధము. ఇవిగాక రొంప, పొడిదగ్గు, అపస్మారము, మూర్ఛ, చంటిబిడ్డ గుణము, కోరియా, నాభిగుదకము, ఉబ్బసము, కామెర్లు, నిద్రలేకపోవుట మూత్ర మప్రయత్నముగ పడుట—యీ మొదలగువాటికి కూడ పనిచేయును. అల్లోపతి ఔషధము లెక్కువగ వాడినవారికి ప్రథమమున దీనిని ముఖ్యముగ విరుగుడుగ వాడదగును. మనోపరిశ్రమ అధికముగ చేయువారికి బాగా పనిచేయును. దీనిని ముఖ్యముగ రాత్రి పరుండబోవునపుడు వాడినచో మంచి పనిచేయును.

## ఓపియమ్

ఇది పిల్లలకు బాగా పనిచేయును. మలబద్ధమునకు ముఖ్యౌషధము. మలము నల్లని వుండలుగా మేకపెంటికలవలె వెళ్ళునపుడు బాగా పనిచేయును. జీర్ణశక్తి చెడిపోయి, పిల్లలు చిక్కిపోయి, ముసలిరూపము కలిగియున్నపుడు మంచి పనిచేయును. మగత అధికముగనుండి నిద్ర పట్టకపోయినను, మగతతో కూడియున్న మూర్ఛ, చంటిబిడ్డ గుణము, రుద్రవాతము, యీడ్పులు మొదలగువాటికి మంచిది. మూత్రబంధనమునకు కూడ పనిచేయును. నాభిగుదకమునకు వాడదగును.

## ఫాస్ఫరస్

ఇది శ్వాస కోశములమీద అద్భుతముగా పనిచేయును. రాత్రియందును,

ఎడమప్రక్క పరుండినను అధికమగుచు, కుడివైపున పరుండినచో ఉపశమించు సాధారణ దగ్గులకు, కింక, కోరింతదగ్గు, ఉబ్బసము, క్షయ వ్యాధులకు మంచిది. శ్వాసకోశములు చెడిపోయియుండు టైఫాయిడు, న్యుమోనియా జ్వరములలోకూడ వాడదగును. గొమ్ముమీద బరువు పెట్టినట్లుండి బిగపట్టియుండును. మరియు చిమ్మలి గొట్టములోనుంచి వచ్చినట్లు విరేచనములగుట, విరేచనములలో సగ్గుబియ్యపు పలుకులవలె పడుట, సన్నగా, పొడుగుగా, గట్టిగా కుక్క మలమువలె పడు మలబద్ధము, విరేచనానంతరము మలాశయము మంట——వీటికి పనిచేయును. నపుంసకత్వము, ముక్కునుండి రక్తము పడుట, రొంప, తుమ్ములు, పీనస, రికెట్సు వీటికిమంచిది. పులిత్రేణుపులు, దప్పియుండును. రాత్రులు ఆకలి అధికముగ నుండును.

## పోడోఫిల్లమ్

వేసవికాలములోను, ఉదయమున, పిల్లలకు దంతములు మొలచు సమయములోను కలుగు విరేచనములకు మంచిది. క్షీరాలసకము (అనగా పిల్లలకు కలుగు కలరా విరేచనములు) లో అద్భుతముగ పనిచేయును. దీని విరేచనములు పెద్దవిగను, వాసనగయుండును. గ్రహణిలోకూడ మంచిది. విరేచనకాలమందు గాని, ముందుగాని మలాశయము వెలుపలికి వచ్చుచుండును. కడుపులోను, ప్రేగులలోను గురగురలాడుచుండును. పిల్లలు రాత్రులు నిద్రలో పండ్లు కొరుకుట, పండ్లచిగుళ్ళు నొక్కుట వీటికిమంచిది. కామెర్లకు బాగాపనిచేయును. పిల్లలు పాలు వమనముచేసుకొనుట మూలుగుట, కండ్లు సగము మూతలు పడుట——ఈ లక్షణములకు వాడవలయును.

## పల్సటిల్లా

ఇది ముఖ్యముగా క్రొవ్వుపదార్థములు అనగా పాలు, వెన్న మొదలగునవి భుజించిన పిమ్మట కలుగు అజీర్ణ రోగమునకు బాగా పనిచేయును. జఠర సంబంధమైన దోషములకు మంచిది. ఇది స్త్రీలకు పిల్లలకు బాగాపనిచేయును. కడుపులో గురగురలాడుట, పొత్తికడుపులో బాధ, వమనము, అతిసారము నకు మంచిది. మరియు రొంప, ముక్కులు దిబ్బడవేయుట, రుచి తెలియక పోవుట, నిద్రలో మూత్రవిసర్జనమగుట, పిల్లలకు పొంగులోను, పొంగుపడిన పిమ్మట కలుగు చెవిలోచీము, చెముడు మొదలగు కర్ణరోగములు, ఎక్కిళ్ళు, ఒకచోటనుంచి మరొకచోటికి తరుచు మారుచుండు మేహవాతపు నొప్పులు,

తరుచు రంగుమారు విరేచనములు—వీటికన్నిటికి పనిచేయును. రోగికి ఉదయమున నోరు దుర్వాసన కలిగియుండును.

## రూస్‌టాక్సు

పిల్లలకుగాని, పెద్దలకుగాని కలుగు చర్మవ్యాధుల కన్నిటికి చాలామంచిది. శరీరము దురద, నీరుతోగూడిన పొక్కులు, మంటయుండు సర్పి, ఎగ్జిమా మొదలగు చర్మవ్యాధులకును, కంటిరెప్పలు వాచి యెర్రగానుండుట, మంటలుండుట, రాత్రులు కండ్లంటుకొనుట, వెలుతురు జూడలేకపోవుట మొదలగు నేత్రరోగములకును, దీర్ఘ రొంపలకును, కుదురులేకయుండు సంధి, విరేచనములతో కూడిన సన్నిపాత జ్వరములకును బాగుగా పనిచేయును. మశూచికములోగూడ వాడదగును. మేహవాతపు నొప్పుల కద్భుతముగ పనిచేయును. దీని నొప్పులు కూర్చుండినపు డధికమగుచు కదలినచో శాంతించుచుండును. ఇది గ్రహణిరోగమునకుకూడ పనిచేయును. వాతజ్వరములకు, దగ్గుతోకూడిన చలిజ్వరములకు మంచిది.

## సేబాడిల్లా

ఇది పిల్లలకు అద్భుతముగా పనిచేయును. క్రిమిలక్షణములుగలిగి పొత్తి కడుపు నొప్పితో కూడియుండు విరేచనములకు, జ్వరమునకు, కంపములకు పనిచేయును. విడుపు జ్వరములో చలిదశలో వాడదగును. ముక్కునుండి యెడతెగకుండ నీరుకారుచుండు రొంపలకు, జలుబులకు, తుమ్ములకు, దివ్యౌషధము. కంటి రెప్పలు యెర్రగానుండుట, నీరు కారుట. మంటయుండుట— వీటికి మంచిది. నోటినుండి నీ రెక్కువగా కారుచుండును. పొంగులోకూడ పనిచేయును. ఉబ్బసమునకు మంచిది. రాత్రులు సరిగా నిద్రపట్టదు.

## స్పాంజియా

ఇది పిల్లలకు శ్వాసకోశములమీద అద్భుతముగా పనిచేయును. పిల్లలకు రాత్రులు ఊపిరి సలుపక ఉక్కిరిబిక్కిరియై వచ్చుచు, బుసకొట్టు ధ్వనిగలిగి యుండు దగ్గులకు అమోఘమైనది. ఈ లక్షణములుగల కింకవాయువు (Croup) నకు ప్రధానౌషధము. ఉక్కిరిబిక్కిరియై పిల్లవాడు నిద్రనుంచి లేచి కూర్చుండును. ఈ దగ్గు మాట్లాడినను, చదివినను, గుటకవేసినను తల పల్లముగా బెట్టి పరుండినను, శీతగాలివలనను అధికమగుచుండును. 'Goitre' అనగా గొంతుకవద్ద బయలుదేరు కాయలకుకూడ బాగా పనిచేయును.

## స్ట్రామోనియమ్

ఇది వాతరోగములలోను (Nervous diseases) సంధి జ్వరములలోను అద్భుతముగా పనిచేయును. దీని సంధిలో నవ్వుట, యేడ్చుట, అతి ప్రేలాపన యుండును. ముఖము యెఱ్ఱగానుండుట, ఒంటరిగా నుండుటకు భయపడుట, తలగడమీదనుంచి తలనెత్తుచుండుట, కంటిపాపలు పెద్దవగుట, విరేచనములు, లేక విరేచన మూత్ర బంధనములు; చేతులు, కాళ్ళు చల్లబడుట—యీ లక్షణము లుండును. కోరింతా వ్యాధికి మంచిది. చంటిబిడ్డగుణములో మంచిపనిచేయును. దీని యీడ్పులు (convulsions) ప్రకాశమాన మైన వెలుతురును జూచినచో అధికమగుచుండును. ఎన్ని వికార గుణము లున్నను బాధ లేకపోవుట దీనికి ముఖ్య లక్షణము.

## సల్ఫర్

ఇది సకల విధములైన చర్మ వ్యాధులకు, దీర్ఘ వ్యాధులకు మంచిది. స్నానముచేయుటకుగాని, శరీరము కడుగుకొనుటకుగాని భరించలేని పిల్లలకును, చర్మవ్యాధులచే బాధపడుచు, అపరిశుభ్రముగా నుండువారికిని బాగుగా పని చేయును. ఈ ఔషధమునకు మంట ముఖ్య లక్షణము. శరీరము దురద, గోకి నచో మంట, మలవిసర్జన సమయమందు మలాశయము దురద, మంట, కాళ్లు, చేతులు మంట, గుండెలలో కడుపులో మంట, కండ్లు దురదలు, మంట, నీరు కారుట; ఎరుపు, రొంప; ముక్కులు వాచుట, దురద, మంట; నెత్తిమీద పొక్కులు, దురద, మంట; గొంతుకలో నొప్పి, మంట; కాలే యము, ప్లీహము పెద్దదగుట; కాలేయము నొప్పి; పొత్తికడుపు నొప్పి; కడు పుబ్బరము; కడుపులో పోట్లు, అపానవాయువు లధికము. ప్రాతఃకాల మున అగు విరేచనము. ఆయాసము, గుండెలలో బరువు, రాత్రి దగ్గు; ఛాతి బిగపట్టుట, మంట, ఉబ్బసము, యితర శ్వాసకోశములకు సంబంధించిన వ్యాధులు; కోరింతదగ్గు, క్షయ, గండమాల, అజీర్ణము, మలబద్ధము, గ్రహణి, మూత్ర వ్యాధులు; వాతరోగములు అనగా మూర్ఛ, అపస్మారము, కంప ములు—ఈ మొదలగు వ్యాధులన్నిటికి పనిచేయును. అల్లోపతి ఔషధములను యెక్కువగా వాడినవారికి దీనిని ముందు యివ్వవలెను.

## స్టాఫీసేగ్రియా Staphysagria.

పొట్ట వికారముగా పెరిగి వికృతరూపముగల పిల్లలకు బాగా పనిచేయును. పిల్లలు పాలుత్రాగినచో అధికమగు కడుపునొప్పికి మంచిది. ఆకలి ఎక్కువ

మూత్రవిసర్జన చేయకపోయినను మూత్రద్వారము మంట, ముష్టిమైథునముచే
కలుగు దుర్గుణములకు అమోఘముగా పనిచేయును. కంటిరెప్పలమీద బయలు
దేరు కాయలకు (Sties) ను, రెప్పలమీద, శిరస్సుమీద, చెవిప్రక్కన రసి
కారుచు బయలుదేరు ఎగ్జిమా మొదలగు చర్మవ్యాధులకును, తలలో పేలకు,
కింకవాయువు (Croup) నకు కూడ బాగుగా పనిచేయును. బాలురలో
పండ్లు త్వరలో చెడిపోవునపుడు వాడదగును. పిల్లలు ఉదయమున విశేష
ముగా ఏడ్చుచు, ఏదియిచ్చినను పారవేయుచు, ఏడుపు మాననప్పుడు యిది
బాగా పనిచేయును.

## తూజా

ఇది అనారోగ్యమైన చర్మముగలవారికి బాగుగా పనిచేయును. సల్ ఫర్
'సోరా' కును, మెర్క్యూరియస్ 'సవాయి' కిని తూజా సైకోసిస్ నకును
ప్రధానౌషధములు.

ఇది ముఖ్యముగా చర్మముమీదను, మూత్ర మర్మావయవములమీదను, శగ
రోగము అణచిపెట్టబడుటచే కలుగు సమస్త బాధలకును బాగుగా పని
చేయును.

ఈ రోగి విపరీతమైన మనోభావములను కలిగి యుండును. పరపురుషుడు
ప్రక్కనయున్నట్లు, శరీరమునుండి ఆత్మ విడదీయ బడినట్లు, అవయవము
లన్నియు గాజుతో తయారుచేయబడి తాకినచో బ్రద్దలగునట్లు, పొత్తికడు
పులో ఏదో జంతువున్నట్లు మొదలగు లక్షణములుండును.

తలలో మేకుకొట్టినట్లు నొప్పి, తెల్లనిచుండ్రు, వెంట్రుకలూడుట, కను
రెప్పలమీద కాయలులేచుట, ముక్కునుండి ఆకుపచ్చని స్రావము కారుట,
పండ్లు త్వరలో చెడిపోవుట, నోటిలో పుండ్లు ఆసనము బీటలువారుట,
ఆసనమువద్ద పెద్దకాయలులేచుట, పుండ్లుపడుట, పుప్పిగోళ్ళు, మూత్రావ
యవములమీద పుండ్లు, పులిపిరికాయలు, మొటిమలు, మచ్చలు, అంగము
దురద, మంట, అంగముమీద పొక్కులు, పుండ్లు మొదలగు సైకోటిక్ లక్షణ
ములకును, శగరోగము అణచిపెట్టబడుటచే కలుగు కండ్లకలక మొదలగు
రోగములకును, పిల్లలకువచ్చు ఉబ్బసము, అనాస రోగములకును, టీకాలు
వేయుటవలన గలుగు నీళ్ళవిరేచనములు మొదలగు దుర్గుణములకును, 'టీ'
త్రాగుటవలన గలుగు పార్శ్వపునొప్పి, అజీర్ణము, నిద్రలేమి మొదలగు బాధ
లకును అద్భుతముగా పనిచేయును. మశూచిగల ప్రదేశములలో దీనిని వాడి

నచో వ్యాధిని రాకుండ కాపాడును. వచ్చినను తేలిపోవును.

దీని లక్షణములు వర్షకాలములోను, సముద్రతీరమున తడితోకూడిన చలి గాలిలో 'టీ' త్రాగుటవలన అధికమగును.

కడుపులో గుడగుడలాడుచు, నల్లగా బంతులవలె వెళ్ళు మలబద్ధముగాని పలచగ వెళ్ళు నీళ్లవిరేచనములుగాని యుండును.

ఉలిపిరికాయలకు, మొటిమలకు, శగరోగమువలన కలుగు మేహవాత నొప్పులకు దీనిని పైకికూడ వాడవచ్చును.

## వెరాట్రం ఆల్బం

ఇది కలరాకు అమోఘమైనది. కడుగువలె అగు పెద్దపెద్ద నీళ్ళవిరేచనము లకు, వమనములకు బాగా పనిచేయును. రోగికి వాతముక్రమ్మి శరీరమంతయు చల్లబడియుండు చివరదశలో మంచి పనిచేయును. నొసటను చల్లని చెమటలు పోయును. వస్తువులు కొరుకుట, బట్టలు చింపివేయుట మొదలగు పిచ్చి లక్షణ ములుండును. అతిసారము, కడుపునొప్పి, కోరింతదగ్గు—వీటికి పనిచేయును.

## కాల్కేరియాఫాస్

ఇది పిల్లలపాలిట సంజీవి. పిల్లలకు సాధారణముగ వచ్చు వ్యాధు లన్నిటికి బాగుగా పనిచేయును. పాలు త్రాగిన పిమ్మట కక్కుకొనుట, జీర్ణకోశము చెడిపోయి అజీర్ణము, శూలచే బాధపడుట, పిల్లలు యెక్కువగా చిక్కి పోవుట, నీరసించుట, రక్త క్షీణమగుట, యెముకలు దుర్బలముగా నుండుట, పిల్లలు చాలకాలమువరకు నడవలేకపోవుట, పండ్లు వచ్చు సమయములో నీళ్ల విరేచనము లగుట, పండ్లు ఆలశ్యముగా వచ్చుట, త్వరలో చెడిపోవుట— యీ లక్షణము లన్నిటికి అద్భుతముగా పనిచేయును. అజీర్ణముచే గలుగు సమస్త వ్యాధులకు మంచిది. రికెట్సు, గండమాల, గళగ్రంధి రోగములకు అమోఘముగా పనిచేయును. గ్రంధులు వాచుటకు ప్రధానౌషధము. పుప్పి పండ్లు, చెవిలో పోట్లకు వాడదగును. రక్తక్షీణమగు పిల్లలకు మంచి రసా యనము (Tonic) అశ్మరీవ్యాధిలోను, రక్తహీనముచే గలుగు నంజు రోగము నకుకూడ పనిచేయును.

## కాల్కేరియాఫ్లోర్

చిక్కని స్రావముతో కూడియుండు దీర్ఘరొంపలకు, ముక్కులు దిబ్బడ

వేయుట, ముక్కులో బయలుదేరు కాయలకు (Adenoids), పిల్లలకు ఆస నము దురదతో కూడియుండు నులిపురుగు లక్షణములకు, గండమాల, సంజు, మలబద్ధము, మలబద్ధములతోకూడిన తలనొప్పులకు, పండ్లరోగములకు, చెవిలో కలుగు ధ్వనులకు, రాత్రులు మూత్ర మధికముగ వెళ్ళుట, తరుచు తొందర కలుగుట, మూత్రద్వారము మంట, పోటు మొదలగు మూత్ర రోగములకు, గ్రంధులు వాచి గట్టిపడుట, వృషణములు వాచుట, నీరు పట్టుట, విసర్పి, కొండనాలుక వాలివచ్చు దగ్గునకు, గొంతుకలో మంట, నొప్పి, గుటక సరిగా వేయలేకపోవుట—మొదలగు లక్షణములతో గూడిన డిఫ్తీరియాకును, కింక వాతము (Croup) నకును, ఉబ్బసమునకు—యీ రోగములకు బాగుగ పని చేయును. దీని లక్షణములు వెచ్చని కాపడములవల్లను, తోముటవల్లను ఉపశ మించుచు తేమవలనను, చలిగాలివలనను అధికమగుచుండును.

## కాల్కేరియాసల్ఫ్

కురుపులు, వ్రణములు, గండమాల, భగంధరము, కాల్పులు, సెగరోగము, కంటిమీద పుండ్లు, ముఖముమీద మొటిమలు, చిడుము——యీ మొదలగు వాటికన్నిటికి చీము పట్టినపుడు దీనిని తప్పక వాడినచో చీముకట్టి పుండ్లు మానును. చీము కారుచుండు మంత్రపుపొక్కులకు మంచిది. కండ్లు ఎరుపులు. నొప్పి, కండ్లనుంచి పసుపుపచ్చని పుసులు కారునపుడు, చెవినుంచి పచ్చని చీముగాని, రక్తముగాని స్రవించునపుడు, చెముడుకు, కుడిచెవిలో ధ్వనులు వినపడునపుడు, ముక్కునుండి రక్తముకారునపుడు, పగలు కుడిముక్కు, రాత్రులు ఎడమ ముక్కునుండి స్రావమున్నపుడు, చిగుళ్ళువాచి, రక్తము కారునపుడు, వికారముతోకూడిన తలత్రిప్పునకు, కింకవాయువు (Croup) కళ్ళదగ్గు, న్యుమోనియా, ఉబ్బసము, క్షయ వ్యాధులకు, గొంతుకలో పుండ్లు పడి చీముపట్టుట, గొంతుకలో నొప్పి, డిఫ్తీరియా, గళగ్రంధి (Tonsillitis) రోగములకు, కడుపులో గురగురలాడుట, నొప్పి, అతిసారము, జిగటవిరేచన ములు, మలబద్ధము, సన్నిపాత జ్వరము, విడుపు జ్వరమునకు——వీటికన్నిటికి కూడ పనిచేయును. మరియు మశూచి, ఒరుపులు (Chilblains) లో కూడ వాడదగును. ఒరుపులలో దీనిని లోపలికి పైకికూడ వాడవచ్చును. వీర్యనష్ట ముతోకూడిన నపుంసకత్వమునకుకూడ మంచిది. దీని బాధలన్నియు ఆరు బయట యున్నపుడు ఉపశాంతిగనుండి, తేమవలన అధికమగుచుండును. పిల్లలకు తలవెంట్రుకలు త్వరలో రాలి బట్టతల అగునపుడుకూడ పనిచేయును.

## కాలీమూర్

నాలుక తెల్లగానుండి, యే రంధ్రమునుంచియైనను తెల్లని చిక్కని స్రావము కారునపుడు అద్భుతముగా పనిచేయును. అనగా కండ్లు మిరమిరలాడుచు, తెల్లని పుసులు కారునపుడు, జలుబుచేసి రొంపపట్టి, ముక్కులు దిబ్బడవేసి, ముక్కులనుండి చిక్కని తెల్లని చీము కారునపుడు; దగ్గు, ఉబ్బసము, కళ్ళి దగ్గు, న్యుమోనియా, క్షయరోగములలో చిక్కని తెల్లని కఫము పడునపుడు, గళగ్రంధి, గండమాల, ఎగ్జిమా, చిడుము మొదలగు వాటిలో చీముతో కూడి యున్నపుడు; చెముడు, చెవినుండి చిక్కని చీము కారునపుడు ఆసనమునుండి జిగురువంటి విరేచనములగునపుడు—యీ లవణము అమోఘముగా పనిచేయును. మరియు కడుపు నొప్పి, ఉబ్బరము, త్రేణుపులు, మలబద్ధము, నంజు, కోరింత దగ్గు, విసర్పి, చలిజ్వరము, సన్నిపాతజ్వరము, కామెర్లు, రక్తవమనము, మల బద్ధముతో కూడిన తలనొప్పి, గవదలు, మూత్రము చిక్కగాపడుట, మూత్ర కృచ్ఛము, మూత్రబంధనము, అండవృద్ధి, నోటిలో పుండ్లు, చిగుళ్లు వాపు, చొంగ అధికముగా కారుట, మూర్ఛ, పొంగు, స్కర్వీ—యీ రోగము లన్ని టికి పనిచేయును. గొంతుక నొప్పి, గుటకవేయలేకపోవుట, కంఠమువద్దగ్రంధులు వాచుట—యీ మొదలగు లక్షణములతో కూడిన డిఫ్తీరియా రోగమునకు ప్రధానౌషధము. సమస్త గొంతుక జబ్బులలోను దీనిని నీళ్ళలో కలిపి బాగుగా పుక్కిలి బట్టుట మిక్కిలి ఉపయోగము. త్వరలో గుణ మిచ్చును. ఇంతేగాక మశూచికములోగూడ నిది ప్రధానౌషధము. పిల్లలకు నులిపురుగు లున్నపుడు కూడ బాగా పనిచేయును. ఈ లవణముయొక్క గుణము లన్నియు గురు పదార్థమునుగాని, చమురు పదార్థములనుగాని, క్రొవ్వు పదార్థములనుగాని భుజించినను, కదలినను అధికమగుచుండును. పిల్లలకు నెత్తిమీద బయలుదేరు పుర్రెమాదకు మంచిది. బుడ్డకుకూడ పనిచేయును.

## కాలీసల్ఫ్

శరీరముయొక్క యే రంధ్రమునుంచియైనను పసుపుపచ్చని స్రావ మున్న పుడు దీనిని తప్పక వాడవలయును. నాలుకకూడ పచ్చగానుండును. ఒక్కొ క్కప్పుడు నాలుకచివర తెల్లగా యుండవచ్చును. కండ్లకలకలో పచ్చని పుసులు కట్టుట, కండ్లంటుకొనుట, చెవులనుంచి ముఖ్యముగా కుడిచెవిలోనుంచి పసుపు పచ్చని చీముకారుట, పోటు, పీనసరోగములో ముక్కులు దిబ్బడవేయుట, పసుపుపచ్చని చిక్కని చీమిడికారుట, ఊపిరితిత్తులకు సంబంధించిన వ్యాధు లలో అనగా దగ్గు, ఉబ్బసము, కళ్ళిదగ్గు, క్షయ, న్యుమోనియా వ్యాధులలో,

చిక్కని పసుపురంగుగలిగిగాని, పసుపు, ఆకుపచ్చ మిశ్రమమైన రంగుగలిగి గాని కళ్లి పడుట, మూత్రద్వారమునుంచి పసుపుపచ్చని, జిగురువంటి పదార్థము వెళ్లుట; గజ్జి, ఎగ్జిమా మొదలగు చర్మవ్యాధులలో పసుపుపచ్చని స్రావముండుట -ఈ లక్షణములుగల రోగములకు బాగుగా పనిచేయును. మరియు పొంగు, ఆటలమ్మ, స్కార్‌లెట్ జ్వరములలో పొక్కులగస్మాత్తుగ అణగిపోయి నపుడు వాడదగును. మశూచిలో దీనిని వాడినచో క్రొత్త చర్మముపట్టి శరీర మును బాగుచేయును. మేహవాతజ్వరము, సన్నిపాతజ్వరము, చలిజ్వరము లలో సాయంకాలము శరీరోష్ణము (Temperature) అధికమగుచు నాలుక మీద పసుపురంగు పూసినట్టున్నచో బాగుగా పనిచేయును. ఈ లవణము శరీరమును చెమటలు పట్టించును. గనుక దీనిని అన్ని జ్వరములలోను వాడ వచ్చును. ఫెర్రంఫాస్‌తో మార్చి వాడుచుండుట మంచిది. ఇంతియగాక అజీ ర్ణము, అగ్నిమాంద్యము, కడుపు నిండుగా యుండుట, శూల, నాలుక పసుపు రంగుతోకూడిన మలబద్ధము, పసుపుపచ్చని నీళ్ళవిరేచనములు, వెచ్చని గదిలో సాయంకాల మధికమగుచు ఒకచోటనుంచి మరియొకచోటకు మారుచుండు మేహవాతనొప్పులు, పండ్లనొప్పులు, అణచిపట్టబడిన సెగరోగముచే జనించు అండవృద్ధి, గోళ్ళుసరిగా ఎదగకపోవుట, పుప్పిగోళ్ళు, పైత్యపు దద్దుర్లు (Nettlerash) -యీ మొదలగు వ్యాధులన్నిటికి పనిచేయును. పిల్లలకు వచ్చు కోరింతదగ్గులో పసుపురంగుగల కళ్లి యుండి తెగిపడక పిల్లవాడు బాధ పడునపు డమోఘముగ పనిచేయును.

## ఫెర్రంఫాస్

రొంప, దగ్గు, జ్వరములలో ప్రారంభదశలో దీనిని తప్పక వాడదగును. గ్రహణి, పొంగు, కామెర్లు, క్షయ, మశూచి మొదలగు వ్యాధు లన్నిటిలోను ప్రారంభమున జ్వరలక్షణములకు వాడినచో వ్యాధులను ముదరనివ్వదు. జ్వర ములకు ప్రధానౌషధము. విసర్పి, గళగ్రంథి మొదలగు రోగములలో ప్రారంభ మున జ్వరము, ఎరుపు, మంట, నొప్పియున్నపుడు దీనిని లోపలికి, పైకికూడ వాడవచ్చును. రక్తస్రావములకు దివ్యౌషధము. నోరు, నాసికాద్వారము, మూత్రద్వారమునుంచి కలుగు రక్తస్రావములకును, కత్తి మొదలగు వాటివలన కలుగు రక్తస్రావములకును, రక్తవిరేచనములకు బాగుగా పనిచేయును. అజీర్ణ మునకు మంచిది. అజీర్ణపదార్థములు వమనమగునపుడు పనిచేయును. పగలు పిల్లలకు మూత్రమప్రయత్నముగ పడుట, కొద్దికొద్దిగా పడుట, మూత్రబంధ

నములకు అద్భుతముగా పనిచేయును. రక్తహీనులకు మంచి రసాయనము (Tonic). రక్తమును శుభ్రపరచి ఆరోగ్యమును కలుగజేయుటలో దివ్యమైనది.

## కాలీఫాస్

ఇది నరములకు, మెదడునకు సంబంధించిన వ్యాధులన్నిటికి అద్భుతముగా పనిచేయును. వాతరోగములకు ప్రధానౌషధము. జ్ఞాపకశక్తి లేకపోవుట, పిచ్చి (Insanity), పక్షవాతము, మూర్ఛ, అపస్మారము (Hysteria), చంటిబిడ్డ గుణము, కోరియా, ధనుర్వాతము, వాతజ్వరము—ఈ మొదలగు వాటికి దివ్యౌషధము. నరముల బలహీనతచే కలుగు అతిమూత్రము, శయ్యామూత్రము, మూత్రమప్రయత్నముగ పడుట మొదలగువాటికి మంచి పని చేయును. ఉబ్బసమునకు ప్రధానౌషధము. నోటి చిగుళ్ళనుంచి, చెవులనుంచి ఆసనమునుంచి, నాసికాద్వారములనుంచి కలుగు రక్తస్రావములకు ముఖ్యమైన ఔషధము. కపాలజలంధరము (Hydrocephalus), గ్రహణికికూడ వాడదగినది. సన్నిపాత జ్వరములో కలుగు అతిసారము, సంధి, మగత, రక్తవమనములకు దివ్యౌషధము. నిద్ర పట్టనపుడిది వాడినచో నిద్రపట్టును. దీని లక్షణములన్నియు శబ్దముచేతను, శారీరక, మానసిక పరిశ్రమవల్లను యెక్కువగుచుండును.

## మెగ్నిషియాఫాస్

ఇది నరములకు సంబంధించిన నొప్పులకు, మేహవాతపు నొప్పులకు, కడుపు నొప్పులకు దివ్యౌషధము. అన్నినొప్పులకు అమృతాంజనము వంటిది. దీని నొప్పులు అతితీవ్రముగా కోయుచున్నట్లు, కత్తితో పొడిచినట్లు, గ్రుచ్చినట్లుండును. పిల్లలకువచ్చు కడుపునొప్పికి కెమోమిల్లాతో సమానముగా పనిచేయును. అన్ని విధములైన కంపములకు, యీడ్పులకు బాగుగా పనిచేయును. పిల్లవాడు కొయ్యబారుట, పళ్ళు బిగబట్టుట, గుప్పెళ్ళుపట్టుట మొదలగు లక్షణములు గల మూర్ఛ, చంటిబిడ్డ గుణము, కోరియా, ధనుర్వాతములకు అమోఘముగ పనిచేయును. కోరింతదగ్గుకు ముఖ్యౌషధము. గొంపపట్టి వాసన తెలియక పోవుట, ఎక్కిళ్ళు, చెముడు, పండ్లజబ్బులు, తలనొప్పి, మెనింజిటీస్ వ్యాధులలోకూడ వాడదగును. దీనిని ఉష్ణోదకముతో వాడినచో బాగుగా వెంటనే గుణమిచ్చును. దీనిబాధలు ఉష్ణోపచారములవలన తగ్గుచుండును. మూత్రబంధనమునకుకూడ మంచిది.

## నేట్రంమూర్

అజీర్ణ రోగములకు, నంజునకు శ్లేష్మజ్వరములకు, మలబద్ధమునకు, వమన ములకు ముఖ్యమైనది. పోషణ బాగుగాయుండి శరీర అభివృద్ధిలేక పిల్లవాడు శుష్కించిపోవునపుడు అద్భుతముగా పనిచేయును. నోటినుంచి నీరధికముగా కారునపుడు గవదలు, ఆటలమ్మ, పొంగు, గళగ్రంథి, డిఫ్తీరియా మొదలగు వ్యాధులలోను, చిడుము, గజ్జి, ఎగ్జిమా, విసర్పి, పైత్యపుదద్దుర్లు (Nettle rash) మొదలగు చర్మవ్యాధులలోను, దగ్గు,ఉబ్బసము,కఫ్ఫదగ్గు(Bronchitis), క్షయ రోగములలోను, నాసికా ద్వారమునుంచి, మూత్ర ద్వారమునుంచి కలుగు రక్తస్రావములకును, పండ్ల చిగుళ్ళనుంచి రక్తము స్రవించునపుడు స్కార్వీ వ్యాధిలోను, అశ్మరీవ్యాధిలోను, మలబద్ధముచేగాని, ఋతుదోషముచే గాని కలుగు తలనొప్పులకును, పలచగ నీళ్ళవలె విరేచనములగు క్షీరాలసకము (పిల్లలకువచ్చు కలరా) లోను, ఉదయము 10, 11 గంటలకు తగులుచుండు మలేరియా జ్వరములకును, మశూచిలోను, పీనస రోగమునకును, పాండురోగ మునకు, ఎక్కిళ్ళకు అమోఘముగా పనిచేయును. నిద్రపట్టకపోవుట, చెవు లలో చీముకారుట, ధ్వనులగుట—వీటికికూడ మంచిది.

## నేట్రంఫాస్

క్రిములకు, అజీర్ణమునకు అమోఘమైనది. ఈ కారణములచే కలుగు ప్రతి రోగమునకు వాడదగును. బాలురకు పాలు జీర్ణముగాక పెరుగు బిళ్ళలవలె కక్కుకొనుట, అతిసారము, కడుపుబ్బరము, పులిత్రేనుపులు, కడుపునొప్పి, అజీర్ణ విరేచనములు, మలబద్ధము—మొదలగువాటి కన్నిటికి దివ్యముగా పని చేయును. పిల్లలకు క్రిములవలన కలుగు శూల, శయ్యామూత్రము మొదలగు వాటికి ప్రధానౌషధము. పైత్యపు దద్దుర్లకు, తేనెవంటి ద్రవము కారుచు దురదతో కూడిన పొక్కులుగల ఎగ్జిమా మొదలైన చర్మవ్యాధులకు బాగుగా పనిచేయును. అతిసారముతో కూడిన కాళ్ళనొప్పులకు, వీర్యనష్టమునకుకూడ వాడ దగును.

## నేట్రంసల్ఫ్

ఇది పైత్య రోగముల కన్నిటికి అద్భుతముగా పనిచేయును. పిల్లలకు శరీ రముమీద బయలుదేరు పైత్యపు దద్దుర్లు, సర్పి— మొదలగు వాటికిని, పైత్యో

ద్రేకముచే కలుగు తల నొప్పి, వమనము, తల తిరుగుట, పైత్యజ్వరము, కాలేయమునకు సంబంధించిన శూల, కామెర్లు, నంజు—యీ రోగములకు ప్రధానౌషధము. దగ్గు, ఉబ్బసము, కళ్లిదగ్గు, వర్షాకాలములో కలుగు అతిసారము, న్యుమోనియా, సన్నిపాతజ్వరము, మూత్రములో యిసుకవంటి పదార్థము పడుట, అశ్మరీ—యీ వ్యాధులలోకూడ బాగుగా పనిచేయును.

## సైలీషియా

పిల్లవాడు యెంత భుజించినను, పోషణ యెంత బాగుగా యున్నను, జీర్ణశక్తి తగ్గి, బాలుడు శుష్కించి నీరసముగను, దుర్బలముగను ఉన్నపుడు అద్భుతముగా పనిచేయును. గండమాల వ్యాధిగల పిల్లలకు, నెత్తిమీద చెమటలుపోయు పిల్లలకు మంచిది. ఈ పిల్లలకు శరీర మందన్ని అవయవములుమామూలుగ యున్నను, పొట్ట పెద్దదై యుండును. దుర్బలులై పిల్లలాలశ్యముగ నడచుట ప్రారంభించుదురు. మలబద్ధమునకు మంచిది. పిల్లవాడెంత తినికినను మలము కొంతవరకు బయటకువచ్చి తిరిగి లోపలికి పోవుచుండును. దంతములు మొలచు సమయమందుగాని, వేసవి కాలములోగాని, పిల్లలకు కలుగు విరేచనములకుకూడ పనిచేయును. ఈ విరేచనములు అనేక రకములుగ అగుచుండును. మరియు పిల్లలకు అమావాశ్యకువచ్చు మూర్ఛ మొదలగు కంపములకు పనిచేయును. ఇంతియగాక క్షయరోగమునకు ప్రధానౌషధము. కఫము చిక్కగ, పచ్చగ నుండును. అశ్మరీ మూత్రములో ఎర్రని యిసుకవంటి పదార్థములుండుట, గండమాల, నులిపురుగు, స్వప్నములు, కలతనిద్ర, చెవిలో చీము, పాదములమీద చెమటలు పోయుట—వీటి కన్నిటికి బాగుగాపనిచేయును. కురుపులు చీముపట్టినపుడు తప్పక వాడదగును. ఎటువంటి కురుపులుగాని, వ్రణములుగాని, రాచకురుపులుగాని, శస్త్రచికిత్స అక్కరలేకనే దీనివలన నెమ్మదించును. దీనిని లోపలికి, పైకికూడ వాడవచ్చును. కురుపులలో దీనిని ఆరంభమున హెచ్చు పొటెన్సీలో నిచ్చినచో ఎదగకుండ హరింపజేయును. కాని తక్కువ పొటెన్సీలో వాడినచో చీము పట్టి త్వరలో చితుకును. పిల్లలకువచ్చు బుడ్డలకు(Hydrocele in children) కూడ పనిచేయును.

సంపూర్ణము

జెమిని ప్రింటర్సు, పవరుపేట-ఏలూరు (పశ్చిమగోదావరిజిల్లా)

తల్లాప్రగడ కామేశ్వరరావు, బి. ఏ. గారిచే

తెలుగున వ్రాయబడిన

# హోమియోపతి వైద్యగ్రంథములు

1. స్త్రీల ఋతురోగములు
2. బాలరోగముల చికిత్స
3. సుఖవ్యాధులు
4. అజీర్ణము

అన్ని హోమియో మందులషాపులలో దొరకును.

దిగువ అడ్రసులకుకూడ వ్రాసుకొనవచ్చును.

1. కాపీరైట్ హోల్డర్స్: జెమిని ప్రింటర్స్, ఏలూరు (పశ్చిమగోదావరి)
2. శ్రీ రామకృష్ణ హోమియోస్టోర్సు, ఏలూరు (పశ్చిమగోదావరి)
3. శ్రీ తల్లాప్రగడ కామేశ్వరరావుగారు బి. ఏ., ఉంగుటూరు (పశ్చిమగోదావరి)